

డోరియన్ గ్రే

[ నవల ] ఆస్కార్ వైల్డ్

అనువాదం:

# బెల్లంకొండ రామదాసు

# THE PICTURE OF DORIAN GRAY.

BY

OSCAR WILDE



WARD LOCK AND Co
LONDON NEW YORK
& MELBOURNE.



1875 అపరశంకరుడు 1914

# శ్రీ బెల్లంకొండ రామరాయ కవీంద్రులు

## SRI BELLAMKONDA RAMA RAYA KAVINDRULA TRUST

NARASARAOPET

15-01-2015

ఆస్కార్ వైల్డ్

# డోరియన్ గ్రే

[నవల]

అనువాదం:
బెల్లంకొండ రామదాసు



ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.

# డోరియన్ గ్రే

చిత్రశాలనిండా కమ్మని గులాబీ పరిమళం గుమ్మని గుబాళిస్తూఉంది. చిన్నచిరుగాలి అల్లనల్లన వచ్చి తోటలో చెట్లని కాస్త కదిపితే చాలు — తెరిచిఉన్న ద్వారంలోనుంచి బరువైన పూలవాసన పరుగెత్తుకుని వచ్చి గదినంతా అలము కుంటోంది.

గదిలో ఒకమూల పర్షియన్ బాలీసుపై మేనువాల్చి, హాయిగా సిగరెట్‌మీద సిగరెట్ కాలుస్తున్నాడు లార్డ్ హెన్రీ వాటన్. అలా వరుసగా ఆరకుండా సిగరెట్లు కాల్చడం అతనికి అలవాటు. అలా హాయిగా పవళించిన అతనికి తోటలో 'లాబర్నమ్' వికసించిన తీయతీయని తేనెరంగు పూలు కనుపిస్తున్నాయి. స్వచ్ఛమైన అగ్నిజ్వాలల్లా వికసించిన పూల సౌందర్యభారం భరించలేక చెట్టుకొమ్మలు కంపిస్తున్నాయా అనిపిస్తోంది.

మధ్యమధ్యలో అటూఇటూ ఎగురుతూ పచార్లుచేస్తున్న పక్షుల విచిత్రమైన నీడలు రెపరెపలాడుతున్న సిల్కు తెరలపై ప్రతిఫలిస్తున్నాయి. పెద్ద కిటికీ తెరలపై అలా ప్రతిఫలిస్తూఉంటే ఒకవిధమైన జపాన్ సౌందర్యం ఉట్టిపడినట్టుగా ఉంది.

టోకియో చిత్రకారులు — వారి పాలిపోయిన వివర్ణ వదనాలు జ్ఞప్తికి వచ్చాయి లార్డ్ హెన్రీ వాటన్‌కి. ప్రఖ్యా

నంగా నిశ్చల స్వభావం కలిగింది కళ. అలాటి కళద్వారా వేగాన్ని చలనాన్ని సాధించడానికి యత్నిస్తారు ఆ చిత్రకారులు. గదినిండా బరువైన ప్రశాంతి వ్యాపించిఉంది. పెరిగిన పచ్చగడ్డిలోనుంచి దూసుకుని పోతున్న తుమ్మెద బారుల మెల్లని మర్మరధ్వని గదిలోని నిశ్శబ్దభారాన్ని మరింత ఎక్కువ చేస్తున్నట్టుగా కనుపిస్తోంది. దూరంగా వినిపిస్తున్న లండన్ నగరపురొద ఎక్కడో దూరంగా వినిపిస్తున్న 'ఆర్గన్' పాట లాగా ఉంది.

గదిమధ్యలో - నిటారుగా ఉన్న ఒక కొయ్యస్టాండుకు తగిలించి — ఒక యువకుని నిలువెత్తు చిత్రపటం వేలాడదీసి ఉంది. ఆ యువకుని సౌందర్యం ఇలాటిది అని చెప్పడానికి వీల్లేదు. ఎంతో అసాధారణమైన సౌందర్యం అది.

చిత్రపటానికి ఎదురుగా కొద్దిదూరంలో ఆ పటాన్ని వ్రాసిన చిత్రకారుడు బేసిల్ హాల్‌వర్డ్ కూచునిఉన్నాడు. కొన్ని సంవత్సరాలక్రితం అతను ఎక్కడికో మాయమైపోవడం పెద్ద గొడవ రేపింది. దాన్నిగురించి ఎన్నో చిత్రవిచిత్రమైన కథలల్లారుకూడా.

తను, తన కళాఫలకంలో, ఎంతో గొప్ప నేర్పుతో ప్రతిఫలించిన ఆ లావణ్యమూర్తిని చూస్తూకూచున్నాడు చిత్రకారుడు. అలా చూస్తోంటే - అతని పెదవులపై ఒక సన్నని ఆనందహాసం అలా అలా తేలివచ్చి ముఖంనిండా వ్యాపించి, అక్కడే అంటుకుని ఆడుతున్నట్టుగా కనుపించింది కాని ఎంచాతనో అతను హఠాత్తుగా ఉలికిపడి కళ్ళు మూసుకుని, ఏదో

ఒక విచిత్రమైన స్వప్నాన్ని మనస్సులో ఖైదు చేస్తున్నట్టుగా, కొన్ని క్షణాలు కనురెప్పలు ఒత్తుకున్నాడు.

'ఇది నీ బొమ్మలన్నిటిలోకి గొప్పది బేసిల్! ఇలాంటి బొమ్మ నీవు ఎన్నడూ చిత్రించలేదు' అన్నాడు హెన్రీ వాటన్ మెల్లగా – మందంగా – 'వచ్చే సంవత్సరం తప్పకుండా ఈ చిత్రాన్ని గ్రోస్ వెనర్ పంపించాలి. పరిషత్తు ఎంతపెద్దదో అంత అభిరుచి రహితమైనది. నే నెప్పుడు పరిషత్తుకు వెళ్లినా, తాపీగా బొమ్మలు చూడడానికి వీలు లేనంత జనసమ్మర్దం రావడమో, లేక జనాన్ని చూడడానికి అవకాశంలేనన్ని బొమ్మలు రావడమో తటస్థిస్తూ ఉండేవి. గ్రోస్ వెనర్ ఒకటే అన్నిటికీ తగినస్థలం'

'ఈ మాటు బొమ్మని ఎక్కడికీ పంపిస్తా ననుకోను. అవును ఎక్కడికీ పంపించను' అన్నాడు చిత్రకారుడు విచిత్రంగా తలను వెనక్కు వంకిస్తూ.

హెన్రీ వాటన్ కనుబొమ్మలెత్తి, తన బరువైన నల్లమందు సిగరెట్‌నుంచి వస్తున్న నీలాల పొగతీగలలోనుంచి అతనివంక ఆశ్చర్యంగా చూచి, 'ఎక్కడికీ పంపించవూ? ఏమిటోయ్ ఈ ధోరణి? ఏదైనా కారణం ఉందా? మొత్తం మీద మీ చిత్రకారులు భలే చిత్రమైన వ్యక్తులు! కీర్తికోసం ప్రపంచంలో ఎలాటి పనయినా చేస్తారు. అది రాగానే దాన్ని తన్నేదా మనుకుంటారు.

'నీ ధోరణి చాలా అర్థరహితంగా కనుపిస్తోంది సుమా. ఎంచాత నంటావా? లోకంలో మనల్ని గురించి నలుగురూ చెప్పుకోవటంకంటె అధ్వాన్నమైంది ఒకటే ఉంది – అది

మనల్ని గురించి ఎవరూ చెప్పుకోకుండా ఉండడం. ఇలాటి బొమ్మ నీకు ఎంత ఆధిక్యతను సంపాదించిపెడుతుందో నీవు అర్థంచేసుకోడంలేదు. ఇంగ్లండులోని చిత్రకారు లందరి లోకి నీకు అగ్రస్థానం లభిస్తుంది. వృద్ధులకు అసూయ కలుగు తుంది – వృద్ధులకు హృదయం – ఉద్వేగాలు – అనేవి మిగిలి ఉంటే' అన్నాడు.

'నాకు తెలుసు– నీ విలా గేలిచేస్తావని. కాని నిజంగా చెబుతున్నాను. నే నీ బొమ్మ ప్రదర్శించలేను. ఈ బొమ్మలో నా ఆత్మ ఉంది. ఈ బొమ్మలో నా ఆత్మలో చాలాభాగం చిత్రించుకున్నాను' అన్నాడు చిత్రకారుడు.

లార్డ్ హెన్రీ బాలీసుపై వెల్లకిలా పడుకుని నవ్వాడు.

'అవును. నా కా విషయం తెలుసు. అవు తేమిట్టుకు ? ఏమన్నావు ? ఈ బొమ్మలో నిన్ను నీవు చాలావరకు వ్రాసు కున్నా నన్నావుకదూ ? నిజంగా చెబుతున్నాను బేసిల్, నీ వింత వ్యర్థుడి వనుకోలేదు సుమా. నా కళ్ళకు మాత్రం నీకూ ఈ బొమ్మకూ రవంతైనా పోలికలు కనుపించ డంలేదు. బొగ్గులా నల్లనిజుట్టు, గరుకుగా గట్టిగాఉన్న నీముఖ మెక్కడ– ఈబొమ్మ ఎక్కడ! ఈబొమ్మలో యువకుడు దంతం తో మలచినట్టు, రోజాఆకులతో చేసినట్టూ ఉన్నాడు. ఇం తెందుకు, బేసిల్, అచ్చంగా నార్కిసస్ అంటే నమ్మవచ్చు. నీవు? నిన్ను చూస్తే మేధావి అనిపిస్తుంది.అంతేకాని సౌందర్యం అచ్చమైన నిజమైన సౌందర్యం, మేధోదృష్టి ఎక్కడ ప్రారం భిస్తుందో అక్కడ సమాప్తమవుతుంది.

చూచావ్- ఈ మేధస్సు- మేధస్సు అంటేనే ఒక అతిశయోక్తిపద్ధతి. అంచాత ఏ వదనంలోని సమగ్రతని, సమన్వయాన్నయినా ధ్వంసంచేస్తుంది. ఆలోచన అనేది మొదలుపెట్టామంటే చాలు - ఏ ఒక్క ముక్కునుగురించో- నుదుటినిగురించో ఆలోచనపోతుంది, అంతే; మరే అసహ్యకరమైన ఆలోచనకూడా రావచ్చు. ప్రపంచంలో వైజ్ఞానికవృత్తులలో ప్రతిష్ఠసంపాదించిన ఏ మేధావినైనా చూడు- ఎంత అసహ్యంగా ఉంటాడో! ఒక్క చర్చిలో పెద్దలుమాత్రం అలా ఉండరనుకో- ఎంచాతనంటావా? అసలు చర్చిలో ఆలోచనకు తావేది? బిషప్, పద్ధెనిమిది సంవత్సరాల కుర్రాడుగా చదువుకున్న పాఠాన్నే ఎనభయ్యోపడిలో పడిన తరువాతకూడా వల్లెవేస్తూ ఉంటాడు. అంచాతనే మనదృష్టికి ఎప్పుడూ అందంగా కనుపిస్తాడు! ఈ నీ స్నేహితుడున్నాడే- ఇతనిపేరు నీవు ఎన్నడూ చెప్పలా నాకు- ఇతనిబొమ్మ నాకు చాలా ఆకర్షణీయంగానే కనుపిస్తూవుంది. కాని ఇతనుకూడా ఆలోచించడు. బొమ్మ చూచి గట్టిగా చెప్పగలను అతనెవరో బుర్ర ఎంతమాత్రంలేని వట్టి అందగాడై ఉంటాడు. శీతాకాలంలో ఇక్కడ మనం చూస్తూఉండడానికి పూలులేనప్పుడు ఎప్పుడూ అతన్ని ఇక్కడే ఉంచుకుని చూస్తూఉండవచ్చు. వేసవికాలంలో అతను దగ్గరుంటే మన మనస్సుకి కాస్త చల్లదనంసోకి మనమేధస్సు మేలుకుంటుంది. అంతే. అంతకుతప్ప ఎందుకూ పనికిరాడు ఆ కుర్రాడు. నిన్ను నీవు ఊరికే ప్రస్తుతించుకోకు బేసిల్. నీకూ ఆ బొమ్మకూ రవంతయినా సామ్యంలేదు.' అన్నాడు లార్డ్ హెన్రీ వాటన్.

'నీవు నన్ను అర్థంచేసుకోడం లేదు. నేను అతనిలాగా లేనిమాట వాస్తవమే. ఆ విషయం నాకూ బాగా తెలుసు. అతనిలాగా ఉన్నట్టవుతే నేను విచారించి ఉండేవాణ్ణి. నిజంగా నిజం చెబుతున్నాను. భౌతికంగా కాని, మానసికంగా కాని విశిష్టత కలిగిఉండడంలో ఒకవిధమైన విధిదోషం ఉంది. తోటి వాళ్ళకు విభిన్నంగా ఉండకుండాఉండడమే మంచిది. ఒక విధంగా, శరీరసౌందర్యం కాని, బుద్ధసూక్ష్మత కాని లేనివారి జీవితాలు మంచివే. వారు ఒకమూల కూచుని ఈ లోకనాటకాన్ని నోళ్ళుతెరుచుకుని చూడవచ్చు. విజయంఅనేది ఎలా ఉంటుందో వారికి తెలియనప్పుడు ఇహ పరాజయం అంటే ఎలా ఉంటుందో మాత్రం ఎలా తెలుస్తుంది? మనలాగానే వాళ్ళూ బ్రతుకుతారు— ఏ గొడవలూలేకుండా— హాయిగా— అశాంతి, ఆందోళన లేకుండా. ఒకరికి హానీ చెయ్యరు. ఒకరివల్ల హానీపొందరు. కాని మనవిషయం వేరు. నీకు అంతస్తు, భాగ్యం ఉన్నాయి. నాకు బుర్రఉంది. నాచేతులో ఈ శిల్పకళ ఉంది. డోరియన్‌గ్రేకు సౌందర్యం ఉంది. దేవుడు మనకు ఇవి ప్రసాదించాడు. అందుకు ఫలితం— మనం బాధపడతాం. భయంకరమైన బాధంతా మనపాలవుతుంది.' అన్నాడు చిత్రకారుడు.

'డోరియన్‌గ్రే?— అదా అతనిపేరు!' అని అడిగాడు లార్డ్ హెన్రీ బేసిల్ హాల్‌వర్డ్‌వైపుకు నడిచివస్తూ.

"అవును. అదే అతనిపేరు. మొదట్లో నీకు చెప్పాలనుకోలేదు."

'ఎంచాత?'

'కారణం చెప్పలేను. నేను ఒక వ్యక్తిని ఎక్కువగా ప్రేమించినప్పుడు అతనిపేరు ఎవరికీ చెప్పను అలా చెప్పడం ఇష్టంఉండదు. అలాచెబితే వారిలో ఒకభాగాన్ని వెలకడుతున్నానా అనిపిస్తుంది. నాకు రహస్యమంటే ఇష్టం. రహస్యాన్ని ప్రేమించడం నేర్చుకున్నాను. అలా సాధనచేశాను. అధునాతన జీవితాన్ని అందంగా అద్భుతంగా కనుపింపచేసేది అదొక్కటే అనుకుంటాను. దాపరికంలో ఒక అందం ఉంది. ఎంత సామాన్యమైన విషయమైనా దాచినప్పుడు ఎంతో అందంగా కనుపిస్తుంది. నేను ఈఊరినుంచి ఎక్కడికైనా వెడితే ఎక్కడికి వెళుతున్నదీ ఎవరితోనూ చెప్పను. అలాచెబితే అందులోఉన్న ఆనందమంతా పోతుంది. పైకిచూడడానికి—చాలా అర్థరహితమైన— వెర్రి అలవాటుగా కనుపిస్తుందనుకో. అయినా ఇలాంటి అలవాటు ఎంతాతనో కాని జీవితానికి గొప్ప వైచిత్ర్యాన్నిస్తుంది. ఏదో కొత్తదనాన్ని, ఏదో రక్తిమను, ఏదో విచిత్రతను తెచ్చిపెడుతుంది. నామాటలు నీకు చాలా తెలివితక్కువగా కనుపిస్తున్నాయను కుంటాను!'

'లేదు లేదోయ్ బేసిల్! నేనువివాహితుణ్ణన్న విషయం నీవు మరచిపోయావనుకుంటాను. పెళ్ళిలోఉన్న గమ్మత్తు చెప్పనా? ఇరుపక్షాలను, ఒకరిని ఒకరు మోసంచేసుకుంటూ జీవించడం అత్యావశ్యకంగా చేస్తుంది పెళ్ళి. ఇదే పెళ్ళిలోఉన్న మజా. నా ఇల్లాలు ఎక్కడుంటో నాకు తెలీదు. నే నెక్కడుంటానో, ఏంచేస్తుంటానో దానికి తెలీదు. కాని కలుసుకున్నప్పుడు మాత్రం—ఎప్పుడైనా కలుస్తూ ఉండడం తటస్థిస్తుంది. ఇద్దరం అలా డిన్నర్‌కువెళ్ళి ఎంతో గంభీరమైన ముఖా

లతో ఎంతమాత్రం నమ్మడానికి వీల్లేని కట్టుకథలు ఒకరి కొకరం చెప్పుకుంటాం. అదిమాత్రం - ఇలాటి కథలు చెప్పడంలో - నాకంటెకూడా మహానేర్పరి. ఫలానా తాగీఖున ఫలానాచోట ఉన్నానని ఫలానా విషయం జరిగిందని పాఠం వల్లెవేసినట్లు చెబుతుంది. ఒక్కచోటకూడా తొట్రుపడను. తాగీఖుల విషయంలో నే నెప్పుడూ తొట్రుపడడమే. నా గాథ రాసల్లా - నా తప్పు తెలిసినప్పటికీ - అదిమాత్రం తగాదాపెట్టుకోదు. తగాదా పెట్టుకుంటే బాగుండునే అనిపిస్తుంది. కాని నవ్వి ఊరుకుంటుంది' అన్నాడు లార్డ్ హెన్రీ వాటన్.

'నీ వివాహజీవితాన్ని గురించి నీ విలా మాట్లాడడం చూస్తే నాకు అసహ్యం వేస్తుంది. నీవు చాలా యోగ్యతగల భర్తవని నా నమ్మకం. కాని నీ సద్గుణాలకే నీవు సిగ్గుపడుతున్నావు. నీవు సామాన్యమైనవాడివికావు నీవు నీతి చెప్పగా నేనెన్నడూ వినలేదు. తప్పు చెయ్యగా ఎన్నడూ చూడలా. ఎందులోనూ దోషం తప్ప - గుణం లేదనే నీ వాదం - ఇది వట్టి ముసుగుతప్ప నిజంకాదు. నీవు దోషదర్శిలా కనుపించే దంతా నటన కాని, నిజం కాదు.'

'సహజంగా ఉండడమే అసలు అభినయం. అంతకంటె అసహ్యకరమైన నటన ఉండదు' అన్నాడు లార్డ్ హెన్రీ వాటన్ బిగ్గరగా నవ్వుతూ.

యువకులిద్దరూ కలిసి తోటలోకి వెళ్ళారు. ఒక పొదరింటిలో పొడుగ్గాఉన్న ఒక వెదురు బెంచీమీద హాయిగాకూచున్నారు. సూర్యకాంతి ఆకురెమ్మలమీదపడి తళతళలాడి జారు

తోంది. గడ్డిలో అక్కడక్కడ తెల్లని గడ్డిపూలు నవ్వు తున్నాయి.

కాసేపాగి లార్డ్ హెన్రీ తన గడియారం చూసుకుని 'ఇక నేను వెళ్ళాలి బేసిల్. కాని వెళ్ళేలోపునుంచు కొన్నాళ్ళ క్రితం నిన్ను నే నడిగిన ఒక ప్రశ్నకు సమాధానం చెప్పాలి' అన్నాడు.

'ఏమిటది?' అన్నాడు చిత్రకారుడు నేలవంక నిశ్చలంగా చూస్తూ.

'నీకు తెలుసు'

'నాకు తెలీదు.'

'సరే. అవుతే నేనే చెబుతాను. డోరియన్ గ్రేచిత్రాన్ని నీ వెందుకు ప్రదర్శించవో నాకు నీవు చెప్పాలి. నిజమైన కారణం కావాలి నాకు.

'అసలు కారణం చెప్పాను'

'చెప్పలేదు. నీ ఆత్మలో చాలా భాగం ఆ బొమ్మలో ఉందన్నావు. అదేం కారణం? హాస్యాస్పదంగా లేదూ?'

'హెన్రీ!' అన్నాడు బేసిల్ హాల్‌వర్డ్ తలఎత్తి అతని ముఖంలోకి సూటిగాచూస్తూ. 'హృదయంతో వ్రాసిన ప్రతి బొమ్మా చిత్రకారుడి బొమ్మేకాని చిత్రించబడినవాని బొమ్మ కాదు. చిత్రించబడిన వ్యక్తి - ఒక యాదృచ్ఛిక సంఘటన-ఒక అవకాశం-ఒక సాధనంమాత్రమేఅవుతాడు. అతన్ని కాదు చిత్ర కారుడు వ్యక్తీకరించేది. తననుతానే వ్యక్తీకరించుకుంటాడు చిత్రకారుడు. నేను ఈ బొమ్మను ప్రదర్శించకపోవడానికికారణం

ఈ బొమ్మలో నా ఆత్మలోని రహస్యాన్ని చూపించానన్న భయమే'.

లార్డ్ హెన్రీ నవ్వి 'ఏమి టా రహస్యం?' అన్నాడు.

'చెబుతాను', అన్నాడు హాల్‌వర్డ్. కాని అతనిముఖం కలవరంతో విచలితమైంది.

'ఒళ్ళంతా చెవులు చేసుకుని కూచున్నాను' అన్నాడు స్నేహితుడు అతనివంక చూస్తూ.

'చెప్పదగిన పెద్ద విషయం కూడా లేదు. అయినా నీవు ఎంతవరకు అర్థం చేసుకుంటావా అని భయపడుతున్నాను. అర్థం చేసుకున్నా, ఎంతవరకు నమ్ముతావో! నమ్మవు' అన్నాడు చిత్రకారుడు.

లార్డ్ హెన్రీ నవ్వి, వంగి, ఒక చిన్న గడ్డిపూవు గిల్లి పరీక్షగా దాన్ని చూచాడు.

'అర్థంచేసుకోవడంవిషయమవుతే మాత్రం తప్పకుండా అర్థంచేసుకుంటాను. కాని నమ్మడం విషయంలో - ఏ విషయాన్నయినా నమ్మగలను - అది పూర్తిగా అసంబద్ధం, అవిశ్వసనీయం అయిన విషయమవుతే సరి', అన్నాడు లార్డ్ హెన్రీ గడ్డిపూవువంక చూస్తూ.

గాలివీచి కొన్ని పూలు రాల్చింది. మందమైన గాలి తెరకు బరువైన 'లీలక్' కుసుమాలు అటూ ఇటూ ఊగాయి. ఒక మిడత గోడప్రక్కన ఎగరడం మొదలెట్టింది. ఒక నీలపు దారంలాగా ఒక పొడుగైన సన్నని ఈగ గోధుమవన్నె రెక్కలుచాచి ఎగురుతూ వెళ్ళింది. బేసిల్ హాల్‌వర్డ్ గుండె కొట్టుకుంటున్న చప్పుడు వినిపిస్తున్నట్టుగా అనిపించింది లార్డ్

హెన్రీకి. ఏం చెప్పబోతున్నాడో అని ఆశ్చర్యంతో చూస్తున్నాడు.

'ఏమీలేదు. ఇదీ కథ. చెబుతావిను' అంటూ ప్రారంభించాడు చిత్రకారుడు హాల్‌వార్డ్.

'రెండు నెలల క్రితం లేడీ బ్రాండన్ (బ్రాండన్ సతి) ఇంటికి ఒక సమావేశానికి వెళ్ళారు. చాలా మంది వచ్చారు. నేనూ వెళ్ళాను. మా చిత్రకారులున్నారు చూచావ్ - అనాగరకులం కామని ప్రజలకు జ్ఞాపకం చెయ్యడానికి - అప్పుడప్పుడు నలుగురూ కూడినచోట కనుపిస్తూ ఉండాలి. సంఘానికి ఇలా దర్శనమిస్తూ ఉండాలిగా. ఒక ఈవినింగ్ కోటు, తెల్లనిటై వేసుకుని వెళ్ళాను.

'ఈదుస్తులతో స్టాక్ బ్రోకర్ కైనా నాగరికసమాజంలో ప్రవేశం కలుగుతుందన్నావు నీవు ఒకమాటు - జ్ఞాపకం ఉందా? అదే డ్రెస్‌లో బయలుదేరి వెళ్ళాను సరే, గదిలోకి వెళ్ళిన పది నిమిషాలు, పెద్దపెద్ద గంతల్లాటి దుస్తులు ధరించిన ఉన్నతకుటుంబాల మహిళామణులతోనూ, విమర్శకులతోనూ మాట్లాడడంతో సరిపోయింది. తరువాత ఎవరో నావంక చూస్తున్నట్టు గమనించాను. సగం వెనక్కు తిరిగి చూచాను. డోరియన్ గ్రేను చూడడం అదే మొట్టమొదటిసారి. నాకళ్ళూ అతని కళ్ళూ కలుసుకున్నప్పుడు నాముఖంలోని నెత్తురంతా ఇంకిపోతున్నట్టుగా అనిపించింది.

'నన్ను ఒకవిచిత్రమైనభయం ఆవహించింది. ఒక గొప్ప ఆకర్షణీయమైన వ్యక్తిసాన్నిధ్యంలో ఉన్నానని - కేవలం అతని మూర్తి - అతని సాన్నిధ్యమే ఆకర్షణీయమైన

దని - ఆ ఆకర్షణను అలాగే కొనసాగనిచ్చేటట్లయితే అది నా ప్రకృతినంతా పీల్చేసుకుంటుందని, నా ఆత్మను, నా కళను కూడా ఆహుతి తీసుకుంటుందని గమనించాను. నే నెప్పుడూ జీవితంలో వెలుపలినుంచి ఎలాటి ప్రభావాన్ని కోరలేదు. నీ మట్టుకు నీకు తెలుసుకదా - నా స్వభావం - ఎంత స్వతంత్ర మైన స్వభావమో. ఎప్పుడూ నాకు నేనే యజమానిని. ఇంత వరకు-అంటే డోరియన్‌గ్రేను కలుసుకున్నంతవరకు అలాగే వున్నాను. తరువాత అంతా మారిపోయింది. ఎలామారిపోయింది అంటే చెప్పడంకష్టం. జీవితంలో యేదో పెద్ద విషమఘట్టం ఎదుర్కొంటూ ఉన్నట్టుగా తోచింది. ఏదో గొప్ప సంధ్య. అలా అనిపించింది. ఎంచాతనో కాని కాలగర్భంలో విధి నాకోసం మెన్నో అపూర్వమైన సుఖాలు, దుఃఖాలు దాచి పెట్టి ఉంచిందనిపించింది. నేను భయపడి గదిలోనుంచి వెళ్ళి పోదామని అడుగులు మళ్ళించాను. అంతరాత్మ కాదు- నాచాత ఈపని చేయించింది. ఒకవిధమైన భయం. అలా తప్పించుకుని పోదామని ప్రయత్నించినందుకు నేను గర్వించడంలేదు.'

'అంతరాత్మ, భయం రెండూ ఒకటే బేసిల్. పిరికి తనం అనే కంపెనీకి అంతరాత్మ వ్యాపారపు పేరు. అంతే' అన్నాడు లార్డు హెన్రీ.

'అలాఅంటే నేను నమ్మను హెన్రీ. నీవూ నమ్ముతా వనుకోను. నాఉద్దేశం ఏదైనప్పటికీ-అది గర్వంకూడా కావచ్చు. నేను వెళ్ళిపోదామని తలుపుదగ్గరకు వెడుతూ లేడీ బ్రాండన్‌కు తట్టుకున్నాను,

'ఇంత త్వరగా వెళ్ళిపోతున్నావేం మిస్టర్ హాల్‌వర్డ్' అన్నది ఆమె తనకీచురాయి కంఠధ్వనితో. నీకు తెలుసుగా— ఆ కంఠధ్వని.'

'ఒక్క సౌందర్యంవిషయంలో తప్ప అన్నివిషయాల్లోనూ ఆమె గొప్పదే — ఎలాటిదోటూ పేన్.' అన్నాడు లార్డ్ హెన్రీ గడ్డిపూవురెక్కలు తుంపుతూ.

'ఇహ ఆమె నన్ను వదిలిపెట్టలేదు. పెద్దపెద్ద రాకుమారులకు, చిలకముక్కుల మహిళామణులకూ పరిచయంచేసింది. తనకు అతి ప్రియమైన ఆ స్నేహితుణ్ణని చెప్పింది. నిజం చెప్పాలంటే ఆమెను అదివరకు ఒక్కసారే కలుసుకున్నాను నన్ను అందరికీ ప్రదర్శించెయ్యడానికి అది అవకాశంగా తీసుకుంది. ఆ రోజుల్లో నా బొమ్మను చేసినా పెద్ద కీర్తివచ్చిందనుకుంటాను. కీర్తివిషయం ఎలాఉన్నా— అణాగాని వార్తాపత్రికలలోనైనా దాన్నిగురించి వ్రాస్తుండేవారు. అవేగా పందొమ్మిదవ శతాబ్దపు అమరస్థితికి ప్రమాణాలు. ఇలా ఒక్కొక్కరినే పరిచయంచేసుకుంటూవచ్చింది. హఠాత్తుగా, నన్ను విచిత్రంగా కదిలించిన ఆ యువకునిముందు నిల్చున్నాను. ఇద్దరం చాలా దగ్గరగా ఉన్నాం— ఇంచుమించు ఒకరిని ఒకరు రాచుకుంటూ. కళ్ళు కలిశాయి. కొంచెం సాహసమే అనుకో— అయినా అతనికి పరిచయంచెయ్యమని లేడీ బ్రాండన్‌ను అడిగాను. ఎలా అడిగానో నాకే తెలీదు. అడగకుండా ఉండలేకపోయాను. ఆమె పరిచయంచెయ్యకపోయినా ఒకరితో ఒకరం మాట్లాడుకుని ఉండేవాళ్ళం తప్పకుండా. డోరియన్ కూడా తరువాత

ఈమాటే అన్నాడు. ఒకరిని ఒకరు తెలుసుకోవాలని రాసడం మా విధిలోనే ఉందని అతని ఉద్దేశంనూనా.'

'అద్భుతమైన ఈ యువకుణ్ని లేడీ బ్రాండన్ ఎలా వర్ణించిందోయ్, చెప్పు. త్వరత్వరగా ఏదో చెప్పేసిేశంటుంది కదూ? ఒకమాటు నన్ను ఒకవృద్ధుడికి పరిచయం చేస్తూ – నా చెవుల్లో– గదిలో అందరికీ వినిపించేటట్టు చాలా ఘోరమైన వివరాలు చెప్పింది. నేను వినలేక పరుగెత్తుకుని వెళ్లానంటే నమ్ము. నాఅంతట నేనే పరిచయంచేసుకోడం నాకు ఇష్టం. కాని, లేడీ బ్రాండన్ తన అతిథులను వేలంపాడేవాడు తన వస్తువులను ఎలా చూస్తాడో సరిగ్గా అలా చూస్తుంది. చెప్పడం మొదలెట్టిందా, చాటభారతంలా, వివరాలన్నీ చెప్పేస్తుంది. లేదా, అసలు తెలుసుకోదలచిన విషయంతప్ప అన్నివిషయాలు చెబుతుంది.'

'పాపం! లేడీ బ్రాండన్! నీవు ఆమెను మరీ ఆటపట్టిస్తున్నావు హెన్రీ!' అన్నాడు హాల్వర్డ్ నిర్లిప్తంగా.

'అదికాదోయ్. ఆమె కొండను తవ్వి ఎలుకను పట్టే రకం. పెద్ద మహల్ కట్టాలని యత్నిస్తుంది. చివరకు ఒకచిన్న హోటల్ స్థాపిస్తుంది. ఇహ ఆమెను పొగడమంటే ఎలా పొగడగలను చెప్పు. అసలువిషయం చెప్పు– ఆమె డోరియన్ గ్రేను గురించి ఏంచెప్పింది?'

'అస్పష్టంగా ఏదేదో చెప్పింది. "చక్కని కుర్రాడు. కుర్రాడితల్లీ నేనూ ఒకదేహంలా మెసలుకునేవాళ్ళం. ఏం చేస్తాడో జ్ఞాపకంలేదు. అసలు ఏమీ చెయ్యడనుకుంటాను. కాదు– పియానో వాయిస్తాడు. పియానోనేనా లేక వాయి

లినా? ఏమిటి మిస్టర్ గ్రే?' అంటూ ఏదేదో చెప్పింది. ఆమె ఇలా చెబుతూ ఉంటే మేమిద్దరంకూడా నవ్వాపుకోలేకపోయాం. తక్షణం స్నేహితులమయ్యాం.'

'నవ్వుతో స్నేహం ప్రారంభంకావడం చెడ్డపేమీ కాదు. స్నేహం అంతమయ్యే సమయంలో నవ్వు మరీ మంచిది' అన్నాడు లార్డ్ హెన్రీ మరో గడ్డిపూవు గిల్లుతూ. హాల్‌వర్డ్ తల ఊపాడు.

'స్నేహమంటే ఏమిటో నీకు తెలీదు హెన్రీ. ఆమాటకొస్తే విరోధమంటేకూడా తెలీదు. నీవు అందరితోనూ ఇష్టంగానే ఉంటావు. అంటే నీవు ఎవరినీ పట్టించుకోవన్నమాట' అన్నాడు.

'ఎంత అన్యాయం!' అని లార్డ్ హెన్రీ తల వెనక్కు వంకించి పైన చిన్నచిన్న మేఘాలవంక చూశాడు. చిన్నచిన్న మబ్బుతునకలు మెరుస్తున్న తెల్లని పట్టుపింజల్లా ముళ్ళుకట్టుకుని గోలిచిన నీలమణిలాఉన్న వేసవికాలపు నీలాలనింగిలో తేలిపోతున్నాయి.

'అవును. చాలా అన్యాయమైనమాట అన్నావు. నాకు తారతమ్యం తెలీకపోలేదు. నాకు తారతమ్యం బాగా తెలుసు. అందమైనవాళ్ళను స్నేహితులుగా ఎన్నుకుంటాను. శీలంగలవారిని పరిచయస్థులుగా ఎన్నుకుంటాను. విరోధులను, మంచి మేధావంతులను వారి మేధస్సుకోసం ఎన్నుకొంటాను. నా స్నేహితుల్లో కాని, పరిచయస్థుల్లో కాని, విరోధుల్లో కాని పనికిరానివద్దమ్మ ఎవరూ లేరు. బుద్ధిహీనుడు మచ్చుకైనా లేడు. అందరూ అంతో ఇంతో బుర్రఉన్నవాళ్ళే. అంచాతనే

అందరూ నన్ను చూస్తే ఇష్టపడతారు. నన్ను ప్రశంసిస్తారు. ఇందులో ఆత్మాతిశయం ఉన్నదంటారా? కావచ్చు' అన్నాడు లార్డ్ హెన్రీ.

'అలాగే అనిపిస్తుంది హెన్రీ. కాని ఈ నీ విభజనప్రకారం నేను పట్టి పరిచయస్థుణ్ణి మాత్రమే అవుతాను' అన్నాడు చిత్రకారుడు.

'బేసిల్, నీవు అంతకంటె ఎక్కువైనవాడివి.'

'స్నేహితునికంటె తక్కువైనవాడిని. ఒకవిధమైన అన్ననో తమ్ముణ్ణో అనుకో.'

'అన్నలూ, తమ్ముళ్లూ! వాళ్ళను ఎన్నడూ లెక్క చెయ్యను. నా అన్నయ్యేమో చనిపోడు. నా తమ్ముళ్ళేమో మరోపని చేసేట్టులేరు.'

'హెన్రీ!' అన్నాడు హాల్‌వర్డ్ కోపంతో.

'అబ్బాయీ, నేను గమ్మత్తుకన్నానులే. కాని బంధువుల్నిమాత్రం అసహ్యించుకోకుండా ఉండలేను. కారణం చెప్పనా? మనలో ఎవరూకూడా మనలోతప్పులు మరొకరిలో కనుపిస్తే సహించలేరనుకుంటాను. పై వర్గాలవారి దురలవాట్లనేవాటిపట్ల ఇంగ్లీషు ప్రజాస్వామ్యవాదుల కోపతాపాలతో నాకు సానుభూతి ఉన్నది. త్రాగుడు, బుద్ధిలేకపోవడం, అవినీతి, ఇవన్నీ తమ స్వంత సొత్తనుకుంటారు ప్రజలు. మనలో ఎవడైనా అలాంటిఅవస్థకు లోనయిన గాడిద పుంటే వారిప్రత్యేక ఆస్తులను దురాక్రమణచేస్తున్నట్టు భావిస్తారు. కాని ఈ కార్మికులలో, వందకు పదిమందయినా సరిగా జీవిస్తారనుకోను'.

'నీవు చెప్పింది ఒక్క ముక్క కూడా ఒప్పుకోను. నీవు కూడా ఒప్పుకోవని నాకు గట్టి నమ్మకం'.

లార్డ్ హెన్రీ కొనదేరిఉన్న తన గోధుమవన్నె గడ్డం నిమురుతున్నాడు. తళతళ మెరుస్తున్న తన బూటుచివరను చేతి బెత్తం ఆడించాడు.

'నీలో ఇంగ్లీష్‌వాళ్ళ స్వభావం ఎంత జీర్ణించుకుని ఉంది బేసిల్! ఈ మాట నీవు అంటే వినడం ఇది రెండవసారి. అసలైన ఒక ఇంగ్లీష్‌వానికి ఎవరైనా ఒకవిషయం చెబితే — అలా చెప్పడం చాలా సాహసమనుకో — ఆ విషయం తప్పా ఒప్పా అని ఆలోచించడు. అసలు అతని మనసులోకి ఆ ఆలోచనరానేరాదు. అతనిదృష్టిలో ముఖ్యమైన విషయం చెప్పిన వాడు ఆ విషయం నమ్ముతున్నాడా లేదా అని. అంతే. ఒకరు ఒక విషయం చెప్పారనుకో. ఒక భావం వెలిబుచ్చారనుకో. ఆ భావంయొక్క విలువకూ ఆ భావం వెలిబుచ్చినవ్యక్తి ఆత్మ శుద్ధికీ ఎలాంటి సంబంధమూ లేదు. ఇంతేకాదు — భావం వెలిబుచ్చిన వ్యక్తిలో ఆత్మశుద్ధి ఎంత తగ్గుస్థాయిలో ఉంటే, ఆ భావంలో అంత స్వచ్ఛమైన మేధస్సు ఇమిడిఉంటుంది. అంటే అలాటి భావానికి అతనివ్యక్తిగతమయిన కోరికలు, ఇష్టాఇష్టాల తాలూకు పూతలేమీ ఉండవు. అయినా, నీతో రాజకీయ శాస్త్రం కాని, సాంఘికశాస్త్రం కాని, తత్వశాస్త్రం కాని, చర్చించడం నా ఉద్దేశం కాదు. నాకు సూత్రాలకంటె, నియమాలకంటె వ్యక్తులంటే ఎక్కువ ఇష్టం. ప్రపంచమంతటిలోకీ, నియమాలు సూత్రాలు లేని వ్యక్తులంటే మరీ ఇష్టం

నాను. డోరియన్ గ్రేను గురించి ఇంకా ఏమైనా చెప్పు. నీవు తరుచుగా చూస్తుంటావా అతన్ని?' అన్నాడు లార్డ్ హెన్రీ.

'ప్రతిరోజూ కలుసుకుంటాను. ఒక్కరోజు చూడకపోయినా నా మనస్సు మనస్సులో ఉండదు. నా బ్రతుకుకు తీరని అవసరం అతను'.

'ఇదేం చిత్రం! నీవు జీవితంలో ఒక్క నీ కళకోసం తప్ప మరి దేనికీ లెక్క చెయ్యవనుకున్నాను'.

'ఇప్పుడు నా కళంతా అతనే' అన్నాడు చిత్రకారుడు గంభీరంగా.

'హెన్రీ, ఒకొక్కమాటు నాకు ప్రపంచచరిత్రలో రెండే ముఖ్యమైనయుగాలున్నాయనిపిస్తుంది. నూతన కళా సాధనం తొలిగా కనుపట్టినయుగం మొదటిది, కళకోసం కొత్త మూర్తి ద్యోతకమైనయుగం రెండవది. నూనె రంగులలో బొమ్మలు వ్రాయడం కనిపెట్టడం వెనిస్ వాసులకు ఎలాంటిదో, గతించిన గ్రీక్ శిల్పానికి ఆంటోనియస్ వదనం ఎలాంటిదో, డోరియన్ గ్రే వదనం ఒకనాటికి నాకు అలాంటిదే అవుతుంది. అతన్ని బొమ్మగా గీయడంమాత్రమే కాదు, అతని బొమ్మకు రంగులు పూయడంమాత్రమే కాదు— ఇవన్నీ నేను చేశాను— ఇంతకంటే మించిన విశేషమున్నది అతనునాకు వట్టి 'మోడల్' మాత్రమే కాదు. అంతకంటె ఎక్కువ. నేను వ్రాసిన బొమ్మ నాకు సంతృప్తికరంగా లేదని, అతని సౌందర్యం కళద్వారా వ్యక్తీకరించడానికి అసాధ్యమైనదని, కళకి అతీతమయినదని చెప్పను. కళ వ్యక్తీకరించలేని విషయమేమీ లేదు. నేను డోరియన్ గ్రేను కలుసుకున్ననాటినుంచి నేను చేసినపని — మంచి

దని - నా జీవితంలోకల్లా అత్యుత్తమమయినదని నాకు తెలుసు. ఇదంతా చెబుతూఉంటే నీవు నన్ను అర్థంచేసుకుంటున్నావో లేదో మరి? కాని, అదేంచిత్రమో చెప్పలేను. కాని, అతని మూర్తి నాకు పూర్తిగా అపూర్వమయిన ఒక కళావిధానాన్ని స్ఫురింపచేసింది. ఒక కొత్త కళాపద్ధతి నాలో తొలకరించింది. నా దర్శనం మారింది. ఇప్పుడు నేను ప్రతివిషయాన్ని కొత్తగా చూస్తున్నాను. పూర్వంకంటె విభిన్నంగా మరోవిధంగా చూస్తున్నాను. అంతేకాదు - ప్రతి విషయాన్ని గురించి కొత్తగా ఆలోచిస్తున్నాను. ఇంతకాలం నుంచి నాకు తెలీకుండా దాచబడి ఉంచిన కొత్త విధంగా ఇప్పుడు జీవితాన్ని కళలో పునస్సృష్టీకరించగలను.

'ఆలోచనాదినాలలో ఒక స్వప్నమూర్తి' - ఎవరూ ఈమాటన్నది? మరిచాను. కాని నాకు డోరియన్‌గ్రే అలాగే స్వప్నమూర్తి అయ్యాడు.

'కంటిముందు ఆ కుర్రాడు ఉంటేచాలు - కుర్రాడని ఎందుకంటున్నానంటే నా కళ్ళకు అలాగే అబ్బాయిలా కనిపిస్తాడు ఇరవైఏళ్ళు దాటినా. కంటిముందు ఆ అబ్బాయిఉంటే చాలు! అతని సాన్నిధ్యం చాలు! ఓహ్! ఏం చెప్పను! ఆ సాన్నిధ్యంలో ఎంత విశేషముఉన్నదో నీవు అర్థంచేసుకోగలుగుతావో లేదో! ఒక కొత్త కళాదృష్టియొక్క రూపాంచలాలు అతనిలో నేను అవ్యక్తంగా దర్శిస్తాను. అతను అవ్యక్తంగా ఆ దృష్టిని నిర్వచిస్తాడు.

'గ్రీక్ శిల్పకళాపరిపూర్ణతనంతా ఇముడ్చుకున్న కళా దృష్టి అది! రసజగత్తులోని స్వారస్యాన్నంతా ఇముడ్చుకున్న కళా స్వరూపం అది!

'ఆత్మ శరీరాల సమన్వయం! - ఎంత బాగా కుదిరింది! మన వెర్రితనంవల్ల మనం వాటిని విడదీసి ఒకవైపున జుగుప్సాకరమయిన వాస్తవికతనూ మరోవైపున శూన్యతుల్యమయిన ఆదర్శాన్ని ఏర్పరచుకున్నాం. కాని, రెంటినీ కలిపిచూస్తే! హెన్రీ! డోరియన్‌గ్రేకూ నా ఆత్మకూ ఎలాంటి సంబంధం ఉన్నదో నీవు గ్రహిస్తే చాలు! నేనొక ప్రకృతిదృశ్యాన్ని చిత్రించాను - నీకు జ్ఞాపకం ఉందికదూ - ఆగ్న్యూ పెద్ద వెల ఇచ్చి దాన్ని కొంటానన్నాడు - కాని నేనుమాత్రం అమ్మలేదు - జ్ఞాపకమేకదూ? నేను వ్రాసిన గొప్ప బొమ్మల్లో అది ఒకటి. ఎంచాతనో తెలుసా? ఆబొమ్మను నేను చిత్రిస్తున్నప్పుడు డోరియన్‌గ్రే నా పక్కనే వున్నాడు. ఒక అనిర్వచనీయమైన ప్రభావం అతని నుంచి నన్ను చేరింది. నాలోకి ప్రవహించింది. నా జీవితంలో మొట్టమొదటిసారిగా నేను చిత్రిస్తున్న అతిసామాన్యమయిన ఆ అడవిలో నాకు అద్భుతమైన సౌందర్యం కనుపించింది. ఎన్నోసార్లు ఈసౌందర్యంకోసం వెదికాను. కాని, ఎన్నడూ కనుపించలేదు.'

'బేసిల్, నీవు చెబుతున్న విషయాలన్నీ అపూర్వంగా వున్నాయి. నేను డోరియన్‌గ్రేను తప్పకుండా చూడాలి' అన్నాడు లార్డ్ హెన్రీ.

హాల్‌వర్డ్ తను కూచున్నచోటినుంచి లేచి, తోటలో అటూ ఇటూ తిరగసాగాడు. కాసేపు అలా తిరిగి తిరిగి వచ్చి

'హెన్రీ! డోరియన్ గ్రే నా కళకు ఒక ప్రేరేపణ మాత్రమే. అతనిలో నీకేమీ కనుపించకపోవచ్చు.

నా కళలో అతని ప్రతిబింబం కనుపించినప్పుడు అతను సాక్షాత్కరించినంతగా మరెప్పుడూ సాక్షాత్కరించడు. ఒక కొత్తపద్ధతికి అతను ఒక సూచనామాత్రమే. కొన్ని రేఖలవంపులు అతనిలో నాకు కనుపిస్తాయి. కొన్ని వర్ణాల అందచందాలలో రహస్యపు లోతులలో ఆ రేఖాంచలాలు నాకు కనుపిస్తాయి. అంతే' అన్నాడు

"అయితే అతనిబొమ్మను ఎందుకు ప్రదర్శించవు?' అన్నాడు లార్డ్ హెన్రీ.

'ఎందుచేతనంటావా? నాకు తెలీకుండానే నేను ఆ బొమ్మలో ఈ విచిత్రమైన కళారాధనను ప్రతిఫలింపచేశాను. ఈ విషయం ఎప్పుడూ డోరియన్ గ్రేతో చెప్పలేదుకూడా. అతని కీ విషయం ఏమీ తెలీదు, తెలుసుకోడుకూడా. కాని ప్రపంచం ఈ రహస్యాన్ని ఊహించుకోవచ్చు. అలా ఊహించి ప్రపంచం తన చూపుల సూదులతో నా హృదయాన్ని గుచ్చి బాధిస్తే నేను సహించలేను. ఆ చూపులకు నా హృదయం తట్టుకోలేదు. ఆ చూపులముందు నా హృదయాన్ని నగ్నంగా నిలబెట్టలేను. వాళ్ళ చూపుల సూక్ష్మదర్శిని యంత్రానికి నా హృదయాన్ని అప్పగించలేను. ఆ బొమ్మలో నాకు — నా ఆత్మకి సంబంధించింది చాలా ఉంది హెన్రీ! చాలా ఉంది'

'కవులకు మాత్రం మీకున్నన్ని పట్టింపులుండవు. ఉద్వేగం కీర్తికోసం ఎంత బాగా ఉపయోగిస్తుందో వారికి బాగా తెలుసు. ఈ రోజుల్లో భగ్నహృదయాన్ని గురించిన రచనలు

అమ్మినంతగా మరే రచనలుగా అమ్మలేవు. ఒక ముద్రణ కాదు – అనేక ముద్రణలు అమ్మకమవుతుంది 'భగ్నహృదయం' అయితే సరి.'

'అలాటివంటే నాకు అసహ్యం! కళాకారుడు అందమైన విషయాలను సృష్టించాలి గాని, తన జీవితాన్నంతా తీసుకునిపోయి వాటిలో పెట్టకూడదు. ఈ రోజుల్లో కళకూ ఆత్మకథకూ భేదం లేకుండాపోయింది. కళకూడా ఒకవిధమైన ఆత్మకథను చెప్పే స్వరూపంగా పరిగణింపబడుతున్న యుగంలో నివసిస్తున్నాం మనం. కళను గురించిన 'అవ్యక్తదృష్టి' మనలో పూర్తిగా నశించిపోయింది. ఒక రోజుకు ఆ దృష్టి ఎలాటిదో ప్రపంచానికి చూపిస్తాను. అందుకనే నేను వ్రాసిన ఈ డోరియన్‌గ్రే చిత్రం ఎన్నటికీ ప్రపంచంకళ్ళపడదు'

'నీవు తప్పుచేస్తున్నావనుకుంటాను బేసిల్. అయినా ప్రస్తుతం నీతో నేను వాదించ దలచుకోలేదు. మేధస్సు నన్నగిల్లినవాళ్ళే వాదనలోకి దిగుతారు. నాకో విషయం చెప్పు – డోరియన్‌గ్రేకు నీవంటే చాలా ఇష్టమేనా ?'

చిత్రకారుడు కొద్ది క్షణాలపాటు ఆలోచనలోపడ్డాడు.

'నేనంటే ఇష్టమే' అన్నాడు కొద్దిసేపాగి – 'అతనికి నేనంటే ఇష్టమే. నాకు తెలుసు. అతన్ని నేను ఎంతో పొగుడుతూఉండేమాట నిజం.

'అతనితో కొన్నివిషయాలు చెబుతూ ఉంటే నాకు విచిత్రమైన ఆనందం కలుగుతుంది. ఆ విషయాలు ఎందుకు చెప్పానా అని చింతిస్తానని నాకు తెలుసు. అయినా ఆ విషయాలు చెబుతున్నప్పుడు ఆనందం కలుగుతుంది. అతని సాన్ని

ధ్యం ఎంతో ఆకర్షణీయమైనది. అందులో సందేహం ఎంత మాత్రం లేదు. స్టూడియోలో కూచుని మేము ఎన్నెన్నో విషయాలు మాట్లాడుకుంటాం. ఒక్కొక్కసారి అతను నన్ను అర్థం చేసుకోనట్టుగా కనిపిస్తుంది. 'ఇంత ఆలోచనలేనివా డేమిటా' అనిపిస్తుంది. తన ఆనందం కోసం నాకు బాధకలిగిస్తున్నా డనిపిస్తుంది. తరువాత నాకు ఇలా అనిపిస్తుంది హెన్రీ - తన కోటులో అలంకారార్థం పెట్టుకునే పూవును ఎలా చూస్తాడో అలా నా హృదయాన్ని పాలించుకునే వ్యక్తికి నా హృదయాన్ని ఇచ్చేశా ననిపిస్తుంది. అతను నా హృదయాన్ని అలా — తరువాత తన సౌందర్యం కోసం తన ఆకర్షణ కోసం కోటులో వేసవిరోజుల్లో ధరించే అలంకారపు పూవులా చూస్తా డనిపిస్తుంది' అన్నాడు చిత్రకారుడు.

'వేసవిరోజులు బహుశా అక్కడక్కడే తిరుగుతున్నట్టుంటాయి బేసిల్. ఈ గొడవంతా చూస్తూఉంటే అతనికంటె ముందుగా నీవే విసుగుచెందుతావనిపిస్తోంది. అనుకుంటే విచారం కలుగుతుంది. కాని — అందంకంటె ప్రతిభకు వయస్సెక్కువ.

మన సంస్కారాన్ని విజ్ఞానాన్ని మనం మరింత అధికం చేసుకోడానికి యత్నించడమే ఇందుకుసాక్షి. ఉనికికోసం మనం చేసే భీకరమైన సంఘర్షణలో శాశ్వతంగా నిలిచే విషయం కోసం మనం యత్నిస్తాం. అందుచేతనే అసహ్యమైన అనేకవిషయాలతో మనబుర్రలు నింపుకుంటాం. అలా చేస్తే ఇహ మనకు చలనం ఉండదని మన ఉద్దేశం. అన్ని విషయాలూ సర్వసమగ్రంగా తెలిసినవ్యక్తి — ఇది అధునాతన ఆదర్శం. అలాటి

వ్యక్తి మనస్సు - అది భయంకరం - యమలోకంలా ఉంటుంది. చిందరవందరగా ఉన్న దుకాణంలా ఉంటుంది. వస్తువుల నిండా మట్టీ దుమ్మూ. అసలు విలువలకంటె ఎక్కువ విలువలు వేసి ఉంటాయి. ఏమైనా, మొదట గిరాకీ నీకే కలుగుతుందనుకుంటాను. ఒకరోజున నీమిత్రుడిలో నీకు కనుపించిన ఆకర్షణంతా పోతుంది. ఈబొమ్మకూ అతనికీ కూడా ఆట్టే భేదం కనుపించదు. అతని రంగునో, దేన్నో నీవు ఇష్టపడక పోవడం జరుగుతుంది. బైటికి చెప్పకపోయినా, నీ హృదయంలో అతన్ని తీవ్రంగా నిందించుకుంటావు.

నీ పట్ల ప్రవర్తించరాని విధంగా ప్రవర్తించాడనుకుంటావు. మరోసారి అతను నీ దగ్గరికి వస్తే అతన్ని పట్టించుకోవు. అపరిచితుణ్ణి చూచినట్టు చూస్తావు. ఈ మార్పు చాలా భయంకరమైంది, చాలా విషాదకరమైంది — నీవు పూర్తిగా మారిపోవడం. ఇంతవరకూ నీవు నాకు చెప్పింది ఒక విచిత్రమైన ప్రణయంలా ఉంది. కళాప్రణయం అనవచ్చా? ఎలాంటి ప్రణయంలోనయినా ఒక గొప్పదోషం ఉన్నది. ఎలాంటి ప్రణయమైనా చివరకు ఆ వ్యక్తిని రసరహితంచేసి శూన్యంలో విడిచి పెడుతుంది' అన్నాడు లార్డు హెన్రీ.

'హెన్రీ, నీవు ఇలా మాట్లాడకు. నేను బ్రతికిఉన్నంత కాలం డోరియన్ గ్రే మూర్తి నన్ను ఆకర్షిస్తూనే ఉంటుంది. నా హృదయాన్ని పాలిస్తూనే ఉంటుంది. నేను స్పందించినట్టుగా నీవు స్పందించవు. అదీకాక, నీవు తరుచుగా మారుతూ ఉంటావు.'

'సరిగ్గా నేనూ అదే అనుకుంటున్నాను బేసిల్. ప్రేమ పట్ల విశ్వాసం గలవాళ్ళకు దాని లోతుపాతులు తెలియవు. దాని పై మెరుగులే తెలుస్తాయి. విశ్వాసంలేని వారికే ప్రేమ యొక్క వైఫల్యాలూ, విషాదాంతాలూ తెలుస్తాయి' అని లార్డు హెన్రీ ఒక సిగరెట్ వెలిగించి తాపీగా తృప్తిగా కాల్చడం మొదలెట్టాడు ప్రపంచాన్నంతా ఒక్క మాటలో ఇమిడ్చి చెప్పినట్టు. దూరంగా పిచ్చుకల కిచకిచలు వినిపిస్తున్నాయి. నీలంగా ఉన్న మబ్బులసీమయి పిట్టల బారుల్లా గడ్డిమీద పరుగెత్తుకుని పోతున్నాయి. తోటల్లో ఎంత హాయిగా ఉంది! ఇతరుల హృదయాలూ – ఉద్వేగాలూ – ఎంతరసవంతంగా కనుపిస్తున్నాయి. వారిభావాలకంటే ఎక్కువ అందంగా కనుపిస్తున్నాయి – అని పించింది లార్డు హెన్రీకి.

మన ఆత్మ – మన స్నేహితుల ఉద్వేగాలు – ఇవే జీవితంలో ఆకర్షణీయమైనవి, అందమైనవీ. అతను ఒకచోటికి మధ్యాహ్నం భోజనానికి వెళ్ళాలి. కాని బేసిల్ హాల్‌వర్డ్‌తో కూచుని మాట్లాడుతూ వెళ్ళలేదు. ఆ విషయం జ్ఞాపకం వచ్చింది లార్డు హెన్రీకి. అతను తన మేనత్తగారింటికి భోజనానికి వెళ్ళి ఉంటే లార్డు గుడ్‌బడీ తప్పకుండా కనుపించి ఉండే వాడు. సంభాషణంతా పేదలకు అన్నదానాన్ని గురించి సత్రాలనుగురించి సాగేది. ప్రతివర్గం, తన జీవితంలో అమలులో పెట్టడానికి అవసరంలేని కొన్ని గుణగుణాల ప్రాధాన్యాన్ని గురించి చెబుతుంది. ఆ గుణగణాలు తమ జీవితంలో ఆచరించవలసిన ఆవశ్యకత ఉండదు. దానధర్మాలనుగురించి ధనవం

తులు మాట్లాడుతారు. శ్రమలో ఉన్న గొప్పతనాన్ని గురించి సోమరిపోతులు ఉపన్యాసా లిస్తారు. భోజనానికి వెడితే ఈగోడ వంతా పడాల్సివచ్చేది.

ఇదంతా తప్పించుకున్నందుకు లార్డ్ హెన్రీకి సంతోషం గాఉంది! అతని అత్త తలపుకురాగానే అతనికో విషయం జ్ఞాపకంవచ్చింది. హాల్ వర్డ్ వంక తిరిగి 'అబ్బాయ్! ఒక విషయం జ్ఞాపకంవచ్చింది' అన్నాడు.

'ఏమిటి హెన్రీ?'

'ఎక్కడో డోరియన్ గ్రే పేరు విన్నాను.'

'ఎక్కడ?' అన్నాడు హాల్ వర్డ్ కొద్దిచిరాకుతో.

'అలా కోప్పడకు బేసిల్, మా అత్త లేడీ 'అగథా' అనుకుంటాను - అతని పేరు చెప్పింది. అతను అందగాడని ఆమె చెప్పలేదు. నాకు బాగా జ్ఞాపకం. ఆడవాళ్ళకు—ముఖ్యంగా మంచివాళ్ళకు - అందచందాల విషయంలో అంత అభిరుచి ఉండదు. మంచి కుర్రవాడని, స్వభావం మంచిదని చెప్పింది. అప్పుడు నా కళ్ళముందు అతను కళ్ళద్దాలు, సాఫీగా జారుతున్న జుట్టు, ఒంటినిండా పొడలు కలిగి బరువుగా కాళ్ళీడ్చుకుంటూ నడుస్తాడని ఊహించుకున్నాను. అతడు నీ స్నేహితుడని తెలిసిఉంటే బావుండేది.'

'తెలీకపోవడమే మంచిది.'

'ఏం?'

'నీవు అతన్ని కలుసుకోడం నాకు ఇష్టంలేదు.'

'నేను అతన్ని కలుసుకోడం నీకు ఇష్టంలేదూ?'

'లేదు.'

'మిస్టర్ డోరియన్ గ్రే వచ్చి స్టూడియోలో ఉన్నారు సార్!' - అన్నాడు బట్లర్ తోటలోకి వచ్చి.

'ఇప్పుడు నీవు నాకు పరిచయంచెయ్యక తప్పదు' అన్నాడు లార్డ్ హెన్రీ నవ్వుతూ.

చిత్రకారుడు ఎండలో కళ్ళార్పుకుంటూ నిల్చునిఉన్న సేవకుని వైపు తిరిగి, 'పార్కర్, మిస్టర్ గ్రేను ఉండమని చెప్పు. కొద్దిక్షణాలలో వచ్చేస్తున్నాం' అన్నాడు.

సేవకుడు తలవంచి వెళ్ళిపోయాడు.

తరువాత అతను లార్డు హెన్రీవైపుచూచి, 'డోరియన్ గ్రే నా ప్రాణమిత్రుడు. అతని హృదయం నిర్మలమైంది. అందమైంది. అమాయకమైంది. నీ అత్త అతన్నిగురించిచెప్పినది నిజం. అతన్ని చెడగొట్టకు. అతన్ని నీ ప్రభావంలోకి తీసుకోడానికి యత్నించకు. నీప్రభావం అతనికి మంచిదికాదు ప్రపంచం చాలా విశాలమైనది. అద్భుతమైన వ్యక్తులు ప్రపంచంలో చాలామంది ఉంటారు. నా కళకు ఏదైనా అందం ఉన్నదంటే ఆ అందాన్నిచ్చే ఆ ఒక్కవ్యక్తినీ నా నుంచి దొంగిలించకు. కళాకారుడుగా నా జీవితం అతనిమీద ఆధారపడివుంది. హెన్రీ! నా మాట నీవు పాటిస్తా వనుకుంటాను. నిన్ను నమ్ముతున్నాను' అన్నాడు. ఈ మాటలు యెంతో మెల్లగా చెప్పాడు బేసిల్ - తనకు ఇష్టంలేకుండా తనలోనుంచి మాటలు బైటికి లాగుతున్నట్టు.

'ఏమి టీ అర్థంలేని మాటలు?' అన్నాడు లార్డ్ హెన్రీ నవ్వుతూ. హాల్‌వర్డ్‌ను చెయ్యిపుచ్చుకుని ఇంట్లోకి లాక్కుని వెళ్లాడు.

# 2

వాళ్లు యింట్లోకి వచ్చారో లేదో డోరియన్ గ్రే కనుపించాడు. పియానో దగ్గర కూచుని స్కూమన్ 'ఫారెస్ట్ సీన్స్' గ్రంథాన్ని పేజీలు తిరగేస్తున్నాడు.

'వీటిని కొంచెం నాకివ్వాలి బేసిల్. నేను వీటిని నేర్చుకోవాలనుకుంటున్నాను. ఎంతో ముచ్చటగా ఉన్నాయి' అన్నాడు బేసిల్ కనుపించగానే.

'అది, ఇవాళ నీ బొమ్మ గ్రాసేటప్పుడు నీవు ఎంత చక్కగా కూచుంటావో దానిమీద ఆధారపడి ఉంటుంది డోరియన్!' అన్నాడు బేసిల్ లాలింపుగా.

'అబ్బ! కూచుని కూచుని నాకు విసుకెత్తిపోతోంది. అదీకాక, నా నిలువు సైజు చిత్రం నాకు అవసరం లేదు' అన్నాడు విలాసంగా వెనక్కు తిరిగి.

వెనక్కు తిరగగానే అతనికి లార్డు హెన్రీ వాటన్ కనుపించాడు. ఒక సన్నని సిగ్గుతెర అతని కపోలాలకు ఎరుపు తెచ్చింది. వెంటనే లేచి, 'క్షమించు బేసిల్, నీతో మరొకరు ఉన్నట్టు గమనించలేదు' అన్నాడు.

'ఇతను లార్డు హెన్రీ వాటన్ డోరియన్. ఆక్స్‌ఫర్డ్‌లో చదువుకునే రోజులనుంచి నా చెలికాడు. నీవు బొమ్మకోసం ఎంతచక్కగా కూచుంటావో ఇప్పుడే అతనితో చెబుతున్నాను. నీవు అంతా చెడగొట్టేశావు.'

'నిన్ను కలుసుకోవడంలో నా ఆనందాన్ని మాత్రం నీవు చెడగొట్టలేదు మిష్టర్ గ్రే' అన్నాడు లార్డు హెన్రీ

ఒక అడుగుముందుకు వేసికరస్పర్శకోసం చెయ్యిఅందిస్తూ-'నిన్ను గురించి మా అత్త చాలాసార్లు చెప్పింది. ఆమెకు నీవంటే ఎంతో ఇష్టం. ఆమె బందీలలో నీవూ ఒకడివేమోనని నాకు భయంగా ఉంది'.

'ప్రస్తుతం లేడీ 'ఆగథా'కు నన్ను గురించి అభిప్రాయం కొద్దిగా మారినట్టు కనుపిస్తోంది. ప్రస్తుతం ఆమెచల్లనిచూపులో లేను. పోయిన మంగళవారం ఆమెతో కలసి వైట్‌ఛాపెల్‌లో ఒక క్లబ్బుకు వస్తానని మాటిచ్చాను. కాని తీరా మరిచి పోయాను. మే మిద్దరం కలిసి ఒక డ్యూయెట్ పాడవలసిఉంది. ఒకటికాదు- మూడు డ్యూయెట్లనుకుంటాను. ఆమెకు కనుపిస్తే ఏం మందిసడుతుందోనని భయపడి కనుపించడంలేదు' అన్నాడు డోరియన్ గ్రే. ఇలా చెబుతూంటే అతని కళ్ళలో ఒక చిత్రమైన పశ్చాత్తాపం తళుక్కుమన్నది.

'ఆ భయం పెట్టుకోకు. నీకూ మా అత్తకూ రాజీ కుదిర్చే బాధ్యత నాది. నివంటే ఆమెకు పూర్తి అనురాగం ఉంది. అదీకాక, నీవు అక్కడికి వెళ్ళనందువల్ల వచ్చిన పెద్దనష్ట మేమీ లేదు. ప్రేక్షకులు అది ఒక డ్యూయెట్ అనుకుని ఉంటారు. ఆగథాఅత్త పియానోదగ్గరకూచున్నదంటే ఇద్దరు కలిసి పాడినదానికంటె ఎక్కువ చప్పుడే చేస్తుంది' అన్నాడు లార్డు హెన్రీ వాటన్.

'ఆమెవిషయంలో అది ఘోరంగా ఉంటుంది. నా విష యంలో అది మంచిగా కనుపించదు' అన్నాడు డోరియన్ నవ్వుతూ.

లార్డ్ హెన్రీ అతనివైపు చూశాడు. అవును బేసిల్ చెప్పింది నిజమే. డోరియన్ గ్రే అందంగా ఉన్నాడు. ఎర్రగా తీర్చిదిద్దినట్టున్న పెదవులు, నిర్మలంగా ఉన్న నీలాల కళ్లు, చక్కగా అతికినట్టున్న బంగారురంగు జుట్టు — అతని అందం కన్నుల విందు చేస్తోంది. అతని ముఖంలో ఏదో ఒక విచిత్రం ఉన్నది. ఆ ముఖం చూడగానే ఎవరైనా అతన్ని నమ్ముతారు. యౌవన తేజస్సు, నైర్మల్యం, యువకునికి వుండవలసిన తీవ్రమైన స్వచ్ఛత్వం ఆ ముఖంలో ముద్దకట్టుకుని కనుపిస్తున్నాయి. అతన్ని చూడగానే అలా నీడలేని నిండు వెన్నెలలా కనుపిస్తాడు. ఇంకా ప్రపంచం అతన్ని మైలపరచలేదనిపిస్తుంది. బేసిల్ హాల్‌వర్డ్ అతన్ని ఆరాధిస్తున్నాడంటే అందులో ఆశ్చర్యమేమీ లేదు.

'నీ అందం ప్రపంచంకోసం పారబొయ్యవలసింది కాదు. నీ అందం చాలా అతీతమయింది' అంటూ లార్డ్ హెన్రీ బాలీసుపై వాలి సిగరెట్ కేస్ తెరిచాడు.

చిత్రకారుడు రంగులు కలపడంలో, బ్రష్‌లు తయారు చేసుకోవడంలో నిమగ్నుడై వున్నాడు. ఎంచాతనో కాని అతని ముఖంలో ఆందోళన కనుపిస్తోంది. లార్డ్ హెన్రీ అన్న చివరిమాట విని అతనివంక చూచి, ఒక్క నిమిషంపాటు తటపటాయించి, 'హెన్రీ, ఇవాళ ఈ చిత్రాన్ని పూర్తిచెయ్య దలచుకున్నాను. నిన్ను వెళ్ళమని అడిగితే నన్ను వట్టి మర్యాద తెలియని అనాగరకుడని అనుకోవుకదా' అన్నాడు.

లార్డ్ హెన్రీ చిరునవ్వునవ్వి డోరియన్ గ్రేవంక చూచి 'నన్ను వెళ్ళమంటావా మిస్టర్ గ్రే?' అన్నాడు.

'దయచేసి వెళ్ళకండి లార్డ్ హెన్రీ! బేసిల్‌కు అప్పుడప్పుడూ ఇలాంటి మానసికావస్థలు వస్తూ ఉంటాయి. అలాంటి సమయంలో అతన్ని నేను సహించలేను. అదీకాక, నేను లోకోపకారంకోసం ఎందుకు వెళ్ళకూడదన్నారో మీరు నాకు చెప్పాలి' అన్నాడు డోరియన్ గ్రే.

'అది నీకు చెప్పగలననుకోను మిస్టర్ గ్రే. అది ఒక పెద్ద చాంతాడంత విషయం. అంచాత ఆ విషయాన్ని తీరిగ్గా తాపీగా జాగ్రత్తగా మాట్లాడుకోవాలి. కాని, నీవు నన్ను ఉండిపొమ్మన్నావు కాబట్టి తప్పకుండా ఉండిపోతాను. నీవేం అనుకోవుకదా బేసిల్? నీవు బొమ్మగీస్తూంటే కూచునేవారితో ఎవరైనా కబుర్లు చెబుతూంటే నీకిష్టమని అనేకసార్లు చెప్పావు. జ్ఞాపకంఉందా?' అన్నాడు లార్డ్ హెన్రీ.

హాల్‌వర్డ్ పెదవికొరుక్కుని, 'డోరియన్ గ్రేకు ఇష్టమైన పక్షంలో నీవు తప్పకుండా ఉండిపోవాలి' డోరియన్ గ్రే మనసు ముచ్చటలు అతనికి తప్ప ఇతరులకుమాత్రం శాసనాలే,' అన్నాడు.

లార్డ్ హెన్రీ లేచి హాట్, గ్లోవ్‌లు పుచ్చుకుని, 'బేసిల్, నీవు ఉండమని చాలా బలవంతపెడుతున్నావు కాని, నాకు మాత్రం వెళ్ళాల్సిన అవసరంఉంది. ఆర్లియన్స్‌దగ్గర ఒకవ్యక్తిని కలుసుకుంటానని వాగ్దానం చేశాను. వస్తాను మిస్టర్ గ్రే. ఒక మాటు ఎప్పుడైనా సాయంత్రంపూట కర్జన్‌స్ట్రీట్‌లో మా ఇంటికి రా. అయిదు గంటలవరకు ఎప్పుడూ ఇంట్లోనే ఉంటాను. వచ్చేముందు ఒక ఉత్తరంముక్క పడెయ్. ఒకవేళ నేనుఇంట్లో ఉండకపోతే కలుసుకోలేకపోతాను.'

'బేసిల్! లార్డ్‌హెన్రీ వాటన్ వెళ్ళిపోతుంటే నేనూ వెళు తున్నాను. నీవు ఒకమునిలా బొమ్మ గీసేటప్పుడు ఒక్క మాట యినా మాట్లాడవు. అంతసేపూ నవ్వుముఖంతో ఒంటిగానిల్చో వాలంటే నాకు చచ్చే చిరాకు. అతన్ని వెళ్ళొద్దను. ఉండమను. ఈవిషయంలో నిన్ను బలవంతపెడుతున్నాను' అన్నాడు డోరి యన్- హెన్రీ ఎక్కడ వెళ్ళిపోతాడో అనే ఆత్రుతతో.

'వెళ్ళడు. హెన్రీ, ఉండు- డోరియన్‌కోసం, నా కోసం. మమ్మల్ని మన్నించు' అన్నాడు హాల్‌వర్డ్ తను వ్రాస్తున్న చిత్రంవంక తదేకంగా చూస్తూ. 'నేను బొమ్మగీస్తున్నప్పుడు మాట్లాడనిమాట నిజమే. ఇతరులమాటలుకూడా వినిపించు కోను. అంతసేపూ నేను బొమ్మలు గీసేవాళ్ళు అలా కూచో వాలంటే చెడ్డవిసుగేస్తుంది. హెన్రీ! దయచేసి ఉండు.'

'మరి ఆర్లియన్స్‌లోమనిషిసంగతి ఏమిటి?'

చిత్రకారుడు నవ్వాడు. 'ఆ విషయంలో ప్రమాదం ఏమీ ఉండదనుకుంటాను. కూచో హెన్రీ. డోరియన్, ఇహ ఆ ప్లాట్‌ఫారంమీద నిల్చో. అటూఇటూ ఎక్కువగా కదలకు. లార్డ్ హెన్రీమాటలు పట్టించుకోకు. స్నేహితులమీద అతని ప్రభావం మహాచెడ్డది. ఒక్కనిమిషంలో లాగేస్తాడు. ఒక్క నేనుమాత్రమే అందులో చిక్కుకోలేదు.' మరణవేదికను ఎక్కుతున్న ఒక యువక గ్రీక్‌వీరుడిలా డోరియన్‌గ్రే వేదిక ఎక్కాడు. కొంచెంఅసంతృప్తిగా లార్డ్‌హెన్రీవంక చూశాడు. లార్డ్‌హెన్రీ అంటే ఒకవిధమైన ఆకర్షణ కలిగింది డోరియన్ గ్రేకు. అతనికీ బేసిల్‌కూ ఎలాంటి పోలికా లేదు పైగా కావలసి నంత వార ఉంది. బేసిల్‌కు పూర్తిగా విరుద్ధం అతను. ఇద్దరినీ

ఒకగదిప్రక్కనున్న ఒకతెరిని ఉంచి చూస్తే ఎంతో చక్కని వైరుధ్యం కనిపిస్తుంది. అతనిగొంతు ఎంత మధురంగా ఉంది! మాట్లాడితే సంగీతం పాడినట్లుగా ఉంది. ఇలా కాసేపు తనలోతాను ఆలోచించుకున్నాడు డోరియన్ గ్రే. కొద్దిక్షణాల తరువాత, 'నీ ప్రభావం నిజంగా చెడ్డదేనా లార్డ్ హెన్రీ? బేసిల్ చెప్పినంత చెడ్డదా?' అన్నాడు.

'అసలు మంచిప్రభావం అనేది ఏదీ ఉండదు మిస్టర్ గ్రే. ప్రభావం అనేదే అవినీతికరమైన దన్నమాట. శాస్త్రదృష్ట్యా అవినీతికరం.'

'ఎంచేత?'

'ఎందుచేతనంటావా? ఒకవ్యక్తిమీద మనప్రభావం పడు తున్నప్పుడు మనం మనఆత్మను ఇచ్చేస్తున్నా మన్నమాట. ఇహ అతనికి తనదు సహజమైన ఆలోచనలు రావు. తన సహజపద్ధతిలో ఆలోచించడు. తనకు సహజమైన ఉద్రేకాలుకూడా పోతాయి. వాటితో వేగిపోడు. తన గుణాలుకూడా తనవికావు. అతని పాపాలు— పాపాలనేవి కనక ఉంటే—అవికూడా ఎరువు తెచ్చుకున్నవే అవుతాయి. ఎవరో పాడుతున్న సంగీతానికి అతను ప్రతిధ్వనిమాత్రమే. వట్టి ఛాయమాత్రమే అవుతాడు. తనకోసం వ్రాయబడని ఒకపాత్రను నటిస్తున్న నటుడవుతాడు. కాని జీవితపరమార్థం వేరు. జీవితపరమార్థం ఆత్మాభివృద్ధి. అందుకోసం సాధన. ఎవరిస్వభావాన్ని వారు పరిపూర్ణంగా ఎరుకపరుచుకోడం— ఇదే జీవితపరమార్థం. ఇందుకోసమే మన బ్రతుకులన్నీ. ఈరోజుల్లో మనుష్యులు తమనుచూచి తామే భయపడుతున్నారు. అన్ని ధర్మాలలోకి గొప్పధర్మాన్ని

మరిచిపోయారు. ప్రతివ్యక్తి తనపట్లతాను నిర్వర్తించుకోవలసిన ధర్మంఉంది. ఆ ధర్మం అన్ని ధర్మాలలోకి గొప్పది. దాన్ని మరిచిపోయారు. దాన ధర్మాలకు లోటు లేదనుకో. పేదలకు అన్నదానం చేస్తారు. బిచ్చగాళ్ళకు బట్టలు పంచుతారు. కాని వాళ్ళ ఆత్మలుమాత్రం ఆకలితో మాడిపోతున్నాయి. వివస్త్రంగా నగ్నంగా ఉన్నాయి. అసలు మనజాతిలోనుంచి ధైర్యం పారిపోయింది. అసలు ఎప్పుడూ నిజంగా లేదేమో అనుకుంటాను. మనల్ని ఇప్పుడు రెండుశక్తులు పరిపాలిస్తున్నాయి. నీతి నియమాలకు మూలమైన సంఘభయం ఒకటి. మతంలో మర్మమైన దైవభయం ఒకటి - ఈ రెండుశక్తులే మనల్ని పాలిస్తున్నాయి. మరి ఇంకా-'

'డోరియన్, నీతల కొంచెం కుడివైపుకు తిప్పు-మంచి కుర్రాడివి కాని' అన్నాడు చిత్రకారుడు. తనపనిలో గాఢంగా నిమగ్నుడై ఉన్న అతనికి, తను ఇంతకుముందు ఎన్నడూ ఎరుగని ఏదో కొత్తమార్పు డోరియన్ ముఖంలో ప్రవేశించడం కనుపించింది.

'మరి, ఇంకా -' సాగించాడు లార్డ్ హెన్రీ తన మెల్లని మధురస్వరంతో. అలా మాట్లాడుతున్నప్పుడు ఎంతో అందంగా చెయ్యి ఒకవిధంగా విసురుతాడు లార్డ్ హెన్రీ. ఈటన్‌లో చదువుకునే రోజులనుంచీకూడా అలా విసరడం అతని అలవాటు. అది అతని సహజలక్షణాలలో ఒకటి.

'మరి ఇంకా - చెప్పనా ? ఒక వ్యక్తి తన జీవితాన్ని పరిపూర్ణంగా, నిండుగా జీవిస్తే, తనలోని ప్రతి భావానికి ప్రతి ఆలోచనకు ప్రతి ఉద్వేగానికి రూపకల్పన చేస్తే, ప్రతి కలనూ

నిజం చేసుకుంటే ప్రపంచం ఒక కొత్త ఆనందంతో, ఒక కొత్త ప్రాణంతో తొణికిసలాడుతుందని నేను నమ్ముతాను.

మధ్యయుగపు అనుకరణలను, రుగ్మతలనూ మనం మరిచిపోయి మళ్ళీ గ్రీక్ ఆదర్శాన్ని చేరుకోగలుగుతాం. అంతకంటె అందమైన నిండైన ఆదర్శాన్ని చేరుకోగలుగుతాం. కాని, మనల్ని పట్టుకున్న దురదృష్టం ఏమిటంటే మనలో అందరికంటె అతిసాహసికుడు తనను చూచి తాను భయపడతాడు. ఆదిమకాలపు అనాగరకుల ఆత్మావమానభారం ఇంకా మనలో, మనల్ని మనం తక్కువ చేసుకునే రూపంలో బ్రతికే ఉంది. అదే మన బ్రతుకులను ధ్వంసం చేస్తోంది. మనం దేన్నయినా నిరాకరిస్తే అందుకు మనం శిక్ష అనుభవించవలసి ఉంటున్నది. మన శిక్షలకు మన నిరాకరణలే కారణం. ప్రతిశక్తిని మనస్సులో ఆలోచనను అరికట్టి ఉరితీయడానికే వినియోగిస్తాం. అంచాత ప్రతిశక్తీ మనల్ని విషపూరితం చెయ్యడానికే పనికివస్తోంది. దేహం ఒకమాటే పాపం చేస్తుంది. అంతటితో ఆ పాపం ఆఖరైపోతుంది. ఎంచాతనంటే కర్మ ఒకవిధమైన ప్రాయశ్చిత్తపద్ధతి కాబట్టి.

తరువాత మిగిలేదేమీ ఉండదు—ఆ సుఖం తాలూకు స్మృతి తప్ప. లేక పశ్చాత్తాపంలోని భోగమూ కావచ్చు. పశ్చాత్తాపంలోకూడా ఒక విధమైన భోగం ఉంది.

ఒక చెడు ఆకర్షణనుంచి తప్పించుకోడానికి ఒకటే పద్ధతివుంది. అది దానికిలొంగిపోవడమే. దాన్ని నిరోధించావా, అది నిన్ను లొంగదీసుకుంటుంది. నీ హృదయం అది నీకు దూరంగా ఉంచిన విషయాలకోసం తాపత్రియపడుతుంది.

ఎంచాక, ఆ విషయాలు అవినీతికరమైనవో, [illegible] అని ఆరాటపడుతుంది. పెద్దలు ఒకమాట చెబుతూ ఉంటారు. ప్రపంచంలోని గొప్ప సంఘటనలన్నీ మనస్సులోనే జరుగుతాయని కొందరంటారు. మన మనస్సులోనే, మనస్సులో మాత్రమే ప్రపంచంలోని గొప్పగొప్ప పాపాలు కూడా జరుగుతూ ఉంటాయి. నీ వున్నావే మిస్టర్ గ్రే, నీ మట్టుకు నీవు – ఈ నీ గులాబీలాంటి ఎర్రని యౌవనంతో, తెల్ల గులాబీలాంటి కుర్రతనంతో – నీకు భయం గొలిపే ఉద్రేకాలు, నిన్ను భయంతో కంపింపచేసే భావాలు, ఆలోచనలు, నీలోనూ ఉన్నాయి. తలుచుకుంటే చాలు నీ కపోలాలను సిగ్గుతో మలినం చేసే పగటికలలూ, రాత్రికలలూ నీకూ ఉన్నాయి.

'ఆపు' – అన్నాడు డోరియన్ గ్రే తొట్రుపాటుతో —
'ఆపు. నీవు నన్ను కలవర పెడుతున్నావు. నాకు ఏం చెప్పాలో తోచడం లేదు. నీకు సమాధానం ఉంది. కాని నాకు దొరకడం లేదు. మాట్లాడకు. నన్ను కాస్త ఆలోచించుకోనీ. లేక – ఆలోచించకుండా ఉండడానికి ప్రయత్నించనీ.'

పది నిమిషాలపాటు అతను అలా, విచ్చిన పెదవులతో విచిత్రమైన తళుకుతో, మెరుస్తున్న కళ్ళతో, నిశ్చలంగా శిలా ప్రతిమలా నిల్చున్నాడు.

అతను ఇంతకు ముందు ఎన్నడూ ఎరుగని అపూర్వమైన ప్రభావాలు అతనిలో మేలుకుని పనిచేస్తున్నాయన్న విషయం అతనికి పూర్తిగా గోచరం కాలేదు. అతనిలోనుంచే ఉత్పన్నమయినట్టుగా కనుపిస్తున్నాయి. బేసిల్ స్నేహితుడు మాట్లాడిన కొద్దిమాటలు – అవి నిస్సందేహంగా యాదృచ్ఛి

కంగా మాట్లాడిన మాటలే అయినా, ఆ మాటల్లోని విచిత్ర మైన సిద్ధాంతాలు అతనిలో ఇంతకుముందు ఎన్నడూ కదలని ఏదో రహస్యతంత్రువును కదిపింది. అది ఇప్పుడు చిత్రవిచిత్ర మైన తరంగాలను ప్రసరించి ప్రస్తరిస్తున్నది.

ఇలాంటి ఉద్దీపన అతనికి సంగీతం విన్నప్పుడు కలిగేది. సంగీతం ఒక్కటిమాత్రమే అతనిలో శక్తులను ఇలా మేలుకొలి పేది. సంగీతం ఎన్నిసార్లో అతనిలో వేదనలను మేలుకొల్పింది. అతని మనస్సును చెదరగొట్టింది. కాని సంగీతం వేరు. సంగీతా నికి భాష లేదు. అది మనలో సృష్టించేది ఒక క్రొత్త ప్రపం చం కాదు. ఒక కొత్త గందరగోళం. ఒక అవ్యవస్థ. కాని, మాటలు! వట్టి మాటలు! ఎంత భయంకరంగా ఉన్నాయి! ఎంత స్వచ్ఛంగా, ఎంత శుభ్రంగా, ఎంత క్రూరంగాఉన్నాయి! ఈ మాటలనుండి తప్పించుకోడం ఎవరితరం? అయినా వాటిలో ఏదో విచిత్రమైన మంత్రకట్టు ఉన్నట్టుగాకనుపిస్తోంది. రూపంలేని విషయాలను బొమ్మలుచేసి కళ్ళముందు నిలబెడు తున్నట్టుగా ఉన్నాయి ఆమాటలు. వేణునాదంలాగా వాటిలో ఏదో సంగీతం ఉంది. వట్టిమాటలు! మాటలకంటె నిజమైన విషయం మరేమున్నా ఉందా?

అవును. అతను చిన్నతనంలో అర్థంచేసుకోని విషయా లున్నాయి. ఇప్పు డవి అర్థం చేసుకున్నాడు. జీవితం హఠా త్తుగా అతని కళ్ళముందు నిల్చుంది. భయపురంగు పులుము కుంది. అతనకి నిప్పుల్లో నడుస్తున్న ట్టనిపించింది.

ఇంతకాలం ఈ విషయం అతనెందుకు తెలుసుకోలేదు?

తనకు సహజమైన నవ్వుని చిందిస్తూ లార్డ్ హెన్రీ అతన్ని గమనిస్తున్నాడు. సరిగ్గా ఏ క్షణంలో మాటలు ఆపు చెయ్యాలో అతనికి తెలుసు.

అవతలివ్యక్తి మనసునుబట్టి ఏమీ చెప్పకుండా ఉండ వలసిన క్షణం ఏదో అతనికి తెలుసు. అతను శ్రద్ధతో గమని స్తున్నాడు. తన మాటలు హఠాత్తుగా కలిగించినమార్పు అతనికి ఆశ్చర్యం కలిగించింది. అతనికి తన పదహారో ఏట చదివిన ఒక పుస్తకం జ్ఞాపకంవచ్చింది. అదివరకు అతనికి తెలీని ఎన్నోవిష యాలు ఆ పుస్తకంవల్ల తెలిశాయి. కొత్త అనుభూతి కలి గింది. డోరియన్ గ్రే కూడా అలాటి అనుభూతినే పొందుతు న్నాడా అనిపించింది. ఊరికనే, గాలిలోకి విసిరాడు బాణం. అది తగలవలసినచోట తగిలిందా ? కుర్రాడు ఎంత అందంగా ఉన్నాడు ! హాల్‌వర్డ్ బొమ్మగ్రవాయడం ముగించాడు. అతను ఈ నిశ్శబ్దాన్ని గ్రహించలేదు.

'బేసిల్ ! నేను నిల్చుని నిల్చుని అలసిపోయాను. ఇక వెళ్ళి కాసేపు తోటలో కూచోవాలి. ఇక్కడ ఊపిరాడడం లేదు' అన్నాడు డోరియన్ గ్రే.

'అబ్బాయ్ ! నన్ను క్షమించు. నేను బొమ్మరా స్తుంతసేపూ మరేవిషయం ఆలోచంచను. కానీ ఇలా ఎన్నడూ కూచోలేదు. అణుమాత్రంకూడా చలించకుండా నిశ్చలంగా కూచున్నావు. నేను అనుకున్న భావాన్ని అందుకో గలిగాను— అరవిచ్చిన పెదవులూ, కళ్ళలో కాంతీ. హెన్రీ నీతో ఇంత సేపూ ఏం మాట్లాడుతున్నాడో నేను వినలేదు, కాని తన

మాటలవల్ల నీ ముఖంలో చక్కని భావం ఉట్టిపడేటు చేశాడు. నీకు పొగడ్తలూ, అభినందనలూ అందచేస్తున్నా డనుకుంటాను. అతనిమాటలు ఒక్కటీ నీవు నమ్మకు.'

'అతను నాకు ఎలాటి అభినందనలూ అందచెయ్యలేదు. అతను చెప్పిన దేదీ నేను నమ్మకపోవడానికి కారణం అదే ననుకుంటాను.'

'నీవు నమ్ముతున్నావని నీకు తెలుసు' — అన్నాడు లార్డ్ హెన్రీ అతనివంక కలలువిండిన తనకండ్లతో చూస్తూ. 'నీతో నేనూ తోటలోకి వస్తాను. ఇక్కడ స్టూడియోలో ఉక్కపోస్తోంది. బేసిల్! యేదైనా చల్లటి పానీయం తెప్పించు.'

'తప్పకుండా హెన్రీ. కొంచెం గంటనొక్కు. పార్కర్ రాగానే నీ కేం కావాలో అతనితో చెబుతాను.

'నాకు మరికొంచెం పనిఉంది. నేను కొంచెం ఆలస్యంగా వస్తాను. మాట్లాడుతూ డోరియన్‌ను ఎక్కువసేపు అట్టిపెట్టకు, చిత్రణకు ఇవాళ నా మనస్సున్నంత అభిముఖంగా ఇదివర కెన్నడూ లేదు. ఇది నా బొమ్మలన్నిటికీ శిఖరప్రాయం కాబోతున్నది. ఇప్పుడిలా పడలినా ఇది నేను వ్రాసిన బొమ్మలన్నిటికీ తలమానికంలాంటిది.'

లార్డ్ హెన్రీ తోటలోకి వెళ్ళాడు. డోరియన్ గ్రే కనుపించాడు. ముఖాన్ని పూలలో దాచుకుని పూల పరిమళం మత్తుగా ఆస్వాదిస్తున్నాడు— ద్రాక్షరసం సేవిస్తున్నట్టు. హెన్రీ దగ్గరకువచ్చి బుజంమీద చెయ్యివేశాడు. 'నీ విలా చెయ్యడం మంచిదే. ఆత్మను ఇంద్రియాలు తప్ప మరేవీ శుద్ధిచేయ

లేవు. ఇంద్రియాలనూ అంతే - ఆత్మ తప్ప మరేదీ శుద్ధి చెయ్యదు' అన్నాడు.

కుర్రాడు ఉలిక్కిపడ్డాడు. పూలగోనుంచి ముఖం తీశాడు. తలఎత్తిచూశాడు. అకులకు నీలాలకాలు చెదిరిఉన్నాయి. అతని కళ్ళలో భయం కనుపిస్తూఉంది. హఠాత్తుగా నిద్రలేపినప్పుడు కనుపించే భయంలాంటిది. నాసాపుటాలు వణికాయి. ఎక్కడో దాగిన చిన్నరం అతని పెదవులను కదిపింది. అవి వణుకుతూ అలాగే ఆగిపోయాయి.

'అవును. జీవితంలోని పెద్ద రహస్యాలలో ఇది ఒకటి. ఇంద్రియాలద్వారా ఆత్మరుగ్మత పోతుంది. ఆత్మద్వారా ఇంద్రియరుగ్మత పోతుంది. నిజంగా నీది అద్భుతమైన సృష్టి. నీకు తెలిసిందని నీవు అనుకుంటున్నదానికంటె నీకు ఎక్కువ తెలుసు. అలాగే నీవు తెలుసుకోవాలని కోరుతున్నదానికంటె నీకు తక్కువ తెలుసు'

డోరియన్‌గ్రే తల అవలకు తిప్పుకున్నాడు. తన ప్రక్కనే నిల్చున్న పొడుగాటి అందమైన యువకుడంటే ఇష్టపడకుండా ఉండలేకపోయాడు. కొంచెం మాసినట్టుగా అందంగా కనుపిస్తున్న అతనిముఖం డోరియన్‌ను ఆకర్షించింది. అతని మెల్లని మెత్తని కంఠస్వరంలో ఏదో తీయని ఆకర్షణ ఉంది. అతని చల్లని తెల్లని పూలవంటి చేతుల్లోకూడా ఏదో విచిత్రమైన అందం ఆకర్షణ ఉన్నాయి.

తను మాట్లాడుతూంటే అవీ కదులుతాయి - సంగీతంలాగా - వాటికీ ఏదో భాష ఉన్నట్లుగా కనుపిస్తుంది. కాని అతనంటే డోరియన్‌కు ఎంచాతనో భయం. భయపడ్డందుకు

సిగ్గు. ఆఖరుకు తనను తనకు తెలిపించి ఎవరో అపరిచితుడు! బేసిల్ హాల్‌వర్డ్‌ను తనకు కొన్ని నెలలబట్టి తెలుసు. కాని వారిమధ్యనున్న సఖ్యం తనలో ఏలాటి మార్పూ కలిగించలేదు. హఠాత్తుగా తన జీవితంలోకి ఎవరో ప్రవేశించారు. తన జీవిత రహస్యాన్ని తనకు తెలిపారు. అయినా ఇందులో భయపడవలసిన అగత్యంమాత్రం ఏముంది? తనేం బొడ్డూడని పసిపాప కాదు. భయపడటంలో అర్థంలేదు.

'రా, అలా వెళ్ళి ఆ నీడలో కూచుందాం' అన్నాడు లార్డ్ హెన్రీ. 'పార్కర్ పానీయాలు పట్టుకొచ్చాడు. ఈ ఎండపొడలో కూచుంటే వడిలిపోతావు. ఇక బేసిల్ ఎన్నడూ నీ బొమ్మ గీయడు. ఇప్పుడే ఎండ సోకడం అంత మంచిది కాదు. తగింది కాదు' అన్నాడు.

తోటలోనికి వెళ్ళి కూచుంటూ, 'ఏం ఎండసోకితే?' అన్నాడు డోరియన్ నవ్వుతూ.

'అన్ని విధాలా నష్టం – మిస్టర్ గ్రే.'

'ఏం?'

'నీకు అద్భుతమైన యౌవనం ఉంది. అంతకంటె కావలసింది ఏదీ లేదు.'

'నే నలా అనుకోను లార్డ్ హెన్రీ.'

'ఇప్పుడు అలా అనుకోవు. ఒక రోజున నీవు ముసలివాడి వవుతావు. నీ ముఖం ముడతలు పడిపోతుంది. అసహ్యంగా కనుపిస్తావు. ఆలోచన నీ ఫాలభాగాన రేఖలు వ్రాస్తుంది. కామవేదన తన క్షుద్రమైన అగ్నిజ్వాలలతాలూకు ముద్రలు నీ పెదవులపై విడుస్తుంది.

అప్పు డనుకుంటావు. 'అయ్యో! యౌవనంపోయిందే' అనుకుంటావు. క్షోభిస్తావు. ఇప్పుడు నీవు ఎక్కడికి వెళ్ళినా ప్రపంచాన్ని నీ అందపు మంత్రకట్టుతో కట్టుకుంటావు. ఆనందంతో లోకాన్ని మంత్రిస్తావు. కాని ఎప్పుడూ ఇలా ఉంటుందా? నీ ముఖం చాలా అందమైంది మిస్టర్ గ్రే—అలా కోపం తెచ్చుకోకు. నీముఖం అందమైంది. నిజం. అందంకూడా ప్రతిభ యొక్క స్వరూపాల్లో ఒకటి. ప్రతిభకంటె ఎక్కువైందికూడా. ఎందుకంటావా? అందానికి వివరం కాని వ్యాఖ్యానం కాని అవసరం లేదు. సూర్యకాంతిలాగ, వసంతంలాగ, నల్లని నీళ్ళలో చంద్రుని ప్రతిఫలనంలాగ, విశ్వసత్యాలలో అందం ఒకటి. అది ప్రశ్నకు అతీతమైంది. దాన్ని ప్రశ్నించడమంటూ లేదు. అన్నిటికంటె అధికమైన అధికారం దానికి స్వతహాగా ఉంది అది ఉన్నవాళ్లు రాకుమారులు. అది వాళ్ళనలా చేస్తుంది. ఏం నవ్వుతున్నావు? ఓహో! దాన్ని పోగొట్టుకున్న తరువాత ఇలా నవ్వవు. కొంతరు 'అందం' అనేది ఊరికే బాహిరమైనదంటారు. కావచ్చు. లోతులేనిదంటారు. కావచ్చు. కాని 'భావం'అంత బాహిరమైనదీ లోతులేనిదీ కాదు. నాఉద్దేశంలో సౌందర్యంకంటె అద్భుతమైనదేదీ లేదు. అన్ని అద్భుతాలలోకీ అద్భుతమైనది అందం. చూపులను బట్టి నిర్ణయించలేని వాళ్లు వట్టి లోతులేనివాళ్లు మాత్రమే. నిజమైన విశ్వరహస్యం కనుపించేదే కాని కనుపించనిది కాదు. అవును, మిస్టర్ గ్రే. దేవతలకు నీపట్ల దయఉంది. అంచాతనే ఈ అందాన్ని ప్రసాదించారు. కాని దేవతలు ఇచ్చినదాన్ని త్వరలోనే తీసుకుపోతారు. నిజంగా, నిర్దుష్టంగా, పరిపూర్ణంగా బ్రతకడానికి

కొద్ది సంవత్సరాలు మాత్రమే నీ చేతుల్లో ఉన్నాయి. నీ యౌవనం పోయిన తరువాత, నీ అందం కూడా దానితో వెళ్ళి పోతుంది. అప్పుడు నీవు హఠాత్తుగా ఇక సాధించవలసిన విజయాలేవీ లేవని గమనిస్తావు. లేకపోతే పూర్వం సాధించిన అల్పమైన విజయాలతో సంతృప్తిపడి ఊరుకుంటావు. గతం తాలూకు జ్ఞాపకాలు ఆ విజయాలను పరాజయాలకంటె అసహ్యంగా కనుపించేటట్టు చేస్తాయి. కరిగిపోతున్న ప్రతినెలా నిన్ను ఏదో భయంకరవిషయానికి దాపుకు తీసుకుని వస్తుంది. కాలానికి నీమీద చాలా అసూయ. అంచాత నీ పూలమీద, నీ గులాబీలమీద యుద్ధం ప్రకటిస్తుంది. నీవు శుష్కించి పోతావు. బుగ్గలు పీక్కుపోతాయి. కళ్ళల్లో కాంతి తరిగి పోతుంది. భయంకరమైన బాధ అనుభవిస్తావు. అబ్బ! ఉన్నప్పుడే నీ యౌవనాన్ని గుర్తించు. సఫలం చేసుకో. నీ యౌవనం తాలూకు బంగారాన్ని విచ్చలవిడిగా దుబారా చెయ్యకు. శుష్కవేదాంతాలు వినకు. నీ జీవితాన్ని అజ్ఞానానికి, సామాన్యులకు, క్షుద్రులకు బలిచెయ్యకు. ఇవన్నీ మనయుగంలో అర్థంలేని ఆదర్శాలు. జీవించు! నీలో ఉన్న అద్భుతమైన జీవితాన్ని జీవించు! ఏదీ పోగొట్టుకోకు. ఎప్పుడూ కొత్త కోరికల కోసం, కొత్త అందాలకోసం వెదుకు. దేనికీ భయపడకు. ఒక కొత్త 'ఆనందధర్మం' – అదీ మన యుగానికి అవసరం. దానికి నీవు ప్రత్యక్ష సంకేతానివి కావచ్చు. నీ కున్న మూర్తిమత్వంతో నీవు చెయ్యలేని పనంటూ ఏదీ లేదు. ఈ ప్రపంచం కొన్నాళ్ళవరకే నీది. నేను నిన్ను చూడగానే అనుకున్నాను – నీవంటే ఏమిటో నీవు తెలుసుకోని స్థితిలో

ఉన్నావని. నీ వేంకాగలవోకూడా నీవు తెలుసుకోలేనిస్థితిలో ఉన్నావు.నన్ను ఆకర్షించిన విశేషం నీలోచాలాఉంది.అంచాతనే నిన్నుగురించి నీకు కొంత చెబుదామనుకున్నాను. నీవు అనవసరంగా వ్యర్థమైపోవడం విషాదకర మనుకున్నాను, ఎంచాతనంటే నీ యౌవనం ఎంతోకాలం ఉండదు. అతి సాధారణమైన అడవిపూలు వాడిపోతాయి కాని మళ్ళీ వికసిస్తాయి. ఈ ప్రొద్దుతిరుగుడుపూవు మళ్ళీ రేపుఉదయానికి పసుపువన్నెలీనుతుంది. నక్షత్రాలు అస్తమిస్తాయి.మళ్ళీ ఉదయిస్తాయి. కాని మన యౌవనంమాత్రం మళ్ళీ తిరిగిరాదు. మన ఇరవయ్యోఏట మనల్ని ఉద్రూతిలూగించే ఆనందనాడివయసుమళ్ళగానేమెల్లగా కొట్టుకోసాగుతుంది. రానురానునిద్రపోతుంది. కీళ్లుసడలుతాయి. ఇంద్రియాలు గుల్లలవుతాయి అసహ్యమైన కీలుబొమ్మలుగా మారిపోతాము. మనల్ని ఎక్కువగా భయపెట్టే ఉద్రేకాల తాలూకు జ్ఞాపకాలు, మనం ఎన్నడూ అనుభవించడానికి సాహసించని ఆనందాల తాలూకు జ్ఞాపకాలు మనల్ని వెన్నాడి అసహ్యమైన కీలుబొమ్మలకింద మారిపోతాము. యౌవనం! యౌవనం! ప్రపంచంలో అంతకంటె మరేమీ లేదు!'

డోరియన్ గ్రే ఇదంతా కళ్ళు విచ్చుకుని నివ్వెరపోతూ విన్నాడు. అతని చేతిలోనుంచి పూవు రాలి కింద పడింది.

ఒక తేనెటీగవచ్చి దాని చూట్టూ ధ్వనిస్తూ ఒక క్షణం పాటు తిరిగింది. తరవాత పూగుత్తిచుట్టూ ప్రదక్షిణం చెయ్యడం మొదలెట్టింది; డోరియన్ ఒక విచిత్రమైన శ్రద్ధతో దాని వంక చూడడం మొదలెట్టాడు. గొప్ప విషయాలు మనల్ని

భయపెట్టినప్పుడు కాని, మనం వ్యక్తీకరించలేని ఏదో ఒక కొత్త ఉద్వేగం మనల్ని కలచినప్పుడుకాని, మనల్ని భయ చకితులను చేసే ఏదైనా కొత్తభావం హఠాత్తుగా మన బుర్రను ముట్టడివేసినప్పుడుకాని, మనం అలా స్వల్పవిషయాలను పరిశీలిస్తాం. కొంతసేపుకు తేనీగ ఎగిరిపోయింది. మరో పూవులోకి వెళ్ళి దాక్కుంటోంది. పూవు వణికినట్టు వణికి మెల్లగా అటూ ఇటూ ఊగింది.

హఠాత్తుగా చిత్రకారుడు స్టూడియో ద్వారం దగ్గర నిల్చుని వాళ్ళను లోనికి రమ్మని సైగచేశాడు. వాళ్లు ఒకరి ముఖాలు ఒకరు చూచుకుని నవ్వుకున్నారు.

'నేను మీకోసం కాచుకుని ఉన్నాను. లోపలికి రండి. ఇక్కడ వెలుగు బాగానే ఉంది.మీపానీయాలు తెచ్చుకోండి.'

వాళ్ళు లేచి మెల్లగా నడకసాగించారు. రెండు ఆకుపచ్చ తెలుపురంగులు గల సీతాకోకచిలుకలు వారివెంటరెక్కలారుస్తూ వెళ్ళాయి. తోటమూల ఒక రేగిచెట్టుపై ఒక పిట్ట పాట ప్రారంభించింది.

'నన్ను కలుసుకున్నందుకు నీకు సంతోషంగా ఉందా మిస్టర్ గ్రే?' – అనడిగాడు లార్డ్ హెన్రీ అతనివంకచూస్తూ.

'అవును. ఇప్పుడుమాత్రం సంతోషంగానే ఉంది. ఎప్పుడూ ఇలాగే ఉంటుందా అనుకుంటున్నాను.'

'ఎప్పుడూ! అది చాలా భయంకరమయిన మాట. ఆ మాట విన్నప్పుడల్లా నాకు కంపంపుడుతుంది. ఆడవాళ్ళకు ఈ మాటలంటే మహా ప్రీతి. ఎక్కువగా ఉపయోగిస్తూ ఉంటారు. ఎప్పటికీ స్థిరంచేసుకోవాలనే ప్రయత్నంలో ప్రతి

ప్రేమకలాపాన్ని పాడుచేసుకుంటారు. అది వట్టి పారుసూ కే కాదు – అర్థంలేనిమాట కూడా. కాసేపటి 'ముచ్చట'కూ ఆ జన్మాంత ప్రేమకూ భేదమేమిటంటే, ముచ్చట కాస్త ఎక్కువ కాలం ఉంటుంది.'

స్టూడియోలో ప్రవేశించగానే డోరియన్ గ్రే తన చెయ్యి లార్డ్ హెన్రీబుజంమీద వేశాడు. "అలా అవుతే మన స్నేహం ముచ్చటగానే ఉండనివ్వండి' అన్నాడు తన సాహసానికి తనే సిగ్గుపడుతూ. తరువాత మళ్ళీ ప్లాట్‌ఫారం ఎక్కి పోజులో నిల్చున్నాడు.

లార్డ్ హెన్రీ ఒక పెద్ద పడకకుర్చీలో వాలి అతన్ని గమనిస్తున్నాడు. కాన్వాస్‌మీద తాండవిస్తున్న బ్రష్‌చప్పుడు తప్ప మరేమీ వినిపించడంలేదు. మధ్యమధ్యలో హాల్‌వర్డ్ రెండడుగులు వెనక్కువేసి తన బొమ్మను దూరంనుంచి గమనిస్తున్నాడు. ద్వారంలోనుంచి వాలుగాపడుతున్న కిరణజాలంలో దుమ్ము నృత్యంచేస్తోంది. బంగారపు రజనులా ఉంది. బరువైన గులాబీపరిమళం అంతటా అల్లుకుంటోంది. ఒక పావుగంట గడిచింది. హాల్‌వర్డ్ బొమ్మగీయడం ఆపుచేశాడు. చాలాసేపు డోరియన్‌గ్రే వంక, తరువాత చాలాసేపు బొమ్మవంక చూచాడు– పండ్లసందున ఒక పెద్ద కుంచె కొసను కొరుకుతూ. 'పూర్తయినట్టే'–'అన్నాడు చివరకు. వంగి, తనపేరు పెద్ద అక్షరాలలో ఎడమమూలగా వ్రాశాడు. లార్డ్ హెన్రీ వచ్చి చిత్రాన్ని పరిశీలించాడు. నిజంగా అద్భుతమైన కళాఖండం అది. పోలికకూడా ఎంతో చక్కగా ఉంది.

'అబ్బాయ్! నీకు అభినందనాలు! అధునాతన యుగానికంతా ఇది అద్భుతమైన చిత్రం. మిస్టర్ గ్రే, వచ్చి నిన్ను నీవు చూచుకో'- అన్నాడు లార్డ్ హెన్రీ.

కుర్రాడు ఉలికిపడ్డాడు ఏదో కలనుంచి లేపినట్టు. 'అప్పుడే అయిపోయిందా ?' అన్నాడు ప్లాట్‌ఫారంనుంచి కిందికి దిగుతూ.

'ఆ. పూర్తయింది. ఈ రోజు నీవు అద్భుతంగా కూచున్నావు. నీపట్ల ఎంతో కృతజ్ఞుణ్ణి' అన్నాడు చిత్రకారుడు.

'దానికంతా కారణం నేనే కదూ మిస్టర్ గ్రే ?' - అన్నాడు లార్డ్ హెన్రీ.

డోరియన్ సమాధానం చెప్పలేదు. పరధ్యానంగా తన చిత్రంముందుకు వెళ్ళి దానివంక చూచాడు. చూడగానే ఒక్క అడుగు వెనక్కు వేశాడు. ఒక్కక్షణంపాటు ఆనందంతో అతనికపోలాలు ఎరుపెక్కాయి. అతని కళ్ళలో ఒక ఆనంద రేఖ కనుపించింది. తనను తాను ప్రథమపర్యాయంగా తెలుసుకున్నట్లు. ఒక అద్భుతాన్ని చూస్తున్నట్టు అలాగే నిశ్చలంగా నిల్చునిపోయాడు. హాల్‌వర్డ్ మాట్లాడుతూనే ఉన్నాడు. కాని అతనికి వినిపించడంలేదు. అర్థంకావడంలేదు. తన అందాన్ని తను తెలుసుకోడం - ఒక దివ్య సాక్షాత్కారంలాగా ఉంది. ఇదివరకు ఇలాటిఅనుభూతి ఎన్నడూ కలుగలేదు. బేసిల్ హాల్‌వర్డ్ అందిస్తూ వచ్చిన అభివందనలు కేవలం స్నేహప్రీతివల్ల అనే అందమైన అతిశయోక్తులుగా కనుపించేవి. వాటిని విని నవ్వుతూవచ్చాడు. విన్నవెంటనే మరిచిపోతూవచ్చాడు. ఎన్నడూ ఆ మాటల ప్రభావం తన స్వభావంమీద పని

చెయ్యలేదు. తరువాత లార్డ్ హెన్రీ వాటన్ వచ్చాడు. తనతో పాటు ఒక విచిత్రమైన సౌందర్యసిద్ధాంతాన్ని తీసుకుని వచ్చాడు. యౌవనాన్నిగురించిన సిద్ధాంతాన్నీ తెచ్చాడు. అంతేకాదు. దాని అశాశ్వతత్వాన్నిగురించిన భయంకరమైన హెచ్చరికకూడా తెచ్చాడు. అది అతన్ని కదిల్చింది. ఇప్పుడు తన సౌందర్యపు ఛాయవంక తను చూస్తూ నిల్చుంటే ఆ వర్ణనలోని సత్యమంతా పరిపూర్ణస్వరూపంలో తనకు గోచరించింది. అవును. అతను చెప్పింది నిజమే. తన ముఖం ముడతలుపడి వాడి వడలిపోయే రోజొకటున్నది. తన కళ్ళు కాంతితరిగి, రంగుకరిగి, మసకలు కమ్ముతాయి. తన రూపంలోని అందమంతా చెదిరి వికారంమైపోతుంది. పెదవుల నుంచి ఎంజాయ తొలగిపోతుంది. జుట్టునుంచి బంగారు రంగు దొంగలా జారుకుంటుంది. తన ఆత్మను ఉద్దీపింపచెయ్యవలసిన జీవితం తనదేహాన్ని ధ్వంసంచేస్తుంది. భయంకరంగా, అసహ్యంగా, అస్పృశ్యంగా తయారవుతాడు.

ఈ ఆలోచన వచ్చేసరికి ఒక చురుకైన బాధ కత్తి వాదరలా అతనిలోనుంచి దూసుకునిపోయింది. అతని స్వభావంలోని ప్రతి మృదుల సూక్ష్మనాళాన్ని కంపింపచేసింది. అతని కళ్ళు లోతులకు పోయాయి. కన్నీటి మబ్బు కమ్మింది. ఎవరో చల్లని మంచుగడ్డలాటి హస్తాన్ని తన హృదయం మీద ఉంచినట్టయింది.

'ఏం బాగాలేదా? నీకు నచ్చలేదా?' అన్నాడు హాల్వర్డ్ చివరకు కుర్రాడి మౌనానికి కాస్త నొచ్చుకుని, ఆ మౌనాన్ని అర్థం చేసుకోలేక.

'ఎందుకు నచ్చదు? తప్పకుండా నచ్చుతుంది. ఇలాటిచిత్రం ఎవరికి నచ్చకుండా ఉంటుంది? అధునాతున కళాఖండాలలో గొప్పది ఇది. దీనికోసం నే నేదైనా ఇచ్చేస్తాను. నాకీ బొమ్మ కావాలి' అన్నాడు లార్డు హెన్రీ.

'ఇది నా సొత్తు కాదు హెన్రీ'

'మ రెవరిది?'

'డోరియన్‌ది.'

'అతను చాలా అదృష్టవంతుడు.'

'ఎంత విషాదకరం' మెల్లగా అనుకున్నాడు డోరియన్ ఇంకా కళ్ళుబొమ్మపై నే ఉంచి. 'ఎంత విషాదకరం! నాకు వృద్ధాప్యం వస్తుంది. అసహ్యంగా భయంకరంగా మారిపోతాను. కాని ఈ బొమ్మమాత్రం ఎప్పుడూ ఇలాగే యావనంతో ఉంటుంది. జూన్‌లో ఈ రోజుకుమించి ఇహ ఈ బొమ్మకు వయస్సు లేదు. దీనికి వ్యత్యస్తంగా ఉంటే ఎంత బావుంటుంది! ఎప్పుడూ వయస్సులో ఉండేది నేనై, వృద్ధాప్యం వచ్చేది ఈ బొమ్మ కవుతే ఎంత బావుంటుంది! అలా జరిగితే - అది సంభవమవుతే - దానికోసం ఈ ప్రపంచంలో నేను ఇవ్వనిదంటూ యేదీ లేదు. నా ఆత్మను ఇవ్వమన్నా ఇచ్చేస్తాను.'

'ఇలాటి ఒప్పందానికి నీవు ఒప్పుకోవనుకుంటాను బేసిల్. బొమ్మలో కొంచెం గరుకుగీతలు గీయవలసిఉంటుంది' అన్నాడు లార్డ్ హెన్రీ నవ్వుతూ.

'అలా ఎన్నటికీ ఒప్పుకోను హెన్రీ' అన్నాడుహాల్‌వర్డ్.

డోరియన్ గ్రే వెనక్కితిరిగి అతనివంక చూచాడు. 'అవును బేసిల్! నీకు నీ స్నేహితులకంటె నీ కళంటే ఎక్కువ మక్కువ. నీ దృష్టిలో నేనొక పచ్చని కంచు విగ్రహాన్ని. అంతే. అదీ అవునో కాదో—'

చిత్రకారుడు ఆశ్చర్యంతో నివ్వెరపోయి చూచాడు. డోరియన్ ఇలా మాట్లాడడం ఎన్నడూ ఎరగడు. ఇది డోరి యన్ మాట్లాడే పద్ధతి కాదు. ఏం జరిగింది? కోపంగా కను పిస్తున్నాడు, ముఖం ఎర్రగా ఉంది. చెక్కిళ్లు కాలిపోతున్నాయి.

'అవును' డోరియన్ చెప్పసాగాడు — 'నీ బొమ్మల కంటె నేను నీకు తక్కువ. వాటిని ఎప్పుడూ ప్రేమిస్తావు. నన్నెంతకాలం ప్రేమిస్తావు? నా ముఖంమీద తొలిముడత మొలిచేవరకూ — అంతే ననుకుంటాను. ఇప్పుడు నాకు తెలు స్తూఉంది. ఒకరికి సొగసు మాసిపోగానే — వాళ్ళు ఏమైనా కావచ్చు. వాళ్ళకు అంతా పోయినట్టే. నీ బొమ్మ నా కీ రహ స్యాన్ని చెప్పింది. లార్డ్ హెన్రీ వాటన్ చెప్పినదాంట్లో అబద్ధ మేమీ లేదు. అతను చెప్పింది అక్షరాలా సత్యం. యౌవనం తప్ప విలువయిన వస్తువేదీ లేదు. నాకు ముసలితనం వస్తున్నదని తెలియగానే ఆత్మహత్య చేసుకుంటాను.'

హాల్‌వర్డ్ ముఖాన నెత్తుటిచుక్క లేదు. అతనిచెయ్యి పట్టుకున్నాడు.

'డోరియన్, డోరియన్! అలా మాట్లాడకు. నీలాంటి స్నేహితుడు నాకు ఎన్నడూ ఉండబోడుకూడా. నీకు భౌతిక వస్తువులపట్ల అసూయదేనికి? వాటిలోలేని రమణీయత నీలో ఉంది.'

'నాకు సౌందర్యం వాడిపోని ఏ విషయాన్ని చూచినా అసూయే. నీవు వ్రాసిన నా చిత్రాన్ని చూచి నాకు అసూయ. నేను పోగొట్టుకునేదాన్ని అ దెందుకు ఉంచుకోవాలి? జరిగి పోయే ప్రతిక్షణం నాలోనుంచి ఏదో దొంగిలించుకునిపోతు న్నది. దానికి ఏదో ఇస్తున్నది. ఇలా కాకుండా ఉంటే ఎంత బావుంటుంది! బొమ్మ మారి, నే నెప్పుడూ ఇలాగే ఉంటే! ఎందుకు గీశావు ఈ బొమ్మ? ఇది ఎప్పుడో నన్ను వెక్కి-రిస్తుంది. భయంకరంగా వెక్కి-రిస్తుంది.' అతని కళ్ళనుంచి వెచ్చని నీళ్లు బుస్సున ఉబికాయి. విసుకుగా చెయ్యితీసి, తివాసీ మీద వాలి, ప్రార్థన చేస్తున్నవాడిలా దిండ్లలో ముఖాన్ని దాచుకున్నాడు.

'ఇదంతా నీపనే హెన్రీ'- అన్నాడు చిత్రకారుడు.

'ఇది అసలు డోరియన్ గ్రే- అంతే'- అన్నాడు హెన్రీ.

'కాదు.'

'కాకపోతే నే నేం చెయ్యను?'

'నేను వెళ్ళమన్నప్పుడు వెళ్ళాల్సింది.'

"ఉండమన్నప్పుడు ఉన్నాను.'

'హెన్రీ! నేను నా ఇద్దరుప్రియమిత్రులతో పోట్లాట తెచ్చుకోలేను. కాని మీరిద్దరూ నాజీవితంలోకల్లా నేను సృష్టించిన అతిసుందరమైన కళాఖండాన్ని అసహ్యించుకునేట్టు చేశారు. నేను దీన్ని ధ్వంసంచేస్తాను. ఏముంది ఇందులో? కాన్వాస్- రంగూ తప్ప? మన ముగ్గురిజీవితాల్లో ఇది ప్రవే శించి ధ్వంసం చెయ్యనివ్వను.'

డోరియన్ దిండ్లలోనుంచి తలెత్తిచూచాడు. వివర్ణ వదనంతో, అశ్రుమలినమైన కండ్లతో అతనివంక చూచాడు. తెరలుకట్టిన పెద్ద కిటికీకిందఉన్న టేబిల్ దగ్గరకు వెళ్ళాడు చిత్రకారుడు. అక్కడ ఏం చేస్తున్నాడు? అతనివేళ్ళు, రంగుల ట్యూబులమధ్య, కుంచెలమధ్య దేనికోసమో వెదుకుతున్నాయి. అవును. కత్తికోసం వెదుకుతున్నాయి. కత్తి దొరికింది. కాన్వాస్ చింపెయ్యబోతున్నాడు.

హఠాత్తుగా ఒక్కమాటు గభాలునలేచి హాల్‌వర్డ్ దగ్గరకు పరుగెత్తుకుని వెళ్ళి అతనిచేతిలోనుంచి కత్తిలాగేసి స్టూడియో మూలకు విసిరేశాడు.

'చింపకు బేసిల్! చింపకు! అది హత్యఅవుతుంది' అని అరిచాడు.

'చివరకు నాబొమ్మను నీవు అభిమానించి ఆశించిందినందుకు సంతోషిస్తున్నాను డోరియన్— నీ విలా ప్రశంసిస్తావనుకోలేదు'— అన్నాడు చిత్రకారుడు.

'ఒక్క ప్రశంసించడమేమిటి? దాన్ని ప్రేమిస్తున్నాను బేసిల్. అది నాలో భాగం.'

'సరే. నీవు ఎండగానే నీకు తళుకుపూసి, ఫ్రేముకట్టి ఇంటికి పంపిస్తాను. తరువాత నిన్ను నీవు నీఇష్టంవచ్చినట్టు చేసుకోవచ్చు'— ఇలా అని గదిమధ్యనుంచి నడుస్తూ వెళ్ళి, టీకోసం ఆర్డర్ చేశాడు. 'నీవు టీ తాగుతావుకదూ డోరియన్! నీవుకూడా హెన్రీ? ఇలాంటి స్వల్పసుఖాలు నీకు పనికివస్తాయో లేదో?'

'నేను స్వల్పసుఖాలనే పూజిస్తాను- అవి క్లిష్టమనస్కు లకు కడసారిశరణ్యాలు.' అన్నాడు లార్డ్ హెన్రీ.

'కాని నాకు దృశ్యాలంటే మాత్రం ఇష్టంలేదు, అవి ఒక్క రంగస్థలంమీద మాత్రమే బావుంటాయి. మీరిద్దరూ ఎంత వెర్రివాళ్లు! 'మానవుడు హేతుయుతమైన జంతువు' అని నిర్వచించింది ఎవరోకాని, అంతకంటె అర్థరహితమైన నిర్వచనం మరొకటిలేదు. మానవుడు ఏదైనా కావచ్చు. కాని హేతుబద్ధుడు మాత్రం కాదు. కానందుకు నాకు సంతోషమే. అదే నా అభిమతంకూడా.'

'ఓ! ఇవాళఉదయం! ఇవాళ ఉదయంనుంచే కదూ నీవు జీవించడం మొదలెట్టింది!'

తలుపుతట్టిన చప్పుడు వినిపించింది. బట్లర్ టీ ట్రే తెచ్చాడు. జపాన్ టేబిల్ మీద ఉంచాడు. కప్పులూ సాసర్లూ కదలినచప్పుడు. గిన్నెలోంచి వేడి టీ బుస్సుమంటు న్న చప్పుడు. డోరియన్ టీ గిన్నెల్లో పోశాడు.

'ఇవాళ రాత్రికి థియేటర్‌కు వెడదాం. తప్పకుండా ఏదో మంచి ఆట ఉండితీరుతుంది నేను వైట్ ఇంటికి భోజనా నికి వస్తానని చెప్పాను. కాని వెళ్ళకపోయినా మునిగిపోయింది లేదు, అతను చాలా పాతస్నేహితుడు. ఒంట్లో బాగాలేదు, రావడంలేదని వైర్ పంపుతాను. లేకపోతే మరేదైనా పనుండి రావడంలేదని పంపుతాను. అలా అవుతే బావుంటుం దను కుంటాను.'

'ఎక్కడికైనా వెడుతుంటే డ్రెస్ వేసుకుని వెళ్ళడమంటే మహా చిరాకేస్తుంది. బట్టలు వేసుకోగానే అసహ్యం వేస్తుంది'– అన్నాడు హాల్‌వర్డ్.

'అవును' – అన్నాడు లార్డ్ హెన్రీ స్వాప్నికంగా. 'పందొమ్మిదవ శతాబ్దపు దుస్తులు అసహ్యంగా కనుపిస్తాయి. వెలవెలపోతూ ఉంటాయి. అధునాతనజీవితంలో మిగిలిన అందమైనరంగు ఒకటే – అది పాపం.'

'నీవు ఇలాంటిమాటలు డోరియన్ ముందు చెప్పడం సబబుకాదు హెన్రీ,'

'ఏడోరియన్ ముందు? మనకు టీ పోస్తున్న డోరియన్ ముందా? బొమ్మలో డోరియన్ ముందా?'

'ఇద్దరిముందూ.'

'నీతో కలిసి నేనూ థియేటర్‌కు వస్తాను లార్డ్ హెన్రీ' అన్నాడు కుర్రాడు.

'అయితే తప్పకుండా రావచ్చు. బేసిల్! నీవుకూడావస్తావు కదూ?'

'నేను రాలేను. నాకు చాలా పనుంది.'

'సరే. అయితే నీవూ నేనూ వెడదాం మిస్టర్ గ్రే.'

'తప్పకుండా. నా కెంతో ఇష్టం'.

చిత్రకారుడు పెదవికొరుక్కుని' చేతిలో టీ కప్పుతో బొమ్మదగ్గరకు వెళ్ళి, 'అయితే నేను నిజమైన డోరియన్‌తో ఇక్కడే ఉంటాను' అన్నాడు విషాదకరంగా.

'అసలైన డోరియన్ అతనేనా? నేను నిజంగా అలా ఉన్నానా?' అన్నాడు డోరియన్.

'అవును. నీవు అచ్చం అలాగే ఉన్నావు.'

'ఎంత అద్భుతం బేసిల్!'

'చూపులకైనా నీవు అలా ఉన్నావు. కాని అది ఎన్నటికీ మారదు. అదైనా కొంతనయం' అని నిశ్వసించాడు హాల్‌వర్డ్.

'అబ్బ! విశ్వాసాన్ని గురించి జనం ఎంత గొడవ చేస్తారు! ప్రేమ విషయంలో కూడా అది మన దేహ సంబంధమైనదే కాని మన ఇచ్ఛతో ఎలాంటిపనీ లేదు. యువకులు విశ్వాస పరంగా ఉండా లనుకుంటారు. కాని ఉండలేరు. వృద్ధులు ఉండకూడ దనుకుంటారు. కాని వాళ్ళకు సాధ్యం కాదు'— అన్నాడు లార్డ్ హెన్రీ.

'ఇవాళ థియేటర్‌కు వెళ్ళకు డోరియన్. ఇక్కడే నాతో భోజనానికి ఉండు' అన్నాడు హాల్‌వర్డ్.

'వీల్లేదు బేసిల్!'

'ఏం?'

'లార్డ్ హెన్రీవాటన్‌తో వస్తానని వాగ్దానంచేశాను.'

'నీవు వాగ్దానం నిలబెట్టుకున్నందుకు అతను నిన్నేం నెత్తినపెట్టుకోడు. తన వాగ్దానాలు తనే ఎప్పుడూ తప్పుతుంటాడు. నీవు దయచేసి వెళ్ళకు'

డోరియన్ నవ్వి తలఊపాడు.

'ప్రార్థిస్తున్నాను.'

కుర్రాడు తటపటాయించాడు. లార్డ్ హెన్రీ వంక చూచాడు. టీ టేబిల్ దగ్గరనుంచి విచిత్రమైన చిరునవ్వుతో వాళ్ళను గమనిస్తున్నాడు హెన్రీ.

'నేను వెళ్ళాలి బేసిల్! వెళ్ళక తప్పదు'.

'సరే.'— అన్నాడు హాల్‌వర్డ్. ట్రే దగ్గరకు వెళ్ళి కప్పు ట్రేలో ఉంచాడు.

'ఇప్పటికే చాలా ఆలస్యమైంది. మీరు మళ్లీ వెళ్లి ముస్తాబుకావాలి. సెలవు హెన్రీ. సెలవు డోరియన్. త్వరలో కలవండి. రేపు రండి'.

'తప్పకుండా.'

'మరిచిపోవుకదా!'

'మరవను.'

'నీవు హెన్రీ?'

'తప్పకుండా బేసిల్!'

'ఇవ్వాళ ఉదయం తోటలో కూచున్నప్పుడు నిన్నడిగిన మాట జ్ఞాపకం పెట్టుకో'

'మరిచిపోయాను.'

'నిన్ను నమ్ముతున్నాను.'

'నన్ను నేను నమ్మితే ఎంతబావుంటుందా అనుకుంటున్నాను' అన్నాడు లార్డ్ హెన్రీ నవ్వుతూ. 'రా, మిస్టర్ గ్రే. బండి బైటనే ఉంది. నిన్ను మీ ఇంటి దగ్గర దిగబెడతాను. వస్తాం బేసిల్! ఇవాళ సాయంత్రం చక్కగా గడిచింది.'

వాళ్ళు తలుపు మూసుకుని వెళ్ళగానే చిత్రకారుడు సోఫాలో కూలబడ్డాడు. అతని ముఖం వేదనాపూరితమైంది.

# 3

మరుసటిరోజు మధ్యాహ్నం లార్డ్ హెన్రీవాటన్ తాపీగా పచార్లుచేస్తూ కర్జన్‌స్ట్రీట్‌నుంచి, ఆల్బనీకి తన పినతండ్రి లార్డ్ ఫెర్‌ను కలవడానికి వెళ్లాడు. లార్డ్ ఫెర్మర్ వృద్ధుడూ—బ్రహ్మచారీ. కొంచెం గడుసుమనిషి. అయినా చనువుగానే ఉంటాడు. ప్రపంచంమాత్రం అతన్ని పట్టిస్వార్థపరు డంటుంది. కారణం అతనివల్ల దానికి లాభించింది ఏమీ లేకపోవడమే. కాని సమాజం మాత్రం అతన్ని ఉదారవ్యక్తిగానే భావిస్తుంది. అతనికి ఇష్టమైనవారికి అతను అంతో ఇంతో ఇస్తూ ఉంటాడు. ఆయనతండ్రి పూర్వం మాడ్రిడ్‌లో రాయబారిగా ఉండేవాడు. కాని తరువాత కొలువు చాలించుకున్నాడు. తండ్రికి కార్యదర్శిగా ఉంటూవచ్చినా కొడుకుకూడా తండ్రితోపాటే పదవికి రాజీనామాఇచ్చాడు. తరువాత విశ్రాంతిపుచ్చుకున్నాడు. ఆయనకు రెండు పెద్దభవంతు లున్నాయి. అయినా, చిన్నగదుల్లో మాత్రమే ఉండడం అలవాటు చేసుకున్నాడు. భోజనం తరుచుగా క్లబ్బులో తీసుకుంటూ ఉంటాడు. రాజకీయాల్లో ఆయన 'టోరీ.' కాని 'టోరీ'లు ప్రభుత్వంలో ఉన్నప్పుడు మాత్రం వాళ్ళను దుమ్మెత్తిపోసేవాడు. ముందూ వెనకా ఆలోచించని అతివాదు లని అనేవాడు.

లార్డ్ హెన్రీ గదిలో అడుగుపెట్టేసరికి ఆయన కూచుని చుట్టకాల్చుకుంటూ ఉన్నాడు. గరుకుగాఉన్న షూటింగ్‌కోటు వేసుకున్నాడు. 'టైమ్స్' పత్రిక చదువుతున్నాడు. హెన్రీని చూడగానే 'ఏమోయ్ హెన్రీ! ఇంత పెందరాళే వచ్చావు!

ఏమిటి విశేషం? నీలాంటి విలాసజీవులు రెండు గంటలయ్యేవరకు నిద్రలేవరనీ, అయిదుగంటలయ్యే వరకూ దర్శనమివ్వరనీ అనుకుంటూ వచ్చాను' అన్నాడు.

'నారాకకు కారణం కేవలం బంధుప్రీతి మాత్రమే బాబాయ్! నీద్వారా కొంత సమాచారం తెలుసుకోడం అవసరమై వచ్చాను' అన్నాడు లార్డ్ హెన్రీ.

'డబ్బు విషయం మినహాయించావు సరే, కానీ. ఆ విషయమేమిటో చెప్పు. ఈ రోజుల్లో కుర్రాళ్ళు డబ్బులోనే అంతా ఉందనుకుంటారు' అన్నాడు లార్డ్ ఫెర్మర్.

లార్డ్ హెన్రీ కోటుగుండీ సరిచేసుకుంటూ 'అవును. నిజమే. వయస్సు మళ్ళిన తరువాత అది నిజమేనని తెలుసుకుంటారుకూడా. కాని నేనుమాత్రం డబ్బుకోసం రాలేదు. 'బిల్లు' లిచ్చేవారికి మాత్రమే డబ్బవసరం బాబాయ్. నేనెప్పుడూ అప్పుతీర్చను. అందువల్ల నాకు డబ్బు అనవసరం. అప్పే నాకు పెట్టుబడి. ఆ పెట్టుబడితో హాయిగా కాలక్షేపం చెయ్యవచ్చు. అదీకాక, నా లావాదేవీలన్నీ డార్ట్మూర్ వ్యాపారస్థులతోనే. అందువల్ల వాళ్ళెప్పుడూ నన్ను డబ్బుకోసం అట్టే బాధపెట్టరుకూడా. నాకు ఒకవిషయాన్ని గురించి కొంత సమాచారం కావలసివచ్చాను. అనవసరమైన సమాచారమే కాని, అవసరమైన సమాచారం కాదనుకో' అన్నాడు లార్డ్ హెన్రీ.

'సరే, నీకు ఇంగ్లీషు డైకిలోని విషయాల్లో ఏవిషయం కావాలన్నా చెబుతాను. ఈ రోజుల్లో ఆ డైకీలు వ్రాసే వాళ్ళుకూడా వాటిలో అన్నిరకాల చెత్తా నింపుతున్నారు.

నేను రాయబారశాఖలో కొలువుచేస్తూఉన్నరోజుల్లో ఇంత అధ్వాన్నంగా లేదు' అన్నాడు లార్డు ఫెర్మర్.

'డోరియన్ గ్రే డైరీల్లో ఉండదు బాబాయ్' అన్నాడు లార్డు హెన్రీ తాపీగా.

'డోరియన్ గ్రే! ఎవరతను?' అని ప్రశ్నించాడు లార్డు ఫెర్మర్.

'ఆ విషయం తెలుసుకోడానికే వచ్చాను బాబాయ్. నాకూ- కొంచెం తెలుసనుకో. అతను లార్డు కెల్సో కడపటి మనుమడు. అతని తల్లి డెవరె కుటుంబానికి చెందినది. ఆమె పేరు లేడీ మార్గరెట్ డెవరె. అతని తల్లిని గురించి నీ కేమైనా తెలిస్తే చెప్పు ఆమె ఎలాఉండేది? ఏమిటి? ఎవరిని వివాహం చేసుకుంది? నీ రోజుల్లోవారిని అందరినీ నీకు తెలిసేఉంటుంది కదా? ఆమె విషయంకూడా నీకు తెలిసిఉండవచ్చు. ప్రస్తుతం నాకు మిస్టర్ గ్రేవిషయం తెలుసుకోవలసిన అవసరం ఎంతో ఉంది. మొన్ననే అతనితో నాకు పరిచయమైంది' అన్నాడు లార్డు హెన్రీ.

'కెల్సో మనుమడా!' - ఆశ్చర్యపోయాడు వృద్ధుడు. 'కెల్సో మనుమడా! - అవును - ఆ అబ్బాయి తల్లిని నేను బాగా ఎరుగుదును. ఆ అమ్మాయి నామకరణ మహోత్సవసందర్భంలో కూడా ఉన్నా ననుకుంటాను. మార్గరెట్ డెవరె- ఆ అమ్మాయి చాలా అందగత్తె. ఆ పిల్లదాన్ని చూచి వెర్రెత్తని మగాడంటూ లేడు. చివరకు పైసాకూడా లేని ఒక కుర్రాడితో ఉడాయించి అందరినీ వెర్రెత్తించింది. నిన్నా మొన్నా జరిగినట్టుగా నా కంతా జ్ఞాపకం. పెండ్ల

యిన తరువాత కొద్ది నెలలకు 'స్పా' లో ఒక ద్వంద్వ యుద్ధంలో ఆ కుర్రాణ్ణి చంపారు. దాన్నిగురించి ఒకపాడుకథ కూడా ఉంది. కెల్సో ఎవరో ఒక బెల్జియన్ పశువును ఒకణ్ణి పట్టుకొచ్చి వాడికి డబ్బిచ్చి అల్లుణ్ణి బహిరంగంగా అవమానింపజేశాడని చెప్పుకునేవారు. తరువాత ఎలాగో ఒకలా ఈ గొడవంతా మాపుచేశారు. కెల్సో కూతురిని మళ్ళీ ఇంటికి తీసుకొచ్చాడు. ఆమె తరువాత ఎన్నడూ తండ్రితో పల్లెత్తు మాటకూడా మాట్లాడి ఎరుగదు. ఒక సంవత్సరంలో ఆ అమ్మాయికూడా చనిపోయింది. అయితేచెప్పవూ– ఆ అమ్మాయికి ఒక కొడుకున్నాడన్నమాట. నాకు జ్ఞాపకంలేదులే. ఎలా ఉంటాడు ఆ కుర్రాడు? తల్లిపోలిక వచ్చిఉంటే తప్పక బాగుండి తీరాలి!' అన్నాడు వృద్ధుడు.

'చాలా అందంగా ఉంటాడు' అన్నాడు లార్డు హెన్రీ.

'అయితే, మంచివాళ్ళచేతుల్లోనేపడతాడనుకుంటాను. ఆఅబ్బాయికి తల్లిడబ్బూ తాతగారిడబ్బూకూడా వస్తుం దనుకుంటాను. తాతగారిడబ్బు కావలసినంతమూలుగుతున్న దనుకుంటాను. సెల్బీ ఆ స్తంతా, ఆమె తాతగారిద్వారా అతని తల్లికి వచ్చింది. ఆమె తాతగారికి కెల్సో అంటే చెడ్డ అసహ్యం. కుక్కను చూచినట్టు చూచేవాడు. నిజంగావాడు కుక్కలాంటివాడే. నేను మాడ్రిడ్ లో ఉండగా ఒకమాటు అక్కడికి వచ్చాడు. నాకు చచ్చేసిగ్గయింది. అస్తమానం టాక్సీలవాళ్ళతోనూ బండ్లవాళ్ళతోనూ బాడుగల విషయంలో చిల్లరపోట్లాటలు పెట్టుకునే ఈ ఇంగ్లీషు జమీందా రెవరని రాణీగారు ప్రశ్నిస్తుతూ వచ్చేది. దాన్నిగురించి కథలుకూడా అల్లి చెప్పు

తునేవారు. ఒక నెలరోజులపాటనుతే నేను దుర్బారులో ముఖంకూడా చూపించలేకపోయాను.'

'ఆ విషయం నాకు తెలీదుకాని కుర్రాడుమాత్రం ఆ స్త్రీ పరుడే అనుకుంటాను. ఇంకా వయసు రాలేదు. సెల్బీ అతనిదే నని నాకు తెలుసు. అతనూ నాతో చెప్పాడు. ఊ. అయితే అతని తల్లి చాలా అందంగా ఉండేదన్నమాట?'—అన్నాడు లార్డ్ హెన్రీ.

'హెన్రీ! నేను నాజీవితంలో చూచిన అతిలోక సౌందర్యవతులలో మార్గరెట్ డెవరె ఒకతె. ఆ అమ్మాయి అలాటి పని ఎందుకుచేసిందో ఇప్పటికీ నాకు అర్థంకాదు. ఆమె ఎవరినికోరినా కళ్ళకద్దుకుని ఆమెను ఎవ్వరైనా వివాహం చేసు కుని ఉండేవారు. కార్లింగ్టన్ ఆమెకోసం పడిచచ్చేవాడు. ఆమె సౌందర్యవతిమాత్రమే కాక చాలా విలాసంగా కూడా ఉండేది. ఆ కుటుంబంలోని స్త్రీలంతా అలాగే ఉండేవారు. పురుషులు తేభ్యాల్లా ఉండేవారు. కాని, స్త్రీలుమాత్రం అద్భు తంగా ఉండేవాళ్లు. కార్లింగ్టన్ ఆమెకాళ్ళమీద పడ్డాడు. తనే చెప్పాడు ఆ విషయం. ఆమె నవ్వేసి ఊరుకుందట. ఆ రోజుల్లో లండన్‌లో అతనంటే ముచ్చటపడి వెంటపడని స్త్రీ అంటూలేదు. సరే, హెన్రీ! ఈ పెళ్లిగొడవల విషయం వచ్చింది కాబట్టి అడుగుతున్నాను— మీనాన్న, డార్టుమూర్ ఒక అమెరికన్ పిల్లను పెళ్ళాడతాడని చెప్పాడు — ఈ గొడ వేమిటి? ఏం, అతనికి ఇంగ్లీషుపిల్లలు పనికిరాకపోయారా?'

'ఈరోజులలో అమెరికన్ పిల్లల్ని పెళ్ళాడడం ఒక ఫాషనైపోయింది బాబాయ్!'

'ప్రపంచంలో స్త్రీలందరూ ఇంగ్లీషుస్త్రీలతో సరిపోల రని నేను రుజువుచేస్తాను.'

'ఇప్పుడు ఆ పందెం అమెరికన్ స్త్రీలకు వర్తిస్తుంది.'

'వాళ్ళు ఎక్కువకాలం నిలవరట.'

'దీర్ఘమైన వివాహబంధాలు వాళ్ళకు రోత.'

'ఆమెకు ఎవరైనా బంధువులున్నారా?'

లార్డ్ హెన్రీ తలఊపాడు. 'ఇంగ్లీషు స్త్రీలు ఎంత తెలివిగా తమ గతాన్ని దాస్తారో, అమెరికన్ బాలికలు అంత తెలివిగా తమ తల్లిదండ్రులవిషయం దాస్తారు' అన్నాడు.

'ఆమె తల్లిదండ్రులు అమెరికాలో పందిమాంసం పాక్ చేసేవారనుకుంటాను.'

'కావచ్చు. రాజకీయాలతరువాత అంతకంటె లాభసాటివృత్తి అమెరికాలో లేదంటారు.'

'ఆ అమ్మాయి— అందంగా ఉంటుందా?'

'అందంగా ఉన్నట్టు నటిస్తుంది. చాలామంది అమెరికన్ స్త్రీలింతే. అందగత్తెలయినా కాకపోయినా అందగత్తెల్లా హంగుచేస్తారు. అదే వారిఆకర్షణలోని రహస్యం.'

'ఈ అమెరికన్ స్త్రీలు వాళ్ళదేశంలోనే వాళ్ళు ఎందుకు ఉండిపోకూడదూ అంట! ఎప్పుడూ తమదేశాన్ని స్త్రీలపాలిటి స్వర్గమని పొగడుతూవుంటారు కదా!'

'నిజంగా అది స్త్రీలపాలిట స్వర్గమే. అంచాతనే 'ఈవ్'లాగా ఎప్పుడెప్పుడు అక్కడినుంచి బైటపడదామా అని చూస్తుంటారు. వస్తాను జార్జ్ బాబాయ్! ఇహ నే నిక్కడే కూచుని బాతాఖానీ వేస్తుంటే భోజనానికి ఆలస్యమైపోతుంది.

నాకు కావలసినసమాచారం చెప్పినందుకు అభినందనలు. నాకు ఎప్పుడూ నాకొత్తస్నేహితులను గురించి అన్ని విషయాలూ తెలుసుకోడమన్నా, పాతస్నేహితులను గురించి తెలుసుకోకుండా వుండడమన్నా ఇష్టం.'

'ఇవాళ భోజనం ఎక్కడ హెన్రీ?'

'అగథా అత్తయ్యగారింట్లో నేనూ, మిస్టర్ గ్రే అక్కడకే వెడుతున్నాం'

'మీ అగథా అత్తయ్యతో ఒకమాట చెప్పు. ఇహ నుంచి ధర్మాలకోసం చందాలకోసం నాదగ్గరికి వచ్చి తిరిగి గొడవపెట్టవద్దని చెప్పు. నాకుచోతపుట్టింది. తన పిచ్చిపనులన్నిటికి చెక్కులురాసి చందాలివ్వడంతప్ప ఇహ నాకేం పని లేదనుకుంటోంది కాబోలు!'

'సరే, అలాగే చెబుతాను జార్జ్ బాబాయ్! కాని నేను చెప్పి లాభం ఉండదు. దానం అనే జబ్బు పట్టుకున్నమనుష్యులకు మానవత్వంతాలూకు ఇంగితజ్ఞానం పూర్తిగా నశిస్తుంది. అదే వాళ్ళ ప్రత్యేకలక్షణం'

అవునన్నట్టు తలూపాడు వృద్ధుడు. లార్డ్ హెన్రీ సెలవు తీసుకుని బైటికివచ్చి బర్లింగ్టన్ స్ట్రీట్లోనుంచి బెర్కెలె స్క్వేర్ వైపుకు నడకసాగించాడు.

అయితే, ఇదన్నమాట డోరియన్ గ్రే జన్మవృత్తాంతం.

ఆ వృద్ధుడు లార్డ్ హెన్రీకి అంతా పూసగుచ్చినట్టు చెప్పలేదు. అక్కడక్కడ చెదురుచెదురుగా చెప్పాడు. అయినప్పటికీ ఆ కథ ఒక విచిత్రమైన అభూతకల్పనలా అతని హృదయాన్ని కదిల్చింది. కథ ఎంతో చక్కగా ఉంది. ఒక

సౌందర్యవతి ఉద్విగ్నప్రణయంకోసం సర్వస్వం త్యజిస్తుంది. ఎవరితోనో ఎక్కడికో వెళ్ళిపోతుంది. కొన్నివారాలు పెను తుఫానులాంటి ఆనందపుమైకంలో గడచిపోతాయి.

పగలూ రాత్రీకూడా పట్టని ఆనందం. చివరకు ఒక క్షుద్రమైన ద్రోహంవల్ల, హత్యవల్ల - ఈ ఆనందం ఆఖరవుతుంది. తరువాత నిశ్చల నిశ్శబ్దం. గర్భంలోనే సుళ్లు తిరుగుతున్న మూగవేదనతో నెలలుగడుస్తాయి. ఆ బాధలోంచి శిశు జననం. కని, కన్నతల్లి కళ్లుమూస్తుంది. శిశువును ఒంటిగావదలిపోతుంది; వృద్ధుడూ శుష్కహృదయుడూ అయిన ఒక వ్యక్తి నిరాక్షిణ్య నిరంకుశత్వానికి విడిచిపెట్టివెళ్ళిపోతుంది.

అవును. కథ ఎంతో చిత్రంగా ఉంది. వాతావరణం అనుకూలంగా ఉంది. ఈ శైశవగాథ- ఈ ఇతివృత్తం- ఆ కుర్రాడికి మరింత అందాన్ని చేకూర్చుతున్నది. ప్రపంచంలో కనుపించే ప్రతి అద్భుతవిషయం వెనుక ఏదో ఒక విషాదవైపరీత్యం ఉండితీరుతుంది.

ఒక చిన్న గడ్డిపూవు మొలకెత్తాలన్నా లోకాలు ప్రసవవేదన పొందితీరాలి... మొన్నటి రాత్రి డిన్నర్‌లో కూచున్నప్పుడు నిజంగా ఆకుర్రాడు ఎంతఅందంగా ఉన్నాడు! కళ్లు అప్పుడే ఆశ్చర్యంలో విచ్చుకున్నట్టున్నాయి. ఒకవిధమైన భయచకితమైన ఆనందంతో అరవిచ్చిన పెదవులు. క్లబ్‌లో తనకు ఎదురుగానే కూచున్నాడు. ఎర్రని దీపాలనీడలు అతని వదనంలో అనుక్షణం మేలుకునే ఆశ్చర్యాన్ని మరింత అరుణ రంజితం చేస్తున్నవి. అతనితో మాట్లాడుతూఉంటే ఒక సన్నని ఫిడేల్ తీగపై ఆలాపన తీగలుసాగినట్టుగా ఉంది.

ప్రతిస్పర్శకూ అతను ప్రతి స్పందించాడు. ప్రతి కమానుగగుర్పాటుకూ అతను లలితలలితంగా ప్రతిచలించాడు. ఒక వ్యక్తిపై ప్రభావం ప్రసరితం చెయ్యడంలో ఏదో ఒక గొప్ప భీకరమైన ఆకర్షణ ఉంది. ఒక గొప్పశక్తి నిహితమై ఉంది. మరేపనీ ఇలాంటిది కాదు. మరేపనిలోనూ ఇంతశక్తీ ఇంత ఆకర్షణా కనుపించవు. ఒక లావణ్యమూర్తిలోనికి మనఆత్మను ప్రవేశింపచెయ్యడం; ఆమూర్తిలో మనఆత్మను కాసేపు నిలిపి అవలోకించడం; మనదృక్పథాలు, మనభావాలు, మన ఆలోచనలు ఆలావణ్యమూర్తిలోని తారుణ్యంతోనూ ఉద్వేగంతోనూ సమ్మిళితాలై నూతనఛందస్సులతో లయలతో శ్రుతులతో స్వరాలతో ప్రతిధ్వనులీనుతూ ఉంటే ఆ ప్రతిధ్వనులను ఆలకించడం; ఒక విచిత్రమైన పరిమళాన్ని లేక ఒక సూక్ష్మద్రవాన్ని ఎక్కించినట్లుగా మన నైజాన్ని మన స్వభావాన్ని మరొకరికి అందజేయడం—వీటిలో నిజమైన ఆనందం ఉన్నది. బహుశా ఇంత ఆత్మతృప్తినివ్వగల ఆనందం ఈ సంకుచితశేష యుగంలో మరెక్కడా లేదు. అల్పాదర్శాలతోనూ క్షుద్రమైన ఇహలౌల్యంతోనూ కొట్టుకలాడుతున్న ఈ యుగంలో ఇంతకన్న ఆనందం మరెక్కడుంది?...

ఈ కుర్రాడుకూడా అద్భుతమయిన వ్యక్తి. బేసిల్ స్టూడియోలో దైవాద్యా అతన్ని కలుసుకున్నాడు. ఏమైనా ఈ కుర్రాణ్ణి అద్భుతవ్యక్తిగా రూపొందించవచ్చు. లావణ్యం అతని సొమ్ము. బాల్యంలోని పరిశుద్ధధావళ్యం అతని సొత్తు. పురాతన గ్రీకుపాలరాతిప్రతిమల నైగనిగ్యమంతా అతను పుణికిపుచ్చుకున్నాడు. ఎవరైనా అతనివల్ల సాధించలేని

దంటూ ఏమీలేదు. తలచుకుంటే దేవతనూచెయ్యవచ్చు; లేక దెయ్యాన్నీ చేయవచ్చు. ఇంత మహత్తరమైన సౌందర్యం వాడి వడిలిపోవడం ఎంత విచారకరం! ఇక బేసిల్ విషయం. మన స్తత్వరీత్యా చూస్తే అత నెంత విచిత్రంగా కనుపిస్తాడు! శిల్పంలో ఒక కొత్తరీతి; జీవితాన్ని దర్శించడంలో ఒక కొత్త పద్ధతి; ఈ కొత్త దర్శనానికి ఒక వ్యక్తి కేవల సాన్నిధ్యం మాత్రమే – ఆవ్యక్తికి తెలియకుండానే ఆలంబనం కావడం; కాకులు దూరని కారడవిలో చీమలుదూరని చిట్టడవిలో వెలుగు కిరణంచోటుచేసుకోని ఏఅటవీమధ్యంలోనో నివసించే నిశ్శబ్దదేవత, విచ్చిన పచ్చని మైదానంలో అదృశ్యంగా నడిచేశక్తి హఠాత్తుగా వనదేవతలా సాక్షాత్కరించడం;ఆమె అలా సాక్షాత్కరించగా తను భయచకితుడు కాకపోవడం – తలుచుకుంటే ఇదంతా ఎంత అద్భుతావహంగా ఉన్నది!

ఆమెకోసం అన్వేషించే తనలో ఒక అద్భుత దర్శనం మేలుకొన్నది. ఆ అద్భుతచక్షువుకే అతిలోక విషయాలు అవగతమవుతాయి. కేవలం వాటి రూపాలే మార్పుచెందుతూ ఒక కొత్తసాంకేతికరూపాన్ని ధరిస్తాయి. వాటికీ అతీతమూ, పరిపూర్ణమూఅయిన మరేదో రూపానికి అవి మచ్చుల్లా కనిపిస్తాయి. వాటినీడలకే వాస్తవరూపాన్నిస్తాయి. ఇదంతా స్మృతిపథంలో చూచి అచ్చెరువుపొందాడు లార్డ్ హెన్రీ. ఇలాటిది ఏదో చరిత్రలో సంభవించినట్టు అతనికి జ్ఞప్తికివచ్చింది. భావనాజగత్తులో శిల్పివంటివాడైన ప్లేటో కదూ యీవైచిత్ర్యాన్ని తొలిగా పృథక్కరించి ఆలోచనసాగించింది! బొనారొటీ కదూ ఈ అద్భుతవిశేషాన్ని రంగురంగుల

పాలరాతిగీతావళిగా తొలిచి మలిచింది! ఇంతకుముందు ఎన్నడో ఆ మహామహుల ఊహాపథాల ఊగిసలాడినప్పటికీ ఈ శతాబ్దంలో ఇది ఒక అపూర్వవిశేషంగా కనుపిస్తోంది. అవును. లార్డ్ హెన్రీ మనోపథాన మరో భావవీచిక వీచింది. డోరియన్ గ్రే అద్భుతమూర్తిని చిత్రరువుగా రూపొందించిన ఆ చిత్రకారునికి తనకు తెలియకుండానే డోరియన్ ప్రేరేపణ నిచ్చాడు. ఆ కుర్రాడు ఆ చిత్రకారుని ఎలా ప్రేరేపించాడో, తను డోరియన్ గ్రే ను అలా ప్రేరేపిస్తాడు. ఆ చిత్రకారునికి ఆ కుర్రాడు ఏ మయ్యాడో ఆ కుర్రాడికి తనూ అదే అవుతాడు. అతనిపై తనప్రభావం ప్రసరింపజేస్తాడు. తనఅధిక్యాన్ని ముద్రిస్తాడు. స్వాధీనం చేసుకుంటాడు. ఇప్పటికే చాలావరకు ఆ కుర్రాడు తన ఛాయలోకి వచ్చాడు. ఆ అద్భుతమూర్తిని తన సొంతంచేసుకుంటాడు. ప్రేమ, మృత్యువుల అనుగుబిడ్డయిన ఈ కుర్రాడిలో ఏదో అతిలోకమైన ఆకర్షణ ఉంది.

ఇలా ఆలోచనా వాహినిలో కొట్టుకునిపోతున్న వాడల్లా హఠాత్తుగా ఆగి ఎక్కడికి వచ్చాను అన్నట్టు ఇండ్ల వంక చూచాడు లార్డ్ హెన్రీ. తన అత్తయ్యగారిల్లు ఎప్పుడో దాటివచ్చేశాడు. తన పరధ్యానానికి నవ్వుకుని మళ్ళీ వెనక్కు తిరిగాడు. హాల్లో ప్రవేశించగానే బట్లరు వాళ్ళు అప్పుడే భోజనానికి కూచున్నారని చెప్పాడు. లార్డ్ హెన్రీ తన హేట్‌నూ చేతికర్రనూ ఒక సేవకునికి అందించి భోజనశాలలోకి వెళ్ళాడు.

'అలవాటు ప్రకారమే ఆలస్యంచేశావే హెన్రీ!' – అన్నది అగాథాఅత్త అతనివంకచూచి తల పంకిస్తూ.

అప్పటికప్పుడు సులువుగా కనిపెట్టి ఒక అనువైన కారణం చెప్పాడు లార్డ్ హెన్రీ. ఆమె ప్రక్కనే ఖాళీగా ఉన్న కుర్చీలో కూచుని ఎవరెవరు వచ్చారా అని చుట్టూ కలయ చూచాడు. డోరియన్ టేబిల్ చివర కూచుని ఉన్నాడు. హెన్రీని చూచి సిగ్గుతో చిరునవ్వు నవ్వాడు. అతని చెక్కిళ్ళలోకి ఒక ఆనంద లజ్జారుణిమ దొంగలా జొరబడింది. అతనికి ఎదురుగా హార్లె డచెస్ ఆసీనురాలై ఉంది. ఆమె చాలా సాధు స్వభావం గలది. ఆమెను ఎరిగినవారంతా ఎంతో ప్రేమిస్తారు. గౌరవిస్తారు. ఆమె కుడిప్రక్కన పార్లమెంటులో రాడికల్ సభ్యుడు సర్ థామస్ బోర్డన్ కూచుని ఉన్నాడు. ప్రజాజీవితంలో తన నాయకుణ్ణే అనుసరిస్తాడు. వ్యక్తిగత జీవితంలో పసందైన వంటవాళ్ళను అనుసరిస్తాడు. టోరీలతో కలిసి భోజనాలు చేస్తాడు. లిబరల్స్‌తో కలిసి ఆలోచిస్తాడు. ఆమెకు ఎడమప్రక్క మిస్టర్ ఎర్స్కైన్ ఆసీనుడై ఉన్నాడు. ఆయన వృద్ధుడూ, పెద్దమనిషీ. కొంత సంస్కారం అదీ ఉన్నవాడు. కాని మోసమనే చెడు అలవాటుకు అలవాటుపడిపోయాడు. ఈ విషయాన్ని గురించి లేడీ అగాథాతో ఒకమాటు ప్రస్తావిస్తూ- తనకు ముప్ఫయి ఏళ్ళు రాకమునుపే తను చెప్పదలిచిన విషయాలన్నీ చెప్పేశానన్నాడు. అతని ప్రక్కనే మిసెస్ వారి డెలెర్ కూచుని ఉంది. ఆమె తన అత్తయ్య పాతస్నేహితురాండ్రలో ఒకతె. స్త్రీలలో ఋషిపత్నిలాంటి దామె. కాని రోతపుట్టేటంత ఎబ్బెట్టుగా అలంకరించుకుని ఉంది. ఆమెను చూస్తే అవకతవకగా బైండుచేసిన ప్రార్థనాగీతాల పుస్తకం జ్ఞాపకంవస్తుంది. అదృష్టవశాత్తూ ఆమె లార్డ్ ఫాడెల్‌కు

అవతలి వైపుగా కూచుని ఉంది. ఆమె అతనితో ఏదో విషయం చాలా శ్రద్ధగా మాట్లాడుతూ ఉంది.

'మేము – పాపం! – డార్ట్ మూర్ నుగురించి మాట్లాడుకుంటున్నాం లార్డ్ హెన్రీ! ఆ చిన్నదాన్ని అతను తప్పకుండా పెళ్ళిచేసుకుంటా డంటావా?'– అన్నది డచెస్.

'ఆమె అలా నిశ్చయంచేసుకున్న దనుకుంటాను డచెస్' – అన్నాడు హెన్రీ.

'ఎంత ఘోరం! ఎవరో ఒకరు కలగజేసుకుని ఈ విపరీతం ఆపుచెయ్యాలి' అన్నది లేడీ అగాథా.

'ఆ అమ్మాయితండ్రి అమెరికానుంచి ఎండిన పదార్థాలు ఎగుమతిచేస్తాడట' అన్నాడు సర్ థామస్ బర్డన్.

'ఎండిన పదార్థాలా? ఏమిటవి?' – అని అడిగింది డచెస్.

'అమెరికన్ నవలలు' అన్నాడు లార్డ్ హెన్రీ.

హెన్రీ ఇలా అనేసరికి డచెస్ కాస్త గాభరాపడింది.

'అతని మాటలు పట్టించుకోకు. అత నెప్పుడూ ఇలాగే మాట్లాడుతాడు. వేరే దురుద్దేశం ఏమీ లేదు' అని సర్దింది లేడీ అగాథా.

'అమెరికానుకనిపెట్టిన కొత్తరోజుల్లో'–అంటూ మొదలెట్టి ఏదేదో విసుకెత్తించే విషయాలు చెప్పసాగాడు రాడికల్ సభ్యుడు. కొందరు ఒక విషయం మొదలెట్టారంటే శ్రోతలకు ఎంత విసుగ్గాఉన్నా పూర్తిగాచెప్పేవరకూవదలిపెట్టరు.అతనూ అలాగే చేశాడు. డచెస్‌కు విసుకెత్తి, 'అబ్బ! ఈ అమెరికా కనిపెట్టకుండా ఉన్నా ఎంత బావుండేది!' అన్నది.

'ఈ అమెరికా కనిపెట్టడంవల్ల మన దేశంలో అమ్మా యిలకి సంబంధాలకొరత యేర్పడింది!' అన్నది.

'ఇంతకూ నా ఉద్దేశంలో అమెరికా కనిపెట్టబడ లేదు. అమెరికాను పరిశోధించి పట్టుకున్నా రంటాను!' అన్నాడు మిస్టర్ ఎర్స్కిన్.

'నేను ఆ దేశస్థులను కొందరిని చూచాను. చాలా మంది చూడ ముచ్చటగా వుంటారు. సందేహం లేదు. ముస్తాబుకూడా చక్కగా చేసుకుంటారు. దుస్తులన్నీ పారిస్‌నుంచి తెప్పిస్తారట. నా దుస్తులూ పారిస్‌నుంచి తెప్పిస్తే ఎంతబావుం టుందా అనుకుంటున్నాను' అన్నది డచెస్.

'అమెరికాలో చనిపోయిన మంచివాళ్లు మళ్ళీ పారిస్ లో పుడతారట' అన్నాడు సర్ థామస్.

'నిజంగానా? అయితే చనిపోయిన చెడ్డ అమెరికనులు ఎక్కడికి వెడతారో!' అన్నది డచెస్.

'మళ్ళీ అమెరికాకే వెడతారు' అన్నాడు లార్డ్ హెన్రీ.

సర్ థామస్ ముఖం ముడుచుకున్నాడు. లేడీ అగాథాతో, 'మీ అల్లుడికి ఆ దేశమంటే చాలా కోపంలాగుంది!' అన్నాడు.

'ఆ దేశాన్ని సందర్శించిరావడం విజ్ఞానదాయకంకూడా'

'మనం విజ్ఞానం నేర్చుకోవాలంటే చికాగో చూడడం అవసరమంటారా?' – అని అడిగాడు ఎర్స్కిన్.

'మిస్టర్ ఎర్స్కిన్‌కు ప్రపంచమంతా తన బీరువాలో పుస్తకాల్లోనే ఉన్నట్టుంటుంది. కాని మాకుమాత్రం అలా

కాదు. మేము విషయాలనుగురించి చదవడంకాదు – అవి చూచి తీరాలి. అమెరికా దేశస్థులు తప్పక చూచి తీరవలసిన ప్రజ. వాళ్ళ జీవితాలుకూడా ఎంతో హేతుయుతంగానూ అర్థసహితంగానూ ఉంటాయి. ఇదే అమెరికాదేశస్థుల విశిష్ట లక్షణమని కూడా అనుకుంటాను. వాళ్ళనుగురించి ఇంత ఆడి పోయవలసిన పనేమీలేదు' అన్నాడు సర్ థామస్.

'ఎంతఘోరం! పశుశక్తిని నేను సహించగలను కాని పశుహేతువంటే నాకు తగనికోత. దానిలో ఏదో దోషం ఉన్నది. మేధస్సుకు ద్రోహం చెయ్యడం అది' అన్నాడు లార్డ్ హెన్రీ.

'నీవంటున్నది నాకు అర్థంకావడం లేదు' అన్నాడు సర్ థామస్.

'నాకుమాత్రం అర్థమైంది లార్డ్ హెన్రీ!' అన్నాడు మిస్టర్ ఎర్స్కైన్.

'పరస్పర వైరుధ్యాలు ఒకవిధంగా బాగానే ఉంటాయి' అన్నది డచెస్.

'ఇప్పుడు లార్డ్ హెన్రీ అన్నమాట పరస్పరవైరుధ్య మంటారా? నేనుమాత్రం అలా అనుకోను. అయినా, అవి పరస్పరవైరుధ్యంకావచ్చు. సరే, ఇంతకూ పరస్పరవైరుధ్యాలు సత్యానికే దారితీస్తాయి. వాస్తవాన్ని పరీక్షించాలంటే త్రాటి సాముపైనే పరీక్షించాలి. సర్కస్ చేయించినప్పుడే సత్యం యొక్క నిగ్గు తేలుతుంది' అన్నాడు మిస్టర్ ఎర్స్కైన్.

'అబ్బబ్బ! మీమగాళ్ళ వాదోపవాదాలు ఎంత విచి త్రంగా ఉంటాయి! ఒక్కోసారి మీ రేం మాట్లాడుతున్నారో

కూడా తలాతోకా తెలీదు. అంతా అగమ్యగోచరం. హెన్రీ! నీమాటలతో విసుకెత్తిపోయాను. ఇంతకూ మన డోరియన్ ఈస్ట్ ఎండ్ వదిలెట్టాలని ఇంత పట్టేమిటి చెప్పు ?'

'అతను నాకు పంతపాడాలని నా అభిమతం' అన్నాడు లార్డ్ హెన్రీ చిరునవ్వునవ్వుతూ.

అవునా? - అన్నట్టు డోరియన్ వంక చూశారు.

నిజమే అన్నట్టు డోరియన్ తిరిగి లార్డ్ హెన్రీ వంక చూచాడు.

"కాని, వైట్ ఛాపెల్ లో వాళ్ళంతా ఎంతో ఆతుర పడుతున్నారు", అని చెప్పసాగింది లేడీ అగాథా.

'నేను దేనితోనైనా సానుభూతిచూపగలను. కాని బాధతో మాత్రం సానుభూతి చూపలేను. అది నాకు చాత కాని పని. బాధ అనేది చాలా అసహ్యమైనది. రోత పుట్టిస్తుంది. ఈ రోజుల్లో బాధపట్ల సానుభూతి చూపడం ఒక ఫాషనై పోయింది. ఈసానుభూతిలో ఏదో భీకరమైన అసహ్యత నిహితమై ఉన్నదని నా ఉద్దేశం. సానుభూతిఅనేది - ప్రఫుల్ల జీవనానందం పట్ల, జీవనసౌందర్యం పట్ల, జీవన విచిత్ర శోభ పట్ల చూపాలి. బ్రతుకులోని బాధలను ఎంత తక్కువ తలిస్తే అంత శుభం' అన్నాడు లార్డు హెన్రీ.

'అయినప్పటికీ ఈస్ట్ఎండ్ చాలా ముఖ్యమైన సమస్య' అన్నాడు సర్ థామస్.

'కావచ్చు. అది బానిసలను గురించిన సమస్య. ఆడి పాడి ఆ సమస్యను తీర్చగలమా?', అన్నాడు లార్డు హెన్రీ.

ఆ రాజకీయవేత్త లార్డ్ హెన్రీ వంక సూక్ష్మంగా చూస్తూ, 'అయితే, నీవు సూచించదలచిన మార్పు ఏమిటి?' అని ప్రశ్నించాడు.

లార్డ్ హెన్రీ నవ్వాడు.

'నేను ఇంగ్లండులో ఒక్క గాలిమార్పు తప్ప మరేమార్పూ కోరడంలేదు. తత్వచింతన ఒక్కదానితో నేను పూర్తిగా సంతృప్తిచెందాను. ఇహ నాకు కోరవలసింది ఏమీ కనుపించడం లేదు. సానుభూతిని, అధికంగా నీటికి మళ్లే పారబోయడం వల్ల పందొమ్మిదవ శతాబ్దపు మానవమన స్తత్వం పూర్తిగా దివాలాతీసింది. అందుచాత శాస్త్రజ్ఞానం మళ్ళీ ఈమన స్తత్వాన్ని ఒక బాటలో పెట్టాలని మనం కోరుకోడం అవసరం. ఉద్రేకాలవల్ల ఉపయోగం ఏమిటంటే, అవి మనల్ని విపథులను చేస్తాయి. శాస్త్రజ్ఞానంలోని ఉపయోగం, అది ఉద్రేకరహితం కావడం' అన్నాడు హెన్రీ.

'కాని, నీవు ఒక ముఖ్యమైన విషయం ఆలోచించాలి. మనమీద ఎన్నో గొప్ప బాధ్యతలున్నాయి అన్నది మిసెస్ వాన్ డెలెర్.

'చాలా గొప్ప బాధ్యతలు!'- అన్నది లేడీ అగాథా.

లార్డ్ హెన్రీ మిస్టర్ ఎర్స్కిన్ వంక చూచాడు.

'మానవజాతి గోరంతను కొండంతగా చేసి చూస్తుంది. ప్రతి అల్పవిషయాన్నీ గొప్పబాధ్యతగా పరిగణించి ఆరాటపడుతుంది. ఇదే లోకంయొక్క అనాది పాపం. గుహల్లో నివసిస్తూ వచ్చిన తొలిమానవుడు నవ్వడం ఎలాగో నేర్చుకుని ఉంటే మానవచరిత్ర ఇలా వుండేదికాదు' అన్నాడు లార్డ్ హెన్రీ.

'నీమాటలు ఎంతో తీయగా హాయిగా వుంటాయి. కానీ అత్తయ్యను నేను ఎప్పుడు చూడడానికి వచ్చినా, నా కేదో సంకోచంగా వుండేది. నాకు నిజానికి ఈ బానిసల వ్యవహారమంటే అంత ఇష్టంలేదు. అంచాత ఆమెముందు సిగ్గు పడేదాన్ని. ఇహముందు అలాటి సంకోచమూ సిగ్గూ లేకుండా ఆమె ముఖంలోకి సూటిగా చూడగలను' అన్నది డచెస్.

'సిగ్గు ఎంతో ముచ్చటగా వుంటుంది డచెస్!' అన్నాడు హెన్రీ.

'చిన్నతనంలో మాత్రమే సిగ్గు ముచ్చటగా వుంటుంది. నాలాటి వృద్ధురాలిముఖం లజ్జారుణంకావడం అంత వుచితం కాదు. అది మంచి లక్షణంకూడా కాదు. ఇంతకూ — లార్డ్ హెన్రీ! . ని న్నొకవిషయం అడగదలిచాను— నాకు చెప్పవూ— మళ్ళీ యౌవనాన్ని తిరిగి పొందడం ఎలాగో చెప్పు' అన్న దామె.

లార్డ్ హెన్రీ ఒక క్షణకాలం ఆలోచించాడు. 'నీ యౌవనపులిదినాలలో నీవు చేసిన పెద్దతప్పు ఏదైనా నీకు జ్ఞాపకం ఉందా డచెస్?' అని ప్రశ్నించాడు.

'ఒకటేమిటి? చాలా తప్పు లున్నా యనుకుంటాను' అన్నది డచెస్.

'అయితే ఆ తప్పులన్నీ ఒక మాటు మళ్ళీ చెయ్యి. మనకు యౌవనం తిరిగిగావాలంటే మన చిన్ననాటితప్పులు ఒక మాటు మళ్ళీచేస్తే చాలు' అన్నాడు హెన్రీ.

'ఎంత చక్కగా ఉంది ఈ సిద్ధాంతం! తప్పకుండా ఆచరణలోపెట్టి తీసుతాను' అన్నది డచెస్.

'ఇది చాలా ప్రమాదకరమయిన సిద్ధాంతం' అన్నాడు సర్ థామస్.

లేడీ అగాథా అవునన్నట్టు తల ఊపింది. కాని ఆమెకు కూడా ఆ సిద్ధాంతం ఎంతో గమ్మత్తుగా కనుపించింది. మిస్టర్ ఎర్స్కైన్ లార్డు హెన్రీ పలుకులు వింటూ కూచున్నాడు.

లార్డు హెన్రీ ఇలా చెప్పసాగాడు. 'అవును, యౌవనం పునర్నవం కావాలంటే అలాగే చెయ్యాలి. జీవితంలోని గొప్ప రహస్యాలలో అది ఒకటి. ఒక అర్థంలేని ఇంగితజ్ఞానంతో ఈ రోజుల్లో జనం చాలామంది అవస్థపడుతున్నారు. ఏ పనులను గురించి మనం విచారపడమో అవే తప్పులని ఎంతో ఆలస్యంగా గ్రహిస్తారు' అన్నాడు లార్డ్ హెన్రీ.

అంతా పగలబడి నవ్వారు.

ఆ భావంతో అలా ఆడాడు లార్డ్ హెన్రీ. బంతిలా దాన్ని ఆకాశంలోకి ఎగరేశాడు. మళ్ళీ పట్టుకున్నాడు. పరస్పర వైరుధ్యపు రెక్కలు తొడిగి పావురాయి పిట్టలా ఆ భావాన్ని గగనంలోకి ఎగరేశాడు. తన ఊహావైభవంతో రంగుల ఇంద్రధనస్సులాగా ఆ భావాన్ని మెరిపించాడు. పాపాన్నిగురించిన అతని ప్రశంస, అతని ఊహాకాశంలో పైకిపైకి ఎగసి వెళ్ళినకొద్దీ, ఒక తత్వపద్ధతిగా పరిణమించ సాగింది. వేదాంతమే చిన్నారి చిన్ని పడుచుగా మారింది. పచ్చపచ్చని లతామకుటాన్ని ధరించి, ద్రాక్షరసకలుషితమైన పట్టుచీరెకట్టి, కైపెక్కించే ఆనందసంగీతానికి అనువుగా లయకలిపి జీవనగిరిశిఖరాంచలాలపై చిన్మయనాట్యం సలుప సాగింది. తాగి తూలుతున్న వృద్ధాప్యాన్ని చూచి పరిహాసించింది.

వేటగానికి భయపడి పరుగెత్తే అడివిజంతువుల్లాగా వాస్తవాలు ఆమె ముందునుంచి పరుగిడిపోయాయి. విజ్ఞానఘనుడైన ఓమర్ ఆసీనుడయ్యే చల్లని ద్రాక్షారామంలో చిన్నారి చిట్టి అడుగులతో నృత్యంకావిస్తూ వెళ్ళింది. సలసల కాగుతున్న వెచ్చని ద్రాక్షరసం వుబికి ఆమె అడుగుల చుట్టూ సుళ్ళుతిరిగింది.

లార్డుహెన్రీ ఆశువుగా చెప్పిన ఆ ముక్క అంత అద్భుతంగా పనిజేసింది. డోరియన్ గ్రే తనవంక నిశ్చలదృక్కులు నిలిపి చూస్తున్నాడు. తను మూర్ఛదలచుకున్న వ్యక్తి తనశ్రోతలలో వున్నాడనే చైతన్యం హెన్రీపలుకులకు ఒక తీక్ష్ణతనూ, ఒకసూక్ష్మతనూ తెచ్చిపెట్టింది. అతని కల్పనను రాగరంజితం కావించింది. అద్భుతంగా అనూహ్యంగా అపూర్వంగా మాట్లాడుతున్నాడు. నాగస్వరానికి ఫణులు ఫణాలు ఆడించినట్టు శ్రోతలు తలలూపుతున్నారు. డోరియన్ కండ్లు అతనివంకే చూస్తున్నాయి. అతనినుంచి చూపు మరల్చుకోలేకుండా ఉన్నాడు. మంత్రముగ్ధునిలా కూచుని అతని పలుకులు వింటున్నాడు. చిరునవ్వులు తెరలు తెరలుగా అతనిపెదవులపై ఆడుతున్నాయి. ఆశ్చర్యం కాళిమాచ్ఛాదితమవుతున్న అతని కండ్లలో మరింత దట్టమవుతూంది. ఆ మందిరమే ఒక ఊహావిహారంగా మారింది.

కడకు, ఆనాటి దుస్తులు సవరించుకుని, 'వాస్తవం' ఒక సేవకుని రూపంలో గదిలో అడుగిడింది. డచెస్‌తో తను ఇంటికి మరలవలసిన సమయమైందని చెప్పాడు సేవకుడు. 'ఇక నేను వెళ్ళాలి. క్లబ్‌కు వెళ్ళి నాభర్తను కలుసుకోవాలి. విలిస్‌ల ఇంట్లో అర్థంలేనిసభ ఏదో జరుగుతూఉంది. అక్కడ నాభర్త

అధ్యక్షపదవి వహించాలి. నేను ఆలస్యంగా వెడితే ఆయన తప్పకుండా మండిపడతాడు. వస్తానమ్మాయ్, అగాథా! లార్డ్ హెన్రీ! వస్తాను. నీ మాటలు యెంతో ముచ్చటగాఉన్నాయి కాని, నీ అవినీతిమాత్రం ఇంతా ఇంతా అని చెప్పడానికి వీల్లేదు. నీ అభిప్రాయాలనుగురించి ఏం చెప్పాలో నిజానికి నాకు తోచడంలేదు. ఏదో ఒకరాత్రి నీవు మా ఇంటికి తప్ప కుండా భోజనానికి రావాలి మంగళవారంనాడు నీకు తీరికేనా?' అన్నది డచెస్.

'నీకోసం పనులన్నీ అవతలపెట్టేస్తాను డచెస్' అన్నాడు లార్డ్ హెన్రీ.

'మంచిది' అంటూ ఆమె గదిలోనుంచి త్వరత్వరగా వెళ్ళిపోయింది. లేడీ అగాథా, తదితర స్త్రీలూ ఆమెను అనుస రించారు.

లార్డ్ హెన్రీ ఆమెను వాకిటివరకూ పంపి తిరిగివచ్చి, కూచున్నాడు. మిస్టర్ ఎర్స్కైన్ ఒకకుర్చీ అతనికి దగ్గరగా లాక్కొని కూచుని అతనిబుజంమీద చెయ్యివేసి : 'నీవు మాట్లాడితే పుస్తకాలు పుస్తకాలు మాట్లాడేస్తావు. ఒక పుస్తకం ఎందుకు వ్రాయకూడదూ?'— అన్నాడు.

'నాకు పుస్తకాలు చదవడమంటే ఎంత ప్రియమో చెప్పలేను. అందువల్లనే పుస్తకాలు వ్రాయను. నాకు ఒకనవల వ్రాయాలని మాత్రం ఉంది — పర్షియన్ తివాసీలాగా అంద మైన నవల—మంత్రగాని తివాసీలా అవాస్తవికమైన నవల! కాని, ఇంగ్లండులో న్యూస్ పేపర్లు, వాచకాలు, విజ్ఞాన సంపు టాలు, డైరీలు చదివేవాళ్ళుతప్ప సాహిత్యం చదివేవాళ్ళు లేరు.

ప్రపంచంలోని అన్ని దేశాల్లోకి సాహిత్యసౌందర్యంపట్ల అభిరుచి ఇంతకొరవడిన దేశం మరొకటి లేదు' అన్నాడు లార్డ్ హెన్రీ.

'నీ మాట నిజమనిపిస్తుంది. హరీ. ఒకప్పుడు సాహిత్యాదర్శాలు ఉండేవి నాకు, ఎప్పుడో వాటికి స్వస్తి చెప్పేశాను. అయితే, ఇంతకూ ఏన్నాళ్ళ విషయం అడుగుతాను, చెప్పు. నీవు ఇందాక భోజనాలప్పుడు మాట్లాడిన మాటలన్నీ నిజంగా నీవు ఉద్దేశించి మాట్లాడినవేనా?' – అని అడిగాడు మిస్టర్ ఎర్స్కైన్.

'నేను చెప్పిన విషయాలు మరచిపోవడం నాకు అలవాటు. నేను చెప్పిన విషయాలు అంత చెడ్డవంటారా?' అన్నాడు లార్డ్ హెన్రీ.

'చాలా చెడ్డవి. నిజం చెప్పాలంటే నీవు చాలా ప్రమాదకరమైన వ్యక్తివి. డచెస్‌కు ఇకముందు ఏ ప్రమాదం జరిగినా నీవే బాధ్యుడివని అనుకోవలసివస్తుంది. కాని జీవితాన్ని గురించి నీతో కొంత చర్చించాలని కుతూహలంగాఉంది. నేను పుట్టిన తరం చాలా రోత కలిగించేది. నీకు ఎప్పుడైనా లండన్‌తో విసుగెత్తితే ట్రెడ్లీకి వచ్చి నీ ఆనందతత్వసారాన్ని నాకు వినిపిస్తూ నాతో కాలక్షేపం చెయ్యి'–అని అడిగాడు మిస్టర్ ఎర్స్కైన్.

"తప్పకుండా వస్తాను. అంతకంటె భాగ్యమేముంది? ట్రెడ్లీని సందర్శించడం గొప్ప అదృష్టం. చక్కని అతిథి సత్కారం—చక్కని లైబ్రరీ— ఇక కావలసిందేముంది?' అన్నాడు లార్డు హెన్రీ.

'నీవు లేని లోటు నీ రాకతో పూర్తిచెయ్యి. ఇహ నేను వెళ్ళాలి' అన్నాడు మిస్టర్ ఎర్స్కిన్.

లార్డ్ హెన్రీ నవ్వుతూ లేచి, 'నేనూ పార్కుకు వెళ్ళాలి' అన్నాడు.

గదవదాటి వెళుతూ ఉండగా డోరియన్‌గ్రే అతని భుజం స్పృశించి, 'నేనూ వస్తాను' అన్నాడు.

'బేసిల్ దగ్గరికి వస్తానని వాగ్దానం చేశావనుకుంటాను' అన్నాడు లార్డ్ హెన్రీ.

'కాదు. ముందు నీతో వస్తాను. తరువాత అక్కడికి వెడతాను. నీతో రానివ్వవూ? నేను నీతో ఉన్నంతసేపూ నీవు మాట్లాడుతూ ఉండాలి. నీ అంత అద్భుతంగా మాట్లాడే వాళ్ళను నే నెవరినీ చూడలేదు' అన్నాడు డోరియన్.

'ఇవాళ చాలా మాట్లాడాను. ఇహ ఇప్పుడు కాసేపు జీవితాన్ని పరిశీలించాలి. నాతో వచ్చి నీవూ పరిశీలించు' అన్నాడు లార్డ్ హెన్రీ.

## 4

ఒక నెల గడిచింది.

ఒకనాటి మధ్యాహ్నం, లార్డ్ హెన్రీ ఇంట్లో లైబ్రరీ గదిలో డోరియన్‌గ్రే పడకకుర్చీలో వాలిఉన్నాడు. గది చూడ ముచ్చటగా ఉంది.

లార్డ్ హెన్రీ ఇంకా గదిలోకి రాలేదు. అతని కెప్పుడూ ఆలస్యంగా రావడం అలవాటు. అతని ఉద్దేశంలో సమయానికి ఒకపని చెయ్యడం కాలాన్ని దొంగిలించడం. అంచాత ఏమీ

లోచనటు 'మానన్ లెస్ కాట్' ప్రతి పేజీలు తిరగేస్తూ కూచున్నాడు డోరియన్ గడియారం మందంగా 'టిక్ టిక్'మని కొట్టుకుంటూ ఉంది. ఒకటి రెండుసార్లు ఇహ హెన్రీ వచ్చేట్టు లేడని వెళ్ళిపోదామనుకున్నాడు డోరియన్.

చివరకు అడుగులచప్పుడైంది. తలుపు తెరుచుకుంది!

'ఎంత ఆలస్యంచేశావు హెన్రీ !'-కుర్రాడు అన్నాడు ఆ అడుగుల చప్పుడు విని.

'ఇప్పుడు వచ్చింది హెన్రీ కాదనుకుంటాను మిస్టర్ గ్రే !' ఒక సన్నని కంఠస్వరం జవాబు చెప్పింది.

అతను ఉలికిపడి, తిరిగిచూచి, లేచి నిల్చుని 'క్షమించాలి. హెన్రీ అనుకున్నాను' అన్నాడు.

'నా భర్త వచ్చాడనుకున్నావు. కదూ? కాని వచ్చింది నేను. అతని భార్యని. ఇలా నన్ను నేను పరిచయంచేసుకోనీ. నీ ఫొటోలనుబట్టి నిన్ను బాగా గుర్తించగలను. నా భర్త దగ్గర నీ ఫొటోలు పదిహేడు ఉన్నాయనుకుంటాను' అన్నదామె.

'పదిహేడు కాదు లేడీ హెన్రీ'-అన్నాడు డోరియన్.

'పోనీ, పద్ధెనిమిదనుకో. నిన్ను రాత్రి ఒపెరాలో నా భర్తతో కలిసిఉండగా చూచాను' ఇలా అని ఆమె నవ్వుతూ అతనివంక విచిత్రంగా చూచింది. 'నన్ను మరిచిపోవద్దు' అన్నట్టుగా ఉంటాయి ఆమెకండ్లు. ఆమె చాలా చిత్రమైన స్త్రీ. ఆమె వేసుకునే దుస్తులలో ఏదో పెనుతుఫానులాంటి తీవ్రత కనుపిస్తుంది. ఎప్పుడూ ఎవరినో ఒకరిని ప్రేమిస్తూనే ఉంటుంది. ఆమె ప్రేమను ఎన్నడూ తిరిగిపొందకపోవడంవల్ల ఆమె

స్వప్నాలు మాత్రం చెదిరిపోకుండా అలాగే నిలిచిఉన్నాయి. చాలా చక్కగా తీర్చిదిద్దిన చిత్తరువులా కనుపించాలని ప్రయత్నిస్తుంది కాని, కడకు కలగాపులగంగా చిందరవందరగా కనుపిస్తుంది. ఆమెపేరు విక్టోరియా. చర్చికి వెళ్ళడం ఆమె కో వ్యసనంలాంటిది.

'మీరు నన్ను చూచింది 'లోహెంగ్రిన్' ఒపెరాలో అనుకుంటాను లేడీ హెన్రీ!'– అన్నాడు డోరియన్.

'అవును. అక్కడే చూచాను. నా మట్టుకు నాకు వాగ్నర్ సంగీతమంటే ఎంతో ఇష్టం. ఆ సంగీతం సాగుతున్నంతసేపూ ప్రక్కవాళ్లు వినకుండా మనం ఎంతసేపయినా మాట్లాడుకోవచ్చు. అంత బిగ్గరగానూ భీభత్సంగానూ ఉంటుంది ఆ సంగీతం. అవునా కాదా డోరియన్?' – అన్నదామె.

ఆమె అధరాలు చలించి ఒక ప్రకంపితహాసం తెరలు తెరలుగా దూసుకుని వచ్చింది. తాబేటిచిప్పతో చేసిన ఒక పేపర్ కత్తిని ఆమె కొనవ్రేళ్ళతో ఆడిస్తూఉంది.

డోరియన్ నవ్వి తలఊపాడు. 'నా ఉద్దేశం అది కాదనుకుంటాను లేడీ హెన్రీ! సంగీతం సాగుతున్నంతసేపూ నేనేమీ మాట్లాడను. చెడ్డ సంగీతమయితే దాన్ని మన సంభాషణలో ముంచెయ్యడం మన విధ్యుక్త ధర్మమంటాను' అన్నాడు డోరియన్.

'ఇది హెన్రీ అభిప్రాయాలలో ఒకటికదూ మిస్టర్ గ్రే? హెన్రీ ఉద్దేశాలు ఎప్పుడూ అతని స్నేహితులద్వారావింటూ ఉంటాను. అతని ఉద్దేశాలు తెలుసుకోవాలంటే అది తప్ప

మరో మూర్ఖం లేదు. కాని, చక్కని సంగీతమంటే నాకు అభిరుచి లేదని నీవు అనుకోకూడదు. సంగీతమంటే చెవికోసుకుంటాను ప్రాణిస్తాను కాని చక్కని సంగీతమంటే నాకు అదో విధమైన భయం నన్ను మరింత సంప్లావితం చేస్తుంది. నాలోని శోకాలు తీరుతాయి. నేను పియానో గాయకులను ప్రాణించేదాన్నంటే నమ్ము' అన్నది లేడీ హెన్రీ.

ఈ లోగా లార్డ్ హెన్రీ వచ్చాడు.

'ఆలస్యమైంది క్షమించాలి డోరియన్' అన్నాడు.

'నేనూ వెళ్ళాలి. డచెస్‌తో వస్తానని చెప్పాను. సెలవు మిస్టర్ గ్రే'- అంటూ లేడీ హెన్రీ సెలవుపుచ్చుకున్నది.

ఆమె వెళ్ళగానే లార్డ్ హెన్రీ తలుపుమూసి వచ్చాడు. గదినిండా అత్తరు పరిమళం పొగలా అలుముకున్నది. లార్డ్ హెన్రీ సిగరెట్ వెలిగించి సోఫాలో కూలబడ్డాడు.

'ఎండుగడ్డిలా పసుపురంగు జుట్టుగల స్త్రీని ఎన్నడూ పెళ్ళాడకు డోరియన్'- అన్నాడు లార్డ్ హెన్రీ.

'ఎందుచేత హెన్రీ?'

'వాళ్ళకు ఉద్రేకాలు ఎక్కువగా ఉంటాయి'

'కాని, అలాంటివాళ్ళంటే నాకు చాలా ఇష్టం.'

'అసలు పెళ్ళిచేసుకోకు డోరియన్. జీవితంలో అలసి పోయినప్పుడు పురుషులు పెళ్ళాడుతారు. ఔత్సుక్యంవల్ల స్త్రీలు పెళ్ళాడుతారు. ఇద్దరి ఆశలూ విఫలమవుతాయి.' అన్నాడు లార్డ్ హెన్రీ.

'నేనసలు పెళ్ళాడతాననుకోను హెన్రీ. నేనొక విపరీతమైన ప్రేమలో తగుల్కొన్నాను. విపరీతంగా ప్రేమిం

చిన ప్రేమికులకు వివాహం అసాధ్యం. ఇది నీ ప్రవచనా లలో ఒకటి కదూ! నీ ప్రవచనాలన్నీ ఆచరణలో పెట్టి నట్టే దీన్నికూడా ఆచరణలో పెడుతున్నాను' అన్నాడు డోరియన్.

లార్డ్ హెన్రీ కాసేపాగి 'నీవు ప్రేమిస్తున్నది ఎవరిని డోరియన్?' అని అడిగాడు.

'ఒక అభినేత్రిని' అన్నాడు డోరియన్ సిగ్గుచెందుతూ.

'ఇందులో పెద్దవిశేషం లేదు' అన్నాడు లార్డ్ హెన్రీ.

'నీవు ఆ అమ్మాయిని చూస్తే అలా అనవు హెన్రీ!'- అన్నాడు డోరియన్.

'ఎవరా అమ్మాయి?'

'ఆ అమ్మాయి పేరు సిబిల్ వేన్'

'ఆ పేరు ఎప్పుడూ వినలేదు'

'నీవే కాదు. ఆ పేరు ఎవరూ వినలేదు. ఒకరోజుకు తప్ప కుండా అందరూ ఆ పేరు వింటారు. ఆ అమ్మాయి గొప్ప ప్రతిభాశాలి.'

'అబ్బాయ్! నామాట విను. ప్రపంచంలో ఏ స్త్రీ కూడా ప్రతిభాశాలి కాదు. స్త్రీజాతి కేవలం అలంకారార్థం ఏర్పడిన జాతి. అంతే. వాళ్లుచెప్పే విషయాల్లో అర్థమేమీ ఉండదు. కాని, ఆ చెప్పింది కాస్తా ముచ్చటగా చెబుతారు. 'బుద్ధి' పై 'పదార్థం' యొక్క విజయానికి స్త్రీ జాతి ప్రాతి నిధ్యం వహిస్తుంది. నీతి నియమాలపై 'బుద్ధి' యొక్క విజ యానికి పురుషులు ప్రాతినిధ్యం వహిస్తారు.'

'హెన్రీ! ఇవేంమాటలు!'

'అబ్బాయ్! డోరియన్! నేను చెబుతున్నది నిజం. నేను ప్రస్తుతం స్త్రీలను పరిశీలించి పృథక్కరించి అవగాహన చేసుకోగలుగుతున్నాను. అంచాత నాకు స్త్రీల విషయం తెలీకపోవడమంటూ లేదు. పూర్వం నాకు ఈవిషయం అవ్యక్తంగా ఉండేది. ఇప్పుడలాలేదు. ఇంతా పరిశీలించిన తరువాత స్త్రీలలో రెండే రెండురకాల స్త్రీ లుంటారని నిశ్చయించుకున్నాను. నిర్మలంగా నిష్కపటంగా ఉండే స్త్రీలు ఒకరకం. రంగు పులుముకున్న స్త్రీలు మరోరకం. వీళ్ళను అర్థంచేసుకోడం కష్టం. మొదటిరకం స్త్రీలవల్ల చాలా లాభం ఉన్నది. నీకు గౌరవప్రతిష్ఠలు కావాలంటే వాళ్ళను నీతోపాటు డిన్నరుకు తీసుకెళ్ళు— చాలు. రెండోరకం స్త్రీలు చూపులకు చాలా ఆకర్షకంగా ఉంటారు. అయినా, వాళ్ళలోకూడా ఒక చిన్నదోషం ఉన్నది. కృత్రిమయౌవనాన్ని నటించడంకోసం ముఖాలకు రంగు పులుముకుంటారు. నలుగురితోనూ చక్కగా మాట్లాడడంకోసం మన ముసలమ్మలుకూడా ఇదేపని చేశారు. రంగూ, కులాసా, ఒకదానివెంట ఒకటి జోడుకట్టుకుని ఉండేవి. కాని, ఇప్పుడా రోజులన్నీ గతించాయి. స్త్రీ తన కుమార్తెకంటె పది సంవత్సరాలు చిన్నదానిలా కనుపించగలిగిందంటే చాలు— ఇహ ఆ స్త్రీకి అసంతృప్తి ఉండదు. మాటవరుసకు చెప్పాలంటే, లండన్‌లో మాట్లాడదగిన స్త్రీలు అయిదుగురే ఉన్నారు. అందులో ఇద్దరు సభ్యసమాజంలో ప్రవేశానికి అనర్హులు. సరే, ఇంతకూ నీవు ప్రతిభాశాలి అన్నావు —ఆ అమ్మాయిని గురించి చెప్పవూ? నీవు ఆ అమ్మాయిని ఎన్నాళ్ళనుంచి ఎరిగిఉన్నావు?'

'అబ్బ! హెన్రీ! నీ అభిప్రాయాలు నాబుర్ర బ్రద్దలు చేసేస్తున్నాయి.'

'ఆ విషయం పోనీ. ఆ అమ్మాయిని ఎన్నాళ్ళబట్టి ఎరిగిఉన్నావో చెప్పు'

'మూడు వారాలైంది,'

'ఎక్కడ కలుసుకున్నావు.'

'నీకంతా చెబుతాను హెన్రీ. కాని, నీవుమాత్రం నాపట్ల సానుభూతి కనపరచాలి. నన్ను సానుభూతితో అర్థం చేసుకోవాలి. అసలు ఇంతకూ దీనికంతా కారణం నిన్ను కలుసుకోడమే. నిన్ను కలుసుకోకుండా ఉంటే ఇలా తటస్థించి ఉండేదికాదు. నిన్ను కలుసుకున్న తరువాత నీవు నాలో ఒక తీవ్రమైన కోరిక రేకెత్తించావు. జీవితాన్ని గురించి ప్రతిదీ తెలుసుకోవలెననే తీవ్రవాంఛ నాలో చెలరేగింది. నిన్ను కలిసిన తరువాత చాలారోజుల వరకూ నాలో నరనరాలలో ఏదో తీవ్రవేదన ప్రకంపిస్తూ ఉండేది. ఏదో అశాంతి. ఏదో అసంతృప్తి. అర్థంకాని అవ్యక్తవేదన. పార్కులో కూచున్నా పికాడిల్లీలో తిరుగుతున్నా ఈ వేదన నన్ను నిలవనిచ్చేది కాదు. ఎందరెందరో వచ్చి పోతూఉండేవారు. అందరివంకా ఆశ్చర్యంతో చూచేవాణ్ని. 'వీళ్ళెవరు? వీళ్ళ జీవితాలు ఎలాటివి?' అనే వెర్రి ఆశ్చర్యంతోనూ ఉభిరతితోనూ అందరినీ గమనించేవాణ్ణి.కొందరు నాకు ఆకర్షకంగాకనుపించేవారు. కొందరు నన్నుభయావిష్టుణ్ణి చేసేవారు. వాతావరణమంతా ఒకఅద్భుతమైనవిషయంతో నిండినట్టుతోచేది.నాఇంద్రియాలు కొత్తకొత్త కోరికల మొగ్గలు తొడిగేవి. ఇలా ఉండగా ఒకనాటి సాయం

త్రం... ఏడుగంటలవుతుంది. జీవితంలో ఏదో కొత్తరుచిని అను భవిద్దామనే ఆసక్తితో బయలుదేరాను. భయంకరమైన ఈ లండన్ మహానగరం - లక్షలాది ప్రజలతో - లక్షలాది పాపాత్ములతో పాపాలతో - నీ వన్నట్టు అందమైన అద్భుతమైన పాపాలతో, తాపాలతో నిండిన ఈ మహానగరగర్భంలో నా కోసం ఏదో దాగి ఉన్నదనిపించింది. ఆ గర్భంలోకి నడిచి వెడదామనుకున్నాను. లక్షల ఊహలు నాలో తీగలు సాగాయి. ఈ ప్రయాణంలోని ప్రమాదమే సూదంటురాయిలా నన్ను ఆకర్షించింది. మనం తొలిగా కలుసుకుని విందారగించిననాటి చల్లని సాయంత్రం నీవు చెప్పిన మాటలు నాస్మృతిపథంలో తొలకరించాయి. ఆనాటి సాయంత్రం సౌందర్యాన్వేషణను గురించి చెప్పావు. సౌందర్యాన్వేషణే జీవనరహస్యమని చెప్పావు. ఆ పలుకులు జ్ఞాపకంవచ్చాయి. నేను దేనికోసం వెడుతున్నానో నాకు తెలీదు. దేన్ని వాంఛించి వెడుతున్నానో నాకే తెలీదు. కాని దోవతప్పిన కుర్రాడిలాగా వీధుల్లో నడుస్తూ వెడుతున్నాను. సందులూ గొందులూ వీధులూదాటి వెడుతున్నాను. ఎనిమిదిన్నరయ్యేసరికి ఒక చిన్న నాటకశాల దగ్గరికి వచ్చాను. ఆ నాటకశాల చాలా చిన్నది. చౌకబారుది. గాస్‌లైట్లు వెలుగుతున్నాయి. రంగులు దట్టంగా పులిమిన ఎడ్వర్‌టైజ్‌మెంట్లు వ్రేలాడుతున్నాయి. అసహ్యాంగా ఉన్న ఒక జ్యూ గేటు దగ్గర నిల్చుని ఉన్నాడు.

నేను నా జీవితంలో ఎన్నడూ ఎరుగని ఒక విచిత్రమైన వెస్ట్‌కోట్ వేసుకున్నాడు. ఒక చౌకరకంచుట్ట కాలుస్తూ నిల్చున్నాడు. నన్ను చూడగానే ఎంతో వినయవిధేయతలతో

టోపీతీసి, 'దయచేస్తారా అయ్యగారూ!' అన్నాడు. అతన్ని చూడగానే అతనిలో నాకేదో విచిత్రం కనుపించింది హెన్రీ! వాడిలో అదో గమ్మత్తుంది. నే నిలా చెబుతూంటే నీకు హాస్యంగా ఉంటుంది - నాకు తెలుసు. అయినా - విను. వాడలా అడగ్గానే లోపలికివెళ్లి ఒక 'గినియా' ఇచ్చి స్టేజ్ బాక్స్‌లో కూచున్నాను. ఇలా ఎందుకుచేశానో ఈనాటి వరకూ అర్థం చేసుకోలేకుండా ఉన్నాను. కాని, ఇలా చేసి ఉండకపోతే నా జీవితంలోని గొప్ప ప్రణయాన్ని నేను పొంది ఉండలేకపోయేవాణ్ని. నవ్వుతున్నావుకదూ? కానీ నవ్వు!'

'నేను నవ్వడంలేదు డోరియన్. నవ్వినా నిన్నుచూచి నవ్వడంలేదు. కాని, దీన్ని నీ జీవితానికల్లా గొప్ప ప్రణయమని అనడానికి వీల్లేదు. ఇది నీ జీవితానికి తొలిప్రణయం అను. అది నిజం. జీవితంలో నీలాంటివ్యక్తిని ఎప్పుడూ ప్రేమిస్తూనేఉంటారు. నీవు ఎప్పుడూ 'ప్రేమ'ను ప్రేమిస్తూనే ఉంటావు. జీవితంలో మరే పనీ లేనివారికి ప్రేమ ఒక గొప్పపని. ఒక దేశంలోని పనిపాటూలేని వర్గాలవల్ల కలిగే ప్రయోజనం అదొక్కటే. భయపడకు. ఎన్నో అద్భుతానుభవాలు ఇక ముందు నీ కోసం కాచుకుని ఉన్నాయి. ఇది వట్టి తొలకరి మాత్రమే'.

'నా స్వభావం అంత లోతులేనిదనా నీ ఉద్దేశం?' అన్నాడు డోరియన్ కోపంతో.

'అదికాదు. నీ స్వభావం చాలా అగాధమైందని నా ఉద్దేశ్యం', అన్నాడు లార్డ్ హెన్రీ.

'అంటే నీ ఉద్దేశం?'

'అబ్బాయ్! ఒక విషయం చెప్పనా? జీవితంలో ఒక్కసారి మాత్రమే ప్రేమించేవారు నిజంగా లోతయిన స్వభావంగలవాళ్ళు కాదు. ప్రేమకు ఆజన్మాంతం కట్టుబడి ఉండాలనీ ద్రోహం చెయ్యకూడదనీ అంటారు. అది నా ఉద్దేశంలో అనవాయితీగా వచ్చిన ఒక అలవాటు మాత్రమే. లేకపోతే దానికి కారణం వాళ్ళ భావదారిద్ర్యంకూడా కావచ్చు. మేధోజీవితానికి క్రమం ఎలాంటిదో ఉద్వేగజీవితానికి విశ్వాసం అలాంటిది. అంటే వైఫల్యాలను ఒప్పుకోవడమన్నమాట. అంతకంటె మరేం కాదు. విశ్వాసం! ఈమాటకు అర్థమేమిటో ఒక రోజుకు ఆలోచించి తేల్చుకుంటాను! సొంతం చేసుకోవాలనే ఆకాంక్ష దీనిలో ఇమిడిఉంది. ఇతరులు ఏరుకుని తీసుకుంటారనే భయం లేకపోతే మనం ఎన్నో విలువైన వస్తువులను ఎంతో చులకనగా విసిరేస్తాం. సరే, ఇంతకూ నీకథ కానీ'.

'సరే. నేను వెళ్లికూచున్నాను. బాక్స్ చాలాచిన్నది. ఇరుకుగా అసహ్యంగా ఉంది. ఎదురుగా స్టేజి కనుపిస్తోంది. అసహ్యంగా ఏవో పిచ్చిబొమ్మలు గీసిన ఒక తెర వ్రేలాడుతూ ఉంది. తెరప్రక్కనుంచి హాలంతా చూచాను. హాలంతా అసహ్యంగా చిందరవందరగా మురికిగా ఉంది. హాలునిండా ఏవేవో పిచ్చిపిచ్చి బొమ్మలు. గేలరీ నేల పూర్తిగా నిండింది. స్టాల్సుమాత్రం ఖాళీగా ఉన్నాయి. డ్రెస్ సర్కిలులో ఒక్క పురుగుకూడా కనుపించడంలేదు. ఆరంజ్ క్రష్‌లూ. జింజర్ బీర్లూ పట్టుకుని ఆడవాళ్లు అటూఇటూ తిరుగుతున్నారు. బాదం పప్పులు నములుతున్నారు. అక్కడ కూచున్నంతసేపూ నాకు ఇదేమిట్రా ఇక్కడి కెందుకొచ్చాననిపించింది.'

'బ్రిటిష్ నాటకరంగం బాగా ఉజ్వలంగా ఉన్న రోజుల్లోలాగా ఉందనుకుంటాను.'

'ఇంతకూ నాటకం ఏమిటనుకున్నావ్ హెన్రీ?'

'మొద్దబ్బాయి, చెవిటి అమాయకుడు - ఏదో అలా టైమైఉంటుంది. మన తాతలకూ తండ్రులకూ ఇలాటినాటకాలంటే మహాఇష్టంగా ఉండేది. డోరియన్, నాకు వయసువచ్చేకొద్దీ- మన తాతలకు తగినంత మంచిగా కనుపించిం, మనకు తగినంత మంచిగా కనుపించడంలేదనిపిస్తుంది. కళల్లోనూ, రాజకీయాల్లోనూ ఇంతే.'

'కాని ఈ నాటకంమాత్రం మంచిదే హెన్రీ. ఇది 'రోమియో- జూలియట్' నాటకం. ఇలాటి మురికిగుయ్యారంలో షేక్స్పియర్ నాటకం చూడాలంటే నా కదోలా అనిపించింది. అయినా, అదోవిధంగా గమ్మత్తుగానే ఉంది. మొదటి రంగం మొదలెట్టేవరకయినా చూచితీరాలని నిశ్చయించుకున్నాను.

తెర లేచింది :

మొదటి రంగం మొదలెట్టారు. ఆర్కెస్ట్రా భయంకరంగా ఉంది. చెవులు తూట్లుపడిపోతున్నాయి. రోమియోవేషం వేసిన వ్యక్తి కొంచెం వయస్సుమళ్ళినవాడు. పెద్ద పీపాలాగా ఉన్నాడు. మెర్కూషియో కూడా బాగాలేడు. తన ఇష్టం వచ్చినట్టు గంతులేస్తున్నాడు. నేలజనంచప్పట్లకు వంతపాడుతున్నాడు. ఇద్దరి వేషాలు అక్కడి చౌకబారు సీనరీలాగానే కంటికి కొట్టవచ్చినట్టుగా ఉన్నాయి. కాని జూలియట్‌మాత్రం ఎలా ఉందనుకున్నావు! హెన్రీ, ఒక్కసారి ఊహించుకో-

ఒకపిల్ల, పదిహేడేళ్ళు ఉంటాయేమో ఉండవో—చిన్న పూమొగ్గ లాంటి చిన్ని మోము— జడలల్లిన గోధుమవన్నె జుట్టు — ఊదా రంగులో ఉజ్జ్వలమైన ఉద్వేగాలూరుతున్న జలలు కన్నులు— గులాబీరేకులు పెదవులు! నేను నా జీవితంలో నా కన్నులపండుగగా చూచిన అందమైన వస్తువు అదొక్కటే హెన్రీ. ఒకప్పుడు నీవు ఒక మాటన్నావు జ్ఞాపకం ఉందా? కరుణ నిన్ను కదలించలేదన్నావు. కాని ఆ అమ్మాయిఅందం— ఆ అందం ఒక్కటే చాలు నీ కళ్లు కన్నీటి జలలుగా కరిగించ డానికి హెన్రీ! ఆ అమ్మాయిని చూచినప్పుడు నా కలాగే కన్నీటితెరలు కమ్మాయి. ఆ కన్నీటి తెరలలోనుంచి ఆ అమ్మాయిని చూడలేకపోయాను. ఇక ఆ అమ్మాయి కంఠం ఎలా ఉందనుకున్నావు! అలాంటి కంఠం నే నెన్నడూ నా జన్మలో వినలేను. మొదట్లో ఎంతో తగ్గుస్థాయిలో మొదలెట్టింది. మెల్లగా చల్లగా మృదువుగా మొదలెట్టింది. ఆ పాట ఒక్కరికి మాత్రమే వినిపిస్తున్నట్టుగా ఉంది. తరువాత కొంచెం పెద్దదయింది. దూరంనుంచి వినవస్తున్న వేణునాదంలా వినిపిస్తూఉంది. రోమియో జూలియట్‌లు వనంలో కలుసుకునే రంగంలో ఆ కంఠస్వరంలో, ఉషోవేలపక్షుల కిలకిలా రావాల్లోని కంపితానందమంతా నిండుకున్నది.

తరువాత కొన్నికొన్ని క్షణాలలో వయొలిన్ తీగల్లాగా ఉద్విగ్నత పొందింది ఒక కంఠస్వరం మనిషిని ఎలా కదిలిస్తుందో నీకు తెలుసుకదా! నేను నా జీవితంలో రెండే రెండు కంఠస్వరాలు మరువలేను — నీ కంఠస్వరమూ — సిబిల్‌వేన్ కంఠస్వరమూ.

నేను కళ్ళు మూసుకున్నప్పుడు ఈ రెండు కంఠస్వరాలూ వినిపిస్తుంటాయి. ఒక్కొక్క కంఠస్వరం ఒక్కొక విచిత్ర విశేషాన్ని వినిపిస్తుంది. ఏ కంఠస్వరాన్ని అనుసరించాలో నాకు బోధపడదు. నే నా అమ్మాయిని ఎందుకు ప్రేమించ కూడదు హెన్రీ! తప్పకుండా ప్రేమించితీరుతాను. ఆ అమ్మాయే నా జీవితమంతా. ప్రతిరాత్రీ ఆ అమ్మాయిని నాటకంలో చూడడానికి వెడతాను. ఒక రాత్రి ఆ అమ్మాయి రోసలిండ్‌గా కనుపిస్తుంది. మరోరాత్రి ఇమోజెన్‌గా దర్శనమిస్తుంది. ప్రియుని అధరాల్లోని మధుర విషాన్ని పీల్చుకుని ఇటాలియన్ సమాధిలోని నిశ్శబ్ద నిశీథంలో ఆ అమ్మాయి శాశ్వతంగా పవళించడం చూచాను. ఒక ముచ్చటైన కుర్రవాని వేషంలో ఆర్‌డెన్ అడవుల్లోగుండా నడిచి వెళ్ళడం చూచాను. ఆ అమ్మాయికి పిచ్చెత్తింది. పిచ్చిదై ఒక పాపాత్ముడైన రాజు సమక్షంలోకి వచ్చి నిల్చుని ఆ రాజు పాపం పండిందని శపించడం విన్నాను. ఆ అమ్మాయి అమాయకురాలు. ఏ పాపం ఎరుగదు. కాని అసూయయొక్క రాక్షసహస్తాలు స్వరనాళంలా లలితమైన ఆ అమ్మాయి గొంతుకను నులిమేశాయి. ప్రతియుగంలో ప్రతి పాత్రలో ప్రతిఆహార్యంలోనూ ఆ అమ్మాయినిచూచాను. సాధారణ స్త్రీలు మన ఊహను ఆకర్షించరు. వాళ్లు వాళ్లు పుట్టి పెరిగిన శతాబ్దానికి పరిమితమై ఉంటారు. ఎలాటి ఆకర్షణ కానీ వాళ్ళను పునర్నవం చెయ్యదు. వాళ్ళ మనస్సులు అర్థమైపోతాయి. వాళ్ళను చూడగానే ఇట్టే సులువుగా తెలిసిపోతారు. వాళ్ళలో రహస్యం కాని వైచిత్ర్యంకాని ఏమీ లేదు. పగలు పార్కులో కనుపిస్తారు. మధ్యాహ్నం టీపార్టీల్లో

కనుపిస్తారు. ఎప్పుడూ వాళ్ళ ముఖాల్లో ఒకేరకం చిరునవ్వు, ఒకే తరహా. వాళ్ళలో దాగిన అందమేమీ లేదు. పట్టపగల్లే బట్టబయలుగా కనుపిస్తారు. కాని ఒక అభినేత్రి!- ఆ అభినేత్రి మాత్రం అలాకాదు. వీళ్ళకూ ఆవిడకూ ఎంత తేడా ఉంది! హెన్రీ! ప్రేమించదగినది ఒక్క నటి మాత్రమేనని ఎందుకనవు చెప్పూ?'

'నేను చాలామంది నటీమణులను ప్రేమించాను. గనుక ఆమాట అనలేను డోరియన్!' అన్నాడు లార్డ్ హెన్రీ.

'నీవు చాలామంది నటీమణులను ప్రేమించి ఉండవచ్చు కాని, వాళ్ళు నెరిసినజుట్టుకు రంగు పూసుకున్న నటీమణులూ, మాసినముఖాలకు రంగు పులుముకున్న నటీమణులూ అయి ఉంటారు.'

'జుట్టుకు రంగు పూసుకున్న స్త్రీలనూ, ముఖాలకు రంగు పులుముకున్న స్త్రీలనూ అంత తీసెయ్యకు డోరియన్. వాళ్ళలోకూడా ఒక్కోసారి అద్భుతమైన ఆకర్షణకనుపిస్తుంది' అన్నాడు లార్డ్ హెన్రీ.

'నీకు సిబిల్ వేన్ సంగతి ఎందుకు చెప్పానా అని ఇప్పుడు విచారపడుతున్నాను.'

'నీవు నాకు చెప్పకుండా ఉండగలిగేవాడివికాదు డోరియన్. నీ జీవితమంతా నీవేపనిచేసినా నాకు తప్పకుండా చెబుతూనేఉంటావు'.

'అవును ఆ మాట నిజమే. నే నే పనిచేసినా నీకు చెప్పకుండా ఉండలేను. నన్ను నీ వలా ఆకట్టుకున్నావు. నీ విచిత్రమైన ప్రభావం నామీద ఉన్నది. నే నెప్పుడైనా ఒక

నేరం చేస్తే తప్పకుండా వచ్చి నీకు చెప్పేస్తాను. అప్పుడు నీవు నన్ను అర్థం చేసుకుంటావనుకుంటాను.'

'అందరూ నీవంటే ఎంతో ఇష్టపడతారు. కాని ఎన్నడూ నేరాలు చెయ్యకు డోరియన్. మంచి కుర్రాడివి కాని- కొంచె ఆ అగ్గిపెట్టె ఇలా అందించు. థాంక్స్!-ఇంతకూ సిబిల్ వేన్‌తో నీ సంబంధాలేమిటో వివరంగా చెప్పు.'

డోరియన్ గ్రే శోకతొక్కిన తాచులా లేచి నిల్చున్నాడు. అతని చెక్కిళ్లు ఎరుపెక్కాయి. కళ్లు కాలిపోతున్నాయి.

'హెన్రీ! అలా మాట్లాడకు. సిబిల్ వేన్ పరమపవిత్రురాలు! అంటరాని అగ్నికీల!'- అన్నాడు.

'పవిత్రమైన వస్తువులే స్పర్శార్హాలు డోరియన్. ఇంతకూ నేనలా అన్నందుకు నీవెందుకు అలా కలవరపడ్డావు? ఏరోజో ఒకరోజు ఆమె నీది కాకపోదు. మనల్ని మనం మోసం చేసుకోడంతో మన ప్రేమ ప్రారంభిస్తుంది. ఇతరులను మోసం చెయ్యడంతో అంతమవుతుంది. దీన్నే ప్రపంచం 'ప్రణయం' అనే పేరుతో పిలుస్తూ ఉంటుంది. ఇంతకూ ఆ అమ్మాయితో నీకు పరిచయం ఉన్నదనుకుంటాను.'

'అవును. ఆ అమ్మాయి నాకు తెలిసినమాట నిజమే. నేను నాటకానికి వెళ్లిన మొట్టమొదటి రాత్రి నాటకం ముగిసిన వెంటనే ఆ జ్యూ నా దగ్గరికి వచ్చాడు. నన్ను లోపలికి తీసుకుని వెళ్ళి ఆ అమ్మాయికి పరిచయం చేస్తానని అడిగాడు. నాకు చెప్పరాని కోపం వచ్చింది. ఆ కోపంలో ఏదేదో మాట్లాడాను. జూలియట్ చనిపోయి వందల సంవత్సరాలైందని వెరో

నాలో పాలరాతి సమాధిలో నిద్రిస్తూఉందనీ అన్నాను. అతను నేను మాట్లాడేదేమిటో అర్థంకాక నావంక విస్తుపోయి చూచాడు. నేను కొంచెం షాంపేన్ ఎక్కువగా పుచ్చుకున్నా ననుకున్నాడు.'

'అతనలా అనుకోవడంలో ఆశ్చర్యం లేదు.'

'తరువాత అతను నన్ను నేను న్యూస్ పేపర్లకు ఏమైనా వ్రాస్తూ ఉంటానేమోనని అడిగాడు. నేను న్యూస్ పేపర్లు చదివినపాపానకూడా పోలేదన్నాను. నే నిలా చెప్పేసరికి అతను పాపం, దిగాలుపడిపోయాడు. తరువాత నాటకాల విమర్శకులందరూ అతనిమీద కుట్రపన్నారనీ, అతనికి అనుకూలంగా లేరనీ చెప్పాడు. వాళ్ళలో ప్రతిఒక్కణ్నీ డబ్బిచ్చి కొనుక్కుంటే కాని సరిగా వ్రాయరని చెప్పాడు.'

'అతను చెప్పింది నిజమే. కాని ఆ విమర్శకుల ముఖాలను బట్టిచూస్తే, వాళ్ళలో చాలామంది చౌకలోనే దొరికేట్టు కనుపిస్తారు.'

'సరే, ఇంతకూ వాళ్ళనుకొనే శక్తి తనకి లేదనుకుని ఉంటాడు. ఇలా కాసేపు మేమిద్దరం మాట్లాడుకున్నాం. అప్పటికి థియేటర్‌లో లైట్లుకూడా ఆర్పేస్తున్నారు. అతను నాకు కాల్చుమని కొన్ని చుట్టలిచ్చాడు. ఆ చుట్టలు కాలిస్తే చాలా బావుంటాయన్నాడు. కాని నేను నిరాకరించాను. ఇలా ఆ రాత్రి గడిచింది. మళ్ళీ మరుసటిరోజు రాత్రి నేను నాటకానికి వెళ్ళాను. పోయినరాత్రి కూచున్న స్థలంలోనే కూచున్నాను. నన్ను చూడగానే అతను మళ్ళీ వినయంగా తలవంచాడు. నేను గొప్ప కళాపోషకుణ్ణన్నాడు. వాణ్ణిచూస్తే

నాకు చెప్పరానంత అసహ్యం వేసేది. కాని వాడు షేక్స్పియ రంటే పడిచచ్చేవాడు. ఒకసారైతే సగర్వంగా తను అయిదు సార్లు దివాలాతీశానన్నాడు. అందుకు కారణం ఈ "గాయకుడే"ననీ చెప్పాడు. షేక్స్పియర్‌ని గాయకుడని పిలవడం వాడికి అదో ముచ్చట. అదొక పెద్ద విశేషమనుకునేవాడు.'

'నిజంగా కూడా అదొక గొప్పవిశేషమే డోరియన్. జీవితంలో గద్యంమీద పెట్టుబడి పెట్టి దివాలాఎత్తినవాళ్లు చాలామంది ఉంటారు. కాని కవిత్వంమీద పెట్టుబడి పెట్టి నాశనమైపోయారంటే అది గొప్ప విషయమే. ఇంతకూ నీవు సిబిల్ వేన్‌తో ఎప్పుడు మాట్లాడావు?'

'మూడోనాటి రాత్రి మాట్లాడాను. ఆనాటి రాత్రి ఆమె రోసలిండ్ వేషం వేస్తోంది. నేనిక ఆమెను చూడకుండా ఉండలేకపోయాను. ఆమె నటిస్తూవుంటే కొన్నిపూలు విసిరే శాను. ఆమె నా వంక చూచింది. చూచిందో లేదో - చూచిం దని అనుకున్నాను వృద్ధుడైన జ్యూ ఆరోజు నేను లోపలికివచ్చి తీరాల్సిందేనని పట్టుబట్టాడు. నన్ను వదిలేట్టు లేడు. సరేనని వెళ్ళాను. ఇంత ప్రేమిస్తూ ఆమెతో పరిచయంచేసుకోవాలని నేను కోరకపోవడం విచిత్రంగా లేదూ?'

'అందులో విచిత్రమేమీలేదు?'

'అదేమిటి హెన్రీ?'

'ఆ విషయం తరువాత ఎప్పుడైనా చెబుతాను. ముందు ఆ అమ్మాయి సంగతి చెప్పు.

'సిబిల్ విషయం చెప్పనా! నేను లోపలికి వెళ్ళాను. సిబిల్‌ను చూచాను సిబిల్! ఓహ్! ఎంత ముచ్చటగా ఉంది.

ఎంతసిగ్గు! ఎంత నిరాడంబరం! ఒక పసిపిల్లలా ఉంది. ఆమెలో ఏదో పసిబిడ్డలోని సౌందర్యంలాంటి సౌందర్యం ఉంది. నేను ఆమె నటనను గురించి ఏమనుకున్నానో చెబుతూఉంటే ఆమెకళ్ళు అద్భుతమైన ఆశ్చర్యంతో అరవిందాల్లాగా విశాల వికసితాలై నాయి. ఆమెశక్తి ఆమెకే తెలీనంత అమాయకంగా నామాట లు వింటూ నిల్చుంది. మేమిరువురమూ అదోవిధమైన తన్మయావస్థలోనే ఉన్నాము! మేమిద్దరం ఒకరివంక ఒకరం పసిపిల్లల్లాగా చూచుకుంటూ నిల్చున్నాం. వృద్ధుడైన జ్యూ గ్రీన్‌హామ్ వాకిటిదగ్గర నిల్చుని మా ఇద్దరినీ గురించి పెద్ద ఉపన్యాసాలు దంచుతున్నాడు. నేను అవసరం లేదంటున్నా అతను నన్ను 'మై లార్డ్!'అని పిలవకుండా వదిలిపెట్టడంలేదు. నేను లార్డ్‌ను కానని సిబిల్‌తో చెప్పి ఒప్పించడానికి నా తాతలు దిగొచ్చారు. అయినా ఆమె నావంకచూచి 'నీవు ఒక రాకుమారుడిలా కనుపిస్తావు. నిన్ను అందమైన చిన్నారి రాకుమారుడా అని పిలుస్తాను' అన్నది.''

'అమ్మ పిల్లా! అయితే, సిబిల్‌కి అభినందనలు ఎలా అందించాలో చాలా చక్కగా తెలుసన్నమాట!'

'నీకు ఆ అమ్మాయి మనస్తత్వం అర్థంకాదు హెన్రీ! ఆ అమ్మాయి నన్నుకూడా నాటకంలో ఒకపాత్రనిచూచినట్టు చూచింది. అంతే. ఆ అమ్మాయికి జీవితాన్ని గురించి ఏమీ తెలీదు. తల్లిచాటు పిల్ల. తల్లితోపాటు ఉంటూ ఉంటుంది. అంతే. ఆ తల్లి ఒక ముసలిది. వాడిపోయి అలసినట్టుగా కనుపిస్తుంది. మొదటిరాత్రి ఆడిన నాటకంలో లేడీ కాప్‌లెట్

పాత్ర ధరించింది. ఒకప్పుడు మంచిరోజులు చూసిన మనిషిలా కనుపిస్తుంది.'

'అలాంటివాళ్లు ఎలాఉంటారో నాకు తెలుసు. వాళ్ళను చూస్తే నాకు రోత' — అన్నాడు లార్డ్ హెన్రీ తన వ్రేలి ఉంగరాలవంక చూచుకుంటూ.

'ఆ జ్యూ ఆమె కథ నాకు చెప్పబోయాడు. కాని నేను అవసరంలేదన్నాను'

'మంచిపని చేశావు. ఇతరుల విషాదగాథల్లో ఎప్పుడూ ఏదో నైచ్యం దాగిఉంటుంది.'

'అయినా ఆ విషయం నా కెందుకు? నాకు కావల సిందల్లా సిబిల్ విషయమే. ఆమె ఏ తల్లి కడుపున పుడితే ఏమిటి? ఆమె తల్లి ఎవరైతేనేమిటి? సిబిల్ ఆపాద మస్తకం ఒక దేవతాస్వరూపం. ఇహలోకం అంటని దివ్యదీప్తి. నా జీవితంలో ప్రతిరాత్రీ ఆమెనటన చూడడానికి వెడతాను. ప్రతిరాత్రీ ఆమె నాకు నవనవోన్మేషంగా కనుపిస్తుంది.'

'ఇంతకూ నీవు రోజూ నాతో భోజనానికి రాకపోవ డానికి కారణం అదన్నమాట. పూర్వం నేను లేనిదే రాత్రుళ్లు భోజనం చేసేవాడివికాదు. ఇన్నాళ్ళబట్టి ఎందుకు రావడం లేదో అనుకున్నాను. ఏదో ప్రణయకలాపంలో మునిగిఉంటా వనుకున్నాను. అలాగేఉన్నావు. కాని ఈ ప్రణయకలాపం మాత్రం నేను అనుకున్న ప్రణయకలాపంకాదు.'

'హెన్రీ! అదేమిటి అలాఅంటావు? ప్రతినిత్యం ఉద యానో, సాయంత్రానో నీతోకలిసి భోజనానికి వస్తూనే ఉన్నాను. నీతోకలిసి చాలాసార్లు ఒపెరాకుకూడా వచ్చాను'

అన్నాడు డోరియన్, ఆశ్చర్యంతో విప్పారిన నీలాలకళ్ళతో.

'నీ వెప్పుడూ చాలా ఆలస్యంగా వస్తున్నావు'

'సరే, ఏమైనా అనుకో. నేను సిబిల్ నటన చూడడానికి వెళ్ళకుండా ఉండలేను. ఆమె నటించేది ఒక్క రంగమే కావచ్చు కాని, ఆ ఒక్క రంగమైనా చూడకుండా ఉండలేను. ఆమె దర్శనం కోసం నా హృదయం దహించుకుపోతుంది. చిన్నారి చిన్ని దంతపు బొమ్మలాంటి ఆ పిల్లదాని శరీరంలో దాగిన అద్భుతమైన ఆత్మను తలుచుకున్నప్పుడు నా హృదయం భయంతో గగుర్పొడుస్తుంది.'

'ఇవాళ రాత్రి నీవు నాతో కలిసి భోజనానికి రాగలవనుకుంటాను డోరియన్ - రాలేవా!'

లేదన్నట్లు తల ఊపాడు డోరియన్.

'ఇవాళ రాత్రి ఆ అమ్మాయి ఇమోజెన్ వేషంలో ఉంటుంది. రేపు రాత్రి జూలియట్ వేస్తుంది' అన్నాడు డోరియన్.

'మరి ఆమె సిబిల్ వేన్ ఎప్పుడవుతుంది?'

'ఎన్నటికీ కాదు.'

'కాబట్టి అభినందనలు.'

'నీ వెంత భయంకరమైన వ్యక్తివి హెన్రీ! నీవు ఆ అమ్మాయిని ఏ మాత్రం అర్థంచేసుకోలేకుండా ఉన్నావు. ప్రపంచంలోని మహానాయికలందరూ ఆ అమ్మాయి ఒక్కతెలో ఉన్నారు. ఆ అమ్మాయి ఒక్కతే ఒక వ్యక్తిమాత్రమే కాదు. అంతకంటె అధికమైంది.

నే నిలా చెబుతూ ఉంటే నీవు నవ్వుతావు - అయినా ఒక విషయం చెబుతున్నాను, విను. ఆ అమ్మాయిలో గొప్ప

ప్రతిభఉంది. ఆమెను నేను ప్రేమిస్తున్నాను. ఆమెకూడా నన్ను ప్రేమించేలా చేసుకోవాలి. హెన్రీ, నీకు జీవితంలో విరహాస్త్రాలన్నీ తెలుసు. సిబిల్ వేన్ నన్ను ప్రేమించేటట్టు ఎలా ఆకర్షించాలో చెప్పు. ఆ అమ్మాయి ప్రేమను చూరగొనే మార్గం చెప్పు. రోమియో నన్ను చూచి అసూయపడేలా చెయ్యాలని కోరుతున్నాను. ప్రపంచంలోని మృతప్రేమికులందరూ మానవ్వులు విని తలలువాల్చుకోవాలి. విసుగుపడాలి మా ప్రేమోద్వేగపు ఒక్క చిన్న నిశ్వాస ఆ మృతప్రేమికులు స్పృశించి నిదురించే సమాధులమృత్తికను కదిలించి చైతన్యంలోకి మేలుకొల్పాలి. వాళ్ళభస్మంలో వేదనాచలనం కలిగించాలి. హెన్రీ, ఏం చెప్పను? ఆ అమ్మాయిని ఎలా ప్రేమిస్తున్నానో ఎలా ఆరాధిస్తున్నానో ఏం చెప్పను?!

ఇలా ఉద్విగ్నుడై మాట్లాడుతున్నంతసేపూ డోరియన్ గదిలో అటూఇటూ తిరుగుతూనే ఉన్నాడు. ఎర్రని జ్వరచ్ఛాయలు అతని చెక్కిళ్ళపై జ్వలిస్తూ కనుపిస్తున్నవి. అతని ఉద్వేగం ఇంతా అంతా అని చెప్పడానికి వీల్లేదు.

ఒకవిధమైన ఔత్సుక్యంతో అతన్ని పరిశీలిస్తూ కూచున్నాడు లార్డ్ హెన్రీ. బేసిల్ హాల్‌వర్డ్ స్టూడియోలో ఆనాడు తను కలుసుకున్న ఆ కుర్రాడికీ ఈ కుర్రాడికీ ఎంత భేదం! ఎంతమార్పు! అప్పుడెంత సిగ్గుతోనూ భయంతోనూ పసివాడులా ఉండేవాడు! ఇప్పుడెంత మారిపోయాడు! ఒక పుష్పంలా అతని స్వభావం విప్పారుకున్నది. ఎర్రని జ్వాలాకుసుమాలు కుసుమించింది. తన అంతఃపురందాటి వెలుపల అడుగు

పెట్టింది. అతని అంతరాత్మను కలుసుకోడానికి వాంఛ ఎదురు కొలువచ్చింది.

'ఇంతకూ నీ వేం చెయ్యదలచుకున్నావ్ డోరియన్?' అని అడిగాడు లార్డ్ హెన్రీ.

'నీవూ, బేసిల్ ఒకరాత్రి నాతోవచ్చి ఆ అమ్మాయి నటించడం చూడాలి. ఆ అమ్మాయి సరిగా నటించదని నాకేమాత్రం అనుమానంకాని భయంకాని లేదు. మీరు తప్పకుండా ఆ అమ్మాయి ప్రతిభ ఒప్పుకుని తీరుతారు. ప్రస్తుతం ఆ అమ్మాయి ఆ జ్యూ అధీనంలో ఉంటోంది. తరువాత అతని చేతుల్లో నుంచి ఆమెను విడిపిద్దాం. మూడు సంవత్సరాలు అతని కంపెనీలో నటించాలని కాంట్రాక్టు ఉంది. అది రద్దు చెయ్యడంకోసం నేను కొంతధనం అతనికిఇచ్చుకోవలసి ఉంటుంది. ఆ ధనమిచ్చి అంతా పరిష్కారం చేసుకున్న తరువాత నేను వెస్టెండ్ థియేటర్ అద్దెకు తీసుకుని ఆ అమ్మాయిని సక్రమ పద్ధతిలో లోకానికి గొప్ప నటీమణిగా ప్రదర్శిస్తాను. అప్పుడా అమ్మాయి నన్ను వెర్రెత్తించినట్టే లోకాన్నంతా వెర్రెత్తిస్తుంది."

'ఇది అయ్యేపని కాదబ్బాయ్!'

'నీ ఎలా అనుకోకు. ఆ అమ్మాయి తప్పకుండా లోకాన్నంతా ముగ్ధంచేసితీరుతుంది. ఆ అమ్మాయిలో ఒక్క కళావైదగ్ధ్యమే కాదు - చక్కనిరూపం కూడా ఉంది. నీవు అనేకసార్లు నాతో ఒక విషయం చెప్పావు. ఒక యుగాన్ని కదిలించి నడిపించేది గొప్ప వ్యక్తులు కాని నియమాలూ సూత్రాలూ కాదన్నావు.'

'సరే. మనం ఏరోజు రాత్రి వెడదామంటావ్?

'ఉండు చెబుతాను. ఇవాళ మంగళవారం కదూ ? అవుతే, రేపు వెళదాం. రేపు ఆ అమ్మాయి జూలియట్ వేషం వేస్తుంది'

'సరే. ఎనిమిది గంటలకు తయారుగా ఉండు. నేను బేసిల్‌ను కూడా తీసుకొనివస్తాను.'

'ఎనిమిది గంటలకు కాదు హెన్రీ, మనం ఆరున్నరకే అక్కడ ఉండాలి. రోమియోను ఆమె కలుసుకునే తొలిరంగం లోనే మనం ఆమెను చూడాలి.'

'ఆరున్నర ! - భలే టైం పెట్టావయ్యా ! ఆ సమయం లో బైటికి రావడం ఇంగ్లీషునవల చదివినంత గొడవగా ఉంటుంది. ఏడుగంటలయ్యేసరికి వస్తాను. పెద్దమనిషి ఎవడూ ఏడుగంటలకు మునుపే భోజనం చెయ్యడు. ఇంతకూ ఈ విష యం నీవు బేసిల్‌తో చెబుతావా ? లేక నేనొక ఉత్తరం ముక్క రాసిపడెయ్యనా ?'

'బేసిల్ ! పాపం ! ఇప్పటికి అతన్ని చూచి వారంరోజులు కావస్తూంది. అతన్ని ఒక్క మాటయినా చూచి రాకపోవడం నిజంగా ఎంతఘోరం! తను స్వయంగా చక్కని ఫ్రేముకట్టి నాబొమ్మ పంపించాడు. నాకంటె ఒకనెల చిన్నదైనందుకు నా కా బొమ్మనుచూస్తే అసూయగా ఉన్నా, ఆ బొమ్మను చూస్తున్నప్పుడు నాకు ఎంతో ముచ్చటగా ఉంది. నీవే అతనికి ఒక ఉత్తరం ముక్క వ్రాయడం మంచిదనుకుంటాను. నేను ఒంటరిగా వెళ్ళి అతన్ని చూడడం నాకు ఇష్టంలేదు. నా

మనస్సు కలవరపెట్టే సిద్ధాంతాలు ఏవేవో చెబుతాను. నాకు బాగుపడే సలహాలిస్తూ కూర్చుంటాను!

లార్డ్ హెన్రీ చిరునవ్వు నవ్వాడు.

'తమకు ఏది ఎక్కువ అవసరమనుకుంటారో ఆ వస్తువును ఇచ్చెయ్యడమంటే జనానికి చాలా ఇష్టం. దాన్నే ఔదార్యంలోని గొప్పతనమంటాను' అన్నాడు.

'బేసిల్ బాగా మారిపోయాడు. కాని కొంచెం సంస్కారంలేనివాడల్లే కనుపిస్తాడు అందరిలాగానే సామాన్యవ్యక్తి అనిపిస్తాడు. నీతో స్నేహం చెయ్యడం మొదలెట్టిన తరువాతనే ఈ విషయం తెలుసుకోగలిగాను హెన్రీ!'

'అబ్బాయ్! ఒక విషయం చెప్పనా? బేసిల్ తనలోని రామణీయకాన్నంతా తన బొమ్మల్లో నిక్షిప్తంచేస్తాడు. అంచాత అతనికి జీవితంలో మిగిలేదేమీ వుండదు. అతని వ్యక్తిగతాభిప్రాయాలు, నీతినియమాలు, ఇంగితజ్ఞానం — ఇవి మాత్రమే అతనికి మిగిలిపోయాయి. నా అనుభవంలో వ్యక్తులను చూచినప్పుడు ఆకర్షణీయంగా కనుపించేవారు ఒక్క చెడ్డ కళాకారులు మాత్రమే. మంచి కళాకారులు ఒక్క వారిసృష్టిలో మాత్రమే సజీవంగా కనుపిస్తారు. అంచాత అసలుజీవితంలో నిర్జీవంగా కనుపిస్తారు. ఒక గొప్పకవి — నిజంగా అతను గొప్పకవి అవుతే—అతను కవిలా కనుపించడు. పైగా అందరిలోకీ ఏమాత్రం కవితాఛాయ లేనివాడికిమల్లే శుష్కంగా కనుపిస్తాడు. కాని తక్కువరకం కవులు చాలా ఆకర్షణీయంగా కనుపిస్తారు. వాళ్ళు వ్రాసేపద్యాలు ఎంతఅధ్వాన్నంగా వుంటాయో వాళ్లు అంత ఆకర్షణీయంగా వుంటారు. ఒకచౌకబారు పద్యాల

పుస్తకం ప్రచురిస్తేచాలు— ఇహ ఆ కళాప పట్టడానికి వీలుండదు. అతను ఏకవిత్వం వ్రాయలేడో ఆ కవిత్వం జీవించడానికి తాప త్రయపడతాడు. వాళ్ళు కలలోకూడా సాధించలేనిదాన్ని కవి తలో వ్రాస్తారు.'

డోరియన్ గ్రే టేబిల్ మీదనుంచి సెంటుసీసా తీసి కొంత సెంటు తన చేతుమాలుపై చల్లుతున్నాడు. లార్డ్ హెన్రీ మాటలన్నీ విని 'నిజంగానా హెన్రీ! నీవు చెప్పావు కాబట్టి తప్పకుండా నిజమే అవుతుంది. ఇక నేను వెడతాను. ఇమోగెన్ నాకోసం ఎదురుచూస్తూ వుంటుంది. రేపటి విషయం మట్టుకు మరిచిపోకు. వస్తాను' అని సెలవుతీసుకున్నాడు.

అతను గదినుండి వెళ్ళగానే లార్డ్ హెన్రీ బరువైన కంటిరెప్పలు క్రిందికి జారాయి. అతను ఆలోచనా నిమగ్ను డైనాడు. డోరియన్ గ్రే లాగా అతన్ని ఆకర్షించిన వ్యక్తులు చాలా కొద్దిమందే వున్నారు. డోరియన్‌ను ఎంతో ఆత్మీయు నిగా ఎంచుకున్నాడు లార్డ్ హెన్రీ. ఆ కుర్రాడు మరోవ్యక్తిని ఇంత వెర్రిగా ప్రేమించడం అతనికి బాధకాని అసూయకాని కలిగించలేదు. పైగా సంతోషం కలిగించింది. అతనిపట్ల ఆసక్తి మరింత హెచ్చింది. ప్రకృతిశాస్త్రపరిశోధనా విధానాలు అతన్ని ఎప్పుడూ ఉద్విగ్నుణ్ణి చేస్తూ వచ్చేవి కాని ఆశాస్త్రం పరిశోధించే విషయాలు మాత్రం అతనికి ఎంతో అల్పంగా కనుపించేవి. అందుచేత అతని చింతన తనను తాను పృథక్క రించుకోవడంతో ప్రారంభించి ఇతరులను పృథక్కరించడంతో అంతమైంది. మానవజీవితం — ఇదొక్కటే అతనికి పరిశోధనా ర్హమైన విషయంగా తోచింది. దీనితో పోల్చి చూస్తే ఇంత

విలువగలవి మరేవీ లేవు. సుఖదుఃఖాల విచిత్రపు సుడిగుండంలో సుళ్ళు తిరుగుతున్న జీవితాన్ని పరిశీలిస్తే ఎవరూ తమ ముఖానికి గాజుముసుగు వేసుకోలేరు తలలో చెలరేగే అనల కీలల బుసబుసలు అణుచుకోలేరు. భయంకరమైన ఊహాలతోనూ భీభత్స స్వప్నాలతోనూ మనో జగత్తును అల్లకల్లోలం కావించుకుంటారు. లోకంలో ఎన్నెన్నో సౌందర్య లలితమైన కాలకూటాలున్నాయి. వాటి స్వభావ స్వరూపాలు అతి సూక్ష్మాలు. ఆ కాలకూటాల రుచి చూడాలంటే అవి దహించక తప్పవు.

ఎన్నెన్నో విచిత్రమైన విషాదాలున్నాయి. వాటి అందచందాలు అవగతం చేసుకోవాలంటే అవి అనుభవించితీరాలి. ఆ ఛాయల్లో నడిచితీరాలి. అయినా, ఆఖరుకు అందేఫలం ఎంతగొప్పది!

ఈ జగత్తంతా అతనికి ఎంత అద్భుతావహంగా పరిణమించింది! హృదయం – మేధస్సు – ఈ రెండిటి పరస్పర విలాసక్రీడను అవగతంకావించుకోడం ఎంత కష్టం! భావోద్వేగంయొక్క అనూహ్యమైన కఠిన తర్కాన్ని, ఉద్వేగ రాగరంజితమైన మేధోజీవితాన్ని అవగతం కావించుకుని; ఈ రెండూ ఎక్కడ కలుస్తున్నవో ఎక్కడ విడిపోతున్నవో గ్రహించడం, ఏ బిందువులో ఈ ఉభయ జీవితాల సంయోగ వియోగాలు ఏర్పడుతున్నవో పరిశీలించడం ఎంతఉదాత్తమైనది! ఈ పరిశీలనలో ఎంత ఆనందం ఉందో! దీనికోసం– ఈ ఆనంద లబ్ధికోసం– దేన్ని త్యజిస్తేమాత్రం ఏమిటి? రసానుభూతికి తగిన ఖరీదంటూ ఎక్కడా లేదు.

అతనికి తెలుసు- తను, మధుర మధురంగా, సన్నని సంగీతం ఊదినట్లు చెప్పిన కొన్ని తీయని పలుకులే డోరియన్ హృదయాన్ని శుభ్ర ధవళ సుందరమైన ఈ చిన్నదానివైపుకు మరలించాయని, ఆ పలుకుల ప్రభావంవల్లనే అతను ఆఅమ్మాయికి పాదాక్రాంతుడయ్యాడని లార్డ్ హెన్రీకి తెలుసు. ఈ ఆలోచన అతని విశాలనయనాలలోకి ఒక ఆనందరేఖను తీసుకొచ్చింది. చాలావరకు ఆ కుర్రాడు తనసృష్టే. ఆ కుర్రాణ్ని- అతని మనోస్వరూపాన్ని— చాలావరకు తీర్చిదిద్దింది తనే. కాని మొగ్గ కాకమునుపే పూవు పూయించాడు. ఇంకా జీవన ప్రాంగణంలో అడుగిడకమునుపే జీవితపు తెరలు తొలగించి చూపాడు. అందులో గొప్పతనం లేకపోలేదు. సాధారణ వ్యక్తులు జీవితం తనంతతానే తన రహస్యద్వారాలు తెరిచే వరకూ గడపల్లో కాచుకుని ఉంటారు. కొద్దిమందికి మాత్రమే తెర తొలగించకముందే జీవనరహస్యాలు సాక్షాత్కృత మవుతాయి. దీనికికారణం కళాప్రభావం కావచ్చు. ముఖ్యంగా సాహిత్యప్రభావం. సాహిత్యం మేధస్సుకు సంబంధించిన ఉద్వేగాలను వ్యక్తీకరిస్తుంది. ఒక్కొక్కసారి సంక్లిష్ట మనస్తత్వం గల వ్యక్తి కళాపీఠాన్ని ఆక్రమిస్తాడు. అతనే ఒక కళాఖండ మవుతాడు. కవితలో, శిల్పంలో, చిత్రరచనలోవలెనే జీవితాల్లో కూడా కొన్ని అద్భుతకళాఖండా లుంటాయి.

అవును. ఆమాట నిజమే. ఆ కుర్రాడు ఇంకా పసిమొగ్గ. విప్పారిన ప్రఫుల్లపుష్పం కాదు. ఇంకా అతని మనసూ వయసూ పండలేదు. కంకి ఈనకమునుపే ధాన్యం నూరుస్తున్నాడు. యౌవనం తాలూకు ఉజ్వలఉద్వేగం అతనిలో ఉంది.

కాని ఆత్మావబోధనకూడా అలవడుతూ ఉంది. 'నేను' అన్నది దృఢంగా నెలకొంటోంది. ఈ పరిణామంలో — ఈ సాధ్యావస్థలో అతన్ని గమనించడం ఎంతో ముచ్చటగా ఉంటుంది. అందమైన ముఖం, అందమైన ఆత్మ — కన్నులకు కలగా కనుపిస్తాడు. ఇక అతని జీవిత ఎలా పరిణమిస్తే ఏమిటి? ఎలా సమాప్తి చెందితేనేమి? అతను ఏకమహోత్సవంలోని చక్కని దేవతాప్రతిమలా కనుపిస్తాడు. అతని ఆనందం మనకు అందనిది. అతని దుఃఖం సౌందర్యోద్దీపకం. అతని గాయాలు ఎర్రని గులాబీపూలు.

ఆత్మ, శరీరం; శరీరం, ఆత్మ — ఈ రెండూ ఎంత విచిత్రమైనవి! ఎంత అనూహ్యమైనవి! ఒక్కొక్కసారి ఆత్మలో పశుత్వం మేలుకుంటుంది. ఒక్కొక్కసారి శరీరం ఆత్మలా అమలినస్థితి పొందుతుంది. ఇంద్రియాలు సంస్కృతాలై కేవలంగా నిర్మలం కావచ్చు. మేధస్సు అధఃపతనమూ కావచ్చు. ఇంద్రియానుభూతి ఎక్కడ మొదలెట్టిందో ఎక్కడ ఆఖరయిందో ఎవరు చెప్పగలరు? సామాన్యంగా మన స్తత్వశాస్త్రవేత్తలు చెప్పే నిర్వచనాలు ఎంత అసంపూర్ణంగానూ అస్పష్టంగానూ ఉంటాయి. అదీగాక, వివిధ శాస్త్రపద్ధతులలో ఏది సత్యమో, ఏది అసత్యమో నిర్ణయించడం ఎంతకష్టం! పాపాలయమైన శరీరంలో తిష్టవేసుకున్న ఒక ఛాయేమో ఆత్మ! లేక గియర్డానో బ్రూనో అనుకున్నట్టు శరీరమే ఆత్మతో అంతర్నిహితమై ఉన్నదేమో! జీవ, శరీరాలవిభజన నిజంగా ఒక పెద్ద రహస్యం. జీవశరీరాల ఐక్యంకూడా ఒక రహస్యమే.

ప్రతి చిన్న జీవనరహస్యాన్ని మనకు సువ్యక్తం చేసేటంత. పరిపూర్ణశాస్త్రంగా మన స్తత్వశాస్త్రాన్ని రూపొందించడం సాధ్యమా అని ఆలోచింపసాగాడు లార్డ్ హెన్రీ. మన స్తత్వశాస్త్రం ఇంతవరకు అసంపూర్ణంగానే ఉంది. మనం ఎప్పుడూ ఒకరిని ఒకరం అపార్థంచేసుకుంటూనే ఉన్నాం. ఎప్పుడోకాని సరిగా అర్థంచేసుకోము. అనుభవానికి కూడా విలువేమీ కనుపించడంలేదు. అనుభవం, మనుష్యులు తాము చేసే తప్పులకు పెట్టుకున్న ఒకపేరు మాత్రమే. జీవితం ఒక నియమక్రమంలో జరగాలనేవారు అనుభవం ఒక హెచ్చరిక లాంటిదన్నారు. మనం మనశీలాన్ని తీర్చిదిద్దుకునే సందర్భంలో అనుభవం ఉపయోగపడుతుందన్నారు. ఇది మంచి ఇది చెడు అని మనకు తెలియజేస్తుందన్నారు. కాని అనుభవానికి ఒక వ్యక్తిత్వమంటూ లేదు. అనుభవం ఉద్దేశపూర్వకంగా మనల్ని ఒక నిర్ణీతపద్ధతిలో నడిపిస్తుందని చెప్పడానికి వీల్లేదు. అంతరాత్మకు ఎంత అల్పశక్తి ఉన్నదో అనుభవానికి కూడా అంతే. అది ఏవిషయానికీ ఒక సచేతనమైన కారణమేమీ కాదు. అనుభవంవల్ల ఋజువయ్యే విషయం ఒకటే— మన భవిష్యత్తుకూడా గతంలాగానే ఉంటుందని. పూర్వం ఒకప్పుడు అసహ్యంవేస్తూ చేసిన పాపాన్నే మళ్ళీ అనేకసార్లు చేస్తాం. పైగా ఆనందంతో కూడా చేస్తాం.

లార్డ్ హెన్రీకి ఒక విషయం మాత్రం స్పష్టంగా అవగతమైంది. మనిషి ఉద్వేగాలను శాస్త్రీయపద్ధతిలో విభజించి అవగతంకావించుకోవాలంటే ప్రక్రియ ఒకటే సాధనం. అంతకు మించిన సాధనమేమీ లేదు. తన ప్రక్రియకు అనువైనవస్తువు

డోరియన్. తను ప్రయోక్త. డోరియన్ ప్రక్రియ. ఫలితాలు మంచివే రావచ్చు. సిబిల్ వేన్‌తో అతని ఆకస్మికప్రణయం అతనిమనస్సులో వచ్చిన ఒక విచిత్రమైనమార్పును తెలియ జేస్తుంది. ఆ విచిత్ర మానసిక వైచిత్రి జాగ్రత్తగా గమనింప దగినదే. ఈ మార్పుకు ఔత్సుక్యం ఎంతో బలీయమైన కార ణమనడానికి సందేహంలేదు. కొత్త అనుభవాలకోసం ఆకాంక్ష ఔత్సుక్యం డోరియన్‌లో మొలకెత్తాయి.

లార్డ్ హెన్రీ ఇలా మననంచేసుకుంటూ కూచుని ఉండగా ఎవరో తలుపుకొట్టిన చప్పుడైంది. అతని సేవకుడు ప్రవేశించి డిన్నర్‌కు సమయమైందని, ముస్తాబుచేసుకోవచ్చని జ్ఞాపకంచేశాడు. అతను లేచి వీధిలోకి చూచాడు సూర్యా స్తమయమవుతూ ఉంది. ఎదురువరసలోని మేడల కిటికీలకు అస్తమయం బంగారుపూత పూస్తోంది. అప్పుడే కరిగించిన లోహఫలకాల లాగా కిటికీల అద్దాలు మిలమిల మెరుస్తు న్నాయి. ఆకాశం వాడిపోయిన గులాబీలా ఉంది. భయదర క్తి మారంజితమైన తనయువ మిత్రుని జీవితాన్ని ఊహించు కున్నాడు లార్డ్ హెన్రీ. ఆ జీవితం ఎలా పరిణమిస్తుందో ఎలా సమాప్తమవుతుందో అని ఆశ్చర్యపు పొందాడు. అతను ఇంటికి తిరిగి వచ్చేసరికి పన్నెండున్నర దాటింది. టేబిల్ మీద ఒక టెలిగ్రాం పడేసిఉంది. టెలిగ్రాం తెరిచి చూచాడు. డోరియన్ దగ్గరనుంచి వచ్చింది. తను సిబిల్ వేన్‌ను పెళ్ళాడ డానికి ఏర్పాటుచేసుకున్నానని వ్రాశాడు డోరియన్.

# 5

"అమ్మా! అమ్మా! అబ్బ! నా కెంత హాయిగా ఉందనుకున్నావే"— కన్నతల్లి ఒళ్ళో తల దూర్చి గుసగుసలాడింది సిబిల్. తల్లి ముసలిది. శుష్కించి నీరసించినట్టు కనుపిస్తోంది. వాళ్ళు నివసించేది ఒక చిన్న గది. ఒక మూల పడకకుర్చీలో ఉంది ఆ వృద్ధురాలు.

'నా కెంత సుఖంగా ఉందనుకున్నావే అమ్మా! నీవూ సుఖంగా ఉండవేఅమ్మా!—' అన్నది సిబిల్.

మిసెస్ వేన్ ఉలికిపడింది. పాలిపోయిన శుష్కహస్తాలు కుమార్తె తలపై ఉంచి, 'సుఖం! నీవునటిస్తూఉంటేచూస్తున్నప్పుడే నాకు సుఖం. సిబిల్! నీవు నీ నటనను గురించి తప్ప మరో విషయం ఆలోచించకమ్మా. మిస్టర్ ఇజాక్ చాలా మంచివాడు. మనపట్ల ఎంతో దయగా ఉంటాడు. అతనికి మనం డబ్బు ఋణపడి ఉన్నాంకూడా' అన్నది. అమ్మాయి తలెత్తి పెదవులు ముందుకుచాచి, డబ్బు దేముందమ్మా? ప్రేమ డబ్బు కంటె గొప్పది' అన్నది ఆనందంతో.

'మన అప్పులు తీర్చుకోడానికి, జేమ్స్‌కు మంచి బట్టలు కుట్టించడానికి మిస్టర్ ఇజాక్ మనకు యాభై పౌండ్లు ఎడ్వాన్సు ఇచ్చాడమ్మాయ్! నీవు ఈవిషయం గుర్తుంచుకోవాలి. యాభై పౌండ్లంటే సామాన్యం కాదు. మిస్టర్ ఇజాక్ చాలా ఔదార్యం చూపాడు.

'అతను మంచివాడు కాదమ్మా. పెద్దమనిషి కాదు. నాతో అతను మాట్లాడేతరహా చూస్తోంటే నాకు ఒళ్ళు

మందుకొస్తుంది', అన్నది అమ్మాయి. అక్కడనుంచి లేచి కిటికీదగ్గరికి వెళ్ళింది.

'అతను ఆదుకోకపోతే మన బ్రతుకులు ఎలా సాగుతాయి?'- అన్నది ముసలిది.

సిబిల్ వేన్ సగర్వంగా తలపంకించి నవ్వింది. 'అతనితో మన కిహ అవసరంలేదమ్మా. ఇక మన బ్రతుకులు 'మోహన రాకుమారుడు' పాలిస్తాడు. మనకు ఏ బాధలూ ఉండవు' అని ఆగింది. ఆమె సన్నని రక్తనాళాల్లో ఒక ఎర్రనిగులాబీ వణికింది. ఆమె కపోలాలను అరుణరంజితంచేసింది. త్వరితశ్వాసవల్ల ఆమె పెదవుల పూలరేకులు అరవిచ్చుకున్నాయి. అల్లలాడాయి. ఏదో మలయానిలం ఆమెను స్పృశిస్తూ వెళ్ళింది. ఆ అనిలానికి ఆమె తీవెలా తల వంచుకుంది. ఆ అనిలానికి ఆమె దుస్తుల ముడుతలు చెదిరి కదిలాయి. 'నే నతన్ని ప్రేమిస్తున్నాను' అన్నది. అంతే.

'పిచ్చి పిల్లా! పిచ్చిపిల్లా!'- అన్నది తల్లి. సిబిల్‌ను ఎప్పుడూ ఇలాగే మందలించడం ఆమె అలవాటు.

పిల్ల మళ్ళీనవ్వింది. పంజరంలో చిలకయొక్క ఆనందం ఆ నవ్వులో వినిపించింది. ఆ మాధుర్యాన్ని ఆమెకళ్ళలో పాతుకుంది. వెలుగుతో మారుపలికింది. ఆ రహస్యం దాచుకున్నట్టుగా మళ్ళీ కళ్లు మూసుకుంది. మళ్ళీ కళ్లుతెరిచేసరికి ఆ కళ్ళలో గడిచిపోయిన ఒక స్వప్నఛాయ తళుక్కొత్తింది.

మాసిన పాతకుర్చీలో తల్లి కూచుని మాట్లాడుతున్నది. సన్నని పెదవులు.ఆమె మాట్లాడుతూంటే లోకజ్ఞానం మాట్లాడుతున్నట్టుగాఉంది. జీవితంలో జాగ్రత్తనుగురించి చెబుతోంది.

కాని, ఆ పిల్లదిమాత్రం వినడంలేదు. తనలోకంలో తా మంది. తన ప్రణయోద్వేగపు కారాగారంలో స్వేచ్ఛగా ఉంది. తనహృదయాధిపతికూడా తనతోనే ఉన్నాడు. 'జ్ఞాపకాన్ని' పిలిచి, అతన్ని మళ్ళీ తనముందు మూర్తికట్టించమన్నది. స్మృతిఫలకంపై అతని చిత్రరువు మళ్ళీ గీచుకుంటోంది. అతన్ని వెదకడంకోసం తన ఆత్మను పంపింది. తన ఆత్మ వెళ్ళింది. అతన్ని వెదికి తీసుకొచ్చింది. మళ్ళీ అతని ముద్దు ఆమె పెదవు లపై జ్వాలలా హత్తుకుంది. ఆమె నేత్రాలు అతని శ్వాసతో వెచ్చబడ్డాయి.

విజ్ఞానరూపంలో తనబోధ సాగిస్తున్న తల్లి తనబోధనా పద్ధతి మార్చింది. ఏ విషయాన్నయినా తాపీగా ఆలోచించి కాని చెయ్యకూడ దన్నది. ఆయువకుడు నిజంగా శ్రీమంతుడే అవుతే అప్పుడు వివాహాన్ని గురించి ఆలోచించవచ్చు. ఆ పిల్లదాని శ్రవణతీరాలకు లౌకిక వక్రమార్గాల వికృతతరం గాలు ఢీకొన్నాయి. సన్నని పెదవులు కదులుతున్నాయి. ఆమె నవ్వింది. హఠాత్తుగా ఆ అమ్మాయికి మాట్లాడాలనిపిం చింది. సశబ్దనిశ్శబ్దం ఆ అమ్మాయిని కలవరపెట్టింది.

'అమ్మా! అమ్మా! నన్నతను అంతగా ఎందుకు ప్రేమి స్తున్నాడో తెలుసటే? నాకు తెలుసు. నే నతన్ని ఎందుకు ప్రేమిస్తున్నానో నాకు తెలుసు. ప్రేమంటేనే ఎలా ఉంటుందో అత నలా ఉంటాడమ్మా. కాని అతనుమాత్రం న న్నెందుకు ప్రేమిస్తున్నాడో నాకు తెలీదమ్మా. అతని ప్రేమకు నేను ఏ విధంగా అర్హురాలిని! అయినా, ఎంచాతతో కాని – నే నతనికంటె ఎంత తక్కువదా న్ననుకున్నా – తలవాల్చేదాన్ని

కాదు. పైగా నే నెంతో గర్విస్తానమ్మా. అమ్మా - నా కో మాట చెప్పు- నీవుకూడా నాన్నని ఇలాగే ప్రేమించేదానివా? చెప్పవూ?' అని అడిగింది సిబిల్.

దట్టంగా పౌడర్ అద్దిఉన్న ఆ వృద్ధురాలివదనం వివర్ణమైంది. బాధ తెరలా వచ్చి పెదవులు సుళ్ళుతిరిగాయి. సిబిల్ ఒక్క ఉదుటులోవెళ్ళి ఆమెను కౌగిలించుకుంది. ముద్దాడింది. 'అమ్మా! నన్ను క్షమించవూ? నాన్నని గురించి మాట్లాడితే నీకు కష్టం కలుగుతుందని నాకు తెలుసమ్మా. నీవు నాన్నని అలా ప్రేమించావు కాబట్టే నీ కంతకష్టం కలుగుతుందమ్మా. అమ్మా, అలా దిగాలుగా కనుపించకు. ఇరవైఏళ్ళక్రితం నీ వెంత సుఖంగా హాయిగా ఉన్నావో నే నిప్పు డంత సుఖంగా హాయిగా ఉన్నానమ్మా. న న్నెప్పుడూ ఇలా సుఖంగా ఉండమని ఆశీర్వదించమ్మా'అన్నదిపొంగారుతున్న అనురాగంతో.

'నీ కింకా పసితన మమ్మాయ్. నీ కింకా ప్రేమించే వయస్సు రాలేదు. అదీగాక, ఈకుర్రాడు ఎవరో- అతనిసంగతి సందర్భాలు ఏమిటో నీ కేం తెలుసు చెప్పు. అతని పేరేమిటో కూడా నీకు తెలీదు. ఇదంతా ఒక గొడవలా కనుపిస్తుందమ్మాయ్- అదీగాక జేమ్స్ ఆస్ట్రేలియా వెళుతున్నాడు. నేను చూచుకోవలసిన మంచిచెడ్డా చాలాఉన్నాయి. నీవు కొంచెం తాపీగా ఆలోచించడం మంచిది. అయినా నేను ఇంతకు ముందు చెప్పినట్టు... అతను శ్రీమంతుడే అవుతే...' అన్నది తల్లి.

'అమ్మా! అమ్మా! ఇదంతా చెప్పకమ్మా! నన్ను సుఖంగా ఉండనీమ్మా.'

మిసెస్ వేన్ ఒకమాటు తన కుమార్తెవంక చూచింది. నటకురాలు స్టేజీమీద చేసినట్లు కృతకంగా, ఒక్కమాటు కుమార్తెను గట్టిగా కౌగిట్లో హత్తుకున్నది. ఈ క్షణంలో గది తలుపు తెరుచుకుంది. ఒక కుర్రాడు గదిలో అడుగు పెట్టాడు. కుర్రాడు దృఢంగా ఉన్నాడు. ఒత్తయిన జుట్టు. చేతులూ కాళ్ళూ పొడవుగా ఉన్నాయి. కొంచెం చీకాకుగా నడుస్తాడు. అతని చెల్లెలంత చక్కగా పెరిగినవాడు కా దతను. వాళ్ళిద్దరినీ చూస్తే అన్నాచెల్లెళ్ళని ఊహించడం చాలా కష్టం. మిసెస్ వేన్ అతనివంక నిశ్చలంగా చూచింది. ఆమె పెదవులపై చిరునవ్వు విప్పారింది. ప్రేక్షకులకు అభినేత్రి చూసినట్టుగా అతనివంక చూచింది.

'నాకోసం కాసిని ముద్దులు దాచిపెట్టు సిబిల్. అన్నీ అమ్మకేనా ఇచ్చేది?' అన్నాడు కుర్రాడు.

'నీకు ముద్దులన్నా, ముచ్చటలన్నా ఇష్టం లేదుకదా జిమ్! నీవు ముసలిముచ్చువి!' అని పరుగెత్తుతూ వెళ్లి అతన్ని కావిలించుకుంది సిబిల్.

జేమ్సు వేన్ తనచెల్లి ముఖంలోకి సాదరంగా సమార్ద్రంగా చూచాడు. 'సిబిల్, నేను అలా షికారు వెడుతున్నాను. నాతోవస్తావా? నేను మళ్లీ ఎప్పుడూ ఈ పాడులండన్ చూడననుకుంటాను. నాకు మళ్ళీ లండన్ రావాలనే ఇష్టంకూడా లేదు' అన్నాడు.

'బాబూ! అలాటిమాటలు మాట్లాడకు' అన్నది తల్లి. ఒక పాత థియేటర్ డ్రెస్ తీసుకుని, నిశ్వసించి, దాన్ని సరి

చేయసాగింది. కొడుకుకూడా థియేటర్‌లో చేరకపోవడం ఆమెకు కొంచెం లోటుగా కనుపించింది.

'నే నన్నమాటలో తప్పేముున్నదమ్మా? నిజంగాకూడా నా ఉద్దేశం అదే.'

'బాబూ! నీవు అనవసరంగా నామనస్సుకి కష్టం కలిగిస్తున్నావు బాబూ. నీవు మంచి పెద్ద పదవిలోకి వచ్చి ఆస్ట్రేలియానుంచి తిరిగి వస్తావని నేను విశ్వసిస్తున్నాను. వలస రాజ్యాల్లో ఎక్కడా మనం నివసింపదగిన చక్కని సమాజం లేదు. నీవు అక్కడ డబ్బు సంపాదించిన తరువాత మళ్ళీ ఇంటికి తిరిగివచ్చి ఇక్కడ లండన్‌లోనే పేరు ప్రతిష్టలు సంపాదించుకోవాలి.'

'సమాజం! దాన్ని గురించి నే నేమీ తెలుసుకోదలచ లేదు. నిన్నూ సిబిల్‌నూ ఈ నాటకరంగంలో నుంచి తప్పించి ఒకచోట కుదుటపడడం కోసం డబ్బుసంపాదించా లనుకుంటున్నాను; అంతే. ఈ రంగమంటే నాకు అసహ్యం.'

'జిమ్! ఎంత కఠినుడివి జిమ్! ఇంతకూ నన్ను షికారు రమ్మన్నావు — నాతో షికారు వస్తున్నావా, లేదా? మనిద్దరం షికారువెడితే ఎంత బావుంటుంది! నీవు నీ స్నేహితులు టామ్‌హార్డీ, నెడ్ లాంగ్‌టన్ — వాళ్ళదగ్గర సెలవు తీసుకున్నావా? ఈ పైప్ నీకు టామ్‌హార్డీకదూ ఇచ్చింది? అబ్బ! ఇదేం పైప్? ఈ పైప్ నీవు కాలుస్తూ ఉంటే నెడ్‌లాంగ్‌టన్ నిన్నుచూచి ఎగతాళి చేస్తుంటాడుకదూ? అన్నయ్యా! ఈ కడసారి సాయంత్రం నీతో గడపడం నా కెంత హాయిను

కున్నావు! ఎక్కడికి వెడదాం చెప్పు? పార్కుకు వెడదాం పద' అన్నది సిబిల్ అన్నతో మారాం చేస్తూ.

'నా దుస్తులు అసహ్యంగా ఉన్నాయమ్మాయ్. పొట్టలు పెరిగిన పెద్దమనుషులే పార్కుకు వెడతారు' అన్నాడు జేమ్స్ కోపంతో.

'అదేంమాట జిమ్!' - అన్నదా అమ్మాయి అతని కోటు చెయ్యి స్పృశిస్తూ.

అతను ఒకక్షణం తటపటాయించాడు- 'సరే అలాగే వెడదాం' అన్నాడు.

'కాని త్వరగా ముస్తాబు కానీ, ఎక్కువ ఆలస్యం చెయ్యకు' అన్నాడు. ఆమె లేడిపిల్లలే దూసుకునిపోయింది. మేడమెట్లెక్కి పరుగెత్తుతూ ఆమె పాడుకునేపాట వినిపిస్తోంది. ఆమె చిన్నారి అడుగులచప్పుడు పైనుంచి వినిపిస్తోంది.

రెండు మూడు పర్యాయాలు అతను గదిలో అటూ ఇటూ చిరాకుతో తిరిగాడు. అకస్మాత్తుగా కుర్చీలో నిశ్చల ప్రతిమలా కూచున్న తల్లివంక తిరిగి 'అమ్మా! నా సామాన్లన్నీ సిద్ధం చేశావా?' అన్నాడు.

'సిద్ధం చేశాను జేమ్స్! అన్నదామె తన కుట్టుపనినుంచి కళ్ళెత్తకుండా. కొన్ని నెలలనుంచి తన కుమారునితో ఇలా ఒంటరిగా ఉండడమంటే ఆమెకు సంకటంగా కనుపిస్తూఉంది. అతను చాలా గడుసరి. నిక్కచ్చిగా ఉంటున్నాడు. వారిద్దరి కళ్ళూ కలుసుకున్నప్పుడు మూసిపెట్టుకున్న ఆమె అంతస్సు ఎంచాతనో కాని కలవరపాటు పొందుతున్నది. అతను తనని అనుమానిస్తాడేమోనని ఆమె కళవళపడేది. అతనేమీ మాట్లా

దేవాడుకూడా కాదు. అతని మౌనమే ఆమెకు దుర్భరంగా కనుపించేది. ఏవేవో గొడవలు చెప్పుకొచ్చేది. ఆడిపోసేది. స్త్రీలు ఒకరిని ఆడిపోసి తమనుతాము సమర్థించుకుంటారు. ఒక్కొక్కసారి హఠాత్తుగా లొంగిపోతారు. అదికూడా వారు ఎదుట తిరగడమే. 'ఈ నావిక జీవితం నీకు తృప్తికరంగానే ఉంటుం దనుకుంటాను జేమ్సు! ఈ జీవితం నీ అంతట నీవు కోరుకున్నదే. ఇంతకంటె నీవు ఎక్కడైనా ప్లీడర్ల ఆఫీసులో చేరినా బావుండేది. వాళ్ళది చాలా గౌరవనీయమైన వర్గం. గొప్పకుటుంబాలతో కలిసి వాళ్ళు విందులూ వినోదాలూ సలుపుతూఉంటారు.'

'ఆఫీసులన్నా, గుమాస్తాఉద్యోగాలన్నా నాకు అసహ్యమమ్మా. కాని నీవు చెప్పినమాట మాత్రం వాస్తవం. నా బ్రతుకుబాట నా అంతట నేను ఎన్నుకున్నదే. నేను నిన్ను కోరేదల్లా సిబిల్‌ను కనిపెట్టి ఉండమని. అంతే. దాని కేమీ హాని కలగకుండా చూడు. అమ్మా, నీవు దాన్ని జాగ్రత్తగా కనిపెట్టి ఉండాలమ్మా.'

'జేమ్సు! అదేమిటి అలా మాట్లాడుతావు? నే నేం తెలీనిదాన్నా? నే నెందుకు కనిపెట్టిఉండనురా అబ్బాయ్!' అన్నది తల్లి.

'నా కో విషయం తెలిసింది. రోజూ ఎవరో ఒక పెద్ద మనిషి వస్తున్నాడట. నాటకం కాగానే గ్రీన్‌రూమ్‌లోకి వెళ్ళి దానితో మాట్లాడుతున్నాడట. నిజమేనా ఈ విషయం?'

'నీకు తెలీని విషయాలను నీవు మాట్లాడుతున్నావు నాయనా జేమ్స్. మా వృత్తిలో చాలామంది పెద్దలు మా వద్దకువచ్చి మమ్మల్ని అభినందించే అలవాటు ఉంటుంది. నా రోజుల్లో నే నెన్నో పుష్పగుచ్ఛాలు స్వీకరించాను. నటన అంటే ఏమిటో అందరూ గ్రహించి ఆదరించేరోజు లవి. ఇహ సిబిల్ విషయం – ఇంతవరకూ అతనితో ఆమె మైత్రి మాత్రమే సలుపుతూ ఉంది. కాని ఒక విషయం మాత్రం నిజం. ఆ యువకుడు చాలా పెద్దమనిషి అనడానికి ఏమాత్రం సందేహం లేదు. నాతోకూడా ఎంతో మర్యాదగా ఉంటాడు. అదీగాక శ్రీమంతుల బిడ్డలా కనుపిస్తాడు. అతను బహూకరించేపూలుకూడా ఎంతో చక్కనివి.'

'అయినా అతనిపేరుకూడా మీకు తెలీదుకదా?' – అని అడిగాడు కుర్రాడు కర్కశంగా.

'తెలీదు. ఇంకా అతను తన పేరు చెప్పలేదు. తన పేరు చెప్పకపోవడం అతని ముచ్చటల్లో ఒకటనుకుంటాను. అతను గొప్ప అభిజాతకుటుంబీకులలో ఒక డనుకుంటాను.'

తల్లి ఇలా అనగానే జేమ్స్‌వేన్ పెదవి కొరుక్కున్నాడు. 'సిబిల్‌ను కనిపెట్టి ఉండమ్మా. సిబిల్‌ను కనిపెట్టి ఉండమ్మా. జాగర్త!' అన్నాడు.

'అబ్బాయ్! నీవు అనవసరంగా నా మనస్సుకి కష్టం కలిగిస్తున్నావు. ఎప్పుడూ నేను సిబిల్‌ని కంటిపాపలా చూచుకుంటున్నాను. అతను శ్రీమంతుడే అవుతే ఆ అబ్బాయితో సంబంధం చెయ్యడం అనుచితం కాదనుకుంటాను. అతను గొప్ప కుటుంబీకుడని నాకు బాగా విశ్వాసం వుంది. అతనిలో

ఆ లక్షణాలన్నీ బాగా కనుపిస్తాయి. అతన్ని వివాహమాడితే సిబిల్ నిజంగా అదృష్టవంతురాలనే చెప్పాలి. వాళ్ళు చూడ చక్కని దంపతులుకూడా అవుతారు. ఈడూ జోడూ సరిపో తుంది. అతని సౌందర్యం అందరికీ తెలిసిందే' అన్నది తల్లి.

కుర్రాడు తనలో తాను ఏదో గొణుక్కున్నాడు. కిటికీ అద్దాలపై కర్కశంగావున్న తన వ్రేళ్ళతో మీటుతున్నాడు. మళ్ళీ తల్లితో ఏదో చెప్పాలని వెనక్కు తిరిగాడు. ఇంతలో సిబిల్ పరుగెత్తుకుంటూ వచ్చింది.

వారిద్దరూ గంభీరంగా వుండడం గమనించి, 'ఏమి టిలా వున్నారు ? ఏం జరిగింది ?' అన్నది

'ఏమీలేదు. ఒక్కోసారి ఎవరైనా గంభీరంగా వుండ డం అవసరం. వస్తానమ్మా. అయిదు గంటలకు వచ్చి భోజనం చేసి వెడతాను. నా వస్తులుతప్ప అన్నీ సర్దుకుని సిద్ధంగా వుం చాను. ఇహ నీ వేమీ సర్దక్కర్లేదు' అన్నాడు జేమ్సే.

'సరే నాయనా' అన్నది దానె.

ఆ రోజు ఆమెతో అతను మాట్లాడిన తీరు - అతని కంఠస్వరం - ఆమెను ఎంతో కలవరపెట్టాయి. ఇదివరకెన్నడూ అతనలా మాట్లాడడం ఆమె గమనించలేదు. అతనిచూపు కూడా అలాగే వుంది. ఆ చూపుచూస్తే ఎందువల్లనో కాని ఆమెకు భయం కలిగింది.

'నన్ను ముద్దాడవే అమ్మా' అన్నది సిబిల్. పూలరేకుల్లాంటి ఆ చిన్నదాని చిన్నారి పెదవులు ఆ వృద్ధురాలి శుష్క పాండుర కపోలతలాలనుస్పృశించి ఆవార్ధక్యహిమాన్ని వెచ్చచేసి కరిగించాయి.

'తల్లీ! తల్లీ! నా చిట్టి తల్లీ!' అన్నది మిసెస్ వేన్ కుమార్తె చిన్నిముద్దు అందుకుని.

'రా సిబిల్!' – అన్నాడు ఆ పిల్లదాని అన్న అస హనంతో. తనతల్లి అతిగారాము అతనికి అసహ్యంగా తోచింది.

అన్నా చెల్లెళ్ళు బైటికి వెళ్ళారు. ఎండ పొడలు గాలికి చెదిరినవిధంగా తళతళలాడుతున్నాయి. వాళ్ళిద్దరూ ఈస్టన్ రోడ్డు మీదుగా నడుస్తూవెడుతున్నారు. గంభీరంగా బరువుగా వున్న ఆ కుర్రాడివంక వచ్చిపోయేవారంతా ఆశ్చర్యంతో చూస్తున్నారు.అతను తొడిగిన బట్టలుకూడా అతికినట్టుగాలేవు. అవకతవకగా వున్నాయి. అతనూ – అతని ప్రక్కన పూవు లాంటి ఆ పిల్లా నడుస్తూ వెళ్ళడం అందరికీ ఆశ్చర్యంగా కను పించింది. గులాబీపూవు చేతిలో పట్టుకుని నడుస్తున్న తోట మాలిలా వున్నా డతను.

మధ్యమధ్యలో ఎవరైనా అపరిచితుడు తనవంక అదో లా చూచినప్పుడు జిమ్‌కు కోపంవచ్చేది. చిరాకు కలిగేది. ఒకరు తనవంక అలా చూడడమంటే అతనికి అసహ్యం. గొప్ప మేధావులకు జీవితంలో ఆలస్యంగా ఇలాంటి లక్షణం అబ్బు తుంది. ఏమైనా సిబిల్ మాత్రం తనలోకంలో తానుంది. తన వంక ఎవరు చూస్తున్నదీచూడనిదీ గమనించడంలేదు. ఆమె ప్రేమ ఆమె పెదవులపై నవ్వై వెలుపడి ప్రకంపిత మవుతూంది. ఆ నవ్వు వణుకుతోంది. ఆమె తనహృదయాధిపతినిగురించే ఆలో చిస్తున్నది. ఆమెమనస్సులో అత నొక్కడే నిలిచివున్నాడు. అతన్నే మననంచేస్తోంది. అతన్నే భావిస్తోంది. అతన్ని మరిం తగా మననంకావించుకుంటూ అతన్నిగురించి మాట్లాడడం

లేదు. జిమ్ విదేశాలకు వెళ్ళనున్న పడవనిగురించి ఏవేవో కబుర్లు చెబుతోంది. అతను ఆ దూరదేశాల్లో సంపాదించే బంగారాన్ని గురించి, దుర్మార్గుల హస్తాలనుంచి అతను కాపాడి పెళ్ళాడబోయే గొప్ప శ్రీమంతురాలిని గురించీ కట్టుకథ లల్లినట్టు కబుర్లు చెబుతోంది. తన అన్న తప్పకుండా గొప్పవాడవుతాడు. సామాన్యమైన నావికుడుగా మాత్రం వుండబోడు. నావికుడి బ్రతుకు నిజంగా ఎంత కష్టతరమైంది! అసహ్యంగా ఉన్న పడవలో ప్రయాణం. ఏ దేశాలకో తెలీదు. ఏ తీరాలకో తెలీదు. ఎముకుగాలి. చిరిగే తెరచాపలు. విరిగే తెరచాప గడలు. అతను మెల్‌బోర్న్‌లో పడవ దిగుతాడు. కెప్టెన్ దగ్గర సెలవుతీసుకుంటాడు. వెంటనే బంగారుగనులకు ప్రయాణమై పోతాడు. ఒకవారం గడుస్తుందో లేదో అతనికి ఒక పెద్ద నాటుబంగారపు కుప్ప దొరుకుతుంది. అంత పెద్ద కుప్ప మరెవరికీ దొరికి ఉండదు. అతను ఆ బంగారపుకుప్ప తీసుకుని ఆరుగురు పోలీసుల కాపలాతో తీరానికి వస్తాడు. మధ్య దారిలో మూడుసార్లు దారిదొంగలు చుట్టుముట్టుతారు. ఓడిపోతారు. నవ్వుతూ తన అన్న ప్రయాణం చేస్తాడు. లేదా — అతను ఆ బంగారుగనులకు వెళ్ళడు. అవి వెళ్ళాల్సిన స్థలాలు కావు. అక్కడ తాగుబోతు లుంటారు. తగాదాలు పడుతూ ఒకరినొకరు కాల్చుకుంటారు. బూతులు తిట్టుకుంటారు. తన అన్న అలాంటిచోట్లకు వెళ్ళడు. ఒక ముచ్చటయిన రైతూ గొర్రెలకాపరీ అవుతాడు. ఉన్నచోటే ఉండి చల్లగా బ్రతుకుతాడు. ఒకనాటి సాయంత్రం అతను ఇంటికి తిరిగి వస్తున్నాడు. గుర్రంమీద వస్తున్నాడు. దారిలో ఒక శ్రీమంతురాలిని ఒక

దొంగ ఎత్తుకుని నల్లని గుర్రంపై పారిపోతున్నాడు తన అన్న ఆ దొంగను వెంటాడి ఆమెను రక్షిస్తాడు. ఆమె అతన్ని ప్రేమిస్తుంది. ప్రేమించదూ మరి? తనూ ఆమెను ప్రేమిస్తాడు. ఒకరినొకరు ప్రేమించుకుంటారు. పెళ్ళిచేసుకొని ఇంటికి వస్తారు. లండన్‌లో ఓ పెద్ద ఏడంతస్తులభవంతిలో చిలకా గోరింకల్లా చల్లగా ఉంటారు. కాని తన అన్నమాత్రం తగు జాగ్రత్తలో ఉండాలి. చీటికి మాటికి తనవదినెపై చిర్రుబుర్రు మనకూడదు. డబ్బు అయినదానికీ కానిదానికీ ఖర్చుచెయ్యకూడదు. తన వదినె అన్నకంటె ఒక్కయేడే పెద్దవి. ఆమెకు మంచీచెడ్డా తన అన్నకంటె ఎక్కువ తెలుసు. ఎప్పుడూ వాళ్ళు ఒకరిని ఒకరు విడిచి ఉండకూడదు. ఎప్పుడైనా అలాఉంటే ఒకరి కొకరు రోజు మార్చి రోజయినా తప్పకుండా ఉత్తరాలు వ్రాసుకోవాలి. ఊఁ. లేకపోతే వదినెకు కోపంరాదూ? రోజూ అన్న వదినెకోసం నిద్రపోయేముందు తప్పకుండా ఈశ్వరుణ్ని ప్రార్థించాలి. వదినెకూడా అలాగే ప్రార్థించాలి. కొద్ది ఏళ్ళలో అన్న ఇంత డబ్బు పట్టుకుని తిరిగివస్తాడు.

ఇలా కలలమేడ కడుతోంది సిబిల్. కుర్రాడు మందంగా విన్నాడు. జవాబుమాత్రం చెప్పలేదు. ఇల్లువిడిచి దూర దేశాలకు వెళ్ళాలంటే అతనికి అదోలా ఉంది.

కాని, అతన్ని కుంగదీస్తున్నది ఈ ఒక్క విషయం మటుకే కాదు. చిన్నవాడూ, అట్టే అనుభవం లేనివాడూ అయినప్పటికీ తన చెల్లెలిపరిస్థితిలోని ప్రమాదం అతనికి బాగా తెలుసు. తన చెల్లిని ప్రేమిస్తున్న యువకుడు ఒక జల్సా రాయుడు. అతనివల్ల తన చెల్లికి శ్రేయస్సుమాత్రం వుండదు.

అతను పైగా పెద్దమనిషి. ముఖ్యంగా ఇందుకనే అతనంటే తనకు అసహ్యం. అతనంటే ఎందు కంత ద్వేషమో తనకే తెలీదు. బహుశా అతని జాతీ, తనజాతీ వేరు కావచ్చు. అంచాతనే అతనంటేమాత్రం తనకు తీరనిఅసహ్యం. ఇంతే కాదు. తనతల్లి ఎంత అల్పస్వభావురాలో, ఎంత ఆడంబర ప్రియురాలో తనకు తెలుసు పై మెరుపులంటే ఇట్టే లొంగి పోతుంది. లేనిపోని పరువు ప్రతిష్ఠలు ఊహించుకుంటుంది. అంచాతనే, సిబిల్‌కూ ఆమె సౌఖ్యానికీ పెద్ద ప్రమాదం రానున్నదని అతను ఊహించుకున్నాడు. శిశువులు మొదట్లో తల్లిదండ్రులను ప్రేమిస్తారు. తరువాత వారిని నిర్ణయిస్తారు. ఒక్కోసారి వాళ్ళను క్షమిస్తారుకూడా. తనతల్లి! ఆమెను ఏదో అడగాలనిపించింది, ఆ విషయం చెట్టుకు అంటిపెట్టుకున్న ఒక దెయ్యంలా తనమనస్సుని అంటిపెట్టుకుని ఉంది. ఎన్నో నెలల నుంచి నిశ్శబ్దంగా తన మనస్సులో ఆ విషయాన్నే మననం చేస్తున్నాడు. ఎక్కడో థియేటర్‌లో ఎవరో అన్నమాట- అదీ యాదృచ్ఛికంగా అన్నమాట- ఒకనాటి రాత్రి స్టేజిద్వారంలో తను నిల్చునిఉండగా తన చెవులకు సోకిన ఎవరో విసిరిన వెక్కిరింపు- తన మనస్సులో ఒక భీకరభావవాహినిని పసువు లెత్తించాయి. అతని ముఖంమీద ఎవరో ఛెళ్ మని కొరడాతో కొట్టినట్టనిపించింది. అతని కనుబొమలు ఒక్కమాటు నాగేటి చాలులా ముడుచుకున్నాయి. సుడితిరిగిన బాధతో అధరోష్టం కరుచుకున్నాడు.

'నామాటలు ఒక్కటీ వినడంలేదేం అన్నయ్యా? నీ భవిష్యత్తులో మంచికోసం ఎంతో చక్కని విషయాలు చెబుతున్నాను. నీ ఉద్దేశం చెప్పవూ?' అన్నది సిబిల్.

'న న్నేం చెప్పమంటావు?'

'నీవు మంచి అబ్బాయిగా ఉంటావనీ, మమ్మల్ని మరచిపోననీ చెప్పు-' అన్నది ఆ పిల్ల చిరునవ్వుతో.

'నీవు నన్ను మరిచేలా ఉన్నావు కాని, నేను నిన్ను మరిచేలా లేను సిబిల్!'

ఆమె చెక్కిళ్ళు కెంపెక్కాయి.

'అదేమిటి జిమ్! అలా అన్నావు?'- అన్నది.

'నీకెవరో కొత్త స్నేహితుడొకడు దొరికాడటగా? విన్నాను. ఎవరతను? ఇంతకాలం నాతో ఎందుకు చెప్పలేదు? అతను నీకు మంచిమటుకు చెయ్యడు.'

'ఆపు జిమ్! అతన్ని గురించి అలా మాట్లాడకు. నేనతన్ని ప్రేమిస్తున్నాను.'

'అతని పేరైనా నీకు తెలీదే- అతను నీ ప్రియుడా? ఎవ రతను? నాకు తెలుసుకునే హక్కుంది.'

'అతని పేరు ... అతని పేరు ... ఏం చెప్పను అతని పేరు! ... .... అతని పేరు 'ముద్దుల రాకుమారుడు' అలా పిలుస్తాను. ఏం అన్నయ్యా? బాగాలేదా ఈపేరు? అబ్బాయ్! చూడు- ఈపేరు జ్ఞాపకం ఉంచుకో. ఎన్నటికీ మరచిపోకు. మరచిపోవుకదూ? అన్నయ్యా! నీవు అతన్ని చూస్తే... నిజంగా లోకంలో అంత అద్భుతమైన వ్యక్తి లేడనుకుంటావు. నిజంగా నన్నయ్యా! వకరోజుకు నీవు అతన్ని కలుసుకుంటావు. తప్ప

కుండా కలుసుకుంటావన్నయ్యా! నీవు ఆస్ట్రేలియానుంచి తిరిగి వస్తావే— అప్పుడు అతన్ని కలుసుకుంటావు. అతనంటే ఎంతో ఇష్టపడతావు. నాకు తెలుసు. అందరూ అతనంటే ఎంతో ఇష్టంగా చూచుకుంటారు. నేను... నేను... మరి... అతన్ని ప్రేమిస్తాను. అన్నయ్యా, ఇవాళ రాత్రికి నీవు థియేటర్‌కు వస్తే ఎంత బావుండును! అతనూ వస్తున్నాడు. నేను జూలియట్‌గా నటించబోతున్నాను. అన్నయ్యా! ఏం చెప్పను! ఇవాళ రాత్రికి ఎంతఅద్భుతంగానటిస్తాననుకున్నావు! ఒక్కమాటు ఊహించుకో.. ప్రేమిస్తూ జూలియట్‌గా నటిస్తూంటే ఎలా ఉంటుందో! అందులో అతని ముందు. అతనక్కడే కూచునిఉన్నాడు. అతనికోసం నటించడం! అతని ముచ్చటకోసం, అతనిఆనందంకోసం నటించడం! ఊహించుకో అన్నయ్యా! నాకు భయం వేస్తోంది. ఏంచేస్తానో? ఎలా నటిస్తానో! నటిస్తానో నటించలేనో, అందరినీ నటించలేక భయవిహ్వాలులను చేస్తానో లేక అద్భుతంలో ముంచెత్తుతానో! ఎంత కష్టం! ఒక వైపు ప్రేమిస్తూ - ఆ ప్రేమను అధిగమించడం— ఎంతకష్టం! ఇవాళ రాత్రి నాజీవితంలో ఏదో పెద్దమార్పు వస్తుందన్నయ్యా! ఏదో పెద్దమార్పు వస్తుంది! నేనొక అద్భుత దర్శనంలా రంగస్థలంపై అవతరిస్తాను! నాకు తెలుసు. కాని ఇదంతా అతని మహిమే, అతనిదే. నాహృదయాధీశ్వరునిదే! నా లోకాద్భుతప్రియునిదే! నా లావణ్యదేవతామూర్తిదే. కాని అతనిముందు నేనెంత? నేనో పేదరాలిని. పేదరాలిని! అవుతేమటుకేం? దారిద్ర్యం వాకిటిదోవన వస్తే ప్రేమ దొడ్డిదోవన పారిపోతుందన్నారు. ఇది నిజం కాదు. మన సామెతలు తిరగవ్రాయాలి. అవి ఏనాడో వయస్సుమళ్ళిన శీతాకాలంలో చెప్పిన

చెప్పని మాటలు కాని, ఇది వసంతం. నాజీవితానికి ఇది తొలి వసంతం. నీలాలనింగినిండా పూలకన్నెలఆట సాగుతూంది.'

'అత నో పెద్దమనిషికదూ?' – అడిగాడు కుర్రాడు.

'పెద్దమనిషంటావేమిట?– పెద్దరాజకుమారుడవుతే!'– అన్నది రాగంతీస్తూ సిబిల్.

'అతను నిన్ను బానిసని చేసుకోవాలనిచూస్తున్నాడు.'

'నా కదే సుఖం. అతనినుంచి దూరంగా వుండి అనుభవించే స్వేచ్ఛ నాకు నరకం'

'అమ్మాయ్! అతని విషయంలో నీవు జాగ్రత్తగా వుండాలి.'

'అతన్ని చూడడమంటేనే అతన్ని పూజించడం.అతన్ని తెలీడమంటేనే అతన్ని నమ్మడం.'

'సిబిల్! నీవు అతన్ని గురించి వెర్రిగా వున్నావు.'

ఆ అమ్మాయి నవ్వింది. అతని చెయ్యి తనచేతిలోకి తీసుకుంది. 'పిచ్చివాడా! శతవృద్ధులా మాట్లాడుతావేం? ఒక రోజున నీవూ ప్రేమిస్తావు. అప్పుడు తెలుస్తుంది, నీకు ప్రేమఎలాటిదో. అలా ముఖంముడుచుకోకు అన్నయ్యా. నీవు దూరదేశాలకు వెళ్ళేసమయంలో నీ చెల్లి పూర్వం కంటె సుఖంగా వుండడం నీకుమాత్రం సంతోషదాయకం కాదూ? జీవితం మనిద్దరికీప్రసన్నంగా లేదు.బ్రతుకులు మనకు కష్టభరితంగానే గడిచాయి. కాని ఇకముందుమాత్రం ఇలా వుండదు. నీ వొక కొత్త ప్రపంచానికి వెడుతున్నావు. నేనొక కొత్త ప్రపంచాన్ని కనుగొన్నాను. ఇదుగో నన్నయ్యా, ఇక్కడ

రెండు కుర్చీ లున్నాయి. ఇక్కడ కూచుందాం, వచ్చిపోయే వాళ్ళను చూస్తూ.'

వాళ్ళు కూచున్నారు. వచ్చిపోయేవాళ్ళు వారి వంక అపేక్షగా చూస్తున్నారు. రోడ్డుప్రక్క వికసించిన అశోక కుసుమాలు జ్వాలావలయాల్లాగా కనుపిస్తున్నాయి. గాలి రొప్పుతున్నట్టుగావుంది. తెల్లని రజంసకంప జలదంలా గాలిలో వ్రేలాడుతూ వుంది. రంగురంగులగొడుగులు సీతాకోకచిల కల్లా నృత్యంచేస్తూ వెడుతున్నాయి.

ఆ పిల్ల తన అన్నను మాట్లాడేటట్టు చేసింది. అతను మాట్లాడుతున్నాడు. తననుగురించి తన ఆశలనుగురించి, తన భవిష్యతునుగురించి మాట్లాడుతున్నాడు. మెల్లిగా మాట్లాడు తున్నాడు. మాటలు వెదుక్కుంటూ మాట్లాడుతున్నాడు. ఆట గాళ్లుకౌంటర్లు పరస్పరంమార్చుకున్నట్టుగా ఇరువురూమాటలు మార్చుకుంటున్నారు. సిబిల్ బరువుగావుంది. తన ఆనందాన్ని వ్యక్తంచేయలేకపోతోంది. ఒక పల్చని నవ్వు ఆమె పెద వుల అంచుల తెరలావుంది. కొంతసేపటికి ఆమె మెల్లగా ఊరు కుంది. హఠాత్తుగా ఆమె కళ్ళముందు, బంగారురంగు జుట్టూ నవ్వుతున్న పెదవులూ తళుక్కుమన్నాయి.

డోరియన్ ఇరువురు స్త్రీలతో కలిసి గుర్రపు బగ్గీలో వెడుతున్నాడు.

ఆమె వులికిపడి లేచింది. 'అడుగో, అతనే!' అన్నది.

'ఎవరు ?' - అడిగాడు జిమ్.

'నా హృదయాధిపతి.'

అతను తోకతొక్కిన తాచులా బుస్సుమని లేచి ఆమె చెయ్యి గట్టిగా పట్టుకుని, 'ఏడీ అతను? చూపించు. నేనుచూచి తీరాలి' అన్నాడు. కాని అదే క్షణంలో డ్యూక్ ఆఫ్ బెర్విక్ గుర్రపు బగ్గీ అడ్డువచ్చింది. ఆ బండి తొలగిపోయేలోగా డోరియన్‌బండి పార్కునుంచి దాటిపోయింది.

'వెళ్లిపోయాడు. నీవు చూచివుంటే ఎంతబావుండేది!' గుసగుసలాడింది సిబిల్ విషాదంగా.

'అవును. నేను చూచివుంటే ఎంతో బావుండేది. కాని ఒకమాట చెబుతున్నాను. ఈమాట భగవంతుడెంతసత్యమో అంతసత్యం. నీకు అతను ఏవంతయినా ద్రోహం చేశాడంటే అతన్ని చంపితీరతాను.'

ఆమె భయచలిత నయనాలతో అతనివంక చూచింది. అతను మళ్ళీ అవే మాటలు చెప్పాడు. ఆ మాటలు బాకుల్లా గాలిలో దూసుకునిపోయాయి చుట్టూజనం 'ఏమిటిది?' అన్నట్టు చూడసాగారు. దగ్గరలోనే నిల్చున్న ఒక స్త్రీ వెకిలిగా నవ్వింది.

'వచ్చేశెయ్ జిమ్. ఇక్కడినుంచి వెడదాం' అన్నది సిబిల్. అతను గుడ్డిగా ఆమెను అనుసరింపసాగాడు. ఇద్దరూ జనంమధ్యనుంచి దోవచేసుకుంటూ వెడుతున్నారు. అతనలా మాట్లాడినందుకు అతనికెంతో సతోషం కలిగింది. ఇరువురూ ఒక ప్రతిమదగ్గరకు వచ్చారు. ఆమె వెనక్కు తిరిగిచూచింది. ఆమెకళ్ళలో జాలి ఆమెపెదవులపై నవ్వుగా మారింది. ఆమె తలఊపి 'నీవు వట్టిపిచ్చివాడివి జిమ్! వట్టి పిచ్చివాడివి! ఏ దొచ్చినా పట్టలేవు. వట్టి తొందరపాటు. అయినా అవేం

మాటలు జిమ్! ఇంత అసూయ ఇంత కఠినమేమిటి జిమ్! నీవ్వూ ప్రేమిస్తే ఎంత బావుంటుంది. ప్రేమ మనుష్యుల్ని మెత్తబరిచి మంచివాళ్ళను చేస్తుంది.'

'నేనేం పసివాణ్ని కాదు సిబిల్. నా కిప్పుడు పదహారేళ్లు. నామంచీ నాచెడూ నాకు తెలీకపోలేదు. అమ్మ నీకు సహాయపడలేదు సిబిల్. నీ మంచి చెడలు ఎలా చూడాలో ఆమెకు తెలీదు. ఇప్పుడు నీపరిస్థితి చూస్తే ఆస్ట్రేలియా ప్రయాణం ఆపుచేసుకుంటే ఎంత బావుంటుందా అనుకుంటున్నాను.'

'అలా మాట్లాడకు జిమ్. అమ్మ చిన్నతనంలో ఎంతో ప్రీతితో నటిస్తూవచ్చిన వెర్రినాటకాల్లోని నాయకుడల్లే మాట్లాడుతున్నావు. కాని ఇప్పుడు నీతో తగాదాపడను. అతను కనుపించాడు. అతను కనుపించడం ఆనందం! ఇహ మనకు తగాదా ఎలావస్తుంది? నీవు నాప్రియులైనవారికి ఎవరికీ ఎప్పుడూ హానిచెయ్యవని నాకు తెలుసు జిమ్. అలా చేస్తావా జిమ్?'

'నీవు అతన్ని ప్రేమించినంతకాలం అలా చెయ్యను సిబిల్.'

'నే నతన్ని ఎప్పుడూ ప్రేమిస్తూనే ఉంటాను జిమ్.'

'మరి అతనో?'

'అతనూ అంతే.'

'అదే అతనికి శ్రేయస్కరం.'

ఆమె కొంచెం వెనక్కు తగ్గింది. మళ్ళీ నవ్వి, చెయ్యి అతనిబుజంమీద వేసింది. అతను వట్టి పసిపిల్లాడు.

మార్బిల్ ఆర్చ్ దగ్గర బస్ఎక్కారు. ఆ బస్ వారిని ఈస్టన్‌రోడ్‌లో వారికొంపదగ్గర దించింది. అయిదు గంటలు

దాటింది. స్టేజిమీాదికి వెళ్ళబోయేముందు రెండు గంటలసేపు సిబిల్ నిద్రిస్తుంది. ఆమె కా నియమం జిమ్ పెట్టిందే, అమ్మ రాకముందే తను వెళ్ళిపోతానని చెప్పాడు జిమ్. అమ్మ వచ్చిందంటే గొడవచెయ్యక తప్పదు. ఈ గొడవ లంటే అతనికి అసహ్యం.

సిబిల్ గదిలోనే అతను సెలవుపుచ్చుకున్నాడు. కుర్రాడి హృదయంలో, తననూ తన చెల్లెల్నీ విడదీసిన ఆ అపరిచితుని పట్ల అసూయాద్వేషాలు సెలవేస్తున్నాయి. అయినా, ఆమె చేతులు అతని మెడచుట్టూ పెనవేసినప్పుడు, ఆమె వేళ్ళు, అతని జుట్టులోగుండా దూసుకునిపోయినప్పుడు అతని హృదయం మెత్తబడింది, ఆ చిన్నదాన్ని నిజమైన ప్రేమతో ముద్దాడాడు. అతను మెట్లు దిగి వెడుతూండగా అతనికళ్ళలో నీళ్ళు తిరిగాయి.

అతనికోసం తల్లి క్రింద కాచుకుని ఉంది. అతనురాగానే ఆలస్యంగా వచ్చినందుకు కాస్త గొనగొనలాడింది. అతను జవాబు చెప్పలేదు. మెల్లగా భోజనానికి కూచున్నాడు. మాట్లాడకుండా భోజనంచేస్తున్నాడు. టేబిల్ చుట్టూ ఈగలు రొదచేస్తూ తిరుగుతున్నాయి. మురికిగాఉన్న గుడ్డమీాద ప్రాకుతున్నాయి. వీధిలో బస్సుల చప్పుడూ, బండ్ల చప్పుడూ. తల్లి ఏదో నిద్రమత్తుగా మాట్లాడుతోంది. అతనికి మిగిలిన ప్రతి క్షణాన్ని ఆ స్వరం కబళిస్తోంది.

కొంచెంసేపయినతరువాత ఖాళీప్లేటు అవతలికి తోసి చేతుల్లో తల పెట్టుకున్నాడు. తను అడిగితీరా లనుకున్నాడు. తనకు అడిగే హక్కుందనుకున్నాడు. భయంతో అతనిత

అతన్ని గమనిస్తూ ఉంది. ఆమె పెదవులనుంచి ఆమెకు తెలీకుండానే మాటలు రాలిపడుతున్నాయి. చిరిగి మాసిన ఒక చేతురూలు ఆమె వ్రేళ్ళసందున మెలిపెడుతూ ఉంది. గడియారం అరు కొట్టింది. అతను లేచాడు. తలుపు దగ్గరికివెళ్లాడు. తలుపుదగ్గర ఆగి తిరిగి చూచాడు. వారికళ్లు కలుసుకున్నాయి. ఆమెకళ్ళలో ఒక విపరీతమైన జాలి కనుపిస్తోంది. అతన్ని దయ దలచమని ప్రార్థిస్తున్నట్టుగా ఉన్నాయి ఆకళ్ళు. ఆ జాలే అతన్ని కోపోద్రిక్తుణ్ణి చేసింది.

'అమ్మా! నిన్నొకవిషయం అడగా లనుకుంటున్నాను' అన్నాడు. ఆమెకళ్లు అవ్యక్తంగా గది నలుమూలలా కలయ చూచాయి. ఆమె జవాబు చెప్పలేదు. 'నాకు నిజం చెప్పు. నాకు తెలుసుకునే హక్కుంది. నీవు నాన్నని వివాహం చేసుకున్నావా, లేదా?' అన్నాడు జేమ్స్.

ఆమె బరువుదిగినట్టు ఒక్కమాటు విశ్వసించింది. ఆ ఖరుకు ఆ క్షణం వచ్చింది. ఈ భీకరక్షణం కోసమే వారాలు, నెలలు, రాత్రింబవళ్లు ఆమె భయపడుతూవచ్చింది. ఆఖరుకు ఆ క్షణం వచ్చింది. కాని ఆమె భయపడలేదు. ఒకవిధంగా ప్రమాదం ఇంత తేలిగ్గా తేలిపోవడం ఆమెకు నిరాశాస్పదం గానే ఉంది. అతను ఆ ప్రశ్న సూటిగా అడిగాడు. తనూ సూటిగా జవాబుచెప్పాలి. సన్నివేశం హఠాత్తుగా పిడుగుపడ్డట్టు పడింది. క్రమంగా వృద్ధిచెంది పరిణమించింది కాదు. చాలా నాటుగా ఉంది సన్నివేశం. తొలిసారి వేసిన నాటకాభ్యాసం ఆమెకు జ్ఞప్తికొచ్చింది.

'లేదు,' అన్నదామె, జీవితం ఎంత కఠిన విషయాన్నైనా ఇంత సులువుగా తేల్చెయ్యడం చూచి ఆశ్చర్యపోతూ.

'అంటే మానాన్న పట్టి పచ్చి పుండాకోర్ అన్న మాట'— అన్నాడు కుర్రాడు పిడికిళ్ళు బిగించుకొని.

ఆమె తల ఊపింది. 'ఆయనకు నన్ను పెళ్ళాడే స్వాతంత్ర్యం లేదని నాకు తెలుసు. మేము ఒకరిని ఒకరం ఎంతో ప్రేమించుకున్నాం. ఆయన బ్రతికి బాగున్నట్టయితే మన తిండికీ బట్టకూ లోపం లేకుండా చేశాడు. ఆయన్ను గురించి అలా మాట్లాడకు నాయనా. ఆయన నీకు తండ్రి. పెద్దమనిషి. అదీ గాక ఆయన అంతస్తూ గొప్పది. సంఘంలో ఆయన సంబంధ బాంధవ్యాలూ గొప్పవి.'

అతని పెదవులనుంచి ఏదో తిట్టు వెలువడింది. 'నన్ను నేను లెక్క చెయ్యనమ్మా. కాని సిబిల్ విషయమే ఆలోచిస్తున్నాను. దాన్ని ప్రేమిస్తున్నదికూడా ఒక పెద్దమనిషేకదూ! పెద్దమనిషి అయినా కాకపోయినా తను పెద్దమనిషినని చెబుతున్నాడు. అతనికీ పెద్దబంధువర్గం ఉందనుకుంటాను. కదూ?—' అన్నాడు.

ఒక్క నిమిషంపాటు ఆ వృద్ధురాలు అవమానభారంతో కుంగిపోయింది. ఆమెతల వాలిపోయింది. కంపిస్తున్న వ్రేళ్ళతో కన్నీళ్ళు తుడుచుకున్నది. 'సిబిల్ మంచిచెడలు చూడడానికి సిబిల్‌కు ఒక తల్లయినా ఉంది నాయనా. నాకా తల్లీ లేదు. నాతల్లి చిన్నతనంలోనే పోయింది' అన్నది.

తల్లి ఈమాట అనగానే కుర్రాడి గుండె గతుక్కుమన్నది. తల్లితో ఎందుకలా కర్కశంగా మాట్లాడానా అని

పించింది. ఆమెను సమీపించి వినమ్రంగా వంగి ఆమెను ముద్దాడాడు. 'తండ్రిని గురించి అడిగి నిన్ను కష్టపెట్టినందుకు క్షమించమన్నా. కాని అడగలేకుండా ఉండలేకపోయాను. ఇక నేను వెళ్ళాలి. వస్తాను. నేను వెడుతున్నాను. ఇక నీవు జాగ్రత్త తీసుకోవలసింది ఒకబిడ్డనిగురించి మాత్రమే. కాని ఒక విషయంమాత్రం జ్ఞాపకం ఉంచుకో. ఆ వ్యక్తి కనక నా చెల్లెలికి ద్రోహంచేశాడంటే అతన్ని వదలిపెట్టను. అత నెవరో కనుక్కొని తీరుతాను. అతన్ని వెంటాడి వేటాడి కుక్కను చంపినట్టు చంపుతాను. ఇది నా ప్రతిజ్ఞ' — అన్నాడు.

ఈ బెదిరింపులోని అత్యుక్తి ప్రతిజ్ఞకావిస్తూ అతను ఉద్రేకంతో అభినయించిన తీరు, నాటకంలోమాటల్లా ఉన్న ఆ పలుకులు – ఆమెకు జీవితాన్ని మరింత విస్పష్టరూపంలో కనుపింపచేశాయి. ఆమెకు వాతావరణం పరిచితంగా కనుపించింది. కాస్త ఊపిరి పీల్చుకుంది. ఎన్ని నెలలయిందో తన కొడుకును చూచి ఇలా ముచ్చటపడి – అలా ముచ్చటపడింది. ఇలాగే ఈ రంగం సాగితే ఎంత బావుండు నా అనుకుంది. కాని అతను అంతలో అకస్మాత్తుగా ఆపుచేశాడు. పెట్టెలు కిందికి దించాలి. మఫ్లర్ కోసం వెదకాలి. క్రింద బండివానితో బేరం సాగుతోంది. అతను వెడుతున్నాడు. ఏవేవో గొడవలతో గడిచింది క్షణం. మళ్ళీ నిరాశ. ఆమె మాసిన చేరుమారులు కిటికీలోనుంచి ఊపుతోంది. కొడుకు వెళ్ళిపోతున్నాడు. ఒక గొప్ప అవకాశం నిరుపయోగమైపోతోందని ఆమెకు తెలుసు. ఇక తనజీవితం ఎంతనిరామయమవుతుందో

సిబిల్‌తో చెప్పుకుని తనను తాను ఓదార్చుకుంది. ఇక తను చూచుకోవలసింది ఒక్క బిడ్డనే అన్నాడు కొడుకు.

ఆ మాట జ్ఞాపకం వచ్చింది. ఆమెకు సంతోషమైంది. అతని ప్రతిజ్ఞనుగురించి సిబిల్‌తో ఆమె ఏమీ చెప్పలేదు. ఆ ప్రతిజ్ఞ ఎంతో స్పష్టంగా చేశాడు. నాటకాల్లోలా చేశాడు. ఒకనాటికి అంతా ఆ ప్రతిజ్ఞను తలుచుకుని నవ్వవలసివస్తుం దనుకున్నది.

## 6

'విన్నావటోయ్ ఈ వార్త బేసిల్ ?' - అన్నాడు లార్డ్ హెన్రీ. అది సాయంత్రం. హాల్‌వర్డ్ బ్రిస్టల్ వచ్చాడు. లార్డ్ హెన్రీ అతన్ని గదిలోకి తీసుకుపోతూ ఇలా అన్నాడు- 'ముగ్గురికోసం డిన్నర్ సిద్ధంగా ఉంది.'

'ఏవార్త ? రాజకీయాలను గురించి కాదుకదా? రాజకీయాలలో నా కేమాత్రం ఆసక్తి లేదు. అవి నా కేమాత్రం గిట్టవు. హౌస్ ఆఫ్ కామన్స్‌లో బొమ్మ రాయదగిన మనిషి ఒకడూ లేడు. కొందరికి మాత్రం సున్నం రాయడం ఉచితం'- అన్నాడు చిత్రకారుడు.

'డోరియన్ గ్రే పెళ్ళాడతాడట' - అన్నాడు హెన్రీ.

హాల్‌వర్డ్ ఉలికిపడ్డాడు. తరువాత ఒక క్షణం ఆగి 'డోరియన్ పెళ్ళాడతాడా? అసంభవం' అన్నాడు.

'అసంభవం కాదు, నిజం.'

'ఎవరిని పెళ్ళాడుతున్నాడు ?'

'ఎవరినో ఒక చిన్న నటిని '

'నాకు నమ్మకం లేదు. డోరియన్ ఇంత వెర్రివా డను కోను.'

'డోరియన్ చాలా తెలివిగలవాడు. అందుచేతనే అప్పుడప్పుడు ఇలా చిన్ని చిన్ని తెలివి తక్కువ పనులు చేస్తుంటాడు బేసిల్.'

'పెళ్లి అనేది అప్పుడప్పుడు చేసేపని కాదు హెన్రీ!'

'ఒక్క అమెరికాను మినహాయిస్తే నీవు చెప్పింది నిజమే. అయినా అతను పెళ్ళాడాడని నేను అనలేదు. పెళ్ళాడబోతున్నాడన్నాను. ఈ రెంటిలో చాలా తేడా ఉంది. నాకు నాపెళ్ళి బాగా జ్ఞాపకం. కాని నా పెళ్ళికిముందు ప్రణయకలాపంమాత్రం జ్ఞాపకం లేదు. నే నసలు ఎప్పుడూ అలాటి వ్యవహారంలో పడలే దనుకుంటాను.'

'కాని డోరియన్ పుటక, అంతస్తు, సంపత్తి ఎలాటివో ఆలోచించు. అతను తక్కువరకం పిల్లని పెళ్ళాడడం ఏం సమంజసం ?'

'అతను ఈ పిల్లని తప్పకుండా పెళ్ళాడాలంటే ఈ విషయమే అతనికి చెప్పిచూడు, బేసిల్! ఆ తర్వాత తప్పకుండా ఆ పిల్లని పెళ్ళాడతాడు. ఒకమనిషి ఒక అవివేకమైన పని చేశాడంటే దానికి తప్పకుండా గొప్ప ఉద్దేశాలే కారణమై ఉంటాయి.'

'ఆ అమ్మాయి తప్పకుండా మంచిదై ఉంటుందనుకుంటాను, హెన్రీ. డోరియన్ ఒక నీచురాలితో ముడిపెట్టుకోడం

నాకు ఇష్టంలేదు అది అతని స్వభావాన్ని అధఃపతితంచేస్తుంది. అతని మేధస్సునూ నాశనం చేస్తుంది.'

'మంచిపిల్ల అంటావేమిటి? ఒక్క మంచిపిల్లమాత్రమే కాదు. చక్కనిదికూడా' అన్నాడు లార్డ్ హెన్రీ, నారింజరసం మెల్లగా ఒక చిన్నగుక్క తాగి చప్పరిస్తూ - 'ఆ అమ్మాయి చాలా అందగత్తెఅంటున్నాడుడోరియన్. ఇలాటివిషయాల్లో డోరియన్ ఎప్పుడూ పొరబాటుపడడు. నీవు అతని బొమ్మ వ్రాసినతరువాత, ఇతరులరూపాన్ని ఆస్వాదించి అభినందించే అభిరుచి అతనిలో ఎక్కువైంది. ఇవాళరాత్రికి, అతను మరిచి పోకుండా ఉంటే అతనితో కలిసివెళ్ళి ఆ అమ్మాయిని చూడ బోతున్నాం.'

'నిజంగానా?'

'నిజంగా బేసిల్! నేను గమ్మత్తుకు చెప్పడంలేదు. ఈ క్షణంలో నేను ఎంతసీరియస్‌గా ఉన్నానో అంత సీరియస్‌గా ఇహ ముందు ఎప్పుడు ఉంటానని భావించినా అది విచారకర విషయమే ననుకుంటాను.'

'కాని, ఇంతకూ నీవు ఈ వివాహం ఒప్పుకుంటావా హెన్రీ? ఒప్పుకోవనుకుంటాను. ఇదేదో చిన్నతనపుఉన్మాదం లాగా ఉంది.'

'నేను ఏ విషయాన్నయినా, ఇప్పుడు ఒప్పుకోడం ఒప్పు కోకపోవడమంటూలేదు. జీవితంపట్ల ఇది అర్థంలేని దృష్టి మన వ్యక్తిగతమైన పాక్షిక నైతికాభిప్రాయాలను ప్రదర్శించ డానికి మనం పుట్టలేదు. సాధారణ మానవుల అభిప్రాయా లను నే నెప్పుడూ పట్టించుకోను. అందగాళ్ళు ఏపనిచేసినా

నే నెప్పుడూ జోక్యం కలిగించుకోను. ఒక చక్కని వ్యక్తి నన్ను ఆకర్షించాడూ అంటే ఆ వ్యక్తి ఏ పనిచేసినా, ఏ బాటలో నడిచినా, ఏ స్వరూపంలో తనను తాను వ్యక్తీక రించుకున్నా అది నాకు రమణీయంగానే కనుపిస్తుంది. డోరియన్ ఒక చక్కని అమ్మాయిని ప్రేమించాడు. ఆ అమ్మాయి జూలియట్‌గా నటిస్తుంది. డోరియన్ ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటా నంటున్నాడు. చేసుకోనీ! ఎందుకు చేసుకోకూడదు? మెసలీనాను పెళ్ళాడినా అతను నా దృష్టికి ఇలాగే కనుపించేవాడు. నేను వివాహాన్ని సమర్థించేవ్యక్తిని కానని నీకు తెలుసుకదా? అసలు వివాహంలోఉన్న లోపమేమిటో చెప్పనా? వివాహం మనిషిని స్వార్థరహితుణ్ణి చేస్తుంది. స్వార్థం లేని మనిషిలో మజాలేదు. వాళ్ళలో వ్యక్తిత్వం కనుపించదు. కాని, కొన్నిస్వభావాలనుమాత్రం వివాహం మరింత క్లిష్టం చేస్తుంది. వాళ్ళ 'అహం' పోకుండా ఉండడమే కాక మరెన్నో అహాలువచ్చి దానితో కలుస్తాయి. వాళ్ళు ఒకబ్రతుకు కాదు–అనేక బ్రతుకులు బ్రతికే అవసరం కలుగుతుంది. వాళ్ళలో ఎంతో నిండూ నింపాదీ వస్తాయి. ఎంతో సచేతను లవుతారు కూడా. అంతకంటె మానవుని ఉనికికి అర్థం మరొకటి లేదను కుంటాను. ఇంతేకాదు – ప్రతి అనుభవమూ విలువైనదే. వివాహాన్ని ఎవరేమన్నా, వివాహంకూడా ఒక అనుభవమే. డోరియన్ ఈ అమ్మాయిని పెళ్ళిచేసుకుంటాడని, పెళ్ళాడిన ఆరు నెలలవరకూ ఆ అమ్మాయిని దేవతలా పూజించుకుంటాడనీ, ఆ తరువాత అకస్మాత్తుగా మరోఅమ్మాయి కంటపడి ఆ

అమ్మాయిపై మనసు కొంటాడని ఊహిస్తాను అప్పుడు చూడు, డోరియన్ జీవితం ఎంత చక్కగా ఉంటుందో!'

'ఇవన్నీ నీవు నిజంగా అంటున్న మాటలు కావుకదా హెన్రీ! నాకు తెలుసు – నీవు నిజంగా ఇలా మాట్లాడవని. డోరియన్ జీవితం పాడైపోతే నీకంటె విచారించేవా రెవరూ ఉండరు. నీవు పైకి కనుపించేటంత చెడ్డవాడివి కాదు.'

లార్డ్ హెన్రీ నవ్వాడు.

'ఇతరులనుగురించి మనం మంచిగా భావించడానికి కారణం మనల్ని చూచి మనం భయపడడమే. ఆశాదృష్టికి మూలం కేవలం భయం. అంతే. మనకు లాభకరమైన గుణగణాలను మన ప్రక్కవ్యక్తిపై ఆపాదించి మనం ఎంతో ఔదార్యం చూపినట్టు భావిస్తాం. మన ఎకౌంట్‌లో ఓవర్‌డ్రా చేసే నిమిత్తం బాంకర్‌ని పొగడుతాం. మన జేబులుకొట్టకుండా మనల్ని వదిలిపెడతాడుకదా అనే ఉద్దేశంతో దొంగదొంగ గొప్పవాడంటాం. నేను అన్న ప్రతిమాటా అనుకుని అన్నమాటే కాని ఊరికే అన్నమాట కాదు. ఆశాదృష్టిఅంటే నాకు మహా రోత. ఇహ జీవితం పాడుకావడం విషయం – అభివృద్ధి ఆగిపోయిన జీవితం తప్ప మరేజీవితమూ పాడైనట్టు కాదు. నీవు ఒక వ్యక్తిని పాడుచెయ్యాలంటే అతన్ని సంస్కరించు – చాలు. ఇహ నీవు వేరే అతన్ని పాడుచెయ్యనక్కర్లేదు. ఇహ వివాహం విషయం– అది అంత చెప్పుకోదగింది కాదు, అంత పెద్ద విషయమూ కాదు. స్త్రీ పురుషుల మధ్య అంతకంటె అందమైన బాంధవ్యా లున్నాయి. నేను వాటిని ప్రోత్సహిస్తానుకూడా, వాటిల్లో ఒకఅందం ఉంది. అడుగో డోరియన్

వచ్చేశాడు. అతనే నాకంటే విపులంగా అన్ని విషయాలూ చెప్పేస్తాడు.'

'డియర్ హెన్రీ! డియర్ బేసిల్! మీరిద్దరూ నన్ను అభినందించాలి సుమా' అన్నాడు కుర్రాడు ప్రవేశిస్తూ.

'ఇంత సుఖంగా నే నెప్పుడూ లేను. అకస్మాత్తుగా జరిగిన విషయమే అనుకోండి. అందమైన విషయాలన్నీ అకస్మాత్తుగా నే జరుగుతాయి. కాని, నా జీవితమంతా నేను ఆశించింది, అన్వేషించింది ఇందుకోసమే ననిపిస్తోంది' అన్నాడు. ఉద్వేగంతోనూ ఆనందతోనూ అతని చెక్కిళ్లు ఎరుపెక్కాయి. అతీతమైన అందం ఆవహించినట్టు కనుపించింది.

'నీవు ఎప్పుడూ సుఖంగానే ఉంటావని ఆశిస్తాను డోరియన్. కాని నీ పెళ్లి విషయం నాతో చెప్పనందుకు మాత్రం నిన్ను క్షమించను. హెన్రీతో మాత్రమే చెప్పావు' అన్నాడు హాల్వర్డ్.

'నేనూ ఒక విషయానికి నిన్ను క్షమించను. నీవు డిన్నర్‌కు ఆలస్యంగా వచ్చావు' అన్నాడు లార్డ్ హెన్రీ ఆకుర్రాడి భుజంపై చెయ్యివేసి నవ్వుతూ— 'ఇహ రా. భోజనానికి కూచుందాం. అప్పుడు నీవు కథంతా చెప్పవచ్చు.'

ముగ్గురూ చిన్న గుండ్రని బల్లచుట్టూ కూచున్నారు. డోరియన్ ఇలా మొదలెట్టాడు— 'చెప్పవలసింది పెద్దగా ఏమీ లేదు. జరిగిన విషయం ఇది: హెన్రీ, నిన్న నీదగ్గరనుంచి వెళ్ళిన తరువాత డ్రెస్ చేసుకుని రూపర్ట్ స్ట్రీట్‌లో ఒకమాటు నీవు నన్ను తీసుకుని వెళ్ళావ్ చూచావ్ – ఆ ఇటాలియన్ రెస్టారెంట్‌కు వెళ్ళి డిన్నర్ తీసుకున్నాను. తరువాత ఎనిమిది

గంటలకు థియేటర్‌కు వెళ్ళాను. ఆ రాత్రి సిబిల్ రోసలిండ్ పాత్ర ధరిస్తోంది. సీనరీ మహాభీభత్సంగా ఉంది. ఆర్లెండో కూడా అసహ్యంగా ఉన్నాడు. కాని సిబిల్ మాత్రం! ఎలా ఉందనుకున్నావు! నీవు తప్పకుండా చూచి తీరవలసింది! కుర్రాడి ముస్తాబులో రంగస్థలం ప్రవేశించగానే అద్భుతంగా కనుపించింది. ఆకుపచ్చని వెల్వెట్ జెర్కిన్ వేసుకుంది. అందమైన చిన్నిటోపీ పెట్టుకున్నది. ఒక చిన్నముత్యంలో గుచ్చిన పక్షి ఈక ఈ ముస్తాబులో సిబిల్ ఎంత అందంగా ఉందనుకున్నావు! సిబిల్‌ను ఇంత అద్భుతంగా నే నెన్నడూ చూడలేదు. ఒక తీర్చిదిద్దిన ప్రతిమలా లావణ్యం ఒలికి పోతూంది. ఒక తెల్లని గులాబీచుట్టూ పచ్చని ఆకులు చుట్టి నట్టు తలచుట్టూ జుట్టు జడలు చుట్టుకున్నది. ఇహ ఆమె నటన విషయం ఏం చెప్పను! ఇవాళ రాత్రికి మీారే చూస్తారుకదా! ఆమె పుట్టుకతోటే గొప్ప కళాభిజ్ఞురాలని చెప్పాలి. కూపంలా ఉన్న ఆ బాక్సులో నేను ఆమె నటించినంత సేపూ నిశ్చల ప్రతిమనై కూర్చుండిపోయాను నే నున్నది ఈ లండన్‌లోననీ, బ్రతుకుతున్నది ఈ పందొమ్మిదవ శతాబ్దంలోననీ మరిచి పోయానంటే నమ్ము. నేను నా ప్రియురాలితో కలిసి మానవ మాత్రుడు కనిపించని ఒక అరణ్యంలోకి వెళ్ళిపోయాను. నాటకం కాగానే గ్రీన్‌రూమ్‌లోకి వెళ్లి ఆమెతో మాట్లా డాను. మే మిద్దరం ప్రక్క ప్రక్కనే కూచుని మాట్లాడు తున్నాం. అప్పుడు ఆమె కళ్ళలోకి అదోచూపు ప్రవేశించింది. అలాటిచూపు ఎన్నడూ ఆమె కళ్ళలో నేను చూడలేదు. నా పెదవులు ఆమె పెదవులదాపుకు వెళ్ళాయి. ఇరువురం

ముద్దాడాం. ఆక్షణంలో నేనెలా ఉన్నానో ఇప్పుడు మీకు చెప్పలేను. నా బ్రతుకంతా కరిగి ఒక గులాబీరంగు ఆనంద బిందువుగా సూక్ష్మీకృతమైనట్టు తోచింది. ఆ బిందువులో బ్రతుకంతా ఇమిడిపోయింది. ఆమె ఆపాదమస్తకం వణికింది. ఒక తెల్లని నార్సిసస్ పుష్పంలా కంపించింది.

'వెంటనే ఆమె మోకాళ్ళని నా చేతులు ముద్దాడింది. ఇదంతా మీకు చెప్పకూడదనుకుంటాను. కాని చెప్పకుండా ఉండలేను. మా ప్రణయం మా పెండ్లి ఏర్పాటు ఒక పెద్ద రహస్యమైన మాట నిజమే. ఆ విషయం ఆమె తల్లికి కూడా తెలుపలేదు. నా రక్షకులు ఇందుకు ఏమంటారో కూడా నాకు తెలీదు. లార్డ్ రాడ్లీ ఈ విషయం విన్నాడంటే తప్పకుండా మండిపడతాడు. కాని లెక్క చెయ్యను. ఒక సంవత్సరంలో నాకు ఈడు వస్తుంది. అప్పుడు నే నేం తలుచుకుంటే అది చెయ్యగలను. బేసిల్! నేను నా ప్రియురాలిని కవితనుంచీ, షేక్స్పియర్ నాటకాలనుంచీ ఎన్నుకోడం మంచిదే కదూ? షేక్స్పియర్ మాటలు నేర్పిన చిన్నారి పెదవులు నా చెవుల్లో తీయని రహస్యాలు గుసగుసలాడాయి. రోసలిండ్ హస్తాలు నన్ను కౌగిలించాయి. జూలియట్ పెదవులు ముద్దాడను.'

'అవును డోరియన్, మంచిదే'— అన్నాడు హాల్‌వర్డ్ మెల్లగా.

'ఇవాళ ఆ అమ్మాయిని కలుసుకున్నావా?' అని అడిగాడు లార్డ్ హెన్రీ. డోరియన్ గ్రే అవునన్నట్టు తల ఊపాడు. 'ఆర్డెన్ అడవిలో ఆ అమ్మాయిని వదలిపెట్టాను. వెరోనా తోటలో కలుసుకోబోతున్నాను' అన్నాడు.

లార్డ్ హెన్రీ సాలోచనగా షాంపేన్ చప్పరించాడు. 'నీవు పెండ్లిఅనే ప్రస్తావన సరిగ్గా ఎప్పుడు తీసుకొచ్చావో చెప్పు డోరియన్! ఆ మాటకు ఆ అమ్మాయి ఏమంది? నీవు ఆ విషయమంతా మరిచిపోయావనుకుంటాను' అని అడిగాడు.

'హెన్రీ! నే నా విషయాన్ని ఒక వ్యాపారపు కాంట్రాక్టుగా చూచుకోలేదు. నే నా అమ్మాయిని ప్రేమించానని చెప్పాను. ఆ అమ్మాయి తను నాకు భార్యకావడానికి అనర్హురాలి నన్నది. అనర్హురాలట! పిచ్చిది! ఆమెతో పోల్చి చూస్తే ఈ ప్రపంచమంతా నా దృష్టికి తృణప్రాయమని దానికి తెలీదు!'

'స్త్రీలు చాలా తెలివిగలవాళ్ళు మనకంటె కూడా తెలివిగలవాళ్ళు. ఇలాంటి సందర్భాలలో మనం పెండ్లిని గురించి మాట్లాడడం మరిచిపోతాం. వాళ్ళు మరిచిపోకుండా మనకు జ్ఞాపకంచేస్తుంటారు' అన్నాడు హెన్రీ.

హాల్‌వర్డ్ అతని భుజంమీద చెయ్యి వేశాడు.

'అలా అనకు హెన్రీ. నీవు ఇప్పటికే డోరియన్‌ను కలవరపెట్టావు. డోరియన్ అందరివంటివాడు కాడు. అతను చీమకైనా హానిచెయ్యలేడు. అతని స్వభావం అంతసుకుమారం' అన్నాడు.

లార్డ్ హెన్రీ అతనివంకచూచి, 'డోరియన్ ఎన్నడూ నావల్ల కలవరపడింది లేదు. నే నా ప్రశ్న కారణంఉండే అడిగాను. ఎవరు ఏ ప్రశ్న అడిగినా ఒకటేకారణం ఉంటుంది. అది ఉత్సుకత. అంతే.అంచాతనే నేనూఅడిగాను. నాదో సిద్ధాంతం ఉంది. నా ఉద్దేశంలో స్త్రీలే మొదట్లో వివాహ ప్రస్తా

పన తీసుకొంటారు. మనం—పురుషులం తీసుకురాము. మధ్య తరగతుల్లో మాత్రం ఇలా జరగదనుకో. అయినా మధ్య తరగతుల్లో ఆధునిక నాగరికత లేదు'— అన్నాడు.

డోరియన్ నవ్వి తలవూపాడు. 'నీవు వట్టి మొండి ఘటానివి హెన్రీ. కాని నే నా విషయం పట్టించుకోను.నీమీద కోపం రావడమనేది అసంభవం. నీవు సిబిల్‌ను చూచినప్పుడు ఆ అమ్మాయికి ద్రోహం చేసేవాడు మానవుడు కాదనీ కేవలం రాక్షసుడనీ నీవే ఒప్పుకుంటావు. ఒకడు తను ప్రేమించే విషయాన్ని ఎలా కలుషితం చెయ్యగలడో నేను ఊహించుకో లేను. నేను సిబిల్ వేన్‌ను ప్రేమిస్తున్నాను ఆమెను హేమ సింహాసనంపై అధిష్ఠింపచేస్తాను. నేను ప్రేమించే స్త్రీని లోక మంతా పూజించేలా చేస్తాను. వివాహం వివాహం అంటారు. వివాహమంటే ఏమిటి? ఆడితప్పని ప్రతిజ్ఞ. అంతే కదా? అందుకనే కదూ నీవు వివాహాన్ని వెక్కిరించేది? అలా వెక్కి రించకు హెన్రీ! ఆ మహా దీక్షను నేను స్వీకరింప బోతున్నాను. ఆమె నమ్మకమే నాలో విశ్వాసాన్ని దృఢతరం చేస్తుంది. ఆమె నమ్మకమే నన్ను మంచివాణ్ణిగా చేస్తుంది. ఆ సామీప్యంలో ఉన్నప్పుడు నీవు చెప్పినమాటలు విన్నందుకు ఎంతో విచారపడతాను. నీ మాటలన్నీ అసత్యా లనిపిస్తాయి. నేను మరో మనిషినైపోతాను. నీవుఎరిగిన డోరి యన్‌కు ఆడోరియన్‌కు ఎంతో భేదం ఉంది. ఆమె సాన్నిధ్యంలో నేను పూర్తిగా మారిపోతాను. సిబిల్ తన చల్లని చేతితో నన్ను స్పృశిస్తే చాలు - నిన్నూ, నీ తప్పుడు సిద్ధాంతాలను,

నీవు చెప్పే రమణీయ సిద్ధాంతాలను ఇట్టే తృప్తిలో మరిచి పోతాను.'

'కాని ఆ సిద్ధాంతాలు...', అని ఏదో చెప్పబోయాడు లార్డ్ హెన్రీ.

'అవి, జీవితాన్ని గురించి ప్రేమను గురించి, ఆనందాన్ని గురించి నీవు చెప్పే సిద్ధాంతాలు హెన్రీ! అబ్బ! ఆ సిద్ధాంతాలు చెప్పకు' అన్నాడు డోరియన్.

'సిద్ధాంతీకరణకు అర్హమైంది ఆనందం ఒక్కటే డోరియన్. కాని నా సిద్ధాంతం నాదని నేను చెప్పలేను. ఇది ప్రకృతియొక్క సిద్ధాంతం కాని, నాది కాదు. ఆనందం ప్రకృతి యొక్క పరీక్ష. ఆనందం ప్రకృతి యొక్క అంగీకారానికి చిహ్నం. మనం సుఖంగా ఉన్నప్పుడు మన మెప్పుడూ మంచిగా ఉంటాం. కాని మనం మంచిగా ఉన్నప్పుడుమాత్రం మన మెప్పుడూ సుఖంగా ఉండం' అన్నాడు లార్డ్ హెన్రీ.

'మంచి అంటే నీ ఉద్దేశమేమిటి హెన్రీ?' – అని అడిగాడు బేసిల్ హాల్‌వర్డ్.

'అవును. అదే నేనూ అడగా లనుకున్నాను' అన్నాడు డోరియన్.

'మంచి అంటే' మనతో మనం సమాధానంగా ఉండడమన్నమాట. మనకూ మన ఆత్మకూ అపశ్రుతి లేకుండా ఉండడమన్నమాట. అపశ్రుతి అంటే ఇతరులతో సమాధానంగా ఉండడం. మనకు మన జీవితం – అదే ప్రధానమైన విషయం. ఇతరుల జీవితాలు మనకు అనవసరం. ఇంతే కాదు. వ్యక్తిత్వ వాదానికి గొప్ప ఆదర్శంకూడా ఉంది. అధునాతనయుగంలో

నైతికానికి అర్థమేమిటంటే ఈనాటి ప్రమాణాన్ని అంగీకరించమన్నమాట. సంస్కారంగల ఏ వ్యక్తి అయినా తను నివసించేనాటి నైతికప్రమాణాన్ని ఒప్పుకున్నాడంటే అంతకంటె అవినీతి మరొకటి లేదు,' అన్నాడు లార్డ్ హెన్రీ.

'పరుల శ్రేయస్సును పట్టించుకోకుండా ఎవరికోసం వాళ్ళు జీవిస్తే దానివల్ల చాలా నష్టం ఉంది హెన్రీ', అన్నాడు చిత్రకారుడు - 'దానికి చాలా వెలకట్టాల్సి ఉంటుంది.'

'అవును. ఈ రోజుల్లో ప్రతిదానికీ వెల ఎక్కువైపోయింది. పేదవాళ్ళజీవితాల్లో విషాదమేమిటంటే వారు చేయ్యగలిగిందల్లా తమను తాము నిరసించుకోవడమే. అందమైన పాపాలు అందమైన వస్తువుల్లాగానే ఒక్క శ్రీమంతులకే చెందుతాయి' అన్నాడు లార్డ్ హెన్రీ.

'ధనవిషయికంగా కాకపోయినా ఇతరవిధాలుగా వెల కట్టవలసిఉంటుంది'

'ఇంకేవిధంగా బేసిల్?'

'ఏం చెప్పను? పశ్చాత్తాపంవల్ల కాని... బాధవల్ల కాని ...పతనమైపోయాననే విచారంవల్ల కాని... వెలకట్టాలి.'

లార్డ్ హెన్రీ, ఏమి టీ పిచ్చి అన్నట్టు భుజాలుఊపాడు. 'అబ్బాయ్! మధ్యయుగపుకళ అందంగానే ఉంటుంది. కాని మధ్యయుగపు ఉద్వేగాలుమాత్రం పాతబడిపోయాయి. ఈ ఉద్వేగాలు నవల్లో బాగుండేమాట నిజమే. నా నవజీవితంలో పనికిరాకుండాపోయిన విషయాలనే నవలల్లో ఉపయోగిస్తాం. నే నొకమాట చెబుతాను విను నాగరికు డెవరూ, ఒక

సౌఖ్యం అనుభవించిన తరువాత అందుకోసం విచారించడం అనాగరికుడికి అసలు సౌఖ్యమంటేనే తెలీదు.'

'సౌఖ్యమంటే ఏమిటో నాకు తెలుసు. ఎవరో ఒకరిని ఆరాధించడమే సౌఖ్యం' అన్నాడు డోరియన్.

'ఆరాధింపబడడంకంటె ఆరాధించడం మంచిదే. ఆరాధింపబడడం ఒక పాడుగొడవ. మానవజాతి తను ఆరాధించే దేవతలపట్ల ఎలా ప్రవర్తిస్తుందో స్త్రీజాతి మనపట్ల అలాగే ప్రవర్తిస్తుంది. స్త్రీలు మనల్ని పూజిస్తారు. ఎప్పుడూ వారికి ఏదో ఒకటి చేసిపెట్టమని బాధిస్తుంటారు'

'వాళ్లు మననుంచి కోరే ప్రతివిషయమూ ముందు వారు మన కిచ్చిందయ్యే ఉంటుంది. మనలో వారు ప్రేమను సృష్టిస్తారు. మళ్ళీ దాన్ని తిరిగి ఇవ్వమని అడిగేహక్కు వారికుంది. ఇందులో తప్పేముంది?' — అన్నాడు కుర్రాడు గంభీరంగా.

'నిజం చెప్పావు డోరియన్' — అన్నాడు హాల్‌వర్డ్.

'ఎప్పుడూ ఏదీ పూర్తిగా నిజం కాదు'అన్నాడు లార్డ్ హెన్రీ.

'కాని, ఈ విషయంమాత్రం నిజం. నీవు ఒప్పుకుని తీరాలి హెన్రీ స్త్రీలు తమప్రాణమూలాలనే పురుషులకు అర్పిస్తారు. తమజీవితాల్లోని విలువగల బంగారాన్నంతా పురుషులకిస్తారు' అన్నాడు డోరియన్.

'కావచ్చు. కాని వాళ్ళతో ఒకటే చిక్కుంది. చిన్న చిన్న చిల్లరపైసలుగా దాన్ని తిరిగి ఇవ్వమంటారు. ఒకమాటు ఎవరో ఒక ఫ్రెంచివాడు స్త్రీలను గురించి ఇలా అన్నాడు.

స్త్రీలు మనల్ని గొప్పకళాఖండాలు సృష్టించడానికి ప్రేరే పిస్తారు. కాని అవి పూర్తికాకుండా మనకు అవరోధా లవు తారు.'

'హెన్రీ! అబ్బ! ఏం మనిషివి! ప్రతిదీ ఘోరంగా మాట్లాడుతావు. నీవంటే ఇంత ఇష్ట మెందుకో నాకు తెలీదు.'

'నేనంటే నీ వెప్పుడూ ఇష్టపడతావు డోరియన్. కొంచెం కాఫీ పుచ్చుకుందామా? వెయిటర్! కొంచెం కాఫీ పట్రావోయ్ మంచి షాంపేనూ సిగరెట్లూ కూడా పట్రా. అహా... సిగరెట్లున్నాయిలే; అక్కర్లేదు. బేసిల్! ఇహ నిన్ను చుట్టలు తాగనివ్వను. నీవుకూడా సిగరెట్ కాల్చాలి. సిగరెట్ చూచావ్ - సుష్టయిన సౌఖ్యంయొక్క సుష్టయిన రూపం. సిగరెట్ కాలిస్తే అద్భుతంగా ఉంటుంది. మనల్ని అసంతృప్తి తో వదిలేస్తుంది. ఇంతకంటె కావలసిం దేమిటి చెప్పు డోరి యన్! నేనంటే నీ వెప్పుడూ ఇష్టపడతావు. నిజమే. ఎందుచాత నో చెప్పనా? నీవు చెయ్యదలుచుకుని సాహసంలేక చెయ్య డం మానేసిన పాపాలన్నిటికీ నేను ప్రతినిధిలా కనుపిస్తాను'. అన్నాడు లార్డ్ హెన్రీ.

'అవేం మాటలు హెన్రీ. ఇక థియేటర్‌కు వెడదాం పద. సిబిలు రంగంపైకి వచ్చిందంటే నీకు జీవితంలో ఒక కొత్త ఆదర్శం కనుపిస్తుంది. నీవు ఎన్నడూ ఎరుగని ఒక కొత్త విషయాన్ని ఆమెలో చూస్తావు' అన్నాడు డోరియన్

'నేను ఎరుగని దంటూ లేదు. అయినా ఒక కొత్త ఉద్వేగాన్ని రుచిచూడడానికి ఎప్పుడూ సిద్ధమే. కాని కొత్త ఉద్వేగమంటూ ఏమీ లేదేమోనని నా భయం. అయినా

నీవు ప్రేమిస్తున్న ఈ అమ్మాయి నన్ను తన్మయుణ్ని చేయవచ్చు. నటన అంటే నాకెంతో ప్రీతి. బ్రతుకుకంటె వాస్తవమైంది నటన. సరే, ఇక వెడదాం డోరియన్, నీవు నాతో రా. బేసిల్! నాబండిలో ఇద్దరికిమాత్రమే చోటుంది. నీవు మరోబండ్లో రా' అన్నాడు లార్డ్ హెన్రీ

ఇద్దరూ లేచి కోట్లు వేసుకున్నారు. నిల్చునే కాఫీ తాగారు. చిత్రకారుడు మౌనంగా ఉన్నాడు. ఏదో ఆలోచిస్తు న్నాడు. అతని ముఖం ఎంచాతనో విషాదపూరితంగా ఉంది. అతను ఈ వివాహాన్ని సహించలేకుండా ఉన్నాడు. కాని సాధారణంగా జరిగే అనేకసంఘటనలకంటె ఇది మంచిదిగానే కనుపిస్తుంది.

కొద్దినిమిషాలతరువాత అందరూ మెట్లు దిగారు. అను కున్న ప్రకారం వేరువేరు బండ్లలో ఎక్కారు. ముందు డోరి యన్, హెన్రీలు కూచున్న బండి వెడుతోంది. ఆ బండి దీపాలు తళతళలాడుతున్నాయి. తనకు అయినదేదో తన చేతులనుంచి జారిపోయినట్టనిపించింది. డోరియన్ పూర్వంలా ఇక తనవాడు కాడనుకున్నాడు. జీవితం వారిద్దరిమధ్య అడ్డు నిల్చింది... అతని కళ్ళలో చీకటికమ్మింది. జనం గుంపులుగా ఉన్న వీధులు దీపాలవెల్తురులో తళతళలాడుతున్న వీధులు అతని కళ్ళకు చెదురు చెదురుగా కనుపించాయి. బండి థియేటరు దగ్గరికి చేరిందో లేదో అతనికి ముసలితనం పైబడ్డట్టుగా తోచింది.

# 7

ఎందుచేతనో కాని ఆ రాత్రి హాలంతా కిటకిటలా డుతూ ఉంది. లావుపాటి జ్యూ మానేజర్ చేటంత ముఖం చేసుకుని వారిని గేటుదగ్గర కలుసుకున్నాడు. ఎంతో వినమ్ర తతో బాక్సుదగ్గరవరకూ వారిని అనుసరించాడు. ఉంగరాలు మెరుస్తున్న చేతులు తిప్పుతూ పెద్దగా మాట్లాడుతున్నాడు. డోరియన్ గ్రేకు అతనంటే ఎన్నడూ ఎరుగనంత అసహ్యం కలిగింది. మిరాండాకోసం వచ్చి కారిబాన్‌ను కలుసుకున్న ట్టయింది. లార్డ్ హెన్రీ మాత్రం అతనంటే ఎంతో ముచ్చట పడ్డాడు. ముచ్చటపడ్డాడో లేదో కాని, అతనితో కరస్పర్శ కావించేవరకు వదల్లేదు. ఒక గొప్ప ప్రతిభాశాలినిని కనుగొని ఒక కవికోసం దివాలాతీసిన అతన్ని కలుసుకోడం ఎంతో విశే షమనీ, అందుకోసం తను ఎంతో గర్విస్తున్నాననీ అన్నాడు.

వేడిమహామిక్కుటంగా ఉంది. పెద్దదీపం పసుపుపచ్చని రేకులు విచ్చుకుని పెద్దపుష్పంలా కనుపిస్తోంది. గాలరీలో కూచున్న కుర్రాళ్ళు కోట్లు, వెస్టుకోట్లువిడిచి ప్రక్కన తగిలించారు. ఒకరితో ఒకరు మాట్లాడుకుంటున్నారు. ప్రక్కన కూచున్న చక్కనిచుక్కలతో నారింజతొనలు పంచుకుని తింటున్నారు. నేలమీద కొందరు స్త్రీలు కిలకిలా నవ్వుతున్నారు. వారి కంఠస్వరాలు కీచుగా భీకరంగా వినిపిస్తున్నాయి. బార్‌నుంచి బీర్‌సీసాలు మూతలు ఎగిరిపడిన శబ్దం వినవస్తూంది.

'ఆహా! దేవతని మహామంచిస్థలంలో కనిపెట్టావోయ్'
అన్నాడు లార్డ్ హెన్రీ.

'అవును. ఇక్కడే ఆమెను కనుగొన్నాను. నిజంగా ఆమె దేవతే. ఈ సజీవజీవరాసు లన్నిటికి ఆమె అతీతమైన దేవత. ఆమె నటిస్తున్నప్పుడు మనం ఈ లోకాన్నే మరిచిపోతాం. నికృష్టవదనాలతో జుగుప్సాకరస్వభావాలతో రోత పుట్టించే ఈ సామాన్య ప్రజలుకూడా ఆమె రంగస్థలంపై కనుపించినంతకాలం మరోవిధంగా మారిపోతారు. నిశ్శబ్దంగా ఆమెను అవలోకిస్తూ కూచుంటారు. ఆమె విలపిస్తే విలపిస్తారు నవ్వితే నవ్వుతారు. శ్రుతిపెట్టిన వయొలిన్ తీగల్లా కదిలిపోతారు. ఆమె వారిని ఆధిభౌతికం చేస్తుంది. ఆత్మ శరీరాలకు అంతరం నశిస్తుంది' అన్నాడు డోరియన్.

'అంతరం నశిస్తుందా? అలా జరగకుండా ఉండడమే మంచి దనుకుంటాను' అన్నాడు హెన్రీ గాలరీలో కూచున్న వారందరిని ఒపెరా గ్లాసులతో అవలోకిస్తూ.

'అతని మాటలు పట్టించుకోకు డోరియన్. నీ ఉద్దేశం నాకు తెలుసు. నాకూ ఈ అమ్మాయిలో విశ్వాసం ఉన్నది. నీవు ఎవరిని ప్రేమించినా వారు సామాన్యులై ఉండరు. వారిలో ఏదో ఒక అద్భుతం ఉండితీరుతుంది. నీవు చెప్పిన గుణగణాలు గల అమ్మాయి తప్పకుండా ఉదాత్తురాలూ లావణ్యమూర్తీ అయిఉండాలి. ఎవరైనా గొప్ప వ్యక్తి — తను నివసించే యుగాన్ని ఆధిభౌతికం కావించాలి. ఆత్మలేకుండా జీవించే వారికి ఈ అమ్మాయి ఆత్మ ప్రసాదించిందీ అంటే, రోత పుట్టించే క్షుద్రజీవుల్లోకూడా సౌందర్యతత్పరత కలిగించిందీ

అంటే సంకుచితస్వార్థబంధాలనుంచి వారిని విముక్తులను కావించి వారికి అనుకంపతో వెచ్చనైన బాష్పబిందువులు అప్పు పెట్టిందంటే ఆమె తప్పకుండా పూజనీయురాలే కావాలి ఈ లోకమంతా ఆ అమ్మాయికి నీరాజనం పట్టాలి. ఈ నీ వివాహంలో ఏ మాత్రం తప్పులేదు. మొదట్లో నే నిలా భావించలేను కాని, ఇప్పుడు మాత్రం ఒప్పుకుని తీరుతున్నాను. దేవతలు సిబిల్ వేన్‌ను నీ కోసమే సృష్టించారు. ఆమెలేకుండా నీ బ్రతుకు పరిపూర్ణంకాదు' – అన్నాడు చిత్రకారుడు డోరియన్‌ను అనునయిస్తూ.

'నీ వెంత మంచివాడివి బేసిల్! నీవు తప్పకుండా నన్ను అర్థం చేసుకోగలవని నాకు తెలుసు. హెన్రీ వట్టి నిరాశా వాది. అతనికి అన్నిటిలోనూ దోషమే కనుపిస్తుంది. అతన్ని చూస్తే ఒక్కోసారి నాకు భయం వేస్తుంది. అదుగో అప్పుడే ఆర్కెస్ట్రా ప్రారంభించాడు. చూడు– ఆర్కెస్ట్రా ఎంత భయంకరంగా ఉందో. అయినా ఎక్కువసేపు ఉండదులే. ఇప్పుడే తెర ఎత్తుతారు. నా బ్రతుకంతా ఏ అమ్మాయికోసం సమర్పించబోతున్నానో ఆ అమ్మాయిని ఇప్పుడే నీవు చూస్తావు. నాలోని మంచినంతా ఆమెకే సమర్పించుకున్నాను' – అన్నాడు డోరియన్.

ఒకపావుగంట గడిచింది. తెరలేచింది. జనసందోహం పెద్ద రోదచేసింది.

సిబిల్ వేన్ రంగస్థలంపై అవతరించింది. 'డోరియన్ చెప్పినమాట నిజమే,– ఆమె కన్నులకు స్వర్గంగా ఎంతో ముచ్చటగా ఉంది–'అనుకున్నాడు లార్డ్ హెన్రీ. ఆమెఒకచిన్న

పిచ్చుకలా ఉంది. ఆమె ముగ్ధశోభతోనూ, ఆశ్చర్యంతో అప్పుడే తెరిచినట్టున్న ఆమె నయనాల్లోనూ ఏదో అమాయకత గోచరిస్తోంది. ఆమె క్రిక్కిరిసిన ప్రేక్షకసమూహం వంక చూడగానే వెండి అద్దంలో గులాబీపూవు ప్రతిబింబంలాగా ఒక పల్చని లజ్జారుణిమ ఆమెచెక్కిళ్లు తాకింది. రెండడుగులు వెనక్కు వేసింది. ఆమె పెదవులు మృదువుగా అదరసాగాయి. బేసిల్ హాల్‌వర్డ్ కూచున్నవాడల్లా ఉలికిపడిలేచి హర్షింప సాగాడు. డోరియన్ స్వప్నసమాధిలో ఉన్నవాడిలా ఆమె వంక తదేకంగా చూస్తూ అలాగే కూచున్నాడు. లార్డ్ హెన్రీ ఒపెరాగ్లాసుల్లోంచి చూస్తూ, 'ఎంత ముగ్ధమోహనంగా ఉంది.' అన్నాడు

దృశ్యం కాప్‌లెట్ ఇంట్లో హాలు. రోమియో తనబాట సారి దుస్తులలో ప్రవేశించాడు. అతనితో మెర్కూషియో మరి ఇతరమిత్రులూ ప్రవేశించారు. బాండు ప్రారంభమైంది. తరువాత నృత్యం మొదలైంది. అసహ్యంగా ముస్తాబై రోతగా కనుపిస్తున్న ఆ నటకులమధ్య సిబిల్‌వేన్ ఏదో పరలోకం నుంచి దిగివచ్చిన దేవతలా ఉంది. జలాశయంలో మృణాళ్లాగా ఆమె తనువు ముందుకూ వెనక్కూ ఊగుతున్నది. ఆమె మెడ వంపులు ఒక తెల్లని లిలీ వంపుల్లాగా కనుపిస్తున్నాయి. ఆమె చేతులు చల్లనిదంతంతో చేసినట్టుగా ఉన్నాయి.

ఆమె నృత్యంచేస్తున్నా, ఎంచాతనో కాని ఆమె మరేదో లోకంలో ఉన్నట్టుగా ఉంది. రోమియోపై చూపులు వాలినప్పుడు ఆమెకళ్ళలో ఆనందమేమీ కనుపించడంలేదు. ఆమె అనవలసిన నాలుగు ముక్కలూ ఎంతో కృత్రిమంగా

అంటోంది. కంఠస్వరం మాత్రం అద్భుతంగా ఉంది. కాని ఆ కంఠస్వరంలో ఏదో కృతకత్వం కనుపిస్తోంది. ఆ పలుకులకూ ఆ స్వరానికీ పొందిక కుదరడం లేదు. ఆ స్వరంలో శోభా లేదు. రక్తీ లేదు. పదంలోని జీవాన్నంతా ఆ స్వరం హరించి వేస్తోంది. ఉద్వేగం అసహజంగానూ అవాస్తవికంగానూ కనుపిస్తోంది.

ఆమెను గమనించే కొద్దీ డోరియన్ వివర్ణుడై పోతున్నాడు. విచలితుడవుతున్నాడు. ఆందోళన ఆవేదన అతనిలో హెచ్చుతున్నవి. అతని స్నేహితులిద్దరూ అతనితో ఏమీ మాట్లాడలేకపోతున్నారు. ఆమె వారిదృష్టికి ఎందుకూ పనికి రాని నటిగా కనుపిస్తోంది. వారు పూర్తిగా నిరాశ జెందారు.

అయినా, రెండవ అంకంలోని బాల్కనీదృశ్యం జూలియట్‌కు పరీక్షలాంటిది. ఈ దృశ్యంలో ఆమె విఫలురాలవుతే ఇహ ఆమె ఎందుకూ పనికిరాదన్నమాటే.

వెన్నెల. ఆ వెన్నెట్లో ఆమె ముగ్ధమోహనంగా ప్రవేశించింది. ఆ వెన్నెలవెలుగులో అప్సరసలా కనుపిస్తూ ఉంది. ఎవరూ కాదనరు. కాని ఆమె నటనమాత్రం దుర్భరంగా ఉంది. నటించడంకోసం నటిస్తున్నట్టుంది. పోనుపోను మరీ అధ్వాన్నమైపోతోంది. ఆమె హావభావాలు మరీ కృతకంగా కనుపిస్తున్నాయి. ప్రతిమాటనూ లేని అర్థాన్ని కల్పిస్తున్నట్టుగా ఒత్తి ఒత్తి పలుకుతోంది. ఒక బడిపిల్ల పాఠం ఒప్పజెప్పినట్టుగా ఒప్పచెబుతోంది. జూలియట్ బాల్కనీపై వాలి చెప్పే కడసారి పలుకులు కేవలం అర్థశూన్యమైన మాటలు ఒప్పగించినట్టుగా ఒప్పగించింది. ఇది రంగస్థలభయంవల్ల కాదు. భయం

మాట అలా ఉంచి ఎంతో నిండుగా నిబ్బరంగా కనుపిస్తూ ఉంది. ఎంతో నిశ్చలంగా ఉంది కూడాను. దీనికి కారణం అభినయం ఏమాత్రం తెలియకపోవడమే. ఆమె అభినయానికి ఏమాత్రం పనికిరాదు. పామర ప్రజలకు కూడా ఆ జరిగే నాటకంలో ఆసక్తి పోయింది. పెద్దగా మాట్లాడడం, ఈలలు వెయ్యడం మొదలెట్టారు. డ్రెస్ సర్కిల్ వెనకాల నిల్చుని వున్న జ్యూ మానేజర్ కోపంతో తొక్కిసలాడుతున్నాడు. అంతా అల్లకల్లోలంగా ఉంది. నిశ్చలంగా ఉంది, ఒక్క ఆ అమ్మాయిమాత్రమే. రెండో అంకం ముగిసింది. హాలంతా గుసగుసలు. లార్డ్ హెన్రీ వెళ్ళిపోవాలని లేచి, కోటు వేసుకున్నాడు.

'ఈ అమ్మాయి చాలా అందగత్తె డోరియన్ ! కాని, నటనమాత్రం చాతకాదు. ఇహ వెళదాం పద' అన్నాడు.

'నేను నాటకం ముగిసేవరకూ చూచి తీరుతాను. నీచేత ఒక సాయంత్రం అనవసరంగా వృధా చేయించాను. క్షమించు. మిమ్మల్నిద్దరినీ క్షమించమంటున్నాను' అన్నాడు డోరియన్.

'డోరియన్, మిస్ వేన్‌కు ఇవాళ రాత్రి జబ్బుగా ఉండి ఉంటుంది. మరోసారి వచ్చి చూదాం' అన్నాడు హాల్‌వర్డ్.

'జబ్బుగా ఉండాలనే నేనూ కోరుకుంటున్నాను. కాని ఆమెగుండె గడ్డకట్టుకునిపోయినట్టుంది. పూర్తిగా మారిపోయింది. పోయినరాత్రి గొప్పనటిలా నటించింది. ఈ రాత్రి చౌకబారు నటిలా నటిస్తోంది' అన్నాడు డోరియన్. 'నీవు ప్రేమించే దేన్నిగురించయినా అలా మాట్లాడకూడదు డోరియన్! ప్రేమ కళకంటెకూడా అద్భుతమైనది' అన్నాడు చిత్రకారుడు.

'ఆ రెండూ అనుకరణయొక్క స్వరూపాలే. కాని, ఇహ వెడదాం పద డోరియన్. నీవుకూడా ఇక్కడ ఉండడం మంచిదికాదు. చెడ్డనటనచూడడం మనలో నీతికి ఆరోగ్యకరం కాదు. అదీగాక, నీ భార్య నటించడం నీకు అభిమతం కూడా కాదనుకుంటాను అలాంటప్పుడు ఆమె జూలియట్ పాత్రని ఒక చక్కబొమ్మలా నటిస్తే మటుకేం? చూపులకు చక్కగాఉంది. చాలు. ఆమెకు నటన ఎంత తెలుసో, జీవితం కూడా అంతే తెలియడం మరీ మంచిది. రెండేరెండు రకాల మనుష్యులు మనల్ని ఆకర్షిస్తారు. అన్ని విషయాలూ సమగ్రంగా తెలిసినవాళ్ళూ, అసలు ఏమీ తెలీనివాళ్ళూ. అదే మిటోయ్ అబ్బాయ్! అలా పెట్టావ్ మొహం! అలాఉండకు. మనం నిత్యయువకులంగా ఉండాలంటే తగని ఆవేశం పెట్టుకో కూడదు. నాతో, బేసిల్‌తో కలిసి క్లబ్బుకు రా. కులాసాగా సిగరెట్లు తగలేసి, సిబిల్ వేన్ అందాన్ని చక్కగా తాగుదాం. ఆ అమ్మాయి అందానికి లోపంలేదు. ఇహ కావలసిం దేముంది?'– అన్నాడు లార్డ్ హెన్రీ.

'నీవు వెళ్ళు హెన్రీ! నన్ను ఒంటిగా ఉండనీ. బేసిల్ నీవూ వెళ్ళు. నా హృదయం బ్రద్దలైపోతోంది'

వెచ్చని కన్నీళ్ళు చింతగింజల్లా కళ్ళలోనికి వచ్చాయి. పెదవులు వణికాయి. వెనక్కువెళ్ళి గోడకు ఆనుకుని నిల్చుని ముఖం చేతుల్లో దాచుకున్నాడు.

'ఇక వెడదాంరా బేసిల్' అన్నాడు లార్డ్ హెన్రీ. అతని కంఠస్వరంలో ఒక విచిత్రమైన మార్దవం కనుపించింది. యువకులిద్దరూ బైటికి వెళ్ళారు.

కొద్ది క్షణాలు గడిచాయి. మళ్ళీ ఫుట్‌లైట్లు వెలిగాయి. తెరలేచింది. మూడో అంకం. డోరియన్ మళ్ళీవచ్చి తన స్థానంలో కూచున్నాడు. ఒక అహంభావం, లెక్క చెయ్యని తనం అతని ముఖంలో కొట్టవచ్చినట్టుగా కనుపిస్తోంది. అతని ముఖంలో కత్తి కాటుకు నెత్తురుచుక్క లేదు. నాటకం నత్తగుల్లలా నడుస్తోంది. ఒక అంతూ పొంతూ కనుపించడంలేదు. సగంమందిజనం నవ్వుతూ పెద్దఅంగలు వేసుకుంటూ బయటికి వెళ్ళారు. అంతా అయోమయంగా ఉంది. చివరిరంగం పూర్తిగా ఖాళీబెంచీలకోసమే ఆడాల్సివచ్చింది. వెకిలిగా నవ్వులూ కేకలూ అరుపులూ వినిపిస్తూఉండగా తెరజారింది.

నాటకం ముగిసిన వెంటనే డోరియన్ గ్రీన్‌రూమ్ లోకి వెళ్ళాడు. ఆఅమ్మాయి అక్కడ ఒక్కతే నిల్చుని ఉంది. ఆమె ముఖంలో విజయదర్పం కనుపిస్తోంది. ఒక అతిలోకమైన కాంతితో ఆ అమ్మాయికండ్లు వెలిగిపోతున్నాయి. ఆమె ముఖంచుట్టూ ఒక తేజోవలయం ఉన్నట్టుగా ఉంది. అరవిచ్చిన ఆమె పెదవులు ఏదో తనకే తెలిసినరహస్యాన్ని స్మరించుకుని నవ్వుతున్నట్టుగా ఉన్నాయి. డోరియన్ గదిలో అడుగుపెట్టగానే అతనివంక చూచింది. ఆమె ఆనందంతో నిండిపోయింది. 'డోరియన్! ఇవాళ ఎంత అసహ్యంగా నటించాను డోరియన్!' అన్నది.

'ఘోరం! నీకేమైనా జబ్బు చేసిందా? నీ వెంత అసహ్యంగా నటించావో తెలుసా? నే నెంతబాధపడ్డా ననుకున్నావ్?' - అన్నాడు డోరియన్.

ఆ పిల్ల ఒక చిరునవ్వు నవ్వింది.

'డోరియన్ !' అని పిలిచింది, ఆ పేరులోని తీయని మధువును పీలుస్తున్నట్టుగా.

'డోరియన్ ! నీవు అర్థంచేసుకున్నావనుకుంటాను. ఇప్పుడుకూడా నీకు అర్థంకాలేదా డోరియన్ !' - అన్నది.

'ఏమిటి అర్థమయ్యేది ?' అన్నా డతను కోపంగా.

'నే నివాళరాత్రి ఎందుకలా నటించానో అర్థంకాలేదా డోరియన్ ? నే నిక ఎప్పుడూ ఇలాగే నటిస్తాను డోరియన్. అదేమిటి ? - ఇహ అసలు నటించనే నటించను' అన్నది.

అతను ఏమి టీ మాటలన్నట్టుగా బుజాలూపాడు. 'నీకు జబ్బుగా ఉన్నదనుకుంటాను. సుస్తీగా ఉన్నప్పుడు నీవు నటించడం మంచిది కాదు. అందరికుందూ నవ్వులపాలు కావలసి వస్తుంది. నా స్నేహితులకూ నాకూ తలనొప్పి పుట్టింది' - అన్నాడు డోరియన్.

ఆమెకు అతనిమాటలు వినిపించినట్టు లేవు. ఆమె ఆనందంతో మరేదో లోకంలో ఉన్నట్టుంది. ఒక తన్మయత్వం ఆమెను ఆవేశించినట్టుగా ఉంది.

'డోరియన్ ! డోరియన్ ! నిన్ను నేను ఎరుగక పూర్వం నటనఒకటే నాకు జీవితం. అదే నాకు నిజం. నా బ్రతుకంతా థియేటర్ లోనే. నేను బ్రతికింది నటనలోనే. అదంతా నిజమనుకున్నాను. ఒక రాత్రి రోసలిండ్ నయ్యేదాన్ని. మరో రాత్రి పోర్షియా నయ్యేదాన్ని. బియాట్రిస్ సుఖాలు నా సుఖాలయ్యేవి. కార్డీలియా కష్టాలు నా కష్టాలయ్యేవి. అదంతా నిజ మనుకున్నాను. అంతా నమ్మాను. నాతో నటించే సర్వసామాన్యులుకూడా నాకళ్ళకు దేవతలా

కనుపించేవారు రంగులుపూసిన ఆ తెరలచాటునే నా ప్రపం చాన్ని సృష్టించుకున్నాను. అప్పుడు నాకు తెలిసిందల్లా నీడ లే. అవే నిజమనుకున్నాను. అప్పుడు నీవు నా జీవితంలో అడుగు పెట్టావు ప్రియా! నీవు ప్రవేశించావు. నాకు బంధముక్తి కలిగించావు. నా ఆత్మను ఆ ఖైదునుంచి విడిపించావు. అసలు వాస్తవమంటే ఏమిటో నాకు చూపించావు. నీడకాని నిజాన్ని నాకు చూపావు. ఇవాళ రాత్రి మొట్టమొదటిసారిగా నా బ్రతుకు నా కళ్ళముందు నగ్నంగా బట్టబయలయింది. నే నాడిన బొమ్మలాట నా కళ్ళకుకట్టింది. ఈ రాత్రి మొట్టమొదటిసా రిగా రోమియో రోతగా ఉన్నాడని, అతను ముసలాడని, అతని ముఖానికి పులుముకున్నది రంగుతప్ప మరేం కాదని గ్రహిం చాను. తోటలోని ఆ వెన్నెలంతా కేవలం అసత్యమని తెలు సుకున్నాను. ఆ సీనరీఅంతా చౌకబారుసీనరీగా కనుపించింది. నేను మాట్లాడేమాటలన్నీ నిజంకావని, అవి నా మాటలు కావని, నే నవుతే అలా మాట్లాడనని గ్రహించాను. నీవు నాకు మరేదో విషయాన్ని ద్యోతకంచేశావు. దానికి ఈ కళంతా ఒక ప్రతిబింబంమాత్రమే. ప్రేమంటే ఏమిటో నాకు తెలియజెప్పావు. ప్రియా! ప్రియా! నా ముద్దులరాకుమారా! నా జీవనాధిపతీ! నిజాలు కాని ఈ నీడలతో నేను విసుకెత్తి పోయాను. ఈ కళంతా కలిపినా నీతో వెలకట్టను. ఈ కీలు బొమ్మలతో ఇక నా కేమిటి పని? ఇవాళ రాత్రి నేను రంగం స్థలంలో అడుగుపెట్టగానే అదంతా నాలోనుంచి ఎలావెళ్ళి పోయిందో, నేనే ముందు గ్రహించలేకపోయాను.

ముందు అద్భుతంగా నటించగల ననుకున్నాను. కాని తరువాత ఈ రాత్రి నేను నటించలేనన్నవిషయం నాకు తెలిసింది. హఠాత్తుగా ఈ రహస్యంలోని అర్థమంతా నా మనస్సులో మెరుపులా మెరిసింది. ఒక్కమాటు వెలుగులా కనుపించింది. ఈజ్ఞానోదయం నన్ను తన్మయురాలిని చేసింది. నేను నటిస్తూంటే వాళ్ళు గుసగుసలాడుతున్నారని నాకు తెలుసు. అయినా, నవ్వుతున్నాను. వాళ్ళకు మనప్రేమలాంటి ప్రేమ ఏం తెలుస్తుంది? నన్ను తీసుకుని వెళ్లు డోరియన్. నన్ను నీతో తీసుకువెళ్లు. మనిద్దరం ఒంటిగా ఉండేచోటికి తీసుకువెళ్ళు. ఈ రంగస్థలమంటే నాకు రోత పుట్టింది. నేను అనుభవించని ఒక ఆవేగాన్ని అనుకరించగలను కాని, నాలో అనలంలా మండుతున్న ఆవేశాన్ని అనుకరించలేను డోరియన్. ఇప్పుడైనా నే నెందుకు నటించలేకపోయానో అర్థమైందా డోరియన్? నేను ఒకవేళ నటించిఉన్నప్పటికీ అది పాపమయ్యేది. ప్రేమిస్తూ ప్రేమను నటించడం ప్రేమను మలినం చేయడమయ్యేది. డోరియన్, ఈ విషయం నీవు నాకు ఎరుకపరిచావు—'

అతను సోఫాలో కూలిపోయాడు. ముఖం అవతలికి తిప్పుకున్నాడు. ఆమె అతనిదగ్గరికివచ్చి తన చిన్నారివ్రేళ్ళతో అతనిజుట్టు నిమురసాగింది. మోకాళ్ళపై కూచుని అతనిచేతులు పెదవులకు గాఢంగా హత్తుకున్నది అతను చేతులు లాక్కున్నాడు. అతని శరీరంలో విద్యుత్తు ప్రవహించినట్లయింది.

ఎగిరి లేచి నిల్చునాడు. తలుపుదగ్గరికి వెళ్ళాడు.

'నీవు నాప్రేమను చంపేశావు. ఒకప్పుడు నా ఊహాను

కదిలించేదానివి. ఇప్పుడు నా ఉత్సుకతను కూడా మేలుకొల్ప డంలేదు. నిన్నుచూస్తే నాకు ఒక జడప్రతిమను చూచినట్టు ఉంది. నీ వొక అద్భుతవ్యక్తివని నిన్ను ప్రేమించాను. నీకు గొప్ప ప్రతిభా, మేధస్సూ ఉన్నవని ప్రేమించాను. మహా కవుల మనోకల్పనలను గ్రహించి వాటి కొక స్వరూపమిస్తావని ప్రేమించాను. కళల నీడలకు మేడలు కడతావని ప్రేమిం చాను. కాని, అనుకున్న ఆశలన్నిటినీ నేలపాలు చేశావు. నీవు వట్టి డొల్ల. మతిహీనురాలివి. అయ్యో భగవంతుడా! నిన్నంత వెర్రిగా ప్రేమించడానికి నే నెంత వెర్రివాడనై ఉండాలి! ఎంత పొరబాటుచేశాను! ఇప్పుడు నీవునాకు ఏమీ కావు. ఇకముందు నిన్ను చూడను కూడా. నిన్నుగురించి ఆలోచించను. నీపేరే ఎత్తను. ఒకప్పుడు ని న్నెలా చూచుకున్నానో నీకు తెలీదు. ఒకప్పు డేమిటి...అబ్బ! ఆ తలపు భరించలేను! నిన్నసలు చూడకుండా ఉంటే ఎంత బావుండేది! నీమీద నాకళ్ళు పడ కుండాఉంటే ఎంత బావుండేది! నాబ్రతుకులోని ప్రణయా న్నంతా బుగ్గిపాలు చేశావు. ప్రేమ నీకళను చెడగొట్టిం దన్నావు. దీన్నిబట్టి నీకు ప్రేమంటే ఏమిటో ఎంతవరకు తెలుసో అర్థమవుతూంది. నీకు ఆ కళే లేకపోతే నీ వెందుకు పనికివస్తావు? ఆ కళతో నీ కీర్తి దిగంతాలవరకూ వ్యాపించేట్టుచేసిఉండేవాణ్ని. ని న్నొక అద్భుత అభినేత్రిగా రూపొందించి ఉండేవాణ్ని. ఈ ప్రపంచమంతా నీ ముందు మోకరిల్లి ఉండేది. నీవు నా భార్యవయ్యేదానివి. ఇప్పుడో? ఒక ముచ్చటైన ముఖంగల మూడోరకపు నటివి--' అన్నాడు డోరియన్.

అమ్మాయి ముఖంలో నెత్తురు ఇంకిపోయింది. గాలికి తీగలా చలించింది. పిడికిళ్ళు గట్టిగా పట్టుకున్నది. గొంతులో స్వరం అక్కడే నిలిచిపోయింది.

'నిజంగా అంటున్నావా డోరియన్? లేక ఊరికే నటిస్తున్నావా?'- అన్నది మాటలు ఎలాగో ఒకలా పెకల్చుకుని.

'నటన! అది నీకే వదిలాను. నీవు చాలా బాగా నటిస్తావు'- అన్నాడు డోరియన్ విరసంగా. మోకాళ్ళపై కూర్చున్నది మెల్లగా లేచింది. ఆమె ముఖంలో బాధా, జాలీ పెనవేసుకున్నాయి. మెల్లగా అతనిదగ్గరికి వచ్చింది. అతని భుజంపై చెయ్యివేసి అతని కళ్ళలోకి చూచింది. అతను ఆమెను వెనక్కు తోశాడు.

'నన్ను అంటుకోకు' అన్నాడు.

ఒక సన్నని ఎలుగు ఆమె కంఠంనుంచి వెలికివచ్చింది. అతని కాళ్ళదగ్గర కూలిపోయింది. కాలికిందనలిగిన పూవులా అక్కడేపడి ఉంది.

'డోరియన్, నన్ను విడిచిపెట్టకు డోరియన్. నేను సరిగా నటించనందుకు ఎంతో విచారిస్తున్నాను డోరియన్. అంతసేపూ నిన్నే ధ్యానిస్తున్నాను. కాని ఇక ముందు సరిగా నటించడానికి యత్నిస్తాను. అప్పుడు హఠాత్తుగా నీ ప్రేమ జ్ఞాపకం వచ్చింది. నీవు నన్ను ముద్దాడి ఉండకపోయిఉంటే, మనం ఒకరిని ఒకరం ముద్దాడిఉండకపోతే నాకు ప్రేమంటే ఏమిటో తెలిసేది కాదు. ప్రియా! నన్ను ఒక మాటు మళ్ళీ ముద్దాడు. నన్ను విడిచి వెళ్ళకు నేను భరించలేను. నన్ను విడిచి వెళ్ళకు నా అన్న... అహా... ఏంలేదు... అతను అనుకుని

అన్నమాటలుకావు...ఊరికినే అన్నాడు... కాని... నీవు... ఈ ఒక్క-రాత్రికీ నన్ను క్షమించవ్వూ? ఇక ముందు బాగా శ్రమించి జాగ్రత్తగా నటిస్తాను. నా నటనను అభివృద్ధిచేసు కుంటాను. ప్రపంచంలో అన్నిటికంటె ఎక్కువగా నిన్ను ప్రేమించినందుకు నన్ను శిక్షించకు డోరియన్. అయినా ఒక్క సారేకదూ నేను సరిగా నటించక నీకు తృప్తికలిగించనిది? నీ వన్నది నిజమే డోరియన్. నేను సరిగా నటించివుండవలసింది. వెర్రిదాన్ని. కాని, నటించలేకపోయాను. డోరియన్! నన్ను వదలకు నన్ను వదలకు' అని సన్నని స్వరంతో ప్రాధేయపడ సాగింది.

ఏడుపు ఆవేశంలా వచ్చింది. ఒక గాయపడ్డజంతువులా నేలపై ప్రాకులాడసాగింది. డోరియన్ మాత్రం తన అందమైన కండ్లతో ఆమెవంక నిశ్చలంగా చూస్తున్నాడు. తీర్చినట్టున్న అతని పెదవులు అసహ్యంతో విరుచుకున్నాయి. మనం ప్రేమిం చడం మానేసిన వ్యక్తులు మనముందు ఆవేశాలు ప్రదర్శించ డం విచిత్రంగా ఉంటుంది. సిబిల్ వేన్ బాధంతా అతనికి నట నలా కనుపించింది. ఆమెకన్నీళ్ళూ, ఏడుపులూ అతన్ని కలవర పెట్టాయి.

చివరకు 'నేను వెడుతున్నాను' అన్నాడు నిశ్చల కంఠ స్వరంతో. 'నేను నిర్దయగా ఉండాలని కాదు. కాని ఇహ మాత్రం నిన్ను చూడదలచుకోలేదు. నీవు నాకు ఆశాభంగం కల్పించావు' అన్నాడు.

ఆమె జవాబు చెప్పలేదు. మెల్లగా ఏడ్వసాగింది. అత నికి దగ్గిరిగా ప్రాకింది. అతని కాళ్ళకోసం వెదుకుతున్నట్టు

గుడ్డిగా తన చిన్నారి చేతులు చాపింది. అతను చటుక్కున తిరిగి వెళ్ళిపోయాడు. కొద్ది క్షణాల్లో థియేటర్ దాటిపోయాడు.

అతను ఎక్కడికి వెళుతున్నాడో అతనికే తెలీదు. సన్నని మసక వెలుతురు పడుతున్న వీధుల్లోగుండా నడిచివెళ్ళినట్టు మాత్రం జ్ఞాపకం. నల్లని ఆర్చీల నీడలు. పక్కనే చెడుకు ఆలవాలమైన గృహాలు. వేశ్యల ఇళ్ళు. కఠోరస్వరాలతో నవ్వులతో స్త్రీలు అతన్ని పిలిచారు. తాగుబోతులు తూలుతున్నారు. తిట్టుకుంటున్నారు. భయంకరమైన జంతువుల్లా తమలో తామే మాట్లాడుకుంటున్నారు. పిల్లలు గడపల దగ్గర కూచున్నారు. చీకటి వసారాల్లోంచి కేకలూ తిట్లూ వినిపిస్తున్నాయి.

తెల్లవారుతూ ఉండగా అతను కొవెంట్‌గార్డెన్ దగ్గర ఉన్నాడు. చీకటితెర లేచింది. పల్చని అగ్నిజ్వాలలతో కెంపెక్కి సిగ్గుపడింది. ఆకాశం కడిగిన ముత్యంలా ఉంది. శూన్యంగా మిలమిలలాడుతున్న వీధిలో లిలీపూవులు తలలూపుతున్న బండ్లు మెల్లగా సాగిపోతున్నాయి. ఆ పూలవాసనలతో గాలి బరువుగా ఉంది. వాటిఅందం పుండయిన అతని మనస్సుకి చల్లనిగంధం రాచినట్టుగా ఉంది. అతను మార్కెట్‌లోకి వెళ్ళాడు. వాగన్లు దించుతున్నవారిని గమనింపసాగాడు. ఒక బండివాడు అతనికి పండ్లిచ్చాడు. డబ్బిస్తే పుచ్చుకోలేదు. ఏమీతోచనివాడిలా ఆ పండ్లు తింటూ నిల్చున్నాడు. అర్ధరాత్రి కోసినపండ్లవి. చల్లని వెన్నెల వాటిలో ప్రవేశించింది. కొందరుపిల్లలు బారుతీరి బుట్టల్లో పండ్లూ పూలూ పట్టుకుని

వెదుతున్నారు. కొందరు పసిపిల్లలు పోర్టికోలో అటూఇటూ తిరుగుతున్నారు.

పియజాలో కాఫీహోటల్ దగ్గర గుంపులు పోగవుతున్నారు. బండ్లగుర్రాలు గంటలుగలగలలాడిస్తూ వస్తున్నాయి. కొందరు బండ్లవాళ్ళు బస్తాలపై ఇంకా నిద్రపోతూనే ఉన్నారు పావురాళ్లు గింజలేరుకుని ఎగిరిపోతున్నాయి.

కొంతసేపటికి ఒక బండిలో ఇంటికి వెళ్ళాడు. కొద్ది క్షణాలు ఇంటిముందే పచార్లుచేశాడు. ఇల్లు నిశ్శబ్దంగా ఉంది. కిటికీల తెరలు దించిఉన్నాయి. ఆకాశం వివిధ విచిత్ర వర్ణ రంజితమైంది. ఇండ్ల కూరులు వెండిలా తళతళలాడుతున్నాయి. ఒకఇంటి చిమ్నీలోనుంచి ఒక సన్నని పొగ తీగలా సాగివచ్చి, చుట్టలు చుట్టుకుని నింగిలో కలిసిపోతూంది. ముందు హాల్లో పెద్ద వెనీషియన్ లాంతరు ఉంది. అందులోని మూడు వత్తులు ఇంకా వెలుగుతూనే ఉన్నాయి. అవి సన్నని నీలపు పూరేకుల్లా కనుపిస్తున్నాయి. దీపాలు ఊదేశాడు. హాట్, టోపీ టేబిల్ మీద పడేసి పడకగదివైపుకు నడిచి వెళ్ళాడు. ఆరు పలకల పడకగది అది. సొగసుమీద కొత్తగా మొలకెత్తిన మోజుతో ఇటీవలనే దాన్ని అలంకరించాడు కూడా. రకరకాల ముత్యాల తెరలు వ్రేలాడుతున్నాయి. తలుపుగడియ తీస్తూండగా బేసిల్ హాల్‌వర్డ్ గీచిన తనబొమ్మపై కన్నుపడింది. ఏదో ఆశ్చర్యం కొట్టవచ్చినట్టుగా ఉలికిపడ్డాడు. తరువాత ఏదో కలవరంతో తన గదిలోకి వెళ్లాడు. కోటు విడుస్తూ ఒకమాటు మళ్ళీ తటపటాయించాడు. చివరకు మళ్ళీ తిరిగివచ్చి బొమ్మదగ్గరకు వెళ్ళి పరిశీలింపసాగాడు. క్రీమ్‌రంగు

సన్నని సిల్కు తెరలలోంచి పడుతున్న మసక వెలుతురులో ఆ బొమ్మలో తన ముఖం కొంచెం మారినట్లుగా కనుపించింది. ఆ ముఖంలో భావంకూడా మరోవిధంగా ఉంది. నోటిదగ్గర ఒక క్రౌర్యరేఖ కనుపిస్తున్నది. నిజంగా ఇది చిత్రంగానే ఉంది.

వెనక్కు తిరిగి కిటికీదగ్గరకు వెళ్ళి తెరలెత్తాడు. ఉదయ కాంతి గదిలోకి దూసుకుని వచ్చింది. చిత్ర విచిత్రాలయిన చీకటినీడలను మూలలకుఊడ్చింది. అవి అక్కడ వణుకుతూ ఒదిగిపోయాయి. కాని, తన చిత్రంలో తన ముఖంలో తను గమనించిన భావముద్ర మాత్రం అలాగేఉన్నట్టుంది. పూర్వంకంటెకూడా ఎక్కువ విస్పష్టంగా కనుపిస్తోంది. కంపిస్తున్న సూర్యకిరణాలు ఆ నోటిచుట్టూ ఉన్న క్రౌర్య రేఖలను మరింత స్పష్టంగా గోచరింపచేస్తున్నాయి. తను ఏదో ఘోరమైన నేరం చేసినతరువాత తన ముఖాన్నిఅద్దంలో చూచుకుంటున్నట్టుగా ఉంది. అతను కళ్ళు అల్లలార్చాడు. టేబిల్ పైనుంచి ఒక దంతపు ఫ్రేములో కట్టిన అద్దం తీసుకున్నాడు. లార్డ్ హెన్రీ అతని కిచ్చిన అనేక బహుమతుల్లో అది ఒకటి. మిలమిలలాడే ఆ అద్దంలో త్వరత్వరగా తన ముఖం చూచుకున్నాడు. ఆ బొమ్మలో కనుపించినలాంటి క్రౌర్య రేఖేమీ తన అరుణ అధరాలను వికృతంచేసినట్టు లేదు. తన పెదవులు మామూలుగానే ఉన్నాయి. ఏమి టీ చిత్రం? కండ్లు నులుముకున్నాడు. బొమ్మకు దగ్గరగా వచ్చాడు. మళ్ళీ జాగ్రత్తగా పరిశీలించాడు.

అసలు బొమ్మలో మారిన చిహ్నాలేమీ కనుపించడం లేదు. కాని భావముద్రమాత్రం పూర్తిగా మారిపోయింది.

ఏమాత్రం సందేహం లేదు. అది కేవలం తన ఊహామాత్రమే కాదు. స్పష్టంగా కన్నులకు కట్టినట్టు కనుపిస్తూ ఉంది. ఒక కుర్చీలో వాలి ఆలోచింపసాగాడు. హఠాత్తుగా బేసిల్ హాల్ వర్డ్ స్టూడియోలో ఆ బొమ్మ ముగించిన రోజున అత నన్న మాట జ్ఞాపకంవచ్చింది. అవును, ఆ మాట ఇంకా అతనికి జ్ఞాపకం ఉంది. ఆనాడు ఒక వెర్రికోరిక వెలిబుచ్చాడు. తను నిత్య యౌవనుడుగా ఉండిపోయి ఆ బొమ్మ ముసలిదైపోతే ఎంత బావుంటుందా అన్నాడు. తన సౌందర్యం ఏ మాలి న్యమూ అంటకుండా, నిర్మలంగా ఉండాలని తన ఉద్వేగాల పాపాల ముద్రల బరువులన్నీ ఆ బొమ్మేమోయాలనీఅన్నాడు. ఆ చిత్రం బాధల ఆలోచనా రేఖలతో ఛిద్రఛిద్రమైపోవా లన్నాడు. అప్పుడే తనలో ఉదయిస్తున్న బాల్య సౌకుమార్య శోభ తనలో అలాగే స్థిరంగా నిలిచిపోవా లనుకున్నాడు. నిజంగా ఆ వెర్రికోరిక ఈనాడు ఫలించిందా? ఇలా టివి సాధ్యమేనా? అలాటివి ఆలోచించడమే భయంకరం. అయినా, తన ముందు ఆ బొమ్మ కనుపిస్తోంది. ఆ పెదవుల చుట్టూ వికృత క్రౌర్య రేఖ కనుపిస్తూఉంది. క్రౌర్యం! తను క్రూరుడా? క్రూరంగా ప్రవర్తించాడా? అది తన తప్పు కాదు. ఆపిల్లదేతప్పు ఆపిల్ల ఒకగొప్పఅభినేత్రి అవుతుం దనుకు న్నాడు. ఆఅమ్మాయి అతనిఆశ నిరాశచేసింది. వట్టిపనికిమాలిన పిల్లగా కనుపించింది. అయినా, ఆ అమ్మాయి తనకాళ్ళదగ్గర పసిపిల్లలా పడి ఏడ్చినదృశ్యం జ్ఞాపకంతెచ్చుకునేసరికి ఒక అగాధమైన పశ్చాత్తాపం అతన్ని ముంచెత్తింది. ఆ పిల్ల అలా ఏడుస్తుంటే తను ఏ మాత్రం చలించకుండా చూస్తూ నిల్చు

న్నాడు. తనంత క్రూరుడెందుకయ్యాడు? ఎందుకంత గడ్డ రాయిలా తన గుండె కదలకుండా ఉంది? అలాంటి హృదయం తనకెందుకుండాలి? తనుమాత్రం బాధపడలేదా? తనూ బాధ పడ్డాడు. ఆనాటకం జరిగిన మూడుగంటల్లో మూడుయుగాల శోకాబ్దాల ఘోరయాతన అనుభవించాడు. ఆమె బ్రతుకంతకన్నా ఎంతవిలువ తన బ్రతుక్కు ఉంది. తను ఆమెను ఒకయుగంపాటు గాయపరిస్తే తనని ఒకక్షణం ధ్వంసంచేసిందామె. అదీకాక స్త్రీలు పురుషుల కంటె దుఃఖాన్నిభరించడానికి ఎక్కువ తగినవారు. వాళ్లు వాళ్ళ ఉద్వేగాలపైనేజీవిస్తారు. ఎప్పుడూ ఆ ఉద్వేగాలనుగురించే ఆలోచిస్తుంటారు. ప్రేమించారంటే అది తమప్రేమికులతో గొడవ పడడానికి మాత్రమే. చిన్న గొడవలను పెద్ద దృశ్యాలుగా చేసుకుంటారు. ఈ విషయం లార్డ్ హెన్రీ కూడా చెప్పాడు. అతనికి స్త్రీలవిషయం బాగా తెలుసు. ఇక తను సిబిల్ వేన్‌ను గురించి అనవసరంగా అవస్థపడడం ఎందుకు? ఇక ఆమెకూ తనకూ సంబంధమేమిటి?

కాని ఈ చిత్రం? దీన్ని గురించి తనేమంటాడు? తన జీవిత రహస్యాన్నంతా అది తనలో దాచుకుంది. తన కథ అదే చెబుతోంది. తన అందాన్ని తను ప్రేమించడం అది అతనికి నేర్పింది. తన ఆత్మను అసహ్యించుకోడంకూడా నేర్పుతుందా? మళ్ళీ అతను ఆ బొమ్మవంక చూడగలడా?

ఇందులో ఏమీలేదు. అంతా వట్టిభ్రాంతి. నరాలు బాగా అలసిపోయి ఉండడంవల్ల అలా కనుపించింది. అంతే. అతను గడపిన రాత్రి అలాంటిది. ఎన్నో కల్పనా చిత్రాలను తన మనస్సులో విడిచిపెట్టింది. మనుష్యులను పిచ్చివాళ్ళనుగా

మార్పే ఆ చిన్న ఎర్రనికణం అకస్మాత్తుగా అతనిమనస్సులో పడింది. అంతేకాని బొమ్మలో మార్పేమీ లేదు. మార్పు ఉందనుకోవడం భ్రాంతి. అయినా, ఆ బొమ్మ తనవంక చూస్తుంది. అందమైన విరూపవదనంతోనూ క్రూరమందహాసం తోనూ తనవైపే చూస్తున్నది. ఉషఃకాంతిలో దాని ఉజ్వలకేశ జాలం మిలమిలలాడుతోంది. దాని నీలాలకళ్ళు తన కళ్ళను కలుసుకుంటున్నాయి. అతన్ని ఒక అనంతమైన జాలి ముంచె త్తింది. ఆ జాలి తనమీద కాదు. ఆ బొమ్మమీద. ఆ బొమ్మ అప్పుడే మారిపోయింది. ఇకముందుకూడా మారుతుంది. బంగారు రంగు బూడిదరంగుగా మారుతుంది. దాని ఎర్రని తెల్లని గులా బీలు వాడి వడలి చనిపోతాయి. తనుచేసే ప్రతిపాపానికి ఒక మచ్చ ఆబొమ్మను మలినంచేసి ఆ అందాన్ని ధ్వంసంచేస్తుంది. కాని అతనిక పాపం చెయ్యడు. మారినా, మారకపోయినా ఆ బొమ్మ అతనిఅంతరాత్మకు సాక్షిగానిలుస్తుంది. ప్రత్యక్షసంకేత మవుతుంది అతను ఇహ మాయావాగురలలో చిక్కుకోడు. వాటికిదూరంగా ఉంటాడు. ఇకముందు లార్డ్ హెన్రీని చూడడం మానేస్తాడు. ఒకవేళ చూడడం తప్పకపోయినా, తనను బేసిల్ హాల్వర్డ్ తోటలో తొలిసారిగా కదిలించిన అతని విషపూరిత విచిత్ర సిద్ధాంతాలు మాత్రం వినడు. ఆ సిద్ధాంతాలు అసాధ్య విషయాలకోసం అతన్ని రెచ్చగొట్టాయి. మళ్ళీ సిబిల్ వేన్ దగ్గరకు వెళతాడు. క్షమాభిక్ష వేడుకుంటాడు. ఆమెను పెళ్ళా డతాడు. ప్రేమించడానికి యత్నిస్తాడు. అవును. అది అతని ధర్మం; తనే ఇంత బాధపడ్డాడు. ఆ పిల్ల ఎంత బాధపడి ఉంటుందో! పిచ్చిపిల్ల! తను ఎంతో స్వార్థంతో క్రూరంగా

ప్రవర్తించాడు. ఆమె ఆకర్షణంతా మళ్ళీ తిరిగి తనలో మేలు కుంటుంది. ఇద్దరూ మళ్ళీ సుఖంగా ఉంటారు. ఆమెతో తన బ్రతుకు అందంగానూ, పవిత్రంగానూ నడుస్తుంది. అతను కుర్చీలోనుంచి లేచాడు. బొమ్మను కప్పిన పెద్ద తెరను లాగాడు. మళ్ళీ బొమ్మవంక చూస్తూ 'ఎంత భయంకరం !' - అనుకున్నాడు. కిటికీదగ్గరకు వెళ్ళి కిటికీ తెరిచాడు. బైటికి వచ్చాడు. బైట పచ్చగడ్డిపై అడుగుపెట్టగానే ఒకదీర్ఘ నిశ్వాస విడిచాడు. పరిశుభ్రమైన ఉదయమారుతం అతని బాధామాలిన్యాన్నంతా తుడిచిపెట్టినట్టుంది.

అతని మనస్సులో ఒక్క సిబిల్‌మాత్రమే మెదులు తోంది. మళ్ళీ తనప్రేమతాలూకు ఒక సన్నని ప్రతిధ్వని తిరిగి అతనిలో ప్రవేశించింది. మళ్ళీమళ్ళీ ఆమెనామమే ఉచ్చరింపసాగాడు. హిమకణాలతో తడిసిన తోటలో కిచకిచ లాడుతున్న పక్షులుకూడా పూలకు ఆమె విషయమే చెబు తున్నట్టుగా వున్నాయి.

## 8

డోరియన్ నిద్రలేచేసరికి బాగా ప్రొద్దెక్కింది. మధ్యాహ్నం దాటింది. అనేకసార్లు సేవకుడు గదిలోకి వచ్చి అతను మేలుకున్నాడో లేదోనని చూచివెళ్ళాడు. యజమాని ఇంత సేపు నిద్రపోతున్నాడేమిటా అని ఆశ్చర్యపడ్డాడు. చివరకు పడకగదిలో గంటమోగింది. విక్టర్ టీ కప్పూ, ఉత్తరాల కట్టలూ తీసుకుని గదిలోకి మెల్లగావెళ్ళి కిటికీలతెరలు తొలగించి వాటిని తనయజమానిముందు ఉంచాడు.

'అయ్యగారు బాగా నిద్రపోయినట్టున్నారు' అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

'ఇప్పుడు టైమెంతయింది విక్టర్?' అని అడిగాడు డోరియన్ నుత్తుగా.

'ఒకటిన్నరయింది.'

ఎంత ఆలస్యమైంది! డోరియన్ మెల్లగా లేచికూచుని టీ చప్పరించి, ఉత్తరాలు చూడడం మొదలెట్టాడు. ఒక ఉత్తరం లార్డ్ హెన్రీది. పోస్టులో వచ్చిన ఉత్తరంకాదది. హెన్రీ సేవకునిద్వారా పంపాడు. ఒక్కక్షణ మాలోచించి ఆ ఉత్తరం తెరిచి చూడకుండానే అవతలఉంచాడు. ఇతరఉత్తరాలు యథాలాపంగా తెరిచిచూచాడు. పెద్దవిశేషాలేమీ లేవు. డిన్నర్లకు ఆహ్వానాలు మొదలైనవి ఉన్నాయి. అంతే. ఒక వెండి టాయిలెట్ సెట్‌కు చెల్లించవలసినబిల్లుకూడా వచ్చింది. బిల్లు పెద్దమొత్తం చెల్లించాలి. ఆ బిల్లు తన సంరక్షకులవద్దకు పంపడానికి బిడియపడ్డాడు డోరియన్. వారు పూర్వకాలపు మనుష్యులు. వాళ్ళకు ఈనాటి విలాసాలూ, అభిరుచులూ ఏం తెలుస్తాయి? మనం బ్రతుకుతున్న యుగంలో అనవసరమైనవే మనకు అత్యావసరాలని వాళ్ళకు తెలీదు. మరికొన్ని ఉత్తరాలు జెర్మిన్ స్ట్రీట్ వడ్డీవ్యాపారస్తుల దగ్గరనుంచి వచ్చాయి. మాటమాత్రం చెప్పిపంపితే చాలు, ఎంత డబ్బయినా అప్పు పెడతామని వ్రాశారు.

పది నిమిషాలు ఉత్తరాలు చూచుకుని పక్కమీది నుంచి లేచాడు. సిల్కు కుట్టుపనిచేసిన చక్కని కాశ్మీర్ వూల్ డ్రెసింగ్‌గౌను వేసుకుని, రంగురంగులపాలరాళ్లు తాపిన

స్నానాలగదిలోకి వెళ్ళాడు. చన్నీళ్ళస్నానం చేశాడు. దీర్ఘ నిద్రపోయినతనువాత చన్నీళ్ళస్నానం చేస్తే కాస్త కలతతీరిన ట్లయింది. గతరాత్రి జరిగినదంతా విస్మృతిలోపడిపోయిన ట్లనిపించింది. ఒకటి రెండు పర్యాయాలు మాత్రం ఏదో విచిత్రమైన ఒక విషాదఘటనలో తను పాల్గొన్నస్మృతి అస్పష్టంగా అతనిమనస్సులోకి వచ్చింది. కాని ఆ స్మృతి కలలా కనుపించింది. కాని నిజంగా కనుపించలేదు. స్నానం ముగించి డ్రెస్ వేసుకోగానే లైబ్రరీలోకి వెళ్ళి అల్పాహారం పుచ్చుకోడానికి కూచున్నాడు. తెరచివున్న కిటికీదగ్గర ఒకచిన్న గుండ్రనిబల్లమీద అల్పాహారం అమర్చబడి వుంది. ఆ రోజు ఎంతో హాయిగా వుంది. గాలి వెచ్చగా పరిమళభరితంగా వుంది. ఒక తుమ్మెద ఝుమ్మంటూ లోనికివచ్చింది. పసుపు గులాబీలపూలకుండుచుట్టూ ప్రదక్షిణాలు చేసింది. డోరి యన్‌కు ఎంతో హాయిగా వున్నట్లనిపించింది. హఠాత్తుగా అతనిచూపు బొమ్మపై పడింది. బొమ్మకు తెర కప్పివుంది. అతను వులికిపడ్డాడు.

'చలివేస్తోందా అయ్యగారూ ? కిటికీ మూయనా ?'— అని అడిగాడు సేవకుడు పళ్ళెంలో ఒక ఆమ్లెటు పడేస్తూ. డోరియన్ అక్కర్లేదన్నట్టు తల ఊపాడు. 'చలిగా లేదు' అన్నాడు.

మళ్ళీ అతనికి బొమ్మనుగురించిన ఆలోచనలు వచ్చాయి. అదంతా నిజమేనా ? నిజంగా ఆ బొమ్మ మారిందా ? లేక పోతే అది వట్టి భావనేనా ? ఇదేం చిత్రం ? రంగులతో రాసినబొమ్మమిటి మారడ మేమిటి ? దాని కేమన్నా

ప్రాణం వుందా? అంతా అబద్ధం. దీన్ని ఒక కట్టుకథలా బేసిల్‌కు ఎన్నడైనా చెప్పవచ్చు. ఈ వెర్రికథ విని అతను నవ్వనూ నవ్వుతాడు. అయినా, అతనికి బాగా జ్ఞాపకం. స్పష్టంగా చూచాడు. బొమ్మ మారింది. మొదట్లో తొలి సంజ మసకవెలుగులో చూచాడు. తరువాత నిండుగా వున్న ఉదయకాంతిలోనూ చూచాడు. క్రౌర్యరేఖ ఆ పెదవులను వికృతం చేసింది. నిజం. డోరియన్‌కు భయంవేసింది. తన సేవకుడు గదిలోనుంచి ఎక్కడ వెళ్ళిపోతాడో అని భయపడ్డాడు. అతను వెళ్ళిపోతే తను ఒంటిగా వుంటే మళ్ళీ ఒకమాటు బొమ్మను చూడవలసివస్తుంది. బొమ్మ తప్పకుండా మారి వుంటుంది. కాఫీ సిగరెట్లూ తెచ్చిఇచ్చిన తరువాత సేవకుడు వెళ్ళబోయాడు. అతన్ని వెళ్ళవద్దని అడగాలనిపించింది. తలుపు మూస్తూవుండగా అతన్ని మళ్ళీ పిలిచాడు. అతను అక్కడే యజమాని ఏం ఆజ్ఞాపిస్తాడో అని నిల్చున్నాడు. డోరియన్ ఒక క్షణంపాటు అతనివంక చూచాడు. 'ఎవరైనా వస్తే నేను కలుసుకోడానికి వీల్లేదని చెప్పు విక్టర్' అన్నాడు బరువుగా నిశ్వసిస్తూ. అతను 'చిత్తం' అని వెళ్ళిపోయాడు.

సేవకుడు వెళ్ళిపోగానే అక్కడనుంచి లేచాడు. ఒకసిగరెట్ వెలిగించి మెత్తనిసోఫామీద పవళించాడు. ఎదురుగా తెరకప్పిన బొమ్మ తెరపాతది. గిల్టు స్పానిష్ లెదర్‌తో చేసిన తెర. ఒకమాటు ఆ తెరవంక పరికించి చూచాడు. ఆ తెరచాటున ఒకమనిషి జీవితరహస్యం దాగిఉందేమోనని ఆశ్చర్యంతో చూచాడు. ఆ తెర తొలగించి చూస్తే? అక్కర్లేదు. అలా ఉంచితే ఏం? తెర తొలగించి చూస్తాడు. చూస్తేమటుకు లాభం? బొమ్మ

మారిఉంటుంది. అదే నిజమవుతే దాన్ని చూడలేడు. నిజం కాదు. ఇహ దాన్నిగురించి తాపత్రయం ఎందుకు! తనుకాక మరెవరైనా ఈ బొమ్మను చూస్తే? బేసిల్ హాల్‌వర్డ్ వచ్చి తను వ్రాసిన బొమ్మ తనకు చూపమని అడిగితే? అడుగుతాడు. అప్పుడు? వీల్లేదు. వెంటనే బొమ్మను చూచితీరాలి. ఆ రహస్యమేమిటో కనుక్కు-తీరాలి. ఈ సందేహాంబుధిలో ఈదులాడడంకంటె ఏదైనా నయమే. డోరియన్ లేచాడు. తలుపులు మూశాడు. తన పరాభవవదనాన్ని తను చూచుకుంటున్న సమయంలో తను ఒంటిగా ఉండడం మంచిది. తెర తొలగించాడు. తననుతానే చూచుకున్నాడు. అది నిజమే. బొమ్మ మారిపోయింది. మొదట్లో ఇదేంచిత్రమూ అని పరిశోధనాబుద్ధితో ఆ బొమ్మను చూడడం అతనికి తరువాత తరువాత జ్ఞాపకంవచ్చేది. ఈ మార్పు అతనికి దురవగాహంగా కనుపించేది. అయినా అందులో అసత్యం లేదు. అది స్పష్టంగా కనుపిస్తూనే ఉంది.

ఈ బొమ్మ వ్రాసిన కాన్వాస్‌పై రూపంగా రంగులుగా రూపొందిన రసాయనిక అణువులకూ, తన అంతరాత్మకూ ఏదైనా సూక్ష్మసంబంధం ఉన్నదా ఏమిటి అన్న సందేహం అతన్ని బాధించేది. తన అంతరాత్మ ఆలోచనలన్నీ ఆ బొమ్మలో గడ్డకట్టి భౌతికరూపం పొందుతున్నవా ఏమిటి? తన కలలన్నీ అక్కడ నిజమవుతున్నాయా ఏమిటి? లేక, ఇంతకంటె ఏదైనా విపరీతమైన కారణం ఉన్నదా? ఈ ఆలోచనలు అతన్ని భయపెట్టేవి. అతను ఆపాదమస్తకం వణికి

పోయాడు. భయంతో మళ్ళీ సోఫాదగ్గరకు వెళ్ళి సోఫాలో పడుకుని ఆ బొమ్మవంక తదేకంగా చూడసాగాడు.

ఏమైనప్పటికీ, ఈమార్పు అతనికి ఒకసహాయం చేసింది. తను సిబ్బిల్ వేన్‌పట్ల ఎంత క్రూరంగా ఎంత అక్రమంగా ఎంత అన్యాయంగా ప్రవర్తించాడో తనకు తెలియజేసింది. అయినా ఇంకా మించిపోయింది లేదు. ఆ విషయాన్ని మళ్ళీ సర్దుబాటుచేసుకోవచ్చు. ఆమె తనకు భార్య అవుతుంది. అతని అవాస్తవికమైన స్వార్థపూరితమైన ప్రేమ మరేదో అతీతమైన ప్రభావానికి లోబడి ఒక ఉదాత్తస్వరూపం పొందుతుంది. బేసిల్ హాల్‌వర్డ్ గీసిన బొమ్మ తనకు యావజ్జీవం మార్గదర్శిగా ఉంటుంది. కొందరికి పావిత్ర్యం ఎలాటిదో, కొందరికి అంతరాత్మ ఎలాటిదో, అందరికీ దైవభీతి ఎలాటిదో ఆ బొమ్మ తనకు అలాటి దవుతుంది. పశ్చాత్తాపాన్ని, నీతిజ్ఞతనూ నిద్రపుచ్చే మత్తు మందులు కొన్ని ఉంటాయి. కాని ఇక్కడమాత్రం పాపపతనంయొక్క ప్రత్యక్షసంకేతం సాక్షాత్తుగా కనుపిస్తూఉంది. మనుష్యుల అంతరాత్మల అధఃపతనానికి చిన్న పిలిస్తే పలుకుతూ ఉంది.

గడియారం మూడు కొట్టింది. నాలుగు, నాలుగున్నర. కాని డోరియన్ కదల్లేదు. అలాగే పడుకుని ఆలోచిస్తున్నాడు. జీవితపు ఎర్రనిదారాలు పోగుచేసుకోడానికి యత్నిస్తున్నాడు. ఆదారాలతో ఒక రూపకల్పన చేసుకోడానికి యత్నిస్తున్నాడు. తను దోవతప్పి తిరుగుతున్న రక్తారుణపంకిల పద్మవ్యూహంలో దోవకోసం దేవులాడుతున్నాడు. ఎంత వెదకినా దోవ కనుపించడంలేదు. సందులు గొందులు సర్వాల్లా మెలికలు వేసుకుని

ఉన్నాయి. తను తిరుగుతున్నాడు. ఎక్కడికో ఎందుకో? ఏంచెయ్యాలో తోచడంలేదు. ఏంఆలోచించాలో పాలుపోవడంలేదు. చివరకు విసుక్తి టేబిల్ దగ్గరకు వెళ్ళాడు. తను ప్రేమించిన అమ్మాయికి ఒక పెద్ద ఉత్తరం వ్రాశాడు. ఉద్వేగంతో ఉప్పెనలా పొంగెత్తే ఉత్తరం అది. ఆ అమ్మాయిని క్షమాభిక్ష వేడుకున్నాడు. తన వెర్రికి తనను తాను తిట్టిపోసుకున్నాడు. పేజీలపై పేజీలు బాధను వర్షంలా కురిపించాడు. స్వీయనిందలో ఒక అందం ఉంది. మనల్ని మనం నిందించుకుంటున్నప్పుడు మరొకరికి మనల్ని నిందించే హక్కు లేదన్న తృప్తి కలుగుతుంది. మనకు పాపప్రక్షాళనం కావించేది మన పాపనివేదనం కాని పురోహితుడు కాదు. డోరియన్ ఉత్తరం ముగించగానే పాపవిముక్తిపొందినట్టూ, తను క్షమింపబడినట్టూ భావించాడు.

హఠాత్తుగా తలుపుతట్టిన చప్పుడైంది. లార్డ్ హెన్రీకంఠస్వరం వినిపించింది.

'అబ్బాయ్! నిన్ను చూచితీరాలోయ్! నన్ను లోనికి రానీ. ఇదేమిటి తలుపులు మూసుక్కూచున్నావు?'- అని పిలుస్తున్నాడు.

డోరియన్ మొదట్లో జవాబుచెప్పలేదు. మాట్లాడకుండా కూచున్నాడు. హెన్రీమాత్రం తలుపుకొట్టడం మానలేదు. మరింత బిగ్గరగా కొడుతున్నాడు. ఇహ అతన్ని రానివ్వక తప్పదు. హెన్రీని లోనికి రానివ్వడంకూడా మంచిదే. అతనితో తను ప్రారంభించబోయే కొత్తజీవితాన్ని గురించి చెప్పవచ్చు. అవసరమయితే పోట్లాడవచ్చుకూడా. స్నేహం తెగితే తెగనీ. డోరియన్ లేచి బొమ్మకు తెరవేసి తలుపు తెరిచాడు.

'జరిగినదానికి చాలా విచారిస్తున్నాను డోరియన్. కాని నీవు దాన్నిగురించి అదేపనిగా ఆలోచించడం అంత మంచిది కాదు' అన్నాడు హెన్రీ గదిలో ప్రవేశిస్తూ.

'సిబిలువేన్ ను గురించికదూ నీవు మాట్లాడడం?- అని అడిగాడు కుర్రాడు.

లార్డ్ హెన్రీ కుర్చీలో కూచుని మెల్లగా చేతిగ్లోవ్ లు విప్పుతూ, 'అవును. ఆ అమ్మాయిసంగతే మాట్లాడుతున్నాను. ఒకవిధంగా చూస్తే అది భీకరమైన సంఘటనే. కాని అది నీతప్పుమాత్రం కాదు. నాకో విషయం చెప్పు. నాటకం ముగిసిన వెంటనే వెళ్ళి ఆ అమ్మాయిని చూచావు కదూ?' అన్నాడు.

'అవును.'

'నేనూ అదే అనుకున్నాను ఆ అమ్మాయి సరిగా నటించలేదని గొడవచేశావా?'

'ఎంతో రాక్షసంగా ప్రవర్తించాను హెన్రీ! కాని, ఇప్పుడు మనస్సు మార్చుకున్నాను జరిగినదానికి నేనేమీ విచారపడడంలేదు. అందువల్ల నన్ను నేను తెలుసుకోగలిగాను.'

'మంచిపని చేశావు డోరియన్. పశ్చాత్తాపంలో పడి వేగిపోతూ ఆ నీ చక్కనిజుట్టు పీక్కుంటూ కూచున్నావనుకున్నాను.'

'పశ్చాత్తపించడం— బాధలో వేగిపోవడం - అదంతా గడిచిపోయింది హెన్రీ. ఇప్పుడు ఎంతో హాయిగా ఉన్నాను. అసలు విషయం చెప్పాలంటే అంతరాత్మ అంటే ఏమిటో

గ్రహించాను. నీవు అంతరాత్మనుగురించి కొన్నిమాటలు చెప్పావు. అదిమటుకు అంతరాత్మ కాదు. అంతరాత్మ అన్నిటి కన్న దివ్యమైంది. దాన్నిచూచి వెక్కిరించకు హెన్రీ! ఏమైనా ఇకముందు నా దగ్గరమాత్రం అంతరాత్మను నిందించకు. నే నికనుంచి మంచిగా ఉండదలచుకున్నాను. నాఅంతరాత్మ క్షుద్రంగా ఉండడం నేను భరించలేను.'

'నీతికి చక్కని ప్రాతిపదిక డోరియన్! నీకు ధన్యవాదాలర్పిస్తున్నాను. అయినా, ఈ మంచిగా ఉండడం ఎలా ప్రారంభించబోతున్నావో చెప్పు.'

'సిబిల్ వేన్‌ను పెళ్ళాడడంతో ప్రారంభించబోతున్నాను.'

'సిబిల్ వేన్‌ను పెళ్ళాడడమా! ఇదేంమాట డోరియన్! కాని డోరియన్-' అన్నాడు లార్డ్ హెన్రీ హఠాత్తుగా లేచి నిల్చుని.

'అవును హెన్రీ, నేను సిబిల్‌ను పెళ్ళాడనున్నాను. నీవు ఏం చెప్పనున్నావో నాకు తెలుసు. వివాహాన్నిగురించి ఏదో భయంకరమైనమాట చెప్పనున్నావు. అలాటి మాట లిక నాకు చెప్పకు. రెండురోజులక్రితం సిబిల్‌ను పెళ్ళాడమని కోరాను. ఇప్పుడామాట నిలుపుకోదలచుకున్నాను.ఆమె నాభార్య కానున్నది'

'నీభార్య! డోరియన్! నీకు నా ఉత్తరం రాలేదా? ఇవాళఉదయం ఒక చీటీముక్కరాసి నామనిషిచేత పంపాను'

'నీ ఉత్తరమా? అవును వచ్చింది. కాని ఇంకా చదవలేదు హెన్రీ. అందులో నాకు ఇష్టంలేనివిషయం ఏదైనా

ఉంటుందేమోనని భయపడ్డాను. నీవు నీ 'ఉవాచ' లతో జీవితాన్ని ముక్కలకింద కోసేస్తావు?

'అయితే, నీ కేమీ తెలీదన్నమాట.'

'అంటే?'

లార్డ్ హెన్రీ డోరియన్ ప్రక్కకు వచ్చి కూచున్నాడు. అతని రెండు చేతులూ తనచేతుల్లోకి తీసుకుని గట్టిగా పట్టుకుని, 'డోరియన్, నా ఉత్తరం - భయపడకు - సిబిల్ వేన్ చనిపోయిందని నీకు తెలుపడానికే వ్రాశాను' అన్నాడు.

పసిపిల్లాడిలా కెవ్వుమన్నాడు కుర్రాడు. ఎగిరి లేచి నిల్చున్నాడు. లార్డ్ హెన్రీగుప్పిట్లోనుంచి చేతులులాక్కుని 'సిబిల్ చనిపోయిందా! అబద్ధం! ఇంతమాట ఎలా అనగలిగావు!' - అన్నాడు.

'నిజంగా చనిపోయింది డోరియన్. నేటి ఉదయం పేపర్లన్నిటిలో ఆ వార్త ఉంది. నేను వచ్చేవరకూ నీవు ఎవరినీ చూడవద్దని ఆ ఉత్తరంలో వ్రాశాను. ఏదో విచారణ - అదీ ఇదీ- ఉండకపోదు. నీవు ఆగొడవల్లో ఇరుక్కోడం నాకు ఇష్టం లేదు. ఇలాటివాటివల్ల పారిస్‌లో అవుతే కీర్తి ఆకర్షణా కలుగుతాయి కాని,లండన్ జనం అన్నిటినీ పక్షపాతబుద్ధితో చూస్తారు. మన లండన్‌లో అపఖ్యాతిని వృద్ధాప్యంలో పనికివచ్చేందుకు ప్రత్యేకించుకోవాలి. ఇంతకూ నీ పేరు — ఆ థియేటర్‌లో ఎవరికీ తెలీదనుకుంటాను. తెలియకపోవడం మంచిది. ఇంతకూ నీవు ఆ అమ్మాయిగదిలోకి వెడుతూంటే ఎవరైనా చూశారా? ఇది ముఖ్యమైన విషయం.'

డోరియన్ కొద్ది క్షణాలపాటు ఏమీ మాట్లాడలేదు. భయోత్పాతంతో చకితుడైపోయి అలాగే మూగవాడిలా ఉండిపోయాడు. చివరకు ఎలాగో ఒకలా గొంతుపెకల్చుకుని 'హెన్రీ! విచారణంటున్నావు. అంటే నీ ఉద్దేశం ఏమిటి? సిబిల్-హెన్రీ! అబ్బ! అదే నిజమవుతే ఎంత ఘోరం! భరించలేను, చెప్పు— త్వరగా చెప్పు'— అన్నాడు.

'మనం అందరికీ ఆవిధంగా చెప్పినా, అది ప్రమాద వశాత్తు జరిగింది కాదనుకుంటాను, డోరియన్. పన్నెండున్నర, ఆ ప్రాంతాల, తల్లితో కలిసి థియేటర్‌నుంచి వెళుతూ మేడ మీద ఏదో మరిచిపోయానని చెప్పి తిరిగివెళ్ళిందట. కాసేపు ఆ అమ్మాయి తిరిగి వస్తుందని కనిపెట్టుకుని నిల్చున్నారట. కాని ఎంతకూ తిరిగిరాలేదట. పైకి వెళ్ళిచూస్తే డ్రెసింగ్ రూమ్‌లో నేలమీద చనిపోయి పడిఉందట. థియేటర్‌లో ఉప యోగించేదేదో తాగిఉంటుంది. అది ఏదో చెప్పలేను కాని, ప్రస్సిక్ యాసిడ్ కావచ్చు. యాసిడే అనుకుంటాను. లేకపోతే తాగినవెంటనే చనిపోదు.'

'హెన్రీ! హెన్రీ! ఎంత ఘోరం!' అని అరిచాడు కుర్రాడు.

'అవును. చాలా విషాదకరమైన విషయమే. కాని ఇందులో నీవు జోక్యం కలగజేసుకోడం మంచిదికాదు.

'స్టాండర్డ్' పత్రికనుబట్టి ఆ అమ్మాయికి పదిహేడేళ్ళ వయస్సని తెలుస్తూవుంది. నేను చూచినప్పుడుకూడా ఆవయస్సు కూడావుండదనుకున్నాను. పసిపిల్లలా కనుపించింది. నటనఏమీ తెలీనిదానిలా సుంది. డోరియన్! ఈవిషయం అధేపనిగా ఆలో

చించినిన్ను నీవు హైరానపెట్టుకోకు. నాతోరా. వెళ్ళి భోజనం చేసి, తరువాత ఒపెరాకు వెడదాం. ఇవాళ అంతా వస్తారు. నీవు నా చెల్లెలి బాక్సుకు రావచ్చు. ఆమెతో కలిసి కొందరు చక్కని చుక్కలుకూడా వస్తున్నారు.'

తరువాత డోరియన్ అర్ధస్వగతంగా ఇలా వాపోవ సాగాడు. 'అవుతే, నేను సిబిల్ వేన్‌ను హత్యచేశా నన్నమాట. ఆ అమ్మాయి చిన్నారిచిన్ని గొంతుకను కత్తితోకోసి ప్రాణం తీసినంతపనిచేశానన్నమాట. అయినా, గులాబీలు ఎప్పటి లాగానే ముచ్చటగానే వున్నాయి. పక్షులు ఎప్పటిలాగానే తోటలో ఆనందంగా కిలకిలారావాలు చేస్తున్నాయి. ఇవాళ రాత్రి నీతోకలిసి భోజనం చేస్తున్నాను. తరువాత ఒపెరాకు వెడతాం. మళ్ళీ ఎక్కడికో వెళ్ళి అల్పాహారం తీసుకుంటాం. జీవితం ఎంత చిత్రమైంది! ఇదంతా ఒక పుస్తకంలోనో ఒక నవలలోనో చదివితే కన్నీరు రాల్చి ఉండేవాణ్ణి. కాని, ఇదంతా నిజంగా జరిగిఉండబట్టి- ఆ కన్నీళ్ళుకూడా రావడం లేదు. కన్నీటికికూడా ఇది దూరంగా కనుపిస్తూఉంది. ఇదిగో, ఇది నా తొలి ప్రేమలేఖ. ఇదే నా కడపటి ప్రేమలేఖ. ఈ లేఖను ఒక మృతప్రేయసికి ఉద్దేశించి వ్రాయడం ఎంత విచిత్రం! నాకు ఒక్కోసారి ఆశ్చర్యం వేస్తుంది. ఈ మృతజీవులనేవాళ్ళు ఎలాఉంటారో? మనం మృతులని భావించే ఈ ధవళనిశ్శబ్దమూర్తులు మనమాటలు వింటారా? మన భావాలు పరితాపాలు వాళ్ళను కదిలిస్తాయా? సిబిల్! ఆ అమ్మాయి నా ఈ పరితాపం వింటుందా? ఈ నా తాపం ఆమెను స్పృశిస్తుందా? హెన్రీ! ఒకప్పుడు ఆమెను ఎలా ఎంతగా ప్రేమించా

ననుకున్నావు! కాని అదంతా గడిచిపోయి సంవత్సరాలు దాటిపోయినట్టుగా ఉంది ఆఅమ్మాయికోసమే నాబ్రతుకంతా వెలకట్టాను. ఆ అమ్మాయే. నాకు సమస్త మనుకున్నాను. కాని తరువాత ఆ భీకరరాత్రి వచ్చింది. ఆ రాత్రి పోయిన రాత్రేనా? ఆ అమ్మాయి సరిగా నటించింది కాదు. నా హృదయం బ్రద్దలైపోయింది. ఆ అమ్మాయి, తను ఎందుకు నటించలేకపోయిందీ నాకు పూసగుచ్చినట్టు చెప్పింది. ఎంత ప్రాధేయపడింది! ఎంత వాపోయింది! ఎంత బ్రతిమిలాడుకుంది! కాని నాగుండె కదిలితేనా? అదీ నటనే అనుకున్నాను.

హఠాత్తుగా ఒక విచిత్రం జరిగింది. అది నన్ను భయ పెట్టింది. మళ్ళీ ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళాలని నిశ్చయిం చుకున్నాను. తప్పు చేశాననుకున్నాను. కాని ఇప్పుడు ఆమె లేదు. చనిపోయింది. అయ్యో భగవంతుడా! ఇక నే నేం చెయ్యాను? నే నెలాంటి ప్రమాదంలో ఉన్నానో నీవు గ్రహిం చలేవు హెన్రీ. ఇక నాకు దోవలేదు. ఇక నే నెలా నాతప్పు దిద్దుకోను? ఆ అమ్మాయి సజీవురాలయివుంటే అందుకువవ కాశం ఉండేది. ఆ అమ్మాయి ఎందుకు చనిపోవాలి? ఆమెకు చనిపోయేహక్కు లేదు. ఆమె ఎంత స్వార్థపరురాలు.'

లార్డ్ హెన్రీ అంతా విని ఒక సిగరెట్ వెలిగించి ఇలా చెప్పసాగాడు:

'డోరియన్, స్త్రీ పురుషుణ్ణి సంస్కరించేవిధం ఒకటే ఉంది. అది అతనికి జీవితంలో పూర్తిగా ఆసక్తి నశించేవరకూ అతన్ని విసుకెత్తించడం. నీవు ఈ అమ్మాయిని పెండ్లాడిఉంటే నీ బ్రతుకు మరింత పాడైఉండేది. నీవు ఆమెను దయతోనే

చూచుకునేవాడివనుకో. అయినా, మనం ఎవరిని లెక్క చెయ్యమో వారిపట్ల దయగా ఉంటాం. ఒక స్త్రీ తన భర్త తనపట్ల ఇలా ఉంటున్నాడని గ్రహించిందంటే చాలా అసహ్యంగా తయారైపోతుంది. తన ముస్తాబు విషయంలో కాని అలంకరణ విషయంలో పూర్తిగా అశ్రద్ధచేసి చూడ రోత పుట్టేటట్లు తయారవుతుంది. లేదా చక్కచక్కని ముస్తాబులపై మోజు హెచ్చుతుంది. కాని ఆ ముస్తాబులకోసం ఇతరస్త్రీలభర్తలు ఆ ఖర్చు భరించవలసి ఉంటుంది. సాంఘిక తప్పిదంమాట అలాఉంచి – ఏవిధంగా చూచినా ఈ నీ వివాహం అన్నివిధాలా నీ నాశనానికే దారితీసేది.'

కుర్రాడు గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తూ: 'అలాగే అయిఉండే దనుకుంటాను. కాని ఆ అమ్మాయిని వివాహమాడడం నా ధర్మమని తలిచాను. ఇంతలో ఈ భయంకర విషాదం సంఘటించి నా కర్తవ్యానికి అవరోధం కావడం నా తప్పుకాదు. నీవు ఒకమాటు ఒక విషయం చెప్పావు. మంచినిశ్చయాలెప్పుడూ ఏదో ఒకవిధంగా విఫలమైపోతాయన్నావు. మనం ఆ నిశ్చయాలకు రావడంకూడా చాలా ఆలస్యంగా, సమయం మించిపోయిన తరువాత వస్తామన్నావు. నానిశ్చయాలూ నిశ్చయంగా అలాంటివే'అన్నాడు.

'మంచినిశ్చయాలెప్పుడూ శాస్త్రీయసూత్రాలతో అనవసరజోక్యం కలిగించుకుంటూ మనం చేసే వ్యర్థయత్నాలు. వీటికి మూలం మన దురహంకారం మాత్రమే. ఫలితం పూర్తిగా శూన్యం. వాటిఉపయోగంకూడా బహుకొద్ది. మనలో కొన్ని ఉద్రేకాలను రెచ్చగొడతాయి. అదీ ఒకవారంపాటు

మాత్రమే. అంతకంటే వాటివల్ల పెద్ద ఉపయోగమేమీ లేదు. అవి ఏకాంతులేని బాంకులో చెక్కుపుస్తకం పుచ్చుకోడం లాంటివి. అంతే.'

'హెన్రీ, నాకో విషయం చెప్పు. నేను అనుకున్నంతగా ఈ విషాదసంఘటననుగురించి పరితాపంపొందలేకపోతున్నాను. ఎంచాతనో చెప్పు. నేను హృదయంలేనివాణ్ణని అనుకోను. నీ ఉద్దేశం చెప్పవూ?'– అన్నాడు డోరియన్ లార్డ్ హెన్రీప్రక్కనే వచ్చి కూచుంటూ.

'గత పత్తుందినాలలో నీవు హృదయం ఎక్కువగా ఉండేవాళ్ళు సహజంగా చేసే తెలివితక్కువపనులు చాలా చేశావు డోరియన్. అంచాత నిన్ను కఠిన హృదయుడని అనడానికి ఏ మాత్రం వీల్లేదు' అన్నాడు లార్డ్ హెన్రీ తనకు సహజమైన విషాద మృదుల మందహాసంతో. కుర్రాడు ముఖం కుంచించుకున్నాడు. 'నీ వివరణ నాకు సమ్మతంగా లేదు హెన్రీ. కాని నేను హృదయంలేనివాణ్ణని నీవు అనుకోనందుకు మాత్రం నేను సంతోషిస్తున్నాను. నేను హృదయం లేనివాణ్ణేమీ కాదు. ఆ విషయం నాకు తెలుసుకూడా. అయినా ఈ సంఘటన తగినంతగా నన్ను కదిలించడం లేదు. ఒక చక్కని నాటకానికి చక్కని సమాప్తిలాగా వుంది. అంతే. ఒక గ్రీక్ విషాదాంతనాటకంలోని భీకర సౌందర్యమంతా ఇందులోవుంది. నే నా విషాదనాటకంలో పెద్దపాత్ర వహించాను. కాని నాకు ఒక చిన్నగాయంకూడా తగల్లేదు.'

కుర్రాడి అవ్యక్త 'అహం'తో కాసేపు ఆటలాడి ఆనందించాలనుకున్నాడు లార్డ్ హెన్రీ. 'ఇది ఒక చక్కని

ప్రశ్నే డోరియన్. చాలా చక్కని ప్రశ్న. దీని తాలూకు అసలు వివరణం ఇదనుకుంటాను. చెప్పనా? సాధారణంగా జీవితాల్లో జరిగే విషాదాలు చాలా నికృష్టంగానూ, కళా రహితంగానూ ఉంటాయి. వాటికి ఒక పద్ధతీ ఒక పొందికా కార్యకారణసంబంధాలూ ఉండవు. ఎంత వెదికినా ఒక అర్థం కూడా కనుపించదు. పైగా చాలా నాటుగా మనల్ని బాధిస్తాయికూడా. అసభ్యత మనల్ని ఎలా నొప్పిస్తుందో అవీ అలానే నొప్పిస్తాయి. ఒక పశుశక్తిలా కనుపిస్తాయి. అంచాత వాటిమీాద మనం తిరుగుబాటు చేస్తాం. ఇది సాధారణంగా సంభవించే విషాదసంఘటనలవిషయం. ఇక ఎప్పుడో ఒక చక్కని విషాద మనేది మన బ్రతుకుల్లోకి తొంగిచూస్తుంది. చక్కనివిషాదం అంటే కళాసౌందర్యలక్షణాలున్న విషాద మన్నమాట. ఈ సౌందర్యలక్షణాలే నిజమవుతే ఆ విషాదం మనలోని రసజ్ఞతకు దోహదమవుతుంది. అది ఒక చక్కని చిన్న నాటకంలా కనుపిస్తుంది. మనం అందులో పాల్గొనే నటకులం కామనీ, అదిచూచి ఆనందించే ప్రేక్షకులంమాత్రమే ననీ అకస్మాత్తుగా తెలుసుకుంటాం. లేక, మనం రెండూ కావచ్చుకూడా. మనల్ని మనమే గమనిస్తూ కూచుంటాం. అప్పుడు కేవలం ఆ దృశ్యావలోకనమే మనల్ని ముగ్ధులను కావిస్తుంది. ఇప్పుడు నీ విషయం తీసుకుందాం. జరిగిందేమి టంటావ్? ఎవరో ఒక అమ్మాయి చనిపోయింది. ఆ అమ్మాయి నిన్ను ప్రేమించింది నీమీాద ప్రేమకోసం చని పోయింది. ఇలాటి అనుభవమే నాకు జరిగిఉంటే ఎంత బావుం టుందా అని నేను వాంఛిస్తాను. ఇలాటి అనుభవమే నాకు

జరిగిఉంటే నేను బ్రతుకంతా ప్రేమనే ప్రేమిస్తూ ఉండిపోయే వాణ్ని. నన్ను ఆరాధించిన వ్యక్తులు— ఎక్కువమంది లేర నుకో— అయినా ఉన్న కొద్దిమందీ నేను వాళ్ళనుకాని, వాళ్ళు నన్నుకాని లెక్కచెయ్యడం మానేసిన తరువాతకూడా అలాగే బ్రతుకులు ఈడుస్తున్నారు. వయస్సుతో అనుభవా లతో బాగా లావెక్కారుకూడా. వాళ్ళలో మజాఅంతా పోయింది. ఎప్పుడైనా నేను వాళ్ళను కలుసుకోడం తటస్థిస్తే ఇహ పాతజ్ఞాపకాలు నెమరువేసుకోడం సాగిస్తారు. స్త్రీ స్మృతి! అబ్బ! ఎంత భయంకరమైందనుకున్నావ్! కుళ్ళిన మేధస్సుకు అది సంకేతం. మనం జీవితం యొక్క స్వార స్యాన్ని, శోభనూ, రంగునూ జీర్ణంచేసుకోవాలి కాని, బ్రతు కుయొక్క అల్ప వివరాల్లోకి పోకూడదు. వాటిని జ్ఞాపకం ఉం చుకోకూడదు. వివరాలెప్పుడూ రోతపుట్టిస్తాయి' అన్నాడు లార్డ్ హెన్రీ.

'నేను నా తోటలో ఉమ్మెత్తలు నాటిస్తాను' అని నిశ్వసించాడు డోరియన్.

'అవసరంలేదు డోరియన్. జీవితం ఎప్పుడూ వాటిని తన చేతుల్లో ధరించేఉంది. మధ్యమధ్యలో మాత్రం విషయాలు అటూఇటూ కాస్త చలిస్తూ ఉంటాయనుకో. ఒకప్పుడు నేను ఒక విషాదానికి చిహ్నంగా ఒక్క 'వయిలెట్' పుష్పాలు మాత్రమే ధరించాను. మృత్యువనేది లేని ఒక ప్రణయానికి చిహ్నంగా వాటిని ధరించాను. కాని, ఆ శృంగారమూ కడకు కన్నుమూసింది. ఎలా నశించిపోయిందో ఇప్పుడు నాకు జ్ఞాపకం లేదు. ఆమె ఈ ప్రపంచాన్నంతా నాకోసం త్యజిస్తాననడంవల్ల

భగ్నమైన దచుకుంటాను. స్త్రీ అలాంటిమాట అన్నదంటే - అది చాలా భీకరక్షణం అనుకో! ఆ క్షణాన్ని భరించలేము. అది శాశ్వతత్వపు భయంతో మనల్ని నింపుతుంది. సరే కాని నీవు నమ్మతావో నమ్మవో, ఒక వారంక్రితం ఒక విషయం జరిగింది. లేడీ హామ్‌ప్‌షైర్ గృహంలో డిన్నర్ జరిగింది. నేనూ వెళ్ళాను. నా ప్రక్క నే ఒక స్త్రీ కూచుంది ఆమె ఒకమాటు గతగాధనంతా తిరిగి త్రవ్వకోడానికి నన్ను ఒత్తిడి చేసింది. పాత కథను తిరిగి త్రవ్వడం, భవిష్యత్తును చిందరవందర చేసుకోడమే. నే నెప్పుడో నా శృంగారాన్ని నీలాలపూలశయ్యలో సమాధి కావించాను. ఆమె మళ్ళీ దాన్నంతా బయటికి లాగింది. నేను తనజీవితాన్ని పాడుచేశానని కచ్చితంగా చెప్పింది, కాని ఆమె కడుపునిండా సుష్టుగా భోంచేసింది. అంచాత వచ్చిన ప్రమాదమేమీ లేదని నేను మాత్రం ఆందోళనపడ లేదు. కాని అలా గతాన్ని త్రవ్వడంలో ఆమె ఎంత అల్పమైన అభిరుచిని ప్రదర్శించిందంటావ్! గతంలోని అందం అది గతం కావడమే. కాని, తెర ఎప్పుడు జారిందో స్త్రీలు ఎన్నడూ తెలుసుకోలేరు. ఎప్పుడూ ఆరో అంకం కోసం ఎదురుచూస్తూ కూచుంటారు. నాటకంలో స్వారస్యమంతా అయిపోయిన తరువాత కూడా నాటకం సాగించాలంటారు. వాళ్ళ ఇష్టప్రకారం వాళ్ళను పోనిస్తే ప్రతి సుఖాంతం కూడా దుఃఖాంతమై కూచుంటుంది. ప్రతిదుఃఖాంతము ప్రహసనంగా పరిణమిస్తుంది. వాళ్ళ కృత కత్వంలోనూ కృత్రిమత్వంలోనూ అందం, ఆకర్షణా ఉన్నాయి. కాని, వాళ్ళకు కళాభిజ్ఞత అవగింజంతయినా • లేదు. నీవు నా కంటె ఎంతో అదృష్టశాలివి డోరియన్. నేను స్పష్టంగా చెప్ప

గలను. నాకు పరిచయం ఉన్న స్త్రీలలో ఒక్కతె కూడా సిబిల్ వేన్ నీకు ఏఁ చేసిందో అది నాకోసం చెయ్యగలిగేది కాదు. సామాన్య స్త్రీలు ఎప్పుడూ తమను తాము ఎలాగో ఒకలా ఓదార్చుకోవడంతో సర్దిపెట్టుకుంటారు. కొందరు ఇందు కోసం వేషాలుకూడా వేస్తారు. ఊదా ముసుగు వేసుకున్న స్త్రీని ఎన్నడూ నమ్మకు. ఆమెవయస్సు ఎంతయినా కావచ్చు. ముప్ఫయిఏళ్ళుదాటిన స్త్రీ పింక్ రిబ్బన్లంటే మోజుపడితే ఆ స్త్రీని నమ్మకు. దాని అర్థం ఆ స్త్రీ వెనకాల ఒక చరిత్ర ఉందన్నమాట. కొందరు స్త్రీలుంటారు. వాళ్ళు తమ భర్త లతో అకస్మాత్తుగా మంచి గుణాలు కనిపెట్టి తద్వారా తమను తాము ఓదార్చుకుంటారు. తమదాంపత్యసౌఖ్యాన్ని అందరి ముందు ప్రదర్శిస్తారు, అది అన్నిపాపాల్లోకి ఆకర్షణీయమైన దన్నట్టు. కొందరికి మతం శాంతినిస్తుంది. మతంలోని రహస్యా లన్నిటిలోను వ్యభిచారంలోని ముచ్చటలన్నీ ఉన్నాయి. ఒక మాటు, ఈ మాట ఒక స్త్రీ నాతో చెప్పింది. ఆమె ఉద్దే శ్యం నేనూ అర్థంచేసుకోగలిగాను. ఒకరిని పాపిఅన్నప్పుడు ఇహ ఆ వ్యక్తి ఎంత పొంగిపోతాడో మనం చెప్పలేం. అంత రాత్మ అనేది మనల్నందరినీ అహంకారులను చేస్తుంది. అధు నాతన జీవితంలో ఆడంగులు వెదికే ఓదార్పులకు ఒక అంతూ పొంతూ లేదనుకో. అయినా, అన్నిటి కంటె ముఖ్యమైనదాన్ని నేను చెప్పాను కాదు.'

'అదేమిటి హెన్రీ?' అని అడిగాడు కుర్రాడు అనాస క్తంగా.

'అది అందరికీ తెలిసిన విషయమే డోరియన్. అది, ఒక స్త్రీ తనప్రియుణ్ణి కోల్పోయినవెంటనే మరొక స్త్రీప్రియుణ్ణి తను స్వీకరించడం. మంచిసమాజంలో ఇది స్త్రీకి ఎప్పుడూ మంచిదే. స్త్రీని మరమ్మత్తుచేసి పరిశుభ్రం చేస్తుంది. కాని, డోరియన్, మనకు రోజూ తారసిల్లే ఈ స్త్రీలకూ సిబిల్ వేన్ కూ ఎంత తేడాఉంది! ఆమెస్మృతిలో నాకు ఏదో గొప్పఅందం కనుపిస్తూఉంది. ఇలాంటి అద్భుతాలు జరుగుతున్న శతాబ్దంలో నివసిస్తున్నందుకు నిజంగా నే నెంతో సంతోషిస్తున్నాను. మనం నిత్యం చేరలాటమాడుకునే ప్రణయం, ఉద్వేగం, ప్రేమ – ఇలాంటి విషయాలు ఎంత నిజమైనవో మనకు ఋజువు పరుస్తుంది.'

'నేను ఆమెపట్ల ఎంతో క్రూరంగా ప్రవర్తించాను. ఆ విషయం నీవు మరుస్తున్నావు.

'స్త్రీలకు క్రౌర్యమంటే ఇష్టమనుకుంటాను డోరియన్. అందులోనూ, వాళ్ళు పచ్చిక్రౌర్యాన్ని అభిమానిస్తా రను కుంటాను. అనాదిమానవప్రేరేపణలన్నీ వాళ్ళలో అద్భుతంగా ఉన్నాయి. మనం వాళ్ళకు విముక్తి కల్పించాం. అయినా, వాళ్ళు తమయజమానులకోసం ఎదురుచూచే బానిసలుగానే ఉన్నారు. వాళ్ళకు ఒకరు తమ మీద పెత్తనం చలాయించడ మంటే ఎంతో ఇష్టం. పెత్తనం చలాయించేవారిని అధికంగా ప్రేమిస్తారు కూడా. నీవు సిబిల్ని కొప్పడడంలోఎంతో అద్భుతంగా ప్రవర్తించా వనుకుంటున్నాను. నీకు ఎప్పుడూ అసలైన కోపం రాగా నేను చూడలా. అప్పుడు నీవు ఎంత అందంగా ఉండిఉంటావో నేను ఊహించుకోగలను. మొన్న నీవు నాతో

ఒక మాట చెప్పావు. అప్పుడు అది కేవలం ఊహాన్మాద మనుకున్నాను. కాని, ఇప్పుడు మాత్రం అది ఎంతో సత్యంగా కనుపిస్తోంది రహస్యమంతా అందులోనే ఉంది.

'ఏమిటా మాట హెన్రీ?'

"ప్రపంచంలోని ప్రణయనాయికలందరికీ సిబిల్ వేన్ ప్రతినిధి అన్నావు. 'ఒకరాత్రి డెస్‌డిమోనాగా కనుపిస్తుంది; మరో రాత్రి ఒఫీలియా అవుతుంది; ఒకరాత్రి జూలియట్‌గా చనిపోతే మరోరాత్రి ఇమోగెన్‌గా జన్మిస్తుంది' అన్నావు."

'ఇక ఆమె జన్మించడం లేదు-' అన్నాడు కుర్రాడు ముఖాన్ని చేతుల్లో దాచుకుంటూ.

'అవును. ఆమాట నిజమే. ఇక ఆమె జన్మించడమనేది లేదు. తన కడసారి పాత్ర అభినయించింది. నిష్క్రమించింది. కాని నీవు- ఆ చిన్న డ్రెసింగ్‌రూమ్‌లో ఆ చిన్నదాని ఒంటరి చావు ఒక విషాదాంతనాటకంలోని ఒక దృశ్యంగా ఊహించుకోవాలి. ఆ అమ్మాయి ఎప్పుడూ నిజంగా బ్రతకలేదు. అంచాత ఆ అమ్మాయి చావుకూడా నిజం కాదు. నీకైనా ఆమె ఎప్పుడూ ఒక స్వప్నంగానే ఉంది. షేక్స్పియర్ నాటకాల్లో అలలాడిన ఒక కలలకన్నెగానే కనుపించింది. ఆమె పరిమళంతో ఆ నాటకాలలో మరింత అందచందాలు గుబాళించాయి. షేక్స్పియర్ సంగీతం మరింత నిండుగానూ ఆనందోత్పాదకంగానూ ప్రవహించిన సన్ననిస్వరనాళంగానే ఆమె నీకు కనుపిస్తూవచ్చింది. కాని ఆమె వాస్తవజీవితాన్ని స్పర్శించిందో లేదో- జీవితాన్ని ధ్వంసం చేసుకుంది జీవితం ఆమెను ధ్వంసం చేసింది. అంచాతనే ఆమె వెళ్ళిపోయింది. ఆ

అమ్మాయికోసం నీవు వాపోవడం ఉచితంకాదు. శోకిస్తే, ఒఫీలియాకోసం శోకించు. కార్డీలియా ఉరిపోసుకున్నందుకు భస్మకిరీటం ధరించు. బ్రబాన్షియో కుమార్తె కళ్ళుమూసినందుకు విధిని వివిధవిధాల దూషించు. కాని, సిబిల్ వేన్ కోసం కన్నీళ్లు పారపోసుకోకు. ఆమె వాటికంటె అవాస్తవికమైనది.'

తరువాత నిశ్శబ్దం. గదిలో సాయంత్రం చిక్కబడింది. చీకటిగా మారుతూంది. నిశ్శబ్దంగా వెండిపాదాలతో చీకటి నీడలు తోటలోనుంచి వచ్చి గదిలోచోటుచేసుకుంటున్నాయి. వస్తువులనుంచి రంగులు బద్ధకంగా తొలగిపోతున్నాయి. కొంతసేపు గడిచింది. డోరియన్ తలెత్తిచూచాడు. ఏదో బాధ దిగిపోయినట్టు మెల్లగా నిశ్వసించాడు. 'నన్ను నాకు తెలియపరచావు హెన్రీ. నీవు చెప్పినదంతా నేనూ అనుభవించాను. కాని ఎంచాతనో భయపడి దాన్ని వెలిబుచ్చలేకపోయాను. నన్ను నేను అర్థంచేసుకోలేకపోయాను. కాని, నన్ను నీ వెంత చక్కగా అర్థంచేసుకున్నావు! కాని, ఇక మనం ఆ విషయం మాట్లాడవద్దు. అదొక అద్భుతమైన అనుభవం, గడిచిపోయింది. అంతే. ఇంకా జీవితగర్భంలో ఇలాటి అద్భుతానుభవాలు నాకోసం ఎదురుచూడడం లేదనుకుంటాను. అయినా, ఇంకా ఏ ఏ అనుభవాలు జీవనగర్భంలో దాగి ఉన్నాయో!'

'జీవితం నీకోసం ఎన్నిటినో దాచిఉంచింది డోరియన్. నీ అందచందాలతో నీవు సాధించలేని దంటూ లేదు.'

'కాని, హెన్రీ, నేను ముసలివాణ్ని అవుతాననుకో, కురూపినవుతాననుకో. నా వయస్సు ఉడిగి ముఖం ముడతలు పడిపోతుందనుకో- అప్పుడు- అప్పుడు ఏమవుతుంది?'

'డోరియన్, అప్పుడు నీ విజయాలకోసం పోరాడవలసి ఉంటుంది. ఇప్పుడు అవి వాటంతట అవే నీ దగ్గరికి వచ్చాయి. కాని, నీవు నీ అందం చెరుపుకోకూడదు. మనం ఒక విచిత్రమైన యుగంలో నివసిస్తున్నాం. విజ్ఞానం నశించేటంతచదువూ, అందం నశించేటంత ఆలోచనా ఉన్నయుగం ఇది. నిన్ను ఈ యుగానికి వదలదలచుకో లేదు. ఇక లేచి ముఖం కడుక్కొని ముస్తాబై క్లబ్బుకు రా. ఇప్పటికే చాలా ఆలస్యమైపోయింది.'

'నిన్ను ఒపెరాలో కలుసుకుంటాను హెన్రీ. నాకు చాలా అలసటగా ఉంది. భోజనంకూడా సయించేటట్టు లేదు. ఇంతకూ-నీ చెల్లెలి బాక్సునంబ రెంత?'

'ఇరవైఏడు అనుకుంటాను. తలుపుదగ్గర ఆమె పేరు అంటించిఉంటుంది. ఇంతకూ — నీవు నాతో వచ్చి భోజనం చెయ్యనందుకు నే నెంతో చింతిస్తున్నాను.'

'నాకు ఆకలిగాలేదు. అయినా, నీవు ఇదంతా చెప్పినందుకు నీకు ఎంతో కృతజ్ఞుణ్ని. నీవే నా గొప్పమిత్రుడివి. నీవు నన్ను అర్థంచేసుకున్నంతగా మరెవరూ అర్థం చేసుకో లేదు.'

'మన స్నేహం ఇంకా ప్రారంభంలోనే వుంది డోరియన్. వస్తాను. నిన్ను తొమ్మిదిన్నరకు కలుసుకుంటాను. 'పట్టి' పాడుతూ వుంది. జ్ఞాపకం వుంచుకో.'

డోరియన్ తలుపుమూసి వచ్చి గంటకొట్టాడు. కొద్ది క్షణాలలో విక్టర్ వచ్చి దీపాలు వెలిగించాడు. కిటికీల తెరలు దించాడు. విక్టర్ ఎప్పుడెప్పుడు వెడతాడా అని కాచుకుని ఉన్నాడు డోరియన్. అతను ఒక్కొక్కపనే చాలాసేపు చేస్తున్నట్టుగా కనుపించింది. అతను వెళ్ళగానే తెరదగ్గరకువెళ్ళి తెరలాగాడు. బొమ్మలో కొత్త మార్పేమీ లేదు. సిబిల్ వేన్ మరణవార్త తనకంటె ముందుగా స్వీకరించింది. జీవిత సంఘటనలన్నీ- జరిగినవి జరిగినట్టుగా ఆ బొమ్మకు తెలుస్తున్నాయి. అక్కడ ఆ అమ్మాయి విషం పుచ్చుకుందో లేదో-ఈ బొమ్మ పెదవులపై ఆ క్షణంలోనే వికృతరేఖలు ఏర్పడిఉంటాయి. లేక ఈ బొమ్మకు ఫలితాలతో ఎలాటి సంబంధమూ లేదా? కేవలం ఆత్మలోజరిగే విషయాల్నిమాత్రం గ్రహించి ఊరుకుంటూఉందా?డోరియన్ఆశ్చర్యపడ్డాడు. ఒకనాటికితనకళ్ళముందే జరగబోయే మార్పుని ఊహించుకుని వణికిపోయాడు. పాపం! సిబిల్ పోయింది. ఎంత చిత్రమైన ప్రణయం! ఎన్నోసార్లు రంగస్థలంపై మరణావస్థను అనుకరించింది' చివరకు మృత్యువే ఆమెను కౌగిలించుకుని ఎత్తుకునిపోయింది. ఆ కడపటి భయద దృశ్యాన్ని ఎలా అభినయించిందో! కడసారి కళ్ళుమూస్తూ తనని శపించిందేమో! శపించిందా? శపించి ఉండదు. తనపై ప్రేమతో చనిపోయింది. ఇక తనకు ప్రేమ ఎప్పుడూ పవిత్ర పూజావస్తువుగానే ఉండిపోతుంది. తన జీవితాన్ని త్యజించి సకల పాపాలకూ నివృత్తి కల్పించింది. ఇక ఆమెనుగురించి తను చెడు ఏమీ ఊహించదలచలేదు. ఆమె తనకి కలిగించిన తీవ్రతాపం, ఆ థియేటర్‌లో ఆనాటి భీకరరాత్రి - ఇక తను

తలచదలచలేదు. ఇక ఆమె తనస్మృతిపథంలో ఒక వెలుగుల దేవతగానే కనుపిస్తోంది. ప్రేమయొక్క అఖండసత్యాన్ని రుజువుపరచడానికై ఈ విశ్వరంగస్థలంలోకి పంపబడిన ఒక అద్భుతవిషాదమూర్తిగానే ఆమెను స్మరించుకుంటాడు. అద్భుత విషాదమూర్తి! ఆ మాట స్మరించుకునేసరికల్లా అతని కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. పసిపిల్లలాటి ఆమె ముఖం, అమాయకపు చూపులు, చక్కని ముచ్చటైన తీరు, లజ్జా లలిత లావణ్యం అతని స్మృతిలో తళుక్కొత్తి కళ్ళలో నీళ్లుతిరిగాయి. వెంటనే కన్నీళ్లు తుడుచుకుని మళ్ళీ బొమ్మవంక చూచాడు. తను ఏదో ఒకబాట ఎన్నుకోవలసినసమయం ఆసన్నమైందనుకున్నాడు. లేక అప్పుడే ఎన్నుకోడం అయిపోయిందా? అవును. జీవితం ఎప్పుడోతనకోసం బాటను ఎన్నిపెట్టింది. జీవితం — జీవితంపట్ల తీరని తన ఔత్సుక్యం, తనబాటను నిర్దేశించింది. తరగని యౌవనం, తుదీ మొదలూ లేని ఉద్వేగం, ఆసక్తి, దాగుడుమూతలాడే సూక్ష్మరహస్య సౌఖ్యాలు, అందీ అందని ఆనందాలు, భీకరమైన వెల్లువలలాంటి ఆనందాలు, అంతకన్న భీకరమైన పాపాలు — ఇవన్నీ తనకోసం తన బాటలో కాచుకుని కూచున్నాయి.తన పరాభవ భారాన్నంతా ఈ బొమ్మ భరించి తీరాలి. ఇంతకన్న మరి మార్గం లేదు. ఆ బొమ్మలోని మధుర వదనాన్ని ఆచ్ఛాదింపనున్న పంకిలపాపచ్ఛాయను ఊహించుకునేసరికి ఒక సన్నని బాధ కత్తివాదరలా అతనిలోనుంచి దూసుకునిపోయింది. ఒకమాటు అతనిలో చిన్నతనం పైకుబికి ఒక చిన్న చిలిపిచేష్ట చేదామనిపించింది. నార్సిసస్‌కు వెక్కిరింతగా తనపెదవులు తనే ముద్దాడాడు. లేదా ముద్దాడినట్టు

ఊహించాడు. ఆ పెదవులు ఇప్పుడు తనని చూచి క్రూరంగా నవ్వుతున్నాయి ప్రతి ఉదయం ఆ బొమ్మముందు కూచునే వాడు. ఆ అద్భుతసౌందర్యాన్ని చూస్తూ ఆశ్చర్యపోయేవాడు. ఒక్కోసారి తన అందం తననే విముగ్ధం కావించేది. అందీఅందని ఆ అందచందాలన్నీ ఇప్పుడిక చెరిగి చెదిరిపోవలసిందేనా? తన మనస్సుచేత జోహార్లు చేయించుకున్న ఆ అతీత అవస్థలన్నీ అథోయానం చెయ్యవలసిందేనా ? ఇక ఆ అప్సర సౌందర్యం ఉట్టిపడుతూవచ్చిన ఆ బొమ్మ భయంకరంగా రాక్షసంగా జుగుప్సాకరంగా మారిపోతుందా? ఇక ఆ బొమ్మను ఎక్కడో మారుమూలల చీకటిగదిలో దాచవలసిందేనా ? ఎన్నోసార్లు ఆ బొమ్మ హేమశిరోజాలను స్పృశించి మరింత తళుకులొత్తిన సూర్యకిరణజాలానికి ఆ బొమ్మ దూరం కావలసిందేనా ? ఎంత ఘోరం! ఎంత విచారకరం !

తనకూ, ఆబొమ్మకూ ఉన్న ఎడతెగని ఆ ప్తబాంధవ్యం తెగిపోవాలని ఒకక్షణం ప్రార్థించుకున్నాడు డోరియన్. ఒక ప్రార్థనకు జవాబుగా ఆ బొమ్మ మారింది. మరో ప్రార్థనకు జవాబుగా అది మారకుండా ఉండవచ్చు. అయినా, జీవితాన్ని గురించి ఏమాత్రం తెలిసిన వ్యక్తయినా, నిత్యం యౌవనం కలిగిఉండే అవకాశాన్ని జారవిడుచుకుంటాడా? ఆ అవకాశం ఎంత భ్రాంతిజనితమైనదైనా కావచ్చు. అంతేకాక, అది అత నికి సాధ్యమయ్యేవిషయమా? ఈ ప్రత్యామ్నాయానికి కారక మైంది ఆ ప్రార్థనేనా ? దీనికంతకీ మరేదైనా ఒక విచిత్రమైన శాస్త్రీయకారణం ఉండకూడదా? సజీవవస్తురాసులపై భావం దాని ప్రభావాన్ని నెరపుతున్నది కదా, అలాంటప్పుడు మరి

ఆ భావం మృతచేతనారహితవస్తుసముదాయంపై తన ప్రభావం ఎందుకు ప్రసరింపచెయ్యకూడదు? పోనీ,— 'భావం' కాని, సచేతనకాంక్ష కాని లేకుండా మనకు బాహిరమైన వస్తుజాలం మన మానసికావస్థలతో ఉద్వేగాలతో శ్రుతిగలిపి ప్రకంపించకూడదా? అనూహ్యా బాంధవ్యాంతోనూ, రహస్యప్రేమ భావంతోనూ, అణువు మరొక అణువును అభిసరింపకూడదా? ఏమైనప్పటికీ, కారణాన్ని అన్వేషించడం అనవసరం ఏ భీకర శక్తినీ ప్రార్థనద్వారా ప్రసన్నం కావించుకోడానికి ఇక అతను యత్నించడు. చిత్రం మారితే మారుతుంది. అందుకు చేయ గలిగింది ఏమీ లేదు. ఇక దాన్ని గురించి అంత నిశితంగా విచారించడం ఎందుకు?

ఆ చిత్రాన్ని వీక్షించడంలో ఒక నిజమైన ఆనందం ఉంది. దాని నిగూఢఅభ్యంతరాలలో తన మనస్సుని ప్రయాణం చేయించవచ్చు. ఈ చిత్రం అతనికి మంత్రముకురంలాంటి దవుతుంది. తనశరీరాన్ని తనకు సాక్షాత్కరింపచేసినట్టుగానే తన ఆత్మను కూడా సాక్షాత్కరింపజేస్తుంది. దాన్ని శీతాకాలం ఆచ్ఛాదించినప్పుడు తను వసంతాంచలాల్లోనే ఉంటాడు. దాని ముఖంలోని నెత్తురు తొలగిపోయి కళ్లు నిర్జీవాలై, ముఖం సున్నపుబొమ్మయినప్పుడు తనలో ఇంకా చిన్నతనంచిందుతూనే ఉంటుంది. తనశోభాకుసుమం ఒక్కటికూడా ఎన్నటికీ వాడిపోదు. తన జీవనాడిఒక్కటికూడా ఎన్నటికీ పల్చబడదు. గ్రీక్ దేవతల్లాగా అతనెప్పుడూ నిత్యానందమయుడిగా ఉంటాడు ఇక ఆ నిర్జీవవర్ణ చిత్రం ఏమవుతే మటుకేం? తను సురక్షితంగానూ భద్రంగానూ ఉంటాడు. అంతే చాలు.

ఈ ఆలోచనలతో చిరునవ్వునవ్వుతూ అతను మళ్ళీ తెర మూశాడు. అక్కడినుంచి పడకగదిలోకి వెళ్ళాడు. అక్కడ తనకోసం సేవకుడు వేచి ఉన్నాడు. ఒకగంట తరువాత ఒపెరాకి కూచుని వున్నాడు. లార్డ్ హెన్రీ అతని కుర్చీపై వాలి ఏదో అంటున్నాడు.

# 9

మరుసటిరోజు ఉదయం. డోరియన్ ఉదయ భోజనానికి కూచోబోతున్నాడు. బేసిల్ హాల్‌వర్డ్ వచ్చాడు.

'నిన్ను కలుసుకోగలిగినందుకు ఎంతో సంతోషిస్తున్నాను డోరియన్. పోయినరాత్రి వచ్చాను. కాని, నీవు ఒపెరాకు వెళ్ళావని చెప్పారు. నీవు అక్కడికి వెళ్ళి ఉండవని నాకు తెలుసనుకో. అయినా నీవు ఎక్కడికి వెడుతున్నావో ఒకమాట చెప్పిపోతే ఎంతబావుండేది. నిన్న సాయంత్రమంతా చాలా ఆందోళనతో గడిపాను. ఒకవిషాదంతరువాత మరోవిషాదం నెట్టుకుని వస్తుందేమోనని భయంతో గడిపాను. నీకు ఆ వార్త రాగానే నీవు నాకు టెలిగ్రాం పంపుతావనుకున్నాను. నేను క్లబ్బులో కూచుని 'గ్లోబ్' పేపరు చదువుతూంటే ఈ వార్త కంటపడింది. వెంటనే ఇక్కడికి పరుగెత్తుకుని వచ్చాను. తీరా వచ్చేసరికి నీవు కనుపించలేదు. దిగాలు పడిపోయాను. ఆ విషయం వినేసరికి నా హృదయం ఎలా బ్రద్దలైపోయిందో నీ కేం చెప్పగలను? ఇహ నీ వేదన చెప్పతరంకాదని నాకు తెలుసు. కాని ఇంతకూ నీవు ఎక్కడికి

...

వెళ్ళినట్టు? ఆ అమ్మాయితల్లిని చూచిరావడానికి వెళ్ళావా? ఒక క్షణంపాటు నేనూ అక్కడికి వద్దామనుకున్నాను. కాని, నేను వచ్చిమట్టుకు చేసే దేముంది? అనవసరంగా, దుఃఖ భారాన్ని తగ్గించకపోగా జోక్యంకలిగించుకోవడ మవుతుంది. పాపం! ఆ అమ్మాయితల్లి! ఆ తల్లిగుండె ఎంత తనుక్కు పోతూ ఉందో! అదీగాక ఒక్కగాను ఒక్కతే బిడ్డ. ఇంతకూ ఆమె ఏమంది?' — అన్నాడు హాల్వర్డ్.

డోరియన్ ఒకచక్కని బంగారు పూలు తాపిన పాత్ర లోనుంచి పల్చని పసుపురంగు ద్రాక్షాసవం సేవిస్తూ 'ఆమె ఏమందో నే నెలా చెప్పగలను బేసిల్! నే నక్కడికి వెళ్ళ లేదు నేను ఒపెరాకు వెళ్ళాను. నీవూ అక్కడకు వచ్చి ఉండ వలసింది. హెన్రీ చెల్లెలు లేడీ గ్వెన్డొలిన్ను తొలిసారిగా కలుసుకున్నాను. మేము ఆమె బాక్సులోనే కూచున్నాము. ఆమె ఎంతో ముచ్చటగా ఉంది. 'పట్టి' కూడా అద్భుతంగా పాడింది. ఇక నీవు ఆ భీకరవిషయాలనుగురించి మాట్లాడకు మనం ఒక విషయాన్నిగురించి మాట్లాడకపోతే, ఆ విషయం జరగనట్టే భావించుకోవాలి. విషయాలకు వా స్తవికతను ఆపా దించేది ఉ క్తిమాత్రమేనని అంటాడు హెన్రీ. ఈ సందర్భంలో మరో విషయంకూడా చెప్పాలి. ఆ తల్లికి ఆ పిల్ల ఒక్కతే బిడ్డకాదు ఒక కొడుకుకూడా ఉన్నాడట. వాడూ అందం గానె ఉంటా డనుకుంటాను. కాని వాడు రంగస్థలంలోమటుకు లేడు. ఎక్కడో సెయిలర్గానో, మరేపనిలోనో ఉంటున్నా డట. సరే, ఇహ నీ విషయం చెప్పు. ఇప్పు డేంబొమ్మలు గీస్తున్నావు?'

'నీవు ఒపెరాకు వెళ్ళావా ? సిబిల్ వేన్ ఎక్కడో మూరుమూల గదిలో చచ్చిపడి ఉంటే నీవు ఒపెరాకు వెళ్ళావా? నీవు ప్రేమించిన అమ్మాయి సమాధిలో ఇంకా పవళించి విశ్రాంతి తీసుకోలేదు అప్పుడే ఒక స్త్రీ చూడ ముచ్చటగా ఉందనీ, 'పట్టి' అద్భుతంగా పాడిందనీ అంటున్నావా ? ఆ అమ్మాయి చిన్ని తెల్లని శరీరాన్ని ఎన్నో ప్రమాదాలు ఎదురు చూస్తున్నాయి, తెలుసా ?'

'ఆపు బేసిల్ ! ఇక నే నా విషయం వినలేను. నీ వా విషయాలు చెప్పక్కర్లేదు. జరిగిం దేమిటో జరిగిపోయింది.' అని అరచాడు డోరియన్.

' 'నిన్న'ని అప్పుడే గతంలో కలుపుతున్నావా ?'

'దానికీ కాలనియమానికీ సంబంధం ఏమిటి ? ఒకఉద్వేగంనుంచి విముక్తిపొందడానికి సంవత్సరాలతరబడి కాలం కావలసింది ఒక్క వ్యర్థులకు మాత్రమే. పరిపక్వత పొందిన వారికి అంతకాలం అనవసరం. తనపై తనకు స్వాధీనతగలవ్యక్తి ఒక కొత్త ఆనందాన్ని ఎంత సులువుగా కనిపెట్టగలడో అంత సులువుగా ఒక దుఃఖాన్ని సమాప్తిచేసుకోగలడు. ఉద్వేగాల దయాదాక్షిణ్యాలపై నేను ఆధారపడి ఉండదలచుకో లేదు. నేను వాటిని నాకోసం వుపయోగించదలచుకున్నాను. వాటిని ఆస్వాదించి ఆనందించదలచుకున్నాను. వాటిమీాద నా స్వామిత్వాన్ని చలాయించదలిచాను.'

'డోరియన్ ! ఇ దెంత ఘోరం ! నిన్నెవరో పూర్తిగా మార్చేసింది. నీవు నా స్టూడియోకు వచ్చేరోజుల్లో ఎంత అమాయకంగా కనుపించేవాడివో ఇప్పుడూ అలాగే కనుపిస్తు

న్నావు. కాని అప్పుడు నీ వెంతో అమాయకంగానూ, సహజంగానూ, ఆప్యాయంగానూ వుండేవాడివి. ఈ లోకంలో నీ వొక్కడివే నిర్మలచూరివిగా కనుపించేవాడివి. కాని ఇప్పుడు నీలో ఇంతమార్పు ఎలావచ్చిందో నేను గ్రహించ లేకుండాఉన్నాను. హృదయం, జాలి, దయ అన్నవి లేశమైనా లేనివాడిలాగా మాట్లాడుతున్నావు. ఇదంతా హెన్రీప్రభావం'

కుర్రాడి ముఖం ఎరుపెక్కింది. కిటికీదగ్గరకు వెళ్ళాడు. కొద్ది క్షణాలపాటు పచ్చనితోటవంక చూస్తూ నిల్చున్నాడు. పచ్చనితోట సూర్యకాంతిలో మిలమిలలాడుతూ ఉంది. 'నేను హెన్రీకి ఎంతో ఋణపడి ఉన్నాను బేసిల్. నీ కంటెకూడా అతనికి ఎంతో ఋణపడిఉన్నాను. నీవు నాకు నేర్పింది పట్టి వ్యర్థత్వం మాత్రమే' – అన్నాడు.

'అందుకు నన్ను శిక్షించావు డోరియన్. లేక ఒక రోజుకు——'

'నీవు మాట్లాడుతున్న దేమిటో నాకు అర్థంకావడం లేదు బేసిల్! నీవు దేన్ని కోరుతున్నావో నాకు తెలీడంలేదు. ఏమిటి నువ్వు కోరుతున్నది ?'

'నేను డోరియన్ గ్రేను కోరుతున్నాను. నేను బొమ్మ వ్రాస్తూ వచ్చిన డోరియన్‌ను కోరుతున్నాను.'

కుర్రాడు మెల్లగా అతనివద్దకు వెళ్ళి అతని భుజంమీద చెయ్యివేశాడు. 'బేసిల్ నీవు రావడం చాలా ఆలస్యమై పోయింది. నేను సిబిల్ వేన్ ఆత్మ హత్యచేసుకున్నదని వినగానే——' అన్నాడు.

'ఆత్మహత్యా! అయ్యో భగవంతుడా! ఎంతపని జరిగింది! నిజమేనా?' — అన్నాడు హాల్‌వర్డ్ భయంతో చలించిపోతూ.

'నిజంగా బేసిల్. ఆమె తన ప్రాణం తనే తీసుకుంది.'

చిత్రకారుడు ముఖాన్ని చేతులతో కప్పుకున్నాడు. 'ఎంత భయంకరం' అని గొణుక్కున్నాడు. ఆపాదమస్తకం వణికిపోయాడు.

డోరియన్ ఇలా చెప్పసాగాడు: 'ఇందులో భయావహమైన దేమీ లేదు. ఈ యుగంలోని గొప్ప ప్రణయవిషాదాంత గాథలలో ఇది ఒకటి. సహజంగా నటులుకాని, నటీమణులుకాని చాలా సర్వసాధారణమైన జీవితాలు గడుపుతారు. మంచి భర్తలు — విశ్వసనీయమైన భార్యలూ అవుతారు. మధ్యతరగతి మామూలుజీవితమని నాఉద్దేశం. కాని, వీరికీ సిబిల్‌కూ ఎంత తేడా ఉంది. ఆమె తనబ్రతుకులో కంతటికీ అతిరమణీయమైన విషాదాన్ని జీవించి వెళ్ళిపోయింది. తన బ్రతుకును ఒకచక్కని విషాదాంతగాథ చేసుకున్నది. ఆమె బ్రతికినన్నాళ్ళూ నాయికగానే బ్రతికింది. మీరు ఆమెను చూచిన చివరిరాత్రి ఆమె సరిగా నటించలేకపోయింది. దానికి కారణం ఆనాటిరాత్రి ఆమె ప్రేమయొక్క యాథార్థ్యాన్ని తెలుసుకోవడమే. దాని అవాస్తవికతను గ్రహించగానే ఆమె జూలియట్‌లాగా తనువు చాలించింది. మళ్ళీ కళాజగత్తులోకి నిష్క్రమించింది. ఆమె తనబ్రతుకును ఒకవిధంగా బలిదానం కావించింది. ఆమె మృతిలో బలిదానంలోని జాలిగొలిపే నిరుపయోగతా, నిష్ఫలసౌందర్యమూ ఉన్నాయి. ఇంత

సౌందర్యం ఇలా ఎందుకో వృధాకావడం? కాని, నే నన్నట్లు, నేను బాధపొందానని నీవు అనుకోకూడదు. నిన్న నీవు, ఒక క్షణంలో నన్ను చూచిఉన్నట్లవుతే- అంటే అయిదున్నరకూ ఆరుకూ మధ్య- నేను కన్నీటికడలిలో మునిగిఉండడం నీవు గమనించిఉండేవాడివి. నాకీ వార్త తెచ్చిన హెన్రీకికూడా నే నప్పుడు ఎంతవేదనలో ఉన్నానో తెలీదు. నేను ఎంత వేగి పోయానో నాకే తెలుసు. తరువాత ఆ బాధ మెల్లగా గడచి పోయింది. ఒక ఆవేగానికి నేను పునరుక్తి చెప్పలేను. దుర్బల హృదయులుమాత్రమే అలా చెయ్యగలరు. నీవు చేస్తున్నది చాలా అన్యాయం బేసిల్. నీవు నన్ను ఓదార్చాలనివచ్చావు. కాని నీవు వచ్చేసరికే నాదుఃఖం తీరిఉంది. ఇలాంటిస్థితిలో ఉన్న నన్ను చూచి కోపగించుకుంటున్నావు. ఒక సానుభూతి చూపేవానికి తగినట్లే ఉంది. ఒకప్పుడు ఒక దాతని గురించి హెన్రీ నాకో కథ చెప్పాడు. ఒక అక్రమాన్ని రూపుమాపడం కోసమో, లేక ఒక అక్రమచట్టాన్ని మార్పించడంకోసమో తన బ్రతుకులో ఇరవైఏళ్ళు పరిశ్రమించాడట. అదేమిటో నాకు సరిగా జ్ఞాపకంలేదు. చివరకు ఎలాగవుతేనేం సాధించా డట. అప్పుడు అతనినిరాశ ఇంతాఅంతా అని చెప్పడానికి వీల్లేదట. ఇహ జీవితంలో చెయ్యాల్సిన పని ఏమీ లేక పాండుత్తో పీక్కొని చచ్చాడట. అదీగాక నన్ను ఓదార్చడమే నీఉద్దేశమవుతే జరిగింది మరిచేమార్గం చెప్పు లేదా, ఆ సంఘ టనను కళాత్మకంగా అవలోకించే మార్గం చెప్పు. కళ మనిషికి దుఃఖంలో ఎలా ఉపశమనం కలుగజేస్తుందో దాన్నిగురించి వ్రాసింది గాటియెర్ కదూ? నీ స్టూడియోలో అతని గ్రంథం

ఉండేది నేను ఒకమాటు చదివిన జ్ఞాపకంకూడా ఉంది. మని ద్దరం కలిసి మార్లో వెళ్ళినప్పుడు నీ వొక కుర్రవాడిసంగతి చెప్పావు. పసుపుసాటిన్ బ్రతుకులోని కష్టాలన్నీ మరపుకు తెస్తుందని ఆ కుర్రాడు అంటూవచ్చేవాడని చెప్పావు. నేను అలాటివాణ్ని కాదు. స్పృశించి అనుభవింపదగిన అందమైన వస్తువులనే నేను ప్రేమిస్తాను. పాతకాలపు చిత్రాలు, బొమ్మలు, దంతపుచెక్కడాలు, అందమైన పరిసరాలు, భోగం, విలాసం- ఇవన్నీ మన మనస్సుకి ఓదార్పునిచ్చేవే. కాని అవి మనలో సృష్టించే కళాభిజ్ఞత వాటికన్న నా దృష్టిలో ముఖ్యమైనది. హెన్రీఅన్నట్టు, ఎవరి జీవితాన్ని వారు సాక్షిమాత్రంగా చూడ గలగడమే జీవితదుఃఖాన్నుంచి విముక్తి పొందడం.నీతో నేనిలా మాట్లాడడం నీకు చాలాఆశ్చర్యంకలిగిస్తుందని నాకు తెలుసు. నాటికీ నేటికీ నేను ఎంతపరిపక్వతచెందానో నీవు గ్రహించడం లేదు. నీవు ఎరిగిననాటి బడిపిల్లవాణ్ని కాదు నేను. ఇప్పుడు నే నొక మనిషినైనాను. కొత్త ఉద్వేగాలు, కొత్తభావాలు, కొత్త ఆలోచనలు నాలో ప్రవేశించాయి. పూర్తిగా మారి పోయాను. అయినా నీవు నన్ను ఎప్పటిలాగానే చూచుకో వాలి. నాకు నీవు స్నేహితుడివిగా ఉండాలి. నాకు హెన్రీ అంటే ఎక్కువ ఇష్టమనేమాట నిజమేననుకో.కాని అతనికంటె నీవు మంచివాడివని నాకు తెలుసు. నీవు అతనికంటె ఎక్కువ దృఢమైనవ్యక్తివి కాకపోవచ్చు. నీకు జీవితమంటే మరీభయం కావచ్చు. అయినా నీవు అతనికంటె మంచివాడివి. మనిద్దరం కలిసి ఎంత హాయిగా కాలం గడిపాం! నన్ను వదలిపెట్టకు

బేసిల్! నాతో తగాదాపడకు. నే నేదో నే నని. ఇంతకన్న నేను చెప్పవలసిం దేమీ లేదు.'

డోరియన్ చెప్పడం ముగించాడు. చిత్రకారుని హృదయం ఆర్ద్రమైంది. అతనికి ఆ కుర్రాడు ప్రాణంలాంటి వాడు. తన కళలో ఒక పెద్దమార్పు తెచ్చిన వ్యక్తి. అతన్ని మాటఅనడమంటే అతనిమనస్సు చివుక్కుమంటుంది. ఇంతకూ అతని అనాసక్తత ఒక తాత్కాలిక మానసికావస్థ కావచ్చు. ఇవాళ కాకపోతే రేపటికైనా గడిచిపోతుంది. అతనిలో ఎంతో మంచి ఉంది. ఎంతో ఉదాత్తత ఉంది.

తరువాత కాసేపటికి, విషాదపూరితమైన చిరునవ్వుతో ఇలా అన్నాడు: 'సరే డోరియన్, ఇకనుంచి ఈ ఘోరవిష యాన్ని నీతో ప్రస్తావించను. ఇందులో నీపేరు కాని నీ జోక్యం కాని తీసుకోరాదని నమ్ముతాను. ఇవాళ మధ్యాహ్నం విచా రణ మొదలెడతారట. నిన్ను పిలిచారా?'

డోరియన్ లేదన్నట్టు తల ఊపాడు. 'విచారణ' అనే మాట వినేసరికి అతనిముఖం కలవరంతో కళవళపడింది. అలాటి వంటే అతనికి తగనికోత 'నాపేరు వాళ్ళకు తెలీదు' అన్నాడు.

'కాని, ఆ అమ్మాయికి తప్పకుండా తెలిసిఉండాలి కదా!'

'ఒక్క నా క్రైస్తవనామమే తెలుసు. అయినా ఆ పేరు ఎవరికీ చెప్పి ఉండదు. ఒకమాటు తనవాళ్ళందరూ నా పేరు తెలుసుకోవాలని ఎంతో కుతూహలపడుతున్నారని, నాపేరు ముద్దులరాకుమారుడని తాను చెప్పానని నాతో చెప్పింది. చూడు— ఆ అమ్మాయి అలా చెప్పడం ఎంతముచ్చ

టగా ఉందో. బేసిల్, నీవు నాకు సిబిల్ చిత్రం గీసిపెట్టాలి. చిన్నారి ముద్దులూ, కొన్ని అర్థోక్తిలో ఆగిపోయిన మృదుల కరుణామయభాషలూ- వాటి స్మృతిమాత్రమే కాక అంతకన్న మించింది నాకు కావాలి.'

'తప్పకుండా ఆమెబొమ్మ గీచిస్తాను డోరియన్. కాని, నీవు మళ్ళీ నావద్దకు రావడం మొదలెట్టాలి. నీవు లేనిదే నాకు సాగదు.'

'నేను మళ్ళీ బొమ్మకోసం రావడం పడదు బేసిల్! అది అసంభవం!'- అన్నాడు డోరియన్ ఉలికిపడి.

చిత్రకారుడు అతనివంక విస్మేరపోయి చూచాడు. 'ఇదేం విడ్డూరం డోరియన్? నాబొమ్మ నీకు ఇష్టం కాదా? దానికి ఎంచాత తెరకప్పావో చెప్పు ఏదీ, ఒకసారి నన్ను చూడనీ. నేను రాసిన బొమ్మలన్నిటిలోకి ఇది అద్భుత కళా ఖండం. ఏదీ, ఒకమాటు ఆ తెర తొలగించి చూపు డోరి యన్. నీబొమ్మని, నీసేవకుడు అలా మూసిపెట్టడం సిగ్గుచేటు పని. నేను వచ్చేసరికి గది ఎంచాతనో మారినట్టుగా కను పించింది.'

'నా సేవకునికీ దీనికీ ఏమీ సంబంధం లేదు బేసిల్. నా గదిలో వస్తువులు సర్దే స్వాతంత్ర్యం అతని కిస్తానను కోకు. ఎప్పుడైనా నాపూలకుండీల్లో పూలగుత్తులు మాత్రం సర్దు తాడు. అంతే. ఈ బొమ్మని మూసింది నేనే. వెలుతురు ఎక్కు వగా పడడంవల్ల బొమ్మని మూశాను.'

'అదేమిటి? వెలుతురు ఎక్కువగా పడుతోందా? అలా కాకూడదే. ఆబొమ్మకి అది తగినస్థలం. ఏదీ, ఒకమాటు

నన్ను చూడనీ' ఇలా అని, హాల్‌వర్డ్ గదిమూలాలన ఆ బొమ్మ ఉన్నవైపుకు నడిచివెళ్ళాడు.

డోరియన్‌కంఠం చీల్చుకుని ఒకసన్ననిఎలుగు వెలికి వచ్చింది. పరుగెత్తుకుని వెళ్ళి బొమ్మకూ చిత్రకారునికీ మధ్య నిలిచాడు. 'బేసిల్! నీవు దానివంక చూడడానికి వీల్లేదు. నీ వా బొమ్మను చూడడం నాకు ఇష్టంలేదు'

'నేను రాసినబొమ్మ నేను చూడకూడదా! ఇదేంమాట?' అన్నాడు చిత్రకారుడు నవ్వుతూ.

'నీ వా బొమ్మను చూడాలని పట్టుబడితే నా జీవిత పర్యంతం నీతో మాట్లాడనని ఒట్టుపెట్టుకుంటున్నాను బేసిల్. దీనికి కారణం నేను చెప్పను. నీవూ అడుగవద్దు. కాని ఒక మాటమాత్రం జ్ఞాపకం ఉంచుకో. ఈ బొమ్మని నీవు ముట్టుకు న్నావంటే ఇక మనబంధం ఇంతటితో ముగిసినట్టే.

హాల్‌వర్డ్ పిడుగుమ్రోతవిన్నవాడిలా ఆగిపోయాడు. డోరియన్ గ్రే వంక ఆశ్చర్యస్తబ్ధుడై పోయి అలాగే చూస్తూ నిల్చున్నాడు. డోరియన్‌ను ఇలాటిస్థితిలో అత నెన్నడూ చూడలేదు. కోపంతో నిజంగా అతనిముఖం పూర్తిగా వివర్ణమై పోయింది. పిడికిళ్ళు బిగించాడు. కంటిపాపలు నీలానల వల యాల్లా ఉన్నాయి. ఆపాదమస్తకం కంపించిపోతున్నాడు.

'డోరియన్!'

'మాట్లాడకు.'

'అసలు ఏం జరిగింది? నాతో చెప్పవూ? నీవు చూడ వద్దంటే బొమ్మని చూడను. కాని, శిశిరంలో దీన్ని పారిస్‌లో ప్రదర్శనానికి పంపాలనుకుంటున్నాను.'

'ప్రదర్శిస్తావా! ఈ బొమ్మను ప్రదర్శిస్తావా?'

డోరియన్‌ను ఒక విచిత్రమైన భయం ఆవేశించింది. లోకానికి తనరహస్యం ప్రదర్శింపబడుతుం దన్నమాట! అంతా వెర్రిగా తన జీవితరహస్యాన్ని పరికిస్తారు. అలా జరగడానికి వీల్లేదు. వెంటనే ఏదో ఒకటి చెయ్యాలి. ఏం చెయ్యాలి? అతనికే తెలీదు.

'దీనికి నీవు అభ్యంతరపెట్ట వనుకుంటాను డోరియన్. జార్జ్ పెటిట్ నా బొమ్మల్లోకి మంచివాటినన్నిటిని అక్టోబర్ మొదటివారంలో రూడిసెజెలో జరుగనున్న ప్రత్యేకప్రదర్శనం కోసం సేకరిస్తున్నాడు. ఒక్క నెలమాత్రమే ఈ బొమ్మ నీ ఇల్లు విడిచి ఉంటుంది. అయినా నీవు అప్పుడు ఊళ్ళో ఉండబోవడంలేదు. ఉన్నా, నీవు ప్రతినిత్యం బొమ్మను చూచుకోడం లేదు. తెరమూసి ఉంచావు.'

డోరియన్ నుదురు చేత్తో తుడుచుకున్నాడు. చింతగింజలంత స్వేదబిందువులు నిలిచాయి. ఒక భీకర ప్రమాదపు అంచుల్లో తను నడుస్తున్నట్టుగా తోచింది.

'ఒక నెలక్రితం ఎక్కడా ప్రదర్శించనని చెప్పావు. ఇంతలోనే నీమనసెందుకు మార్చుకున్నావు? ఒకే పద్ధతిలో నడుచుకుంటామని బడాయిలు చెప్పుకుంటారు. మీకూ ఎన్నో రకాల మానసికావస్థలు. క్షణక్షణం మానసికావస్థలు మారే వ్యక్తులకూ, మీకూ తేడా ఒకటే. మీ మానసికావస్థలకు ఒక అర్థమంటూ లేదు. ప్రపంచమంతా ఏమైనా ఈబొమ్మని ప్రదర్శనానికి పంపనన్నావు. హెన్రీతోకూడా ఇదేమాట చెప్పావు' అతను హఠాత్తుగా ఆగిపోయాడు. అతని కళ్ళల్లోకి ఒక వెలుగు

వచ్చింది. ఒకమాటు లార్డ్ హెన్రీ యాదాలాపంగా అతనితో ఒకమాట చెప్పాడు. 'ఒక పావుగంట గమ్మత్తుగా గడపాలంటే బేసిల్ నీ చిత్రం ఎందుకు ప్రదర్శించడో అడుగు. అతను నా కా విషయం చెప్పాడు. అది నా కో అద్భుతంలా కనుపించింది–' బేసిల్‌కు కూడా ఏదో రహస్యం ఉండి ఉండవచ్చు. తను అడిగి తెలుసుకోడానికి యత్నించిచూస్తాడు.

అతను బేసిల్ దగ్గరకు వచ్చి, 'బేసిల్, మనందరికీ ఎవరిరహస్యం వారి కుంది. నీ రహస్యం నాకు చెప్పు. నా రహస్యం నీకు చెబుతాను. నా బొమ్మని ప్రదర్శించ నన్నావు. ఎందుకనో చెప్పు.'

చిత్రకారుడు కంపించిపోయాడు. 'డోరియన్, ఆ విషయం నీకు చెబితే నా పై మమత తగ్గిపోతుంది. నన్ను చూచి నవ్వగలవు. ఈ రెండిటినీ నేను భరించలేను. నీ బొమ్మ నన్ను ఎన్నడూ ఇక చూడవద్దంటే అందుకు నే నేమీ అనుకోను. అనుక్షణం నిన్నే చూస్తున్నాను. ఇకబొమ్మని చూడడ మెందుకు? నేను వ్రాసిన బొమ్మలన్నిటిలోకి అద్భుతకళాఖండాన్ని లోకానికి కనుపించకుండా దాచెయ్యమంటే సంతోషంతో ఆపని చేస్తాను. నా కీర్తికంటె నీ స్నేహం నాకు ఎన్నోవిధాలప్రియతమమైంది.'

'అది కాదు బేసిల్. నీవు నా కా రహస్యం చెప్పాలి. నాకు తెలుసుకునే హక్కుంది'– అని బలవంతపెట్టసాగాడు డోరియన్. అతన్ని ఆవేశించిన భయం గడచిపోయింది. ఆ స్థానే ఔత్సుక్యం వచ్చి కూచుంది. బేసిల్ హాల్‌వర్డ్ రహస్యం తెలుసుకోవాలని పట్టుబట్టాడు.

'కూచో డోరియన్. నా కో ప్రశ్నకి సమాధానం చెప్పు. నీ కా చిత్రంలో ఏదైనా విచిత్రం కనుపించిందా? - మొదట్లో నీకు కనుపించనిది - హఠాత్తుగా తరువాత ద్యోతక మైనది - ఏదైనా విచిత్రం కనుపించిందా?'

'బేసిల్ !' - కేకపెట్టాడు కుర్రాడు. కుర్చీని వణుకు తున్న చేతులతో గట్టిగా కరుచుకుని అతనివంక భయవికృత విభీతనయనాలతో చూచాడు.

'అవును. నాకు అర్థమైంది. ఏదో విపరీతమైన విచిత్రం నీ కా బొమ్మలో కనుపించింది. నన్ను చెప్పేదంతా చెప్పనీ. డోరియన్, నన్ను కలుసుకున్న క్షణంనుంచి నీ మూర్తి నన్ను ఆకట్టుకున్నది. నన్ను అధీనం చేసుకుంది. నాఆత్మ, మనస్సు, శరీరం అన్నీ ఆ ప్రభావానికి బంటులైనాయి. ఒక అద్భుతస్వప్నంలా అనుక్షణం మా మనస్సులను వెంటాడే ఆ అప్రత్యక్షసుందరాదర్శానికి నీవు ప్రత్యక్షసాక్షాత్కృతివై నావు. నిన్ను ఆరాధించాను. నీవు ఎవరితో మాట్లాడినా మనస్సు అసూయతో వేగిపోయేది. నిన్ను పూర్తిగా నా కోసమే ఉంచుకుందా మనుకున్నాను. నా సొత్తుగా ఉంచు కుందా మనుకున్నాను. నీవు దగ్గరఉన్నప్పుడే నాకు సుఖం. నీవు దూరంగా ఉన్నప్పుడు నాకళ్లలో నీవు ఉండనేఉన్నావు... ఎన్నడూ నీతో ఈ విషయం నేను ప్రస్తావించలేదు. అది అసాధ్యమనిపించేది. ఒకవేళ, ప్రస్తావించినా నీవు అర్థం చేసు కునేవాడివి కావు. నేనే అర్థంచేసుకోలేదు. నాకు తెలిసిందల్లా ఒకటే. పరిపూర్ణతను ముఖాముఖిని అవలోకించాను. లోకం నా కళ్ళకు అద్భుతంగా కనుపించసాగింది ఇంతా అంతా

అద్భుతమని చెప్పడానికి వీల్లేదు. ఎంచాతనంటే, ఇలాటి వెర్రి ఆరాధనలో ఒకప్రమాదం ఉంది. కడకు, మనం ఆరాధించే వస్తువు మనచెయ్యిజారిపోవచ్చు. అది మనచేతుల్లో ఉంటే అంత కంటె ప్రమాదం... ఇలా వారాలు గడిచాయి. నీ ధ్యానం మరింత ఎక్కువైంది. అప్పుడు ఒక కొత్తమార్పు వచ్చింది. అనేకరూపాల్లో నిన్ను రూపొందించాను. మూర్తించు కున్నాను. సైనిక దుస్తులలో పారిస్‌గా నిన్ను గీచాను. వేట దుస్తులు ధరించిన అరోనిస్‌గా నీ బొమ్మ గీచాను. వికసితపద్మ మాలామకుటాన్ని ధరించి ఆడ్రియన్ పడవఅంచున కూచుని నైల్‌నదీ నీలజలాల్లోకి తొంగిచూస్తున్నావు. గ్రీస్‌లో ఏదో అడవిలో ఒక కదలని కొలనుబడ్డున కూచుని ఆ ప్రశాంత సర స్సులో, అద్దంలో చూచుకున్నట్లు నీ అద్భుతవదనాన్ని చూచుకుంటున్నావు.ఇలాఎన్నో విధాల నిన్ను ఊహించుకున్నా. కాని, ఇవన్నీ కళ ఫలానావిధంగా ఉండాలని తెలిపేవి కాని, కళనే తెలిపేవి కావు. అవ్యక్తం, ఆదర్శం, అస్పష్టం అయిన కళను తెలుపుతాయి. ఒకరోజున—ఆరోజు రాకుండాఉంటే ఎంత బావుండునా అని ఇప్పటికీ అనుకుంటాను. ఒక రోజున— నిన్ను వున్నరూపున బొమ్మగీద్దామని నిశ్చయించుకున్నాను. మృత గత యుగాల దుసులలో కాక, నీ కాలంలో నీవు ధరిం చిన ఈ దుస్తులతోనే నీ బొమ్మ గీదామనుకొన్నాను దాని తాలూకు వాస్తవికతే కావచ్చు, లేదా, నీ మూర్తిలోని అద్భుతావహమైన ఆకర్షణేకావచ్చు - ఈవిధంగా ఎలాటి మంచుతెరా అడ్డులేకుండా యధాతథంగా నాకు గోచరిం చిందో నేను చెప్పలేను. కాని ఒక విషయంమాత్రం నాకు

స్పష్టంగా తెలుసు. ఆ బొమ్మ గీస్తూ ఉంటే ప్రతి వర్ణచ్ఛాయా నా రహస్యాన్ని నాకు ద్యోతకం చేస్తు సాగింది. ఇతరులకు నా ఈ విగ్రహపూజ తెలిసిపోతుందేమోనని భయపడ్డాను. నన్ను నేను ఎక్కువగా ఆ బొమ్మలో వ్యక్తీకరించుకున్నానేమో నను కున్నాను. తరువాత ఆ బొమ్మను ప్రదర్శించకూడదని నిశ్చయించుకున్నాను ఆ విషయం నీతో చెప్పినప్పుడు నీవు కలవర పడ్డావు కూడా. కాని అది నాకెంత ఆత్మీయమైన విషయమో నీవు గ్రహించలేకపోయావు. ఈ విషయం హెన్రీతో చెప్పాను. అతను నా వెర్రికి నవ్వాడు. కాని నేను లెక్కచెయ్యలేదు. బొమ్మ ముగించాను. ఒంటిగా కూచుని చూచుకుంటే నా నిశ్చయం సరైనదే ననిపించింది. కొన్ని రోజులకు ఆ బొమ్మ నా స్టూడియో విడిచివెళ్ళింది. ఆ బొమ్మపట్ల భరింపరాని ఆకర్షణ నానుంచి తొలిగిపోగానే, అందులో నేనేదో విచిత్రాన్ని చూచాననుకోడం వెర్రితనమని, అందమైన నీవు తప్ప ఆ బొమ్మలో మరేమీ లేదనీ అనుకున్నాను. ఇప్పటికీ నే నొకవిషయం అనుకుంటూ ఉంటాను— సృష్టిలోని ఆవేగం సృష్టించే వస్తువులో పూర్తిగా ప్రతిఫలింప చెయ్యలేము.మనం ఊహించేదానికంటెకూడా అప్రత్యక్షమైంది కళ. రూపవర్ణాలు మనకి రూపవర్ణాలనిమాత్రమే తెలియ జేస్తాయి. అంతే. కళ కళాకారుణ్ని వ్యక్తీకరించడం కంటె ఎక్కువగా దాచిపెడుతుందని నా భావన. అంచాత పారిస్ ప్రదర్శనం మాట వినగానే బొమ్మను ప్రదర్శనానికి పంపాలను కున్నాను. నీవు నిరాకరిస్తావని మొదట్లో అనుకోలేదు. కాని తరువాత నీవు నిరాకరించడంలో తప్పులేదని తెలుసుకున్నాను.

బొమ్మ ప్రదర్శనకు వీలుపడనిది. నే నిదంతా చెప్పుకొచ్చినం దుకు కోప్పడకు డోరియన్. నేను ఒకమాటు హెన్రీతో అన్నట్టుగా నీవు కేవలం ఆరాధింపబడటానికిమాత్రమే పుట్టినవాడివి.'

డోరియన్ పెద్ద బరువు దిగినట్టు ఒకమాటు దీర్ఘంగా నిశ్వసించాడు. మళ్ళీ అతని చెక్కిళ్ళలోకి అరుణిమ వచ్చింది. అతని పెదవులపై ఒక చిన్నచిరునవ్వు తాండవించింది. ప్రమాదం గడచిపోయింది. ఇంతలో ప్రమాద మేమీ లేదు. కాని, ఈ విచిత్రనివేదన కావించిన ఈ చిత్రకారునిపై ఒక విధమైన జాలి కలిగింది. తనకు అతను స్వాధీనమైనట్టు తను ఎన్నడైనా ఎవరికైనా స్వాధీనమవుతాడా అనిపించింది. లార్డ్ హెన్రీలో ఎంతో ప్రమాదకరమైన ఆకర్షణ ఉంది. కాని, అతని తెలివీ, విమర్శనా ఎంతో మిక్కుటమైనవి. అంచాత అతనిపట్ల ప్రీతి కలగడంకష్టం. ఒక విచిత్రమైన ఆరాధనాభావంతో తన బ్రతుకును నింపగలవారు ఎవరైనా ఉన్నారో లేరో. జీవితగర్భంలో దాగిఉన్న విషయాల్లో అదీ ఒక టేమో.

'నీ వా బొమ్మలో ఆ విషయం చూడగలగడం ఎంతో అద్భుతం డోరియన్' అన్నాడు చిత్రకారుడు.

'నేను ఒక విషయాన్ని చూచాను. అది నా కెంతో విచిత్రంగా కనుపించింది.'

నే నొకమాటు చూడవచ్చా?

డోరియన్ వీల్లేదన్నట్టు తల ఊపాడు.

'ఆ విషయంమాత్రం నన్నడగకు బేసిల్. ఆ బొమ్మ ముందు నిన్ను నిల్చోనివ్వను.'

'ఒకరోజుకు నిల్చోనిస్తావు'

'ఎన్నటికీ నిల్చోనివ్వను.'

'సరే. సెలవు. నా జీవితంలో నా కళకు దోహదం కావించిన వ్యక్తివి నీవే. నేను ఏ గొప్పపని చేసినా, దానికి కారణం నీవే. ఇదంతా నీకు చెప్పి ఎంతవెలకట్టానో నీకు తెలీదు డోరియన్.'

'అదేమిటి బేసిల్! నీవు నాకు ఇలా చెప్పడంలో ప్రమాద మేముంది? నన్ను అభిమానించావనీ, ఆరాధించా చెప్పావు. అంతే కదా. ఇది అభినందన కూడా కాదు.'

'అభినందన కాదు, నివేదన. ఇప్పుడు ఇంతా చెప్పిన తరువాత నాలోనుంచి ఏదో బరువు దిగిపోయినట్టుంది. ఒకరు తన ఆరాధ్యవస్తువును పలుకుల్లో చెప్పడం సమంజసం కాదనుకుంటాను.'

'అనుకున్నంత గొప్ప నివేదన కాదు.'

'అదేమిటి డోరియన్? నేనింకా ఏం చెబుతా ననుకున్నావు? నీకు బొమ్మలో మరింకేమీ కనుపించ లేదు కదా?'

'లేదు. మరింకేమీ కనుపించలేదు. అయినా ఆ ప్రశ్న ఎందుకు? కాని నీవు ఈ 'పూజ'ని గురించి మాట్లాడ కూడదు. అది వెర్రిమాత్రమే. నేనూ నీవూ స్నేహితులం బేసిల్. మనం ఎప్పుడూ అలాగే ఉండడం మంచిది.'

'నీకు హెన్రీకూడా స్నేహితుడే కదా?' అన్నాడు చిత్రకారుడు విషాదంతో.

'హెన్రీ!' - కుర్రాడు కిలకిలా నవ్వాడు. 'హెన్రీ తన పగళ్ళు అసందర్భవిషయాలు చెప్పడంలోనూ, సాయంత్రాలు అసూహ్యవిషయాలు చెయ్యడంలోనూ గడుపుతాడు. నేను సరిగ్గా ఎలాటిజీవితం గడపాలని వాంఛిస్తానో అలాటి జీవితం గడుపుతాడు. అయినా, నే నేదైనా కష్టంలో ఉన్నప్పుడు నీదగ్గరికి వచ్చినంతత్వరగా హెన్రీదగ్గరికి వెళ్ళను బేసిల్.'

'మళ్ళీ బొమ్మ గీస్తాను. వచ్చి కూచోవా?'

'అది అసంభవం!'

'అలా అని నా కళాజీవితాన్ని భగ్నం చేస్తున్నావు డోరియన్. రెండు ఆదర్శాలు ఒకేసారి ఎవరినీ ఆకట్టుకో లేదు. కొద్దిమందిని ఒకే ఆదర్శం ఆకట్టుకుంది.'

'నేను సరిగా చెప్పలేను కాని, మళ్ళీ బొమ్మకోసం మాత్రం రాను బేసిల్. బొమ్మలో ఏదో దుర్విపాకం ఉంది. దాని కో ప్రత్యేకజీవితం ఉంది. నీ ఇంటికి వచ్చి నీతో కలిసి టీ తాగమంటే తాగుతాను. అంతే. అదీ హాయిగానే ఉంటుంది.'

'అదే హాయిగా ఉంటుం దనుకుంటాను. ఇక వెడతాను. ఒకమాటు నన్ను బొమ్మ చూడనివ్వవు కదూ? చూడనివ్వవు. నాకు తెలుసు.'

అతను వెళ్ళిపోయాడు డోరియన్ తనలో తాను నవ్వుకున్నాడు. పాపం బేసిల్! అసలు కారణం అతనికి తెలీదు. తనరహస్యం చెప్పకపోగా, యాదృచ్ఛికంగా తనస్నేహితుని రహస్యం తను తెలుసుకోడం తటస్థించింది. ఆ విచిత్ర

నివేదన తనకు ఎన్నివిషయాలు తెలిపింది! అతని అసూయ, మూఢభక్తి, అతని అధికవర్ణనలు, అల్పాగా కొన్ని విషయాలు చెప్పీచెప్పకుండా ఉండడం-ఇవన్నీ అతనికి అవగతమైనాయి. విచారం కలిగింది. ఇలాటి స్నేహంలో యేదో విషాదం ఉన్నదనిపించింది.

అతను నిశ్వసించాడు. గంటకొట్టాడు. ఏమైనా బొమ్మను దాచెయ్యాలి. మళ్ళీ ఆ విషయం కనుపిస్తే ప్రమాదం. తన స్నేహితులు వచ్చిపోయేగదిలో ఆ బొమ్మ ఉండడానికి వీలులేదు.

# 10

గంట వినిపించి సేవకుడు లోనికి వచ్చాడు. డోరియన్ అతనివంక తదేకంగా చూస్తూ కూచున్నాడు. అతను యజమాని ఆజ్ఞలకోసం వేచి నిల్చున్నాడు.

డోరియన్ సిగరెట్ వెలిగించి అద్దందగ్గరకు వెళ్ళాడు. అద్దంలో విక్టర్ ముఖం కనుపిస్తూఉంది. ఆ ముఖంలో నమ్రత సేవాభావం గూడుకట్టినట్టుగా ఉంది. భయపడవలసిందేమీ లేదు, అయినా తగుజాగ్రత్తలో ఉండడం మంచిది. మెల్లని కంఠస్వరంతో ఇంటిదాసిని పిలవమనీ, ఫ్రేములు చేసేవాని వద్దకు వెళ్ళి ఇద్దరు మనుష్యులను పంపమని సేవకునితో చెప్పాడు. కొన్నిక్షణాల తరువాత ఇంటిదాసి మిసెస్ లీఫ్‌వచ్చి నిల్చుంది. నల్లని సిల్కుదుస్తులు ధరించిఉంది. ఆమెను స్కూల్ రూమ్ తాళపుచెవి ఇవ్వమని అడిగాడు డోరియన్.

ఆమె ఆశ్చర్యపడింది.

'పాత స్కూల్‌రూమ్ తాళపుచెవా? ఆ గదినిండా దుమ్ము. ముందు శుభ్రం చేయించాలి. లేకపోతే గదిలో అడుగుపెట్టడానికికూడా వీలుండదు' అన్నది.

'అవసరంలేదు లీఫ్. నాకు తాళపుచెవి కావాలి. అంతే.'

'సరే, అవుతే, తమరు లోనికి వెళ్ళగానే సాలీడు గూళ్ళలో మునిగిపోవలసివస్తుంది. అయిదు సంవత్సరాలనుంచి- పెద్దయ్యగారు చనిపోయినప్పటినుంచి - ఆ గది తెరవలేదు.'

తాతపేరు చెప్పగానే డోరియన్ కళ్లు మూసుకున్నాడు. అతన్నిగురించిన భయంకరమైన జ్ఞాపకాలు అతనిమనస్సులో మెదిలాయి.

'కావచ్చు. అయినా, నే నొకమాటు ఆ గదిచూడాలి. తాళపుచెవి ఇవ్వు-' అన్నాడు.

'ఇదుగోనయ్యా'- అంటూ ఆ ముసలిది వణుకుతున్న చేతులతో తాళపుచెవుల గుత్తిలోనుంచి తాళపుచెవి తీసి ఇచ్చింది.

తరువాత ఏదో గృహకృత్యాలవిషయం ప్రస్తావించింది ఆమె. శాయశక్తులా గృహాన్ని సర్దుకోరమ్మని చెప్పాడు డోరి యన్. తరువాత ఆమె చిరునవ్వులతో గది విడిచి వెళ్ళింది.

ఆమె తలుపుమూసి వెళ్లిపోగానే డోరియన్ తాళపు చెవి జేబులో పెట్టుకుని ఒకమాటు గదినంతా కలయజూచాడు. బంగారు జరీ అల్లిన ఒకపెద్దసాటిన్ తెరపై అతని కన్నుపడింది. బొలోగ్నావద్ద కాన్వెంట్‌లో తన తాతగారు ఆ తెరనుచూచి

తీసుకొచ్చాడు. అది పదిహేడవశతాబ్దపుది. భయంకరమైన ఈ బొమ్మని కప్పడానికి అదెంతో తగినట్టుగా ఉంటుందను కున్నాడు డోరియన్. మృత్యువుకంటెకూడా భీకరమైన వినాశనాన్ని తనలో దాచుకుంది ఆ బొమ్మ. ఆ బొమ్మ తను నాశనమైపోకుండా ఎన్నో భీభత్సాలను కలిగిస్తుంది. క్రిమికీట కాలు శవాన్ని కొరుక్కుని తిన్నట్టు తనపాపాలు ఆబొమ్మను కొరుక్కుని తింటాయి. దానిఅందాన్ని నాశనం చేస్తాయి. దాని లావణ్యాన్ని భుజిస్తాయి. దాన్ని మలినం కావిస్తాయి. లజ్జా పంకిలం చేస్తాయి. కాని దానిప్రాణంమాత్రం పోదు. అది ఎప్పటికీ బ్రతికేఉంటుంది. ఇలా ఊహించుకునేసరికి అతను వణికిపోయాడు. బేసిల్‌కు అసలురహస్యం చెప్పనందుకు విచారపడ్డాడు. లార్డ్ హెన్రీ ప్రభావాన్ని, తనస్వభావాన్నుంచే ఉత్పన్నమయ్యే అనేకవిషపూరితప్రభావాలను ఎదుర్కొన గలిగేమార్గం చెప్పేవాడు బేసిల్. తనపట్ల అతని అనురాగం— అది నిజమైన అనురాగంకాబట్టి— అందులో ఉదాత్తమైనది కాని, మేధాయుతమైనది కాని ఏమీలేదు. అది స్వచ్ఛమైన అనురాగం. ఇంద్రియాలనుంచి పుట్టి ఇంద్రియాలతో నశించే కేవల శారీరక సౌందర్యాస్వాదనంకాదది. మైఖెల్‌యాంజెలో, మాంటెయిన్, వింకెల్‌మన్‌లకు తెలిసింది ఇలాటి అను రాగమే. షేక్స్పియర్‌కూడా ఇలాటి అనురక్తినే ఊహిం చాడు. అయినా, బేసిల్ అతనికి ఏదో ఒక గత్యంతరం చెప్పి ఉండేవాడు. ఈ ఉపద్రవాన్నుంచి కాపాడిఉండేవాడు. కాని తను ఆరహస్యంచెప్పలేదు. ఇప్పుడు సమయం దాటిపోయింది. గతాన్ని ఎప్పుడూ తుడిచిపెట్టవచ్చు. పశ్చాత్తాపం వల్ల

కాని, నిరసించడంవల్ల కాని, మరుపువల్ల కాని గతాన్ని తుడిచి వెయ్యవచ్చు. కాని భవిష్యత్తును ఎలా తప్పించుకోడం? అతనిలో దాగిన ఉద్వేగాలు భీకరంగా బాహిరిల్లకపోవు. స్వప్నాలు తమ మలినచ్ఛాయలను నిజం చేసుకోకపోవు.

అతను పరుపుమీదనుంచి బంగారు ఊదారంగుల పెద్ద దుప్పటిని తీసుకుని తెర వెనకాలకు వెళ్ళాడు. బొమ్మ ముఖం పూర్వంకంటె విషపూరితంగా ఉందా? బొమ్మముఖం పూర్వంకంటె మారలేదనిపించింది. అయినా అతని అసహ్యంమాత్రం మరింత ప్రగాఢమైంది. బంగారుజుట్టు, నీలాలకళ్ళు, గులాబీలా ఎరుపు పెదవులు – అన్నీ అలాగే ఉన్నాయి. మారింది ఒక్క ముఖంలోని భావం మాత్రమే. క్రౌర్యంతో భయంకరంగా కనుపిస్తూ ఉంది. దానితో పోల్చిచూస్తే బేసిల్ చివాట్లు మాత్రం ఎంతపాటివి! తన ఆత్మే ఆ బొమ్మలోనుంచి తన వంక చూస్తోంది. సమాధానం చెప్పమని అడుగుతోంది. అతని ముఖం బాధతో నిండింది. ఆ ముసుగును బొమ్మమీదికి విసిరాడు. ఈ లోగా తలుపు చప్పుడైంది. సేవకుడు వచ్చాడు.

'వాళ్లు వచ్చారయ్యా' అన్నాడు. డోరియన్‌కు అతన్ని వెంటనే అక్కడినుంచి పంపెయ్యాలనిపించింది. ఆ బొమ్మని ఎక్కడికి చేరుస్తున్నారో అతనికి తెలీకూడదు. అతను ఏదో కనిపెడుతున్నట్టుగా ఉన్నాడు. అతనికళ్ళలో ఆలోచనా కుట్రా కనుపిస్తున్నాయి.

డోరియన్ వ్రాతబల్లదగ్గర కూచుని లార్డ్ హెన్రీకి ఒక చీటీ వ్రాశాడు. చదువుకోడానికి యేదైనా పుస్తకం పంపమని, -3.) కు కలుసుకోమని వ్రాశాడు.

ఉత్తరం తీసుకెళ్ళి లాక్హ్సార్ట్కి ఇచ్చి జవాబు తీసుక రమ్మని చెప్పి ఆ మనుష్యులను లోనికి రమ్మని చెప్పాడు. రెండు మూడు నిమిషాల్లో మరోసారి తలుపు తెరుచుకుంది. మిస్టర్ హబ్బర్డ్ వచ్చాడు. సౌత్ ఆడ్లీ స్ట్రీట్లో ఫ్రేములు చెయ్యడంలో అతనంటే చాలా ప్రసిద్ధి. అతను సాధారణంగా దుకాణందాటి బైటికి రాడు. ఒక్క డోరియన్ పిలిచాడని మాత్రమే వచ్చాడు. డోరియన్లో ఏదో విచిత్రమైన ఆకర్షణ ఉంది. ఆ ఆకర్షణ అందరినీ ఆకట్టుకుంటుంది. అతన్ని చూడడం కూడా ఒక ఆనందమే. అతను మాంసలంగా ఉన్న తనచేతులు నలుపుకుంటూ 'తమకోసం ఏం చెయ్యమంటారు మిస్టర్ గ్రే? ఒక చక్కని కొత్త ఫ్రేమ్ తెప్పించాను. పాత ఫ్లారెంటైను ఫాషనులో చేసిన ఫ్రేమ్. ఒకచోట అమ్మకంలో కొన్నాను. మతసంబంధమైన బొమ్మలకు మహా చక్కగా ఉంటుంది. తెప్పించనా?' - అన్నాడు.

'నిన్ను ఇంటికి రప్పించినందుకు ఎంతో విచారపడుతు న్నాను మిస్టర్ హబర్డ్. ఒకమాటు తప్పకుండా వచ్చి ఆ ఫ్రేం చూస్తాను. కాని, ఇవాళమాత్రం ఒక బొమ్మని మేడ మీదకు తీసుకెళ్ళాలి. బొమ్మ చాలా బరువైనది. నీ దగ్గర పనిచేసే వారిలో ఇద్దరిని నాకు సాయం పంపుతావేమోనని నిన్ను పిలవనంపాను' - అన్నాడు డోరియన్.

'తప్పకుండా మిస్టర్ గ్రే. మీకు ఏవిధంగా సాయపడడ మైనా నా కెంతో ఆనందం. ఏదయ్యా, ఆ బొమ్మచూపండి.'

'ఇదుగో. ఇదే. దీన్ని తెరతోసహా పైకి తీసుకుని వెళ్ళాలి. దార్లో రాచుకోకుండా జాగ్రత్తగా తీసుకునివెళ్ళాలి' అన్నాడు డోరియన్.

'అందులో అంత కష్టం లేదు. సులభంగా చేరుస్తాం' అన్నాడు హబర్డ్.

'నాతో రండి. దోవచూపుతాను. లేక మీరు ముందు వెళ్ళండి. నేను వెనకాలే వస్తాను. ముందు మెట్లవరుసమీదుగా వెడదాం. ఆ మెట్లవరుస విశాలంగా ఉంటుంది.'

అతను తలుపు తెరిచాడు. వాళ్లు హాల్లోకి వెళ్ళి మెట్లెక్కడం మొదలెట్టారు. ఫ్రేము పెద్దది కావడంవల్ల బొమ్మ బరువుగా కనుపిస్తూంది. మిస్టర్ హబర్డ్ మధ్యమధ్యలో ఎంత వద్దంటున్నా డోరియన్ సాయంకోసం ఒక చెయ్యివేస్తున్నాడు. చివరిఅంతస్తు చేరగానే 'మహాబరువుగా ఉందయ్యా' అన్నాడు ఒకడు. చెమటతో మిలమిలలాడుతున్న నుదురు తుడుచుకున్నాడు.

'బొమ్మ చాలా బరువుగా ఉన్నదనుకుంటాను' అన్నాడు డోరియన్, గది తలుపు తెరుస్తూ. తన విచిత్ర జీవిత రహస్యాన్ని ఎకరికళ్ళాపడకుండా ఆగదిలోనే దాస్తాడు.

అతను ఆ గదిలో అడుగుపెట్టి నాలుగుసంవత్సరాలకు పైగా అయింది. తనచిన్నతనంలో ఆ గదిని తన ఆటగదిగా ఉపయోగించాడు. తరువాత ఆగదిలోనే చదువుకున్నాడు. గది చాలా పెద్దది. విశాలంగా తీర్చినట్టుకట్టింది. తన చిన్ని మనుమనికోసం కడపటి లార్డ్ కెల్సో కట్టించాడు ఆగది. తల్లి పోలికలు ఎక్కువగా ఉండడంవల్ల, మరికొన్ని కారణాలవల్ల

అతన్ని దూరంగా ఉంచదలచుకున్నాడు. గదిలో ప్రవేశించ గానే డోరియన్‌కు అంత పెద్దమార్పేమీ కనుపించలేదు. పుస్తకాల బీరువాలు, బడిపుస్తకాలు, అన్నీ అలాగేఉన్నాయి. రాజుగారూ రాణీ గారూ తోటలోకూచుని పళ్ళుసాడుకున్నట్లు బొమ్మ అల్లిన తెర అలానే వ్రేలాడుతూఉంది. కొందరు రౌతులు ఒకప్రక్క స్వారీచేస్తూ వెడుతున్నారు. వారిచేతులపై పక్షులు కూచుని ఉన్నాయి. ఇదంతా ఎంత చక్కగా జ్ఞాపకం తనకి? అతను గది నలుమూలలా కలయచూచేసరికి తను ఒంటిగా గడిపిన శైశవపు ప్రతిక్షణం జ్ఞాపకానికి వచ్చింది. తన చిన్ననాటిమచ్చలేని స్వచ్ఛతంతా జ్ఞాపకంవచ్చి ఈ భీకర చిత్రాన్ని ఇక్కడ దాచవలసిరావడం అతని కెంతో భయంక రంగా కనుపించింది. ఆ మృతగతదినాలలో ఇలాంటి సంఘట నలు తనజీవితంలో జరుగుతాయని తనకేం తెలుసు? కాని, బొమ్మను దాచడానికి ఇంతకన్న భద్రమైన చోటు ఇంట్లో మరెక్కడా లేదు. తాళపుచెవి తన దగ్గరే ఉంటుంది. అంచాత గదిలోకి ఎవరూ వెళ్ళడానికి వీలుండదు. ఊదా తెర చాటున బొమ్మముఖం రాక్షసంగా అశుభ్రంగా అసహ్యంగా తయారు కావచ్చు. అయితేమటుకేం? ఎవరూ చూడరు. తనే చూడడు. తన ఆత్మయొక్క భయంకరవినాశాన్ని తను కళ్ళారా ఎందుకు చూడాలి? తన యౌవనం తనకుంది. అది వాడదు. అంతే చాలు. ఇంతే కాదు తన స్వభావం ఇంత కన్న మనోహరం కాకూడదా? భవిష్యత్తు ఇలాగే లజ్జా భరంగా ఉంటుందని ఎలా చెప్పగలం? ఏదో ఒక ప్రేమ అతని జీవితాన్ని మళ్ళీ స్పృశించవచ్చు. అతన్ని పునీతంచెయ్య

వచ్చు. తనఆత్మ శరీరాలలో అప్పుడే మొలకలెత్తి కదలి మెదలుతున్న పాపాలనుంచి తనని కాపాడవచ్చు. ఇంకా ఒకరూపం పొందని ఆ పాపాలు – తమ మర్తతవల్లనే అతన్ని ఆకర్షిస్తున్నాయి. ఒకనాటికి ఆ అరుణ లలితాధరాలనుంచి ఆ క్రౌర్యరేఖ తొలగిపోవచ్చు. అప్పుడు తను లోకానికంతా బేసిల్ హాల్‌వర్డ్ అద్భుతకళాఖండాన్ని ప్రదర్శించవచ్చు.

కాని, ఇది అసంభవం. గంటగంటకూ వారవారానికీ బొమ్మను వృద్ధాప్యం ఆవరిస్తోంది. పాపంతాలూకు క్షుద్రత్వాన్నుంచి తప్పించుకోవచ్చు కాని, వృద్ధాప్యాన్ని ఎలా తప్పించుకోడం? చెక్కిళ్లు పీక్కుపోతాయి. రక్తం తరిగిపోతుంది. వాడిపోయే కండ్లచుట్టూ పసుపురంగునీడ లేర్పడి కండ్లను భయంకరంగా కనుపింపచేస్తాయి. జుట్టుమిలమిల వెళ్ళిపోతుంది. నోరు తెరుచుకుంటుంది. పెదవులు జారిపోతాయి. వృద్ధుల నోళ్ళలాగా అసహ్యంగా కనుపిస్తుంది. గొంతుక ముడతలు పడుతుంది. చేతులు చల్లబడిపోతాయి. నాళాలు నలుపెక్కుతాయి. దేహం వంకర్లు తిరుగుతుంది. తన చిన్నతనంలో తన పై కర్కశంగా ఆధిపత్యం చలాయించిన తాతయ్య జ్ఞాపకం వస్తాడు. బొమ్మను దాచెయ్యాలి. తప్పదు.

'ఇలా తీసుకురా మిస్టర్ హబర్డ్. ఏదో ఆలోచిస్తూ మిమ్మల్ని చాలాసేపు నిలబెట్టాను–' అన్నాడు డోరియన్.

'ఎక్కడ ఉంచమంటారయ్యా.'

'ఎక్కడైనాసరే ఇక్కడ ఉంచండి. ఈ గోడకు ఆనించండి.'

'బొమ్మ చూడవచ్చా అయ్యా?'

డోరియన్ ఉలికిపడ్డాడు. 'చూడవలసిం దేమీ లేదు. మీరు వచ్చి సాయపడినందుకు ఎంతో కృతజ్ఞుణ్ణి-'అన్నాడు.

వాళ్ళు వెళ్ళిపోయారు. డోరియన్ తలుపుమూశాడు. అతనికి ఇప్పుడు భద్రంగా ఉన్నట్టు తోచింది. ఇక ఎవరూ భీకరమైన ఈ బొమ్మను చూడరు. తనకంటికితప్ప మరెవరికంటికి తన అవనతి కనుపించదు.

తరువాత లైబ్రరీలోకి వచ్చాడు. అయిదున్నరయింది. టీ తయారుగా ఉంది. లార్డ్ హెన్రీదగ్గర నుంచి ఉత్తరం వచ్చి ఉంది. పుస్తకంకూడా పంపాడు. 'సెంట్ జేమ్స్ గెజెట్'మూడో ప్రతి పంపాడు. వెళ్ళిన విక్టర్ తిరిగి వచ్చా డన్నమాట. అతను హాల్లో వారిని చూచి, తను లేనప్పుడు వా ళ్ళేం చేస్తున్నారో పసిగట్టాడేమో ననిపించింది. ఇదివరకు బొమ్మ ఉన్నచోట గోడ ఖాళీగా ఉంది. ఎప్పుడైనా రాత్రిపూట అతను మెల్లగా మెట్లెక్కి వెళ్ళి గదితలుపు తెరవవచ్చు. ఇంట్లో ఇలాటివాడు ఉండడం సమ్మతం కాదు. అనేకమంది శ్రీమంతులు, తమసేవకులవల్ల అపనిందలపాలుకావడం అతను విన్నాడు. ఉత్తరం చదవడంవల్లనో, చాటుగా ఉండి వారిమాటలు వినడంవల్లనో, ఏదైనా ఎడ్రస్ఉన్న కార్డు దొరకడంవల్లనో, చివరకు దిండు కింద నలిగిన పూవుకాని, లేసుకాని చూడడంవల్లనో అలాటివి జరుగుతాయి. అతను నిశ్వసించి, కొంచెం టీ పోసుకుని, లార్డ్ హెన్రీ పంపిన చీటీ తెరచి చూచాడు. సాయంత్రం పేపరూ, పుస్తకమూ పంపానని ఉంది. అంతే. 8-15కు క్లబ్ కు వస్తానని ఉంది. పేపర్ అయిదవ పేజీలో ఎర్రపెన్సిల్ గుర్తు ఉంది. అతను ఈ క్రింది పేరా చూచాడు :

'ఒకనటిని గురించిన విచారణ — ఈ రోజు ఉదయం హాక్స్టన్ రోడ్, బెల్ టావెరన్ లో జిల్లా శవపరీక్షాధికారి డాన్బీ, హాల్ బరన్ రాయల్ థియేటర్ లో పనిచేస్తూవచ్చిన ఒక యువనటి సిబిల్ వేన్ శవాన్ని పరీక్షించాడు. ఏదోతొందర పాటువల్ల మరణించిందని తీర్పు చెప్పబడింది. సాక్ష్యమిచ్చే సమయంలో ఎంతో తలక్రిందులైపోయింది తల్లి ఆమెకు సానుభూతి తెలియజేశారట. పోస్టుమార్టెమ్ పరీక్ష కావించిన డాక్టర్ బిరెల్ సానుభూతికూడా ఆమెకు తెలియజెయ్య బడింది.'

డోరియన్ చీటీ చింపివేసి ముక్కలు విసిరేశాడు. ఇదంతా ఎంత అసహ్యంగా ఉంది! లార్డ్ హెన్రీ ఇలాటి రిపోర్టు పంపినందుకు అతనికి కొంచెం ఆందోళన కలిగింది. పైగా ఎర్రపెన్సిలుతో గుర్తుకూడా పెట్టాడు. విక్టర్ కు ఈ చీటీ అర్థం చేసుకునే ఇంగ్లీషు వచ్చు. అతను చదివాడేమో! చదివితే మటుకేం? డోరియన్ కూ సిబిల్ వేన్ చావుకూ సంబంధం ఏమిటి? డోరియన్ కాదుగా ఆమెను చంపింది.

లార్డ్ హెన్రీ పంపిన పసుపురంగు పుస్తకంపై అతని కన్నుపడింది. ఆ పుస్తకం ఏమైఉంటుందాఅని ఆశ్చర్యపడ్డాడు. ఆ పుస్తకం తీసుకుని పేజీలు తిరగేస్తూ పడకకుర్చీలో వాలాడు. కొన్ని క్షణాల తరువాత పూర్తిగా పుస్తకంలో మునిగిపో యాడు. అతను ఇంతవరకు ఎన్నడూ అలాటిపుస్తకం చదవ లేదు. అద్భుతమైన దుస్తులు ధరించి, సన్నని వేణునాదంతో ప్రపంచంలోని పాపాలన్నీ మూగిబొమ్మల్లా తనకళ్ళముందు కదిలిపోతున్నట్టు తోచింది. అతని అస్పష్టంగాకాంచిన కలలన్నీ

అతనికళ్ళముందు నిజమవుతున్నాయి. తను ఎన్నడూ కలలో కూడా ఊహించని విషయాలు ప్రత్యక్షమవుతున్నాయి.

అది ఒక నవల. ఒక ఇతివృత్తంలేని నవల. ఒకటే పాత్ర. తను బ్రతుకుతున్న పందొమ్మిదవ శతాబ్దంలో ఒక్క తన శతాబ్దం తప్ప తతిమ్మా అన్నిశతాబ్దాలఅన్నివిధాల భావనలనుఉద్వేగాలనునిజంచేసుకోడానికి బ్రతుకంతాగడిపిన ఒక పారిస్ యువకునిమనస్తత్వచిత్రణ. విశ్వశక్తిప్రయాణంచేసిన వివిధ మానసికావస్థలు అతనిలో ప్రవహించాయి. మనుష్యులు అవివేకంగా గుణమనే పేరుతో పిలిచిన ఆ పరిత్యాగాలను కేవలం వాటి కృత్రిమతకోసమే ప్రేమించాడు. వివేకవంతులు ఇంకా పాపమనే పేరుతో పిలుస్తున్న సహజమైన తిరుగుబాట్లనూ ప్రేమించాడు. ఆ నవల వ్రాసిన శైలి ముత్యాలు ముగ్గులు తీర్చినట్టుగా ఉంది. స్పష్టతాస్పష్టతలు ఒకేమాటు దోబూచులాడుతాయి. ఉక్తివైచిత్ర్యాలు, వివరణలు వెల్లివిరుస్తున్నాయి. ఫ్రెంచి సాంకేతికవాదుల రచనాధోరణికి చెందిన ఒక గొప్పశిల్పి నైగనిగ్యమంతా ఆ గ్రంథంలో అడుగడుగునా తొణుకుతూఉంది. ఉపమలు. ఉత్ప్రేక్షలు. రంగు రంగుల పూలు. ఆధ్యాత్మిక పదజాలంతో ఇంద్రియజీవితం వర్ణితమైంది. ఒక్కోసారి ఒక మధ్యయుగపుమహర్షి తన్మయావస్థను చదువుతున్నామో, లేక ఒక నేటికాలపుపాపి దుస్సహమైన పాప నివేదన వింటున్నామో తెలీదు. అవి ఋషివాక్కులో పాపుల పలవరింతలో తెలీదు. ఆ గ్రంథం విషపూరితం. ప్రతిపేజీలో బరువైన సాంబ్రాణిపొగ అల్లలాడుతూ మెదడును కల్లోలితం చేస్తుంది. మనస్సు కలవరపెడుతుంది.

వాక్యాలు చదువుతూంటేనే, వాటి ఛందోగమనం, సన్నని సంగీతం - అధ్యాయాలు చదివేకొద్దీ - కుర్రాడి మనస్సుని ఒక స్వప్న నిద్రలో ముంచాయి. అతనికి రోజు తరిగిపోయిందనీ నీడలు ప్రాకుతూ వచ్చాయని కూడా తెలీలేదు. ఒకే ఒక చుక్కతో నిర్మేఘమైన ఆకసం కిటికీలోనుంచి తొంగిచూచింది. ఆ మసక కాంతిలో కూడా అతను చదువుతూనే ఉన్నాడు. కనుపించకుండాపోయినంతవరకూ చదువుతున్నాడు. ఆలస్యమైందని సేవకుడు అనేకసార్లు జ్ఞాపకం చేసినతరువాత లేచి ప్రక్కగదిలోకి వెళ్ళి చిన్న ఫ్లారెంటైన్ టేబిల్ పై పుస్తకం ఉంచాడు. ఆ టేబిల్ ఎప్పుడూ తను పడుకునే ప్రక్క పక్కనే ఉంటుంది. తరువాత డిన్నర్ కు ముస్తాబు కావడం మొదలెట్టాడు.

క్లబ్ కు చేరేసరికి తొమ్మిదిగంటలైంది. లార్డ్ హెన్రీ మార్నింగ్ రూమ్ లో ఒంటిగా కూచుని ఉన్నాడు. విసుకెత్తినట్టుగా కనుపిస్తున్నాడు.

'హెన్రీ, చాలా ఆలస్యమైంది క్షమించాలి. కాని, తప్పునీదే. నీవు పంపిన పుస్తకం చదువుతూ కాలంకూడా మరిచిపోయాను' - అన్నాడు డోరియన్.

'అవును. నీ కిష్టంగా ఉంటుందనే అనుకున్నాను,' అన్నాడు లార్డ్ హెన్రీ.

'ఇష్టపడ్డానని అనలేదు హెన్రీ. ఆకర్షించిందన్నాను. రెంటికీ చాలా తేడా ఉంది.'

'అమ్మయ్య! కనుక్కున్నావు కదా?'- అన్నాడు లార్డ్ హెన్రీ.

ఇరువురూ డైనింగ్ రూమ్ లోకి వెళ్ళారు.

# 11

ఈ గ్రంథప్రభావంనుంచి కొన్నిసంవత్సరాలవరకు డోరియన్ విముక్తిచెందలేకపోయాడు. విముక్తిచెందేయత్నం కూడా చేయలేదనడం ఎక్కువ ఉచితమనుకుంటాను. పారిస్ నుంచి తొమ్మిదిపెద్దకాపీలు తెప్పించాడు. వివిధరకాల రంగు లలో వాటిని బైండు చేయించాడు. తన విశేష మానసికావ స్థలకు మాటిమాటికీ మార్పుచెందే అభిరుచులకు అనుకూలంగా ఉండేలా చేయించాడు. ఇప్పుడు అతని మనస్సు తీరూ, అభి రుచీ క్షణక్షణానికీ మారుతూఉంది. ఒక్కొక్కమాటు తనకు వశంకూడా తప్పిపోతోంది. ఆ నవల నాయకుడైన ఆ పారిస్ యువకుడు ఒకవిధంగా తనలాటివాడుగానే కనుపిస్తున్నాడు. కాల్పనిక, శాస్త్రీయ స్వభావాలు ఆ యువకునిలో అతివిచి త్రంగా సమ్మిళితం పొందాయి. ఆ పుస్తకం మొత్తంమీద, తను బ్రతకడానికి ముందే, తన జీవితగాథ రచించినట్టుగా ఉంది.

ఒకవిధంగామాత్రం తను ఆ నవలలోని విచిత్రమైన నాయకునికంటె అదృష్టవంతుడు. గంభీరంగా కనుపించే అద్దా లను చూచినభయం, మిలమిలలాడే లోహతలాలను చూచిన భయం, ప్రశాంతనిర్మలజలాన్ని చూచిన భయం,- ఈభయా లేమీ అత నెరుగడు. అలాటి అవసరంకూడా లేదు. కాని, ఈ భయాలన్నీ ఆ పారిస్‌యువకుని జీవితంలో పసితనంలోనే ప్రవేశించాయి. ఒకనాడు ఎంతో ఉన్నతంగా కనుపించిన సౌందర్యం ఈ భయాలవల్ల హఠాత్తుగా పతనోన్ముఖమై వాడి వడలిపోతుంది. అతను గ్రంథంలోని అపరార్థభాగాన్ని ఒకవిధ

మైన క్రూరమైన ఆనందంతోనే చదివా డనాలి. ప్రతి ఆనందం లోనూ, బహుశా ఒక క్రూరత్వం ఉంటుంది. ప్రతి సౌఖ్యం లోనూ ఒక క్రూరత్వం తప్పనిసరిగా నిహితమైఉంటుంది. ఆ గ్రంథంయొక్క చరమార్ధభాగమంతా ఆ యువకునిదుఃఖ గాథను వివరిస్తుంది. ఇతరులలోనూ, లోకంలోనూ తాను ఎక్కువగా దేన్ని వాంఛించాడో అది తన జీవితంలో పోగొట్టు కున్న వ్యక్తియొక్క దుఃఖవిషాదగాథను చెబుతుంది.

బేసిల్ హాల్‌వర్డ్‌నే కాక మరి చాలామందిని కూడా ముగ్ధ పెట్టిన ఆ అద్భుత సౌందర్యం తనను ఎన్నడూ విడిచేట్టు లేదు. తననుగురించి ఎన్నో చెప్పరాని విషయాలు విన్నవారు, క్లబ్‌లలో తనని గురించి చిత్రచిత్రవిషయాలు మాట్లాడు కునేవారుకూడా తను ఎదురుపడినప్పుడు, ఆ విషయాలు నమ్మ లేకపోతున్నారు. తను, ఎప్పుడుచూచినా, ఈ లోకపుమలినం అంటనివాడిలా కనుపించేవాడు. అతన్నిగురించి ఎంతో అసభ్య మైన విషయాలు మాట్లాడుతున్నవారు కూడా, డోరియన్ గదిలో అడుగుపెట్టగానే మాట్లాడకుండా ఊరుకునేవారు. వారిని పరాస్తంకావించే స్వచ్ఛత్వం ఏదో అతనిముఖంలో కనుపించేది. అతను కంటిముందు కనుపిస్తే చాలు, తాము మలినపరిచిన అమాయకత వారిస్మృతిపథంలో తోచేది. ఇంత అంతగాదు, ఇంత లావణ్యమూర్తి, ఈ యుగంతాలూకు మచ్చకూడా సోకకుండా ఎలా ఉన్నాడా అని వాళ్ళు అచ్చె రువు పొందేవారు.

ఇలా ఎన్నోసార్లు జరుగుతూఉండేది. ఇంటికి చాలా రోజులు వచ్చేవాడుకాదు. తిరిగి తిరిగి ఇంటికి వచ్చేవాడు.

ఒంటిగా, మెల్లగా మేడమెట్లెక్కి వెళ్ళేవాడు. గది తలుపు తెరిచేవాడు. ఇప్పుడుతాళపు చెవి ఎప్పుడూతనదగ్గరేఉంచుకుంటు న్నాడు. ఒకఅద్దం తీసుకుని తనబొమ్మముందు నిల్చునేవాడు. నానాటికీ ముసలిదై పోతున్న ఆబొమ్మలోనివికృతవదనంవంక మిలమిలలాడే అద్దంలోనుంచి తన చిరునవ్వు తనకే అందిస్తున్న తన సుందర తరుణ వదనం వంక చూస్తూ నిల్చునేవాడు. ఆ రెండిటితారతమ్యమే అతనిఆనందాన్ని ఇనుమడింపజేసేది. తన అందంపట్ల తనమమత మరింత హెచ్చింది. తన ఆత్మ విచ్ఛిత్తిపట్లకూడా ఆసక్తి ఎక్కువ కాజొచ్చింది. ముడతలు పడుతున్న ఆ ఫాలస్థలాన్నికోతలుపెడుతున్న ఆ వికృత రేఖలను కామోద్దీపకాలైన పెదవులచుట్టూ చుట్టలు చుట్టు కున్న రేఖలనూ ఒకోమాటు ఎంతో జాగరగానూ, ఒకో మాటు భీకరమైన ఆనందంతోనూ పరిశీలించేవాడు. పాపాల చిన్నెలనూ, వృద్ధాప్యపు చిన్నెలనూ పోల్చుకుని ఏ చిన్నెలు భయంకరమైనవా అని ఆశ్చర్యపోయేవాడు. తెల్లని తనచేతు లను, బొమ్మలోని ఉబ్బిన కర్కశహస్తాల ప్రక్కనే ఉంచి చిరునవ్వు నవ్వుకునేవాడు. శిధిలమవుతున్న ఆ దేహాన్ని చూచి ఆ అంగాలనుచూచి పరిహసించేవాడు.

కొన్ని కొన్ని క్షణాలలో లలితపరిమళం గుబాళించే తన పడకగదిలో పవళించినపుడో లేక తను ప్రచ్ఛన్న వేషంలో మారుపేరుతో సాధారణంగా వెడుతూండే డాక్సువద్దగల పానశాలలోని మురికిగదిలో పడుకున్నపుడో తన ఆత్మను తను తెచ్చుకున్న పతనాన్నిగురించి జాలిగా విచారించుకునేవాడు. కేవలం స్వార్థపూరితంకావడంవల్ల ఆ భావి మరింత తీవ్రంగా

ఉండేది. కాని ఇలాటిక్షణాలు ఎప్పుడోకాని వచ్చేవికావు. తను స్నేహితుని తోటలో ఇద్దరూ కూచున్నప్పుడు లార్డ్ హెన్రీ తొలిగా తనలో రేకెత్తించిన జీవితాన్నిగూర్చిన ఔత్సుక్యం నానాటికీ అతనిలో పరిఢల్లుతూఉంది. ఎంత తెలుసుకున్నా ఇంకా తెలుసుకోవలెననేకోరిక కలుగుతూఉంది. తను పోషించినకొద్దీ తనలో విచ్చలవిడిగా విహరించే వెర్రి ఆకళ్ళు బయలుదేరుతున్నాయి.

అయినప్పటికీ అతను పూర్తిగా నిర్లక్ష్యతి వహించాడని చెప్పడానికి వీలులేదు. ముఖ్యంగా తన సామాజిక సంబంధ బాంధవ్యాలలో నిర్లక్ష్యంగా ఉన్నాడనడానికి వీల్లేదు. శీతాకాలంలో ప్రతినెలా ఒకటి రెండు సార్లయినా ప్రతిబుధవారం నాటిసాయంకాలం ప్రసిద్ధగాయకులను పిలిపించి, అతిథులను సమావేశపరిచి వారిఅమృతగానంతో అతిథులను తనియింప జేస్తాడు. మధ్యమధ్యలో చిన్న చిన్న విందు లిస్తాడు. లార్డ్ హెన్రీ అతనికి సహాయంకూడా చేస్తూఉంటాడు. ఈ చిన్న చిన్న విందులు ఎంతో ప్రసిద్ధిగా చెప్పుకునేవారు. అతిథులను ఏరి తగినవారిని పిలిచేవాడు. టేబిల్ అలంకరణలో అద్భుతమయిన అభిరుచి ద్యోతకమయ్యేది. చాలా విచిత్రమైన పూల గుత్తులను కుండ్లలో అలంకరించేవాడు. తాము ఈటన్, ఆక్స్ ఫర్డ్ యూనివర్సిటీలలో చదువుకునేరోజులలో ఎలాటి కలలు కనేవారో అవన్నీ డోరియన్ గ్రే లో నిజంకావడం చూచి యువకులు ఎంతోఆనందించేవారు. డాంటే వర్ణించినట్లు, సౌందర్యారాధనద్వారా తమకు తాము పరిపూర్ణత సాధించుకునే వారిలో ఒకనిగా డోరియన్ గ్రేను పరిగణించేవారు.

అంతేకాదు, అతనికి జీవితమే అన్నికళల్లోకి తొలికళ. అన్నికళల్లో గొప్పదికూడా జీవితమే. ఈ కళను, ఇతరకళలన్నీ బాటలుమాత్రమే. డోరియన్ ముస్తాబుతనహో కూడా రకర కాలుగా రంగురంగులుగా మారుతూఉండేది. ఫాషనన్నా ఆడంబరమన్నా కూడా అతని కిష్టమే. ఫాషన్‌వల్ల ఊహాక ల్పన ఒక క్షణమాత్రమైనా విశ్వజననీన మవుతుంది. ఆడంబ రంలో సౌందర్యంలోని అధునాతనత్వం అన్నివిధాలా ద్యోత కం చెయ్యవచ్చు. ఎందరో అతని ముచ్చటైన ముస్తాబుతీరును అనుకరించేవారు కూడా.

ఏదో ఒక కొత్త జీవన పద్ధతిని జీవించడానికి అతను అన్వేషించి యత్నించాడు. ఆ పద్ధతితీరే వేరు. దాని తత్వమూ, దాని పద్ధతీ వేరు. ఇంద్రియాలను ఆత్మపరం కావించడంద్వారా ఆ జీవనపద్ధతిని సార్థకంచేసుకోదలిచాడు. ఇంద్రియారాధనను సాధారణంగా నిరసిస్తారు. తమకంటె బలవత్తరమైన ఇంద్రియో ద్వేగాలంటే మనుష్యులకు ఎంతో భయం. అంచాత ఇంద్రి యానుభూతినీ, సాధననూ నిరసిస్తారు. అదీగాక ఉనికియొక్క అధోరూపాలతో తాము పాలు పంచుకుంటున్నామేమోనన్న భయంకూడా వారి కుంది. కాని డోరియన్ గ్రే ఉద్దేశం వేరు. అతని ఉద్దేశంలో ఇంద్రియాలనైజాన్ని ఎవరూ అర్థంచేసుకో వలసినరీతిలో అర్థంచేసుకోలేదు. ఇంద్రియాలను ఒక క్రొత్త ఆత్మోద్దీపనానికి ఉన్ముఖం కావించకుండా, వాటిని బాధపెట్టి చంపి, వాటిని లొంగదీసి, మలమలమాడ్చి, ఎండబెట్టారు మను ష్యులు. అందుచేతనే అనాగరికులుగానూ పశువులుగానూ మిగి లిపోయారు. ఆత్మోన్ముఖం కావించినట్లవుతే ఇంద్రియాలలో

ఒక క్రొత్త అందం చిందులాడేది. ఒక కొత్త ఆత్మతత్వానికి అవి మూలభూతాలయ్యేవి. ఈ విధంగా చరిత్రలో మానవుని గమనాన్ని అతను వెనక్కు తిరిగి పరిశీలించినపుడు మానవు డింత వృథా అయిపోయాడే అని అతనికి చింత కలిగింది. ఎంతకష్టం! ఎంతఅల్పమైన కారణంకోసం! వెర్రిగా ఎన్నో అందచందాలను మనుష్యులు నిరాకరించారు. అందంనుంచి దూరమైపోయారు. ఎన్నో రకాల ఆత్మహింసన. ఆత్మనిరసన. దీనికంతా కారణం భయం. ఫలితం పతనం. ఏ ఊహా కల్పితమైన పతనాన్నుంచి తాము తప్పించుకోవాలని యత్నించారో అంతకన్న భీకరమైంది ఈ పతనం.

అవును. లార్డ్ హెన్రీ చెప్పిన మాట నిజమే. ఒక క్రొత్త ఆనంద తత్వం వచ్చి తీరుతుంది. జీవితాన్ని నవ నూతనం చేసుంది. జీవితానికి కొత్త ప్రాణం పోసుంది. ఈనాడు మళ్ళీ మొలకెత్తుతున్న పరిశుద్ధతావాదంనుంచి బ్రతుకును కాపాడుతుంది. ఈ విషయంలో మేధస్సుయొక్క సహాయం కూడా తీసుకుని తీరుతుంది. కాని, ఉద్వేగపూరితమూ రసార్ద్రమూ అయిన అనుభూతికి అవరోధం కల్పించే ఏ సిద్ధాంతాన్ని కాని, తత్వాన్నికాని అంగీకరించదు. దాని లక్ష్యం అనుభవించడమేకాని, అనుభవంయొక్క ఫలితాలు కావు. అనుభవంయొక్క ఫలితాలు ఎలాటివయినా కావచ్చు. మంచివీ కావచ్చు. చెడ్డవీ కావచ్చు. కాని అనుభవం అనుభవంకోసమే. ఇంద్రియాలను నిర్జీవంకావించే తపోతత్వం, ఇంద్రియాలను మందంచేసే అతిచారం — ఈ రెంటికీ అది అతీతమైంది. జీవి

తంలోని కొన్ని క్షణాలనుమాత్రమే ధ్యానించేలా చేస్తుంది. బ్రతుకే ఒకక్షణం.

ఎప్పుడో ఒకప్పుడైనా ఉషోదయానికి పూర్వం మేలు కొననివారు మనలో చాలా తక్కువమంది ఉంటారు కలలు లేని రాత్రులుగడిపి మేలుకొనవచ్చు. భగ్నసుఖంతో నిద్రలేక రాత్రులు గడిపి మేలుకుని ఉండవచ్చు. మనోమందిరాలలో వాస్తవంకన్న భీకరమైనదృశ్యాలు అల్లలాడి ఉండవచ్చు. అయినా ఉషోదయాన్ని ఎప్పుడో ఒకప్పుడైనా చూడనివా రుండరు. మెల్లమెల్లగా తెల్లనిద్రవేళ్ళు తెరలచాటునుంచి తొంగి చూస్తాయి. ప్రాకుతూవస్తాయి. వణుకుతూ కనుపిస్తాయి. చిత్ర చిత్రాలయిన నల్లనిరూపాలలో గదుల మూలమూలలకు ప్రాకివచ్చి అక్కడ దాగిపోతాయి. వెలుపల చెట్ల ఆకుల మధ్య పక్షులు కదులుతున్నచప్పుడు వినిపిస్తూఉంది. మనుష్యులు తమతమపనులకు బయలుదేరారు. నకిచి వేకుతున్నారు. కొం డలమీదినుంచి తేలివస్తున్నగాలి ఒకొక్కమారు నిశ్వసిస్తోంది. ఒకొక్కమారు వెక్కివెక్కి ఏడ్చినట్టు వినవస్తూంది. నిశ్శబ్దంగా ఉన్న ఇంటిచుట్టూ ప్రదక్షిణం చేస్తూంది. తాకి నిద్రపోయే వారిని నిద్రమేల్కొల్పుతానేమోనని భయపడుతున్నట్టుగా ఇంటిచుట్టూ పదేపదే తిరుగుతున్నది. తెర తరువాత తెర ఉషః కాలపు తెరలు విచ్చుకుంటున్నవి. క్రమక్రమంగా వస్తువుల రూపాలు వర్ణాలు వాటిని పొందుతున్నవి. పురాతన పద్ధతిలో జగత్తును ఉషోదయం పునర్నిర్మిస్తూ ఉన్నది. రాత్రి కాంతి తొలగిన అద్దాలు మళ్లీ కాంతి పోసుకుంటున్నవి, ఆరిన దీపాల కొసలు మనం విడిచినచోట అలాగే నిలచి ఉన్నవి. మనం చదు

వుతూ సగంలో మూసిపెట్టిన పుస్తకం అక్కడే పడి ఉంది. బాల్ డాన్స్‌లో మనం అలంకరించుకున్న పూవ్వూ, మనం తెరిచిచూచి చదవడానికి భయపడిన ఉత్తరం, లేక మనం చాలాసార్లు చదివిన ఉత్తరం – అన్నీ అక్కడే ఎక్కడివక్కడ ఉన్నాయి. అన్నీ యథాస్థానంలో ఉన్నాయి. ఏదీ మారినట్టు కనుపించడం లేదు. రాత్రి విడచిన కాల్పనిక ఛాయలనుంచి మనం ప్రతినిత్యం ఎరిగిన నిత్యజీవితం మళ్ళీ తిరిగి వస్తుంది. మనం విడిచిపెట్టినచోట మళ్ళీ మనం దాన్ని అందుకోవాలి. మళ్ళీ చేసినపనులే చెయ్యాలి. చెప్పినమాటలే చెప్పాలి. తిరిగిన చక్రమే తిరుగుతుంది. అలవాటుపడిన అదేబాట. ఈ అవసరం ఈ భయం మనలో ప్రవేశిస్తుంది. లేదా మనలో ఒక విపరీతమైన ఆకాంక్ష ఉండవచ్చు. ఉదయాన మనం కండ్లు తెరిచి చూచేసరికి మనఆనందంకోసం రాత్రికిరాత్రి చీకటిలో ఈలోకం మరోరూపం ధరించిఉండవచ్చు. ఆ లోకంలో అన్నీ కొత్త వస్తువులు. కొత్తవస్తువులకు కొత్తరూపాలు. కొత్తరంగులు. కొత్తరహస్యాలు. ఆ లోకంలో గతానికి చోటులేదు. ఆ స్మృతులు లేవు. విషంనిండిన ఆనందమూ లేదు. బాధపెట్టిన సుఖాలూ లేవు.

ఇలాటి జగత్తులే డోరియన్‌కు నిజంగా కనుపించాయి. అలాటి జగత్తులను సృష్టించుకోడమే అసలైన అవధిగా తోచింది. కొత్తకొత్త అందాలకోసం అన్వేషించేవాడు. ఆ అందాలు అతిచిత్రమైనవి. అతి రమ్యమైనవి. ఆ అందాలు అందుకోడం కోసం తరుచుగా కొన్నిభావనాపథాలను అనుసరించేవాడు. అవి తననైజానికి దూరమైనవని అతనికి తెలుసు.

అయినా వాటి సూక్ష్మభావాలకు తనను తాను విడిచిపెట్టుకునే వాడు. వాటిశోభను అందుకుని తన మేధస్సు తనివితీరినవెనుక వాటిని ఎంతో అనాసక్తంగా త్యజించేవాడు. ఉద్విగ్న స్వభావానికి ఆ అనాసక్తి ఏమాత్రం తగినదికాదు. అయినా, కొందరు అధునాతన మనోశాస్త్రవేత్తలదృష్ట్యా అది అందుకు ప్రాతిపదికకూడా.

ఒకమాటు అతన్నిగురించి ఒక పుకారుకూడా పుట్టింది అతను రోమన్ కాథలిక్ మతంలో చేరుతాడన్నారు. రోమన్ పూజాపద్ధతి అతన్ని ఎప్పుడూ ఆకర్షిస్తూవచ్చినమాట నిజమే. చర్చిలలో జరిగే నిత్యబలి పురాతనజగత్తులోని అన్నిబలులకంటె ఎక్కువగా అతనిఆత్మను కదిలించేది ఆ బలిలో అంతర్నిహితమైన ఇంద్రియ తిరస్కృతి, ఆదిమస్వచ్ఛత, అది సంకేతమైన మానవ విషాదాంతంయొక్క అనంత శోకగసం అతన్ని ముగ్ధంకావించాయి. చల్లని తెల్లని పాలరాతిపై మోకాళ్ళని, పూలుపొదిగిన పొడుగైన గౌను తొడిగిన మతగురువును గమనించడమంటే అతని కెంతోఇష్టంగా ఉండేది. పూజాస్థలంలోని తెరను తన తెల్లని చేతులతో మెల్లగా తొలిగించేవాడు మతగురువు. పూజాపాత్రలో పవిత్రజలాన్ని చిలకరించేవాడు. అతని కీ దృశ్యమంతా ఎంతోవిచిత్రంగా కనుపించేది. అతను బైటికివస్తూ నల్లని నివేదనాస్థలాలవంక ఆశ్చర్యంతో చూచేవాడు. వాటి చీకటినీడలో కూచుని స్త్రీలూ పురుషులూ నివేదించే విచిత్రజీవగాథలు వినా లనిపించేది.

కాని, అత నెన్నడూ ఒక పొరబాటుమాత్రం చెయ్యలేదు. ఒక మతాన్నికాని, ఒక తత్వాన్నికాని ఒప్పుకుని తన

మేధస్సు పెరుగుదలకు అవకాశం కల్పించుకోలేను బ్రతికినంత కాలం నివసించే ఇంటికి, ఒక రాత్రి కునుకుతీసి విడిచివెళ్ళే సత్రానికి తారతమ్యం తెలుసుకున్నాడు. రాత్రి కొద్దిగంటలు మాత్రమే సత్రంలో గడుపుతాడు. అప్పుడు నక్షత్రాలు లేవు. చంద్రుడు ఇంకా పుట్టనే లేదు. అతిసాధారణవస్తువులనుకూడా తనఅద్భుతశక్తితో అతివిచిత్రంగా కనుపింపజేసేమర్మవాదమూ, దానికి అనుబంధమైన సూక్ష్మ అనామవాదమూ అతన్ని కొన్నాళ్ళపాటు ఆకర్షించాయి మరికొన్నాళ్ళు జర్మనీలోని డార్వినియన్ ఉద్యమంతాలూకు భౌతికసిద్ధాంతాలు ఆకర్షించాయి. మనుష్యుల ఉద్వేగాలకూ భావాలకూ బుర్రలో ఎక్కడో ఒకసెల్‌లోనో లేక దేహంలోని ఒక తెల్లని నరంలోనో తొలిపుట్టుక ఉందనడం – ఆరోగ్యకరమైన కాని, అనారోగ్యకరమైన కాని, సాధారణమైన లేక అసాధారణమైన శారీరకపరిస్థితులపై ఆత్మ పూర్తిగా ఆధారపడిఉందనడం ఎంతో విచిత్రంగా కనుపించింది. అయినా, జీవితాన్ని గురించిన ఏ సిద్ధాంతంకూడా జీవితంతో పోల్చిచూస్తే జీవితమంత ప్రధానంగా కనుపించడం లేదు. కార్యాచరణనుంచి, ప్రయోగంనుంచి విడమరిచినప్పుడు కేవలం మేధస్సుయొక్క ఊహాకల్పన ఎంత నిర్జీవమైనదో అతనికి బాగా తెలుసు ఆత్మకంటె, ఇంద్రియాలనుంచికూడా తెలుసుకోవలసిన ఆధ్యాత్మిక మర్మాలు చాలా ఉన్నవని అతనికి తెలుసు.

అందుచేత, ఇకనుంచి అతను పరిమళద్రవ్యాలను పరిశీలించి పరిశోధిస్తాడు. పరిమళ తైలాలను సాంబ్రాణి మొదలయిన పరిమళద్రవ్యాలను ఎలా తయారు చేస్తారో ఆ రహ

స్థాలను తెలుసుకుంటాడు. మనస్సులోని ఏ అవస్థకుకూడా ఇంద్రియజీవితంలో ప్రతిఫలనమంటూ లేకుండా పోలేదు. వాటి పరస్పరసంబంధాలలోని నిజతత్వాన్ని పరిశీలింపబూనుకున్నాను సాంబ్రాణిపొగలతీగలు మనిషి మనస్సును మరోన్మత్తం చేస్తాయి. నిద్రించే ఉద్వేగాలను మేలుకొల్పుతాయి. వయిలెట్ పూలు గతించిన ప్రణయకలాపాలను జ్ఞాపకం తెస్తాయి. కస్తూరిగుబాళింపు మనస్సును పిచ్చెక్కిస్తుంది. చంపకం భావనాపథాన్ని మలినంచేస్తుంది. వీటి పరస్పరబాంధవ్యాలలో ఉన్న ఈ విచిత్రవిశేషమేమిటని అతను అన్వేషింపసాగాడు. సుగంధాలకు సంబంధించిన ఒక మన స్తత్వరీతిని ఊహింపసాగాడు. మధుర పరిమళాలుగల వ్రేళ్ళు, పుష్పాడి, గుబాళించే పూలు, మనస్సును మత్తెక్కించేఅంజనాలు, ఘుమఘుమలాడే చెట్లబెరళ్లు, సుగంధతైలాలు, రకరకాల కుసుమాలు, వీటి వివిధ ప్రభావాలను పరిశీలింపసాగాడు.

మరోసారి అతను పూర్తిగా సంగీతసాధనలో మునిగిపోయేవాడు. విశాలమైన గది. పెద్ద కిటికీలు. బంగారు పూత పూసిన చూరు. లేత ఆకుపచ్చరంగులద్దిన గోడలు. అలాటి గదిలో కూచుని విచిత్రమైన సంగీతమేళలు జరిపేవాడు. వెర్రెత్తిన లంబాడీల చిన్నిచిన్ని ఏకతారల తంత్రులకదుపులుచీల్చుకుని విలయసంగీతం వివిధరీతుల వెలువడేవి. పసుపుపచ్చని శాలువాలు కప్పుకుని గంభీరంగా కనుపించే గాయకులు పెద్ద పెద్ద వీణావాదనాలను కొనవ్రేళ్ళ మీటేవారు. రాగి తప్పెటలను అదేపనిగా నీగ్రోలు మోగించేవారు ఎర్రని చాపలపై పద్మాసనాలు వేసుకుని కూచున్న ఇండియనులు సన్నాయి

మేళాలు తీగలుసాగించేవారు. పెద్దపెద్ద ఫణాలుగల ఫణులను మంత్రముగ్ధం కావిస్తున్నట్టుగా సన్నాయిఊదేవారు. అనాగరక ఆదిమసంగీతంలోని కర్కశ విరామాలు, క్షుమనే అపశ్రుతులూ అతన్ని కదిలించేవి. ఒకోమాటు షుబర్ట్ సంగీతంలోని లావణ్య లాలిత్యాలు, ఛాపిన్ సంగీతంలోని అందమైన బాధలూ గాథలూ, బిథోవెన్ ఉదాత్త సంగీత కల్పనలు సైతం అతనిచెవి కెక్కేవి కావు. ప్రపంచంలోని అన్ని భాగాలనుంచి చిత్రచిత్రాలైన గానవాద్యాలను తెప్పించి సేకరించి ఉంచాడు. ఎక్కడ ఏ విచిత్రవాద్య మున్నదని తెలిసినా వదిలిపెట్టలేదు. మృతజాతుల సమాధిగర్భాలలో కలిసిన వాద్యాలను, పాశ్చాత్య నాగరికతతో పూర్తిగా సంబంధం విచ్ఛిత్తి చేసుకుని ఎక్కడో దూరంగా నివసించే అనాగరక జాతులు ఉపయోగించే వాద్యాలనుసైతం తెప్పించాడు. అదీ ఇదీ అనక, అన్నివాద్యాలనూ, అంతో ఇంతో సాధించి చూచాడు. రియో నీగ్రో ఇండియన్ల విచిత్రమైన 'జురుపరిస్' అతనివద్ద ఉండేది. దాన్ని స్త్రీలు చూడడానికి వీల్లేదు. యువకులయినా, ఉపవాసాలుచేసి చర్మకోల దెబ్బలు తిన్న వెనుకనే దానిని చూడవచ్చు. పక్షుల కిలకిలారావాలు వినిపించే పెరువియన్ల మట్టికూజాలు, 'చిలీ' లో వాయించే అల్ ఫాన్సో డి ఒవలె లాంటి మనుష్యులబొమికలతో చేసిన వేణువులూ, కజ్కో దగ్గరమాత్రమే దొరికే పసుపు పచ్చని రాతివాయిద్యాలూ ఉండేవి. తొలిచి గుజ్జుతీసిన బెరడుకాయలలో గులకరాళ్ళు నింపాడు. అవి కదిలించినప్పుడల్లా గలగలలాడేవి. మెక్సికన్లు ఉపయోగించే సన్నాయికర్ర ఉండేది. వాద్యగాడు

అందులోకి గాలిపోయడు. అందులోనుంచి గాలి పీల్చు కుంటాడు. అప్పు డది మోగుతుంది. అమెజాన్ నదీతీరాల్లోని జాతు లుపయోగించే 'ట్యూర్' వాయిద్యం ఉంది. పెద్దపెద్ద చెట్లపై కూచుని కాపలాదారులు దాన్ని మోగిస్తారు. అది కొన్ని వందల మైళ్ళవరకు వినిపిస్తుంది. టెపెనజ్ట్లికూడా ఉంది. దానికి రెండు చెక్క నాలుకలు. కొన్ని మొక్కలనుంచి తీసిన బంకతో చేసిన కర్రలతో ఆ నాలుకలను ప్రయోగిస్తారు. అజ్టెక్లు ఉపయోగించే చిరుగంటలుకూడా ఉన్నాయి. అవి ద్రాక్షగుత్తులలాగా వ్రేలాడదీసి ఉన్నాయి. పెద్ద అడవి పాములతోళ్ళతో చేసిన స్తంభాకారపు తప్పెట ఉన్నది. మెక్సికన్ దేవాలయంలోకి కార్టెస్తో కలిసివెళ్ళి చూచినప్పుడు బెర్నెల్ డయజ్ చూచింది ఇలాటి తప్పెటనే. దీని విషాద ధ్వానాన్నే కండ్లకుకట్టేలా వర్ణించి వదలిపోయాడు. ఈ వాయిద్యాల విచిత్రరీతులు డోరియన్ను ఎంతో ఆకర్షించాయి. ప్రకృతిలోలాగానే కళలోకూడా భీకరవస్తువులూ, భీకరాకారాలూ కంఠస్వరాలు గలవి ఉన్నవనే భావన అతనికెంతో రమణీయంగా కనుపించింది. అయినా, కొద్దికాలం తరువాత అతను వీటితో విసుకెత్తిపోయాడు. ఒపెరాకు వెళ్ళి ఒంటిగానో లేక లార్డ్ హెన్రీతోనో 'టన్హాసెర్' తన్మయంతో వింటూ కూచునేవాడు. ఆ మహత్తరకళాఖండంయొక్క నాందీలో తన ఆత్మయొక్క విషాదాంతమే ద్యోతకమయ్యేది.

ఒకమాటు అతనికివజ్ర వైఢూర్యాలపై మోజుపోయింది. వాటిని పరిశీలింపసాగాడు. వాటినిగురించి తెలుసుకోసాగాడు. ఒకమాటు ఒక కాస్ట్యూమ్ బాల్లో, ఫ్రాన్సు ఎడ్మిరల్ ఆనీడి

జాయిస్ వేషంవేసుకుని అయిదువందల అరవై ముత్యాలు పొదిగిన దుస్తులు ధరించి ప్రత్యక్షమైనాడు. కొన్ని సంవత్స రాల వరకు ఈ మోజు అతన్ని వైవశంచేసుకున్నది. తరువాత అతన్ని వదిలిందని చెప్పడానికవీల్లేదు. తను సేకరించిన రకరకాల రాళ్ళు వాటికేసులలో పెట్టి, మళ్ళీ తీసిచూచి, మళ్ళీ కేసు లలో ఉంచి– ఇలా రోజుకోజంతా గడిపేవాడు, అతను రక రకాల రాళ్ళు సంపాదించాడు. ఒకపచ్చ దీపపువెల్తురులో ఎర్రగా మారుతుంది. వెండితీగ సాగినట్టుంది మరోరాయి. పసుపుపచ్చనివి, ఆకుపచ్చనివి, ఎగ్రనివి, నాలుగు కోణాల నక్షత్రాలు, వజ్రాలు, వైఢూర్యాలు, కెంపులు ఎన్నెన్నో రక రకాలరాళ్ళున్నాయి.

ఈ రాళ్ళనుగురించి రకరకాలైన కథలుసైతం ఊహించ సాగాడు. ఆల్ఫొన్సొ 'క్లెరికలిస్‌డిసిప్లినా' లో ఒకసర్పం ఉద హరింపబడింది. ఆ సర్పంకండ్లు మిలమిలమెరిసే పసుపురాళ్ళు. అలెగ్జాండర్ చరిత్రలో ఎమాథియా విజేత జార్డన్ సర్పాల లోయలో సర్పాల వీపుల పచ్చలుమొలవడం చూచాడట. డ్రాగన్‌తలలో ఒకరత్నం ఉన్నదని బంగారు అక్షరాలను ఎరుపుగుడ్డను చూపడంవల్ల దాన్ని నిద్రపుచ్చి చంపవచ్చని ఫిలాస్ట్రిటస్ వ్రాశాడు. ప్రసిద్ధ స్వర్ణరసాయన శాస్త్రజ్ఞుడైన పియరిడి బొనిఫెస్‌ప్రకారం ఒక వజ్రంద్వారా మనిషి కను పించకుండా చెయ్యొచ్చు. ఇండియూ వజ్ర వైఢూర్యాలు అతనికి వాగ్ధార నిచ్చాయి. సిందూరపురాయి కోపాన్ని తగ్గి స్తుంది. నీలం నిద్ర పుచ్చుతుంది. ఉదామాణిక్యం వైపుదించు తుంది. ఎర్రరాయి పిశాచాలను పారద్రోలుతుంది. చంద్రశిల

వెన్నెలవన్నె తరిగిస్తుంది. చంద్రమణి కరిగి నీరవుతుంది. లియోనార్డస్ కామిలస్‌కు అప్పుడే చంపిన చేపతలలో ఒక తెల్లనిరాయి దొరికింది అది విషం పసిగడుతుంది, అరేబియన్ లేడి గుండెలో దొరికే రాయి ప్లేగ్ వ్యాధిని నయంచేస్తుంది. అరేబియన్ పక్షులగూళ్ళలో కొన్నిరకాల రాళ్ళుంటాయి. అవి ధరించినవారికి అగ్నిప్రమాదం ఉండదు.

సిలన్ రాజు చేతిలో ఒక పెద్దపెద్దమాణిక్యాన్ని ఉంచుకుని, పట్టాభిషేకపురోజున నగరవీధులలోనుంచి గుర్రంపై వెడలాడు. రాచనగరు వాకిళ్ళు ఫణులఫణాలపై గల మణి ఖచితాలైనవి. వాకిళ్ళముఖాలల రెండు బంగారుఫలాలూ ఎర్రని మణులూ ఉన్నాయి. ఫలాలు పగటిపూట, మణులు రాత్రిళ్లూ మిలమిలమెరుస్తాయి. 'మార్గరెట్ ఆఫ్ అమెరికా' లో ఒక రాణీగారిగదిలో లోకంలోని పతివ్రతలందరూ మణులఅద్దాలలో ప్రతిబింబాలు చూచుకుంటున్న మాదిరివర్ణనా లుండేవట. ఇలా రాళ్ళనుగురించి రత్నాలనుగురించి ఎన్నెన్నో కట్టు కథలు కల్పించాడు డోరియన్.

రాజులు రాళ్ళూ రత్నాలూ రాసులుపోసిన రోజులు. ఆరోజులు ఎంత అద్భుతంగా ఉండేవి! ఆ అలంకారాలు! ఆ అందచందాలు! ఆ దర్జాలు! మృతుల భోగభాగ్యాలను గురించి చదువుతున్నా ఒళ్లు పులకరిస్తుంది.

తరువాత అతనిమనస్సు కుట్టుపనులపైకి తెరలపైకి మర లింది. రకరకాల తెరలను గురించిన గ్రంథాలు చదవసాగాడు. అతను ఎప్పుడు ఏ విషయం తెలుసుకోడం ప్రారంభించినా అందులో పూర్తిగా లీనమైపోతాడు. కాలగర్భంలో ఎన్ని

అందమైనవి మనోహరమైనవి చెరిగిపోయాయి! ఈ విషయం తలుచుకునేసరికి అతన్ని విషాదం ఆవరించింది. అయినా, తను మాత్రం దాన్ని తప్పించుకోగలిగాడు. వేసవి వస్తూవుంది. వేసవిపోతూవుంది. ఎన్నో తడవలు పచ్చనిపూలు వికసించి వాడిపోయాయి భీకరంగా గడిచిన రాత్రులు వాటి మలిన గాథ మళ్ళీమళ్ళీ వినిపించాయి. కాని తనుమాత్రం మారలేదు. ఏ శీతాకాలమూ అతని వదనానికి వికారాపత తెచ్చిపెట్టలేక పోయింది. పూవులాంటి అతని శరీరశోభకు మాపులే లేక పోయింది. కాని భౌతికవస్తువులవిషయం వేరు. వాటిని కాలం తీసుకుని వెళ్ళింది, అవి ఎక్కడికి వెళ్ళాయి? దేవతలూ రాక్షసులూ యుద్ధంచేసిన తివాసీ ఇప్పు డెక్కడుంది? నీరో రోమ్ రాచనగరులో ప్రేలాడదీసిన పెద్దతెర ఎక్కడుంది? నక్షత్ర ఖచితమైన ఆకాశం పోదిగిన టిటాన్ తెరచాప ఏమైంది?

ఒక సంవత్సరంపాటు డోరియన్ రకరకాల తెరలను ఢిల్లీ మజిన్లనూ తెప్పించాడు. అవి బంగారు జరీఅల్లిన ఢక్కా వలిపాలు. 'నేసినగాలి' 'పారేసీరు' 'సాయంకాలపు మంచు' అని పిలిచేవారు ఆ మల్లులను. ఇవేకాక, చర్చిలలో ఉపయోగించే చిత్రచిత్రాలైన బట్టలను– తనకు ఎంతో ప్రియతమ మైనవి– సేకరించాడు. జీసస్‌కు ప్రధానమైన పెండ్లికూతురు ఉపయోగించే వలిపపుముసుగు– ఇలాటివెన్నో అతని బీరువాలలో ఉండేవి. ముచ్చటైన తనగృహంలో అతను సేకరించి ఉంచిన ఈ వస్తువులన్నీ– తను మరిచిపోవడానికి సాధనాలు. తనకు ఒకొక్కసారి తను భరించరానంతగా కనుపించే ఆ భయాన్ని తప్పించుకోడానికి మార్గాలు. తను బాల్యాన్నిగడిపిన

గది ఇప్పుడు మూసి ఉంచాడు. ఆ గదిలో తన స్వహస్తాలతో భయంకరమైన చిత్రపటాన్ని వేలాడదీశాడు. క్షణ క్షణం మారుతున్న బొమ్మతీరు అతని జీవిత పతనాన్ని అతనికి తెలుపుతూ ఉంది. ఆ బొమ్మకు ఎదురుగా తెరపించాడు. వారాలవరకు అక్కడికి వెళ్ళడు. దాన్ని మరిచిపోతాడు. అతనిహృదయం తేలికవుతుంది. మధురమైన అతని ఆనందం తిరిగివస్తుంది. బ్రతుకులో మునిగిపోతాడు. తరువాత హఠాత్తుగా ఏదో ఒకరాత్రి ఇంట్లోనుంచి మెల్లగా తప్పించుకుని బ్లూగేట్‌ఫీల్డ్సదగ్గర భయంకరమైన స్థలాలకు వెళ్ళేవాడు. అక్కడ తనను వెళ్ళగొట్టేవరకూ రోజుల తరబడి గడిపేవాడు. ఇంటికి తిరిగివచ్చి,తననూ బొమ్మనూ ఏవగించుకుంటూ బొమ్మ ముందు కూచునేవాడు. ఒక్కొక్కసారి అతనికి ఒకవిధమైన అహంభావంకూడా కలిగేది. దానికి కొంతకారణం పాపంలోని ఆకర్షణ. తనది కావలసిన బరువును మోయవలసి వచ్చిన ఆ ఛాయను తలుచుకుని రహస్యమైన ఆనందంతో చిరునవ్వు నవ్వుకునేవాడు.

కొన్ని సంవత్సరాల తరువాత ఇంగ్లండుకు దూరంగా ఉండడం అతనికి దుర్భర మనిపించింది. ట్రువిల్లిలో లార్డ్ హెన్రీతో కలిసి తను తీసుకున్న బంగళాను, అల్జియర్స్‌లో తను తీసుకున్న చిన్న తెల్లని గోడలఇంటిని వదిలాడు. అక్కడ చాలా పర్యాయాలు శీతాకాలం గడిపాడు. తన జీవితంలో ఒక భాగమైన దృశ్యానికి దూరంగా ఉండడం అతనికి రోతగా కనుపించింది. అదీగాక తను లేనిసమయంలో ఎవరైనా గదిలోకి వెడతారేమోననే భయంకూడా పట్టుకుంది.

అయినా, ఈ బొమ్మవల్ల తనరహస్యం ఎవరూ తెలుసుకోలేరని అతనికి తెలుసు. ఆ బొమ్మముఖం ఎంత వికారమైపోయినప్పటికీ ఇంకా తన పోలికలజాడలు లేకపోలేదు. అయినా దానివల్ల వాళ్ళు తెలుసుకోగలిగింది మాత్రం ఏముంది? తనను ఎవరైనా ఎత్తిపొడిస్తే తను నవ్వి ఊరుకుంటాడు. తను కాదు ఆ బొమ్మ రాసింది. ఇక ఆ బొమ్మ ఎంత క్రూరంగానూ మలినంగానూ కనుపిస్తేమాత్రం ఏమిటి? ఒకవేళ అతను చెప్పినా ఆ విషయం ఎవరూ నమ్మరు.

అయినా, అతనికి భయంమాత్రం ఉంది. ఒక్కొక్కసారి నాటింగ్‌హామ్ షైర్‌లో తన పెద్ద భవంతిలో తనతో సమాన స్థాయిగల నాగరిక యువకులతో కులాసా కాలక్షేపం చేస్తూ, తన జీవనపద్ధతిలోని అద్భుతవిలాసంతో వారిని అచ్చెరువు పరుస్తూ మధ్యలో అతిథులను వదలి హఠాత్తుగా నగరానికి వెళ్ళి, తలుపు సరిగా వేసిఉందో, బొమ్మ యథాస్థానంలో ఉందో లేదో చూచి వచ్చేవాడు. దాన్ని ఎవరైనా దొంగిలించుకునిపోతేమాత్రం ఏమిటి? కాని ఆ తలపురాగానే అతని నెత్తురు గడ్డకట్టుకునిపోయేది. అప్పుడు ఈ లోకానికంతా తన రహస్యం తెలిసిపోతుంది. ఇప్పటికే లోకం అనుమానిస్తూ ఉందేమో!

అతను చాలామందిని ఆకర్షిస్తూ వచ్చినా కొద్దిమంది మాత్రం అతన్ని అనుమానించేవారు. వెస్ట్ ఎండ్ క్లబ్‌లో అతన్ని ఇంచుమించుగా సంఘబాహ్యుణ్ణి చూచినట్లు చూచేవారు. జన్మవల్ల, సంఘంలో అంతస్తునుబట్టి అతని కా క్లబ్‌లో సభ్యుడయ్యే అర్హత పూర్తిగా ఉంది. చర్చిల్ చుట్ట కాల్చి

కునే గదిలోకి ఒక మాటు ఒక స్నేహితుడు అతన్ని తీసుకుని వస్తే డ్యూక్ ఆఫ్ బెర్విక్, మరి ఇతర పెద్దలూ పనిపెట్టుకుని లేచి వెళ్లారట. అతని ఇరవై అయిదవ సంవత్సరం దాటిన తరువాత అతన్నిగురించి విచిత్రమైన కథలు వ్యవహారంలోకి వచ్చాయి. వైట్ చాపెల్ కుఅవల ఎక్కడో దూరప్రదేశాలలో ఒక చీకటి కొంపలో అతను విదేశనావికులతో కలిసి జూద మాడుతుండగా చూచామనీ, అతనికి దొంగలతోనూ దొంగ నాణాలుచేసేవారితోనూ పొత్తుఉందనీ, వారి వ్యాపార రహ స్యాలు అతనికి తెలుసనీ చెప్పుకునేవారు. అతను తరుచుగా కనుపించకుండా పోవడం అందరికీ ఆశ్చర్యకరంగా ఉంది. అతను మళ్ళీ కనుపించగానే మూలల్లో నిల్చుని గుసగుసలాడుకునే వారు. లేదా వికసంగా చిరునవ్వు నవ్వుతూ అతన్ని చూడ కుండా తొలిగి వెళ్ళేవారు. లేకపోతే అతనిరహస్యం తెలుసు కోవడానికి కళ్ళతో చీల్చినట్లు అతనివైపు చూచేవారు. అయితే, ఇలాటి అపనిందలూ అవమానాలు అతను మాత్రం పట్టించుకునేవాడుకాదు. చాలామంది ఉద్దేశంలో, నిష్కపట మైన అతని తీరూ, పసివాని నవ్వులాంటి అతనినవ్వూ, అద్భు తమైన అతని యౌవనంలోని అనంతమైన లాలిత్యం — ఇవే అతన్నిగురించి చెప్పుకునే అపనిందలకు సమాధానాలు. అయినా, అతనితో ఎంతో పరిచయంగా ఉండేవారు. కొందరు అతన్ని తరువాత తరువాత అసహ్యించుకునేవారని అనేవారు. అతన్ని విపరీతంగా ఆరాధిస్తూ వచ్చి, అతనికోసం సంఘనిందనుకూడా భరించిన స్త్రీలు, డోరియన్ గ్రే గదిలో

అడుగుపెడితే సిగ్గుతోనూ భయంతోనూ కుంచించుకు పోయేవారు. అయినా, పొగలా అల్లుకున్న ఈ అపనిందలన్నీ అతని విచిత్రమైన ప్రమాదకరమైన ఆకర్షణనే హెచ్చు చేశాయి. ఒకవిధంగా అతని సంపత్తి అతన్ని కాపాడింది సంఘం- ముఖ్యంగా నాగరికసంఘం అందమూ ఐశ్వర్యమూ గలవారి విషయంలో చెప్పుడు మాటలు అంత తొందరగా నమ్మదు. నీతుల కంటె మర్యాదలకే ఎక్కువ స్థానమిస్తుంది. సంఘం దృష్టిలో అంతస్తు, ప్రతిష్ట- అవన్నీ ఒక ఎత్తు- ఒక మంచి వంటవాడు వుండడం—అదొకఎత్తు. నలుగురికీ తృప్తికరంగా విందు కుడపని వ్యక్తి, తన ఆంతరంగికజీవితంలో ఎంత మచ్చలేనివాడవుతేమటుకేమిటి? చల్లారిన అన్నం పెట్టినవాడు ఎంత సుగుణ సంపన్నుడైనా లాభం లేదని ఒక మాటు లార్డ్ హెన్రీ అన్నాడు. సంఘం నియమాలు కూడా కళానియమాలలాంటివే. శిల్పం ప్రధానమైన ప్రాతిపదిక. ఒక ఆరాధనలోని గాంభీర్యమూ, కల్పనా అందులో ఉండాలి. ఒక కల్పనాత్మక నాటకంలోని ఊహాకల్పననూ హాస్య సౌందర్యాలనూ కలిపి కన్నుల పండుగ చెయ్యాలి. ఆత్మశుద్ధిలేని కేవల ఊహ నిజంగా ఇంత భీకరమైనదా? కాదనుకుంటాను. మన వ్యక్తిత్వాలను హెంచ్చుకోడానికి అదొకసాధనం మాత్రమే.

ఏమైనా డోరియన్ ఉద్దేశం అదే. మానవునిలోని అహాన్ని ఒకసాధారణమైన, నిశ్చలమైన, ఒకేసారంగల వస్తువుగా ఊహించుకునేవారి అపరిణత మనస్తత్వానికి అతను అచ్చెరువు పొందేవాడు. అతని దృష్టిలో మనిషిలో

వేల బ్రతుకు లున్నాయి. వేల స్పందనలున్నాయి. అనేకవ్యక్తిత్వాలు కలిసిన ఒక క్లిష్ట స్వరూపం మనిషి. భావోద్వేగాల చిత్రమైనవారసత్వాలు అతనిలో ఉంటాయి. మనిషి సంసరంలో మృతుల మాలిన్యాలు ఎన్నో ప్రవహిస్తుంటాయి. తన గ్రామ భవనంలోని చిత్రశాలలో కాలక్షేపం చెయ్యడమంటే అతని కెంతో ఇష్టంగా ఉండేది. అక్కడ తనపూర్వీకులచిత్రాలుండేవి. వారి రక్తమే తన నరాల్లోనూ ప్రవహిస్తూ ఉంది. అది ఫిలిప్ హెర్బర్ట్ చిత్తరువు. 'క్వీన్ ఎలిజబెత్, కింగ్ జేమ్స్ పరిపాలననాటి జ్ఞాపకాలు' అనే పుస్తకంలో ఫ్రాన్సిస్ ఆస్బరన్ ఈయన్ను గురించి 'తన ముచ్చటైన ముఖంవల్ల దర్బారులో ఈయన్ను ఎంతో లాలించేవారు' అని వ్రాశాడు. కాని ఆ ముఖంలోని ముచ్చట ఎంతోకాలం ఉండలేదని వ్రాశాడు. తను అప్పుడప్పుడు గడిపింది యువకుడైన ఆ హెర్బర్ట్ జీవితమేనా? ఏదైనా విచిత్రమైన విషక్రిమి దేహంనుంచి దేహానికి ప్రాకి చివరకు తనకు సంక్రమించిందా? ఆ శిథిల సౌందర్యాన్ని గురించిన ఏదో అవ్యక్త భావనవల్లనేనా తను బేసిల్ హాల్‌వర్డ్ స్టూడియోలో తనజీవితం ఇంతగామార్చిన ఆ వెర్రికోరిక కోరుకున్నది? ఇది సర్ ఆంథనీ షెరార్డ్ చిత్తరువు. బంగారుజరీకుట్టిన ఎర్రనికోటు వేసుకున్నాడు. ఇతని వారసత్వం ఏమిటి? నేపిల్స్ జియోవన్నాను ప్రేమించిన ఈ ప్రేమికుడు తనకు ఏ పాపాన్ని పరాభవాన్ని ఆస్తిగా మూటకట్టి ఇచ్చివెళ్ళాడో. ఈ మాసిపోతున్న కాన్వాస్ పై చిరునవ్వు నవ్వుతూ కనుపిస్తున్నది లేడీ ఎలిజబెత్ డెవెరె. సన్నని వలిపపు ముసుగు వేసుకున్నది. కుడిచేతిలో ఒకపూవు ఎడమచేతిలో

రోజాలగుత్తి. ఆమె ప్రక్కనున్న టేబిల్ మీద సమారండలిన్ యాపిల్ పండ్లు ఉన్నాయి. ఆమె చిన్న బూట్లను ఆనుపచ్చని గులాబీలు ఉన్నాయి. తనకు ఆమె జీవితం తెలుసు. ఆమె ప్రేమికులనుగురించి విచిత్రమైన కథలు చెప్పుకునేవారు. ఆమె స్వభావంలో కొంత తనకూ ఉన్నదా? ఆ బరువైన కళ్లు తనవంక అదోలా చూస్తున్నాయి. జార్జ్ విల్లోబి పౌడరద్దిన తలతో మాసికలతో ఎంత రోతగా కనిపిస్తున్నాడు! లార్డ్ బెకెన్‌హామ్ ఎంత గర్వంగా, అందంగా నిలబడ్డున్నాడు! అతని ప్రక్కనే అతనిభార్య చిత్రపటం ఉంది. సన్నగా పాలిపోయి ఉంది. నల్లని దుస్తులు. ఆమె రక్తంకూడా తనలో కదులుతూనే ఉంది. తలుచుకుంటే హృదయం ఎంతవిచిత్రంగా ఉంది! ఇక తనతల్లి. లేడీ హామిల్టన్ ముఖం. తడిపెదవులు. ఆమె తనకిచ్చిన దేమిటో తనకు తెలుసు. తన అందం ఆమె దగ్గరనుంచే వచ్చింది. ఇతరుల అందంపట్ల ఆసక్తికూడా ఆమెదగ్గరనుంచే వచ్చింది. ఆమె అతన్ని చూచి నవ్వుతోంది. వదులుగాఉన్న డ్రెస్ వేసుకున్నది. ఆమె తలలో ద్రాక్షఆకులు అలంకరించుకున్నది. ఆమె పట్టుకున్న కప్పులో ఊదారంగు రసం ఉబుకుతున్నది. రంగులు మాసిపోయినాయి అయినా, ఆమెకండ్లు మాత్రం ఇంకా అద్భుతంగా అగాధంగా కనుపిస్తున్నాయి. తను ఎక్కడికి వెళ్ళినా తనవెంట వస్తున్నట్టుగా ఉన్నాయి.

సాహిత్యంలోనూ, జాతిలోనూ, మన స్వభావాలకు దగ్గరైన పూర్వీకులుంటారు. వారిప్రభావంకూడా మనమీద ఉంటుంది. ఒక్కోసారి డోరియన్‌కు ప్రపంచచరిత్ర కేవలం తన జీవిత ఇతివృత్తమే ననిపించేది. ఆ పరిస్థితులూ ఆ సంఘట

నలూ తన బ్రతుకులో వచ్చాయని కాదు. తన ఊహ వాటిని కల్పించింది. అవి తన మనస్సులోనూ తన ఉద్వేగాలలోనూ ఉంటూనే ఉన్నాయి. పాపానికి చెడుకూ అందంతెచ్చిపెట్టి లోక రంగస్థలంలో నటించి వెళ్ళిన ఆ భయంకర మూర్తులంతా తనకు పరిచితులే అనిపించేవారు. ఏదో ఒకవిధంగా వారి బ్రతుకులన్నీ తన బ్రతుకే అనిపించేవి. తను చదివిన ఈ నవల లోని నాయకునికి కూడా ఈ విచిత్రమైన అనుభూతి ఉన్నది. ఏడవ అధ్యాయంలో అతను పురాతన చక్రవర్తులతో ఎలా తాదాత్మ్యం పొందాడో వర్ణించబడింది. శిరస్సుకు విజయ మాలలు అలంకరించుకుని టైబీరియస్‌లాగా కాప్రీవనంలో కూచున్నాడు. ఎలిఫెంటిస్ పుస్తకాలు చదువుతూ కూచు న్నాడు. అతనిచుట్టూ మరుగుజ్జులూ, నెమళ్ళూ నాట్యం చేస్తున్నాయి. వేణువు ఊదుతున్నారు. 'కాలిగులా'గా గుర్రపు శాలలో జాకీలతో మజాచేస్తున్నాడు. గుర్రంతో కలిసి దంతపు గాడిలో భోజనం చేశాడు. డొమీషియన్‌గా పాలరాతి అద్దాలు పరిచిన వరండాలో, భయ చలితనేత్రాలతో తన ప్రాణాలన్నీ అంతంచేసే బాకు ప్రతిబింబం వెదుకుతూ నడిచి వెళ్ళాడు. భయంతో పాలిపోయాడు.

ఈ విచిత్రమైన అధ్యాయాన్ని డోరియన్ మళ్ళీ మళ్ళీ చదివాడు. తరువాత అధ్యాయాలను కూడా అలాగే చదివాడు. ఆ అధ్యాయాలలో పాపం, విసుగుదల— ఇవి వెర్రెక్కించిన వారిని గురించిన కథలు.

ఈ కథ లన్నిటిలోనూ ఒక భయంకరమైన ఆకర్షణ ఉంది. రాత్రులు వాటిని చూచేవాడు. పగలు అవి అతని

ఊహను కలచేవి. అనేక రకాల విషప్రయోగా లున్నాయి. తన భార్యను చంపిన మిలాన్ డ్యూక్ ఫిలిప్ తనభార్య పెదవులకు ఎర్రని లత్తుక రాశాడు. తను లాలించే శవాన్ని ముద్దాడి ఆమె ప్రియుడుకూడా చనిపోతాడు. పాల్ ది సెకండ్ అని పిలువబడే వెనీషియన్ పియట్రో బార్బి ఒక భయంకరమైన పాపానికి అమ్ముడుపోయాడు. జియన్ మేరియా విస్కాంటి బ్రతికిన మనుష్యులను వెంటాడడానికి వేటకుక్కలను ఉపయోగించేవాడు. హత్య కావించబడిన అతని శరీరాన్ని అతన్ని ప్రేమించిన ఒకవేశ్య గులాబీలతో కప్పింది. బోర్గియా పెరోటో రక్తంతో తడిసిన ముసాబుతో తెల్లని గుర్రమెక్కి వెళ్ళాడు. ఫ్లారెన్స్ కార్డినల్ ఆర్చ్‌బిషప్ పియట్రో రియరియో అందం - అతని వ్యభిచారం సరితూగేవి. ఈజిన్ దుఃఖం మృత్యువును కండ్లార చూచినప్పుడు మాత్రమే ఉపశమించేది.

ఈ కథలన్నిటిలోనూ ఒకభయంకరమైన ఆకర్షణ ఉంది. రాత్రులు వాటిని ఊహించేవాడు. పగలు కలవరపడేవాడు. అనేక రకాల విషప్రయోగా లున్నాయి. శిరస్త్రాణంతో విషం పెట్టవచ్చు. దీపంతో, గ్లోవ్‌తో, ముత్యాల వీవనతో విషం పెట్టవచ్చు. కాని డోరియన్‌కు ఒక పుస్తకం విషంపెట్టింది. ఒక్కొకసారి, పాపాన్ని తనదృష్టిలో సౌందర్యాన్ని తెసుకోడానికి ఒకమార్గమని భావించేవాడు.

# 12

నవంబర్ తొమ్మిదవతారీఖు. డోరియన్ 38 వ పుట్టిన రోజు.

పదకొండు గంటలు. లార్డ్ హెన్రీఇంటినుంచి ఇంటికి తిరిగి వస్తున్నాడు. రాత్రి బాగా చలివేస్తూంది. మంచుగా ఉంది. అంచాత ఉన్నికోటు వేసుకున్నాడు. గ్రాస్‌వెనర్ స్క్వేర్, సౌత్ ఆడ్లి స్ట్రీట్ కలిసేమూల ఎవరో వ్యక్తి పొగ మంచులోనుంచి త్వర త్వరగా నడిచివెళ్ళడం కనుపించింది. అతని కోటుకాలర్ పైకి మడిచి ఉంది. చేతిలో సంచీ ఉంది. డోరియన్ గుర్తించాడు.అతను బేసిల్ హాల్‌వర్డ్.అతన్ని చూడగానే ఎంచాతనో భయంవేసింది. అతన్ని గుర్తించనట్టుగా తన ఇంటివోవన త్వరత్వరగా నడచి వెళ్ళాడు.

కాని హాల్‌వర్డ్ మాత్రం అతన్ని గుర్తించాడు. పేవ్‌మెంట్‌మీద ఒకమాటు ఆగి తనను కలుసుకోడానికి త్వర త్వరగా వస్తున్నాడు. కొద్ది క్షణాల్లో అతనిచెయ్యి తన బుజంపైన వుంది.

'డోరియన్! వెదకబోయిన తీగ కాలికి తగిలినట్ట యింది. తొమ్మిది గంటలనుంచి నీ కోసం నీ లైబ్రరీలో కాచుకుని కూచున్నాను. నీ సేవకుడుకూడా నాతోపాటు కనిపెట్టుకుని కూచున్నాడు. చివరకు నేనే అతన్ని వెళ్ళిపడుకో మన్నాను. నేను ఇవాళ రాత్రి పారిస్ ప్రయాణం పెట్టు కున్నాను. వెళ్ళేలోగా నిన్ను తప్పకుండా చూడాలను

కున్నాను. నీ విలా వెడుతూఉంటే నీ ఉన్నికోటుచూచి నీవే ననుకున్నాను. లేదా ఉన్నికోటు నీదే ననుకున్నాను. కాని అవునా కాదా అని సందేహించాను. నీవు నన్ను గుర్తించ లేదా? '

'ఈ పొగమంచులోనా బేసిల్ ? నిన్నే కాదు. గ్రాస్ వెనర్ స్క్వేర్‌నుకూడా గుర్తించలేకుండా ఉన్నాను. నా ఇల్లు ఇక్కడే ఎక్కడో ఉంది. ఎక్కడుందో సరిగా చెప్పలేను. నీవు వెడుతున్నందుకు నాకు చాలా విచారంగా ఉంది. నిన్ను చూచి చాలారోజులైంది. మళ్ళీ త్వరలోనేవస్తావనుకుంటాను.'

'ఆరు నెలల వరకు మళ్ళీ రాను. పారిస్‌లో ఒక స్టూడియో తీసుకుని నాఊహాలో ఉన్న ఒకచిత్రం పూర్తిచేసే వరకూ అక్కడే ఉందా మనుకుంటున్నాను. అయినా, నేను మాట్లాడదలచుకున్నది నన్నుగురించి కాదు. అదుగో, మీ ఇంటి దగ్గరకు వచ్చేశాం. కాసేపు మీ ఇంట్లో కూచుందాం. నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి.'

'చాలా సంతోషం. కాని నీకు రైలు తప్పిపోదా? '
అన్నాడు డోరియన్ తాత్సారంగా మెట్లెక్కి తలుపుతీస్తూ.

పొగమంచులోనుంచి ప్రయత్నంమీద తొంగిచూస్తోంది ఇంట్లోదీపం. హాల్‌వర్డ్ గడియారం చూచుకున్నాడు. 'ఇంకా చాలా టైముంది. పన్నెండు పదిహేనుకుకాని బండి బయలుదేరదు. ఇప్పుడు పదకొండే అయింది. అసలు నేను నీకోసం క్లబ్‌కు వెడుతున్నాను. మధ్యలోనే నీవు కనుపించావు. లగేజి విషయంకూడా నా కంత కష్టంలేదు. బరువైన సామాన్లన్నీ ముందుగానే పంపించాను. నాతో ఉన్న

నల్లా ఈ ఒక్క సంచీ మాత్రమే. విక్టోరియాకు ఇరవై నిమిషాల్లో చేరుకోగలుగుతాను.'

డోరియన్ అతనివంక చూచి చిరునవ్వు నవ్వాడు. 'ఆధునికచిత్రకారులు ప్రయాణంచేసే తరహా ఇదేకాబోలు-చేతిసంచీ, ఓవర్ కోటూ. త్వరగా లోపలికి రా. లేకపోతే మంచుకూడా లోపలికి వస్తుంది. మరోమాట – గంభీరమైన విషయాలు మాత్రం మాట్లాడకు. ఈ రోజుల్లో ఏవిషయమూ గంభీరమైనది కాదు. ఏమైనా అలా కాగూడదు.'

హాల్ వర్డ్ లోపలికి అడుగుపెడుతూ సరేనన్నట్టు తల ఊపాడు. డోరియన్ తో లైబ్రరీలోకి వెళ్ళాడు. పెద్దమంట. పొయ్యిలో మంటవెలుగుతూఉంది. దీపాలువెలిగించిఉన్నాయి. డచ్ వెండి ఆ సవపాత్రలు, సోడానీళ్లు నింపిన పాత్రలు, చిన్న టేబిలుమీద ఉంచబడిఉన్నాయి.

'చూచావా. నీ సేవకుడు నాకు అన్నివిధాలా ఆతిథ్య మిచ్చాడు. నాకు కావలసిందల్లా ఇచ్చాడు. నీవు కాల్చే బంగారుటిప్ సిగరెట్లుకూడా ఇచ్చాడు. చాలా మంచివాడు సుమా. నీదగ్గర ఉంటూ వచ్చిన ఫ్రెంచి సేవకుని కంటె ఇతనే నయం. అడగ మరచాను – అతను ఎక్కడికి వెళ్ళాడు!'

డోరియన్ ఏమోఅన్నట్టు బుజాలూపాడు. అతను లేడీ రాడ్లే పనిగత్తెను పెళ్ళాడి ఇంగ్లీష్ డ్రెస్ మేకరుగా ఆమెతోకలిసి పారిస్ లో కాపరంపెట్టా డనుకుంటాను. ఇంగ్లీష్ పిల్లలను పెళ్ళాడడం ఇప్పు డక్కడ ఒక ఫాషనై పోయింది. ఈ విషయంలో ఫ్రెంచివాళ్ళ తరహా వెర్రిగా లేదూ ? కాని ఒక విషయం – అతను మాత్రం మంచిసేవ

కుడు కాకపోలేదు. నా కతనంటే ఇష్టం ఉండేది కాదు కాని, అతనిలో తప్పేమీ కనుపించేది కాదు. ఒక్కొక్కసారి మనం అర్థంలేని ఊహలు ఊహించుకుంటాం. అతను నాపట్ల నిజంగా ఎంతో భక్తి విశ్వాసాలతో మెలగుతూ ఉండేవాడు. అతను నన్ను విడిచి వెళ్ళిపోయేటప్పుడు కూడా ఎంతో చింతించాడు. మరో బ్రాందీ, సోడా తీసుకుంటావా ? లేక హైమ్, సోడా తీసుకుంటావా ? నేను ద్రాక్షరసం సోడా తీసుకుంటూ ఉంటాను. ప్రక్కగదిలో కొంచెం ఉండిఉంటుంది.

'ఇక అవసరంలేదు' అన్నాడు చిత్రకారుడు తనటోపీ కోటూ తీసి మూల ఉంచిన సంచీమీద విసిరేస్తూ. 'ఇప్పుడు నీతో ఒక తీవ్రమైన విషయం మాట్లాడా లనుకుంటున్నాను. నావంక మాత్రం అలా చూడకు. అలా చూస్తే అసలు మాట్లాడలేను' అన్నాడు.

'ఇదంతా దేన్నిగురించి : నన్ను గురించి మాత్రం కాదుకదా ! ఇవాళరాత్రి చాలా అలసిపోయి ఉన్నాను. నేను నేను కాకుండా ఉంటే ఎంతో బావుండు ననుకుంటున్నాను' అన్నాడు డోరియన్ తన సహజ ధోరణిలో సోఫాలో కూలబడుతూ.

'నిన్నుగురించే' అన్నాడు హాల్‌వర్డ్ తన గంభీర కంఠస్వరంతో. 'నీ కీ విషయం చెప్పకతప్పదు. ఒక అరగంట మాత్రమే నీతో ఈ విషయం మాట్లాడుతాను' అన్నాడు.

డోరియన్ నిశ్వసించి సిగరెట్ వెలిగించాడు. 'అర గంటే !' అన్నాడు.

'నీకు అనవసరంగా బాధకలిగిస్తున్నానేమో డోరియన్. నీకోసమే ఈ విషయం చెప్తున్నాను. లండన్లో నిన్ను గురించి చెప్పరాని విషయాలు చెప్తున్నారని నీవు తెలుసుకోడం మంచిదనుకున్నాను.'

'నే నా విషయాలు తెలుసుకోవాలని ఏమాత్రం కోరడంలేదు. ఇతరులను గురించిన అపవాదులు వినడం నా ఇష్టం కాని, నన్ను గురించిన అపనిందల్లో నాకు ఆసక్తి లేదు. వాటిలో నాకు కొత్త కనుపించదు.'

'వాటిని గురించి నీవు తెలుసుకోవాలి డోరియన్. ప్రతి పెద్దమనిషికి తన పేరుప్రతిష్ఠలపై ఆసక్తి ఉంటుంది. నిన్ను గురించి ఇతరులు అలా హీనంగా మాట్లాడడం నీకు ఇష్టం ఉండదనుకుంటాను. నీకు సంపత్తూ, ఐశ్వర్యం — అలాంటివన్నీ ఉన్నాయనుకో. కాని అంతమాత్రానే అన్నీ ఉన్నట్టు కాదు. నేను మాత్రం ఈ పుకార్లు నమ్మను. నమ్మినా నిన్ను చూచినప్పుడైనా నమ్మను. పాపం అనేది మనిషి ముఖం చూడగానే కనుపిస్తుంది. అది దాగదు. కొందరు రహస్యంగా ఉండే పాపాలంటూ కొన్ని ఉంటాయంటారు. కాని అలాటివేమీ లేవు. ఒక మనిషిదగ్గర ఒక పాపం ఉందంటే అది వెంటనే, అతని పెదవుల చివరల రేఖలలోనో, అతని వాలిన కనురెప్పలలోనో, చేతులలోనో కనుపించక కనుపిస్తుంది. ఒకరు — అతని పేరు చెప్పడం నా కిష్టం లేదు — కాని నీ కతను తెలుసు — అతను పోయిన సంవత్సరం తన బొమ్మ గీయించుకోడానికి నాదగ్గరకు వచ్చాడు. అతన్ని అంతకు ముందెప్పుడూ నేను చూడలేదు. వినలేదుకూడా. కాని తరు

వాత మాత్రం అతన్ని గురించి అనేక విషయాలు విన్నాను. అతను తన బొమ్మగీస్తే చాలా డబ్బిస్తాననాన్నాడు. కాని నేను నిరాకరించాను. అతనివ్రేళ్ళలో నాకు ఏదో అసహ్యంగా కనుపించింది. నేను అప్పుడు ఊహించింది నిజమేనని ఇప్పుడు తెలుసుకోగలిగాను. అతని జీవితం భయంకరమైంది. కాని నీవుమాత్రం - డోరియన్ - నీస్వచ్ఛమైన అందమైన అమాయక ముఖంతో - నీవు అలాటివాడివంటే నేను నమ్మలేను. నిన్ను తరుచుగా చూస్తూఉంటాను కాని, నీవుమాత్రం ఇప్పుడు నాస్టూడియోకి రావు. నిన్నుగురించి,నీ వెనకాల నాకు అనేకమంది అనేకవిషయాలు చెబుతూఉంటే నా కేమనాలో తోచదు. డ్యూక్ ఆఫ్ బెర్విన్‌లాంటివాడు నీవు క్లబ్ గది లోకి రాగానే లేచివెళ్ళాడు. ఎందుచేత డోరియన్? లార్డ్ స్టావెలెకు నీకూ మైత్రిఉండేది. ఒకమాటు డడ్లీ ప్రదర్శనానికి నీవిచ్చిన బొమ్మలవిషయం మాట్లాడుతూ ఉండగా నీప్రస్తావన వచ్చింది. నీ మాట వచ్చే సరికి స్టావెలె పెదవులు విరుచుకున్నాడు. నీవు చాలా కళాభిరుచులు గల వ్యక్తివి కావచ్చు కాని, స్వచ్ఛమైన మనస్సుగల ఏ కన్నె పిల్లనూ నీతో పరిచయం చెయ్యకూడదని, పవిత్రమైన ఏ స్త్రీ నీ ప్రక్కన కూచోరాదనీ అన్నాడు.అత నిలా అన్నప్పుడు నేను నీకు స్నేహితుణ్ణన్న విషయం అతనికి జ్ఞాపకం చేశాను. అతని ఉద్దేశ మేమిటని అడిగాను. అత నప్పుడు చెప్పాడు. అందరి ముందు నిర్మొహమాటంగా చెప్పేశాడు. ఎంత ఘోరం! యువకులకు నీస్నేహం ఇంత ప్రమాదకరం ఎందుకు కావాలి? గార్డ్స్‌లో ఆ కుర్రాడు ఆత్మహత్య చేసుకున్నాడు. అతనికి

నీవు ఆ ప్తమిత్రుడివి, సర్ హెన్రీ ఆష్టన్ చెడుపేరుతో ఇంగ్లండ్ వదిలిపెట్టవలసివచ్చింది. అతనూ నీవూ ఒక్కక్షణం కూడా విడిచిఉండేవారు కాదు. అడ్రియన్ సింగిల్టన్-అతని భీకరమైనమృతి - ఆ విషయమేమిటి? లార్డ్ కెంట్ ఏక పుత్రుడు - అతని విషయం? నిన్న జేమ్సుస్ట్రీట్‌లో అతనితండ్రి కనుపించాడు. అవమానంతోనూ దుఃఖంతోనూ కుంగిపోయి నట్టు కనుపించాడు. డ్యూక్ ఆఫ్ పెర్త్ - అతని విషయ మేమిటి? ఇప్పు డతను ఎలాటి జీవితం గడుపుతున్నాడో తెలుసా? పెద్దమనిషి ఎవడూ అతనితో తలెత్తిమాట్లాడడు.'

'ఇక ఆపు బేసిల్. నీకు ఏమాత్రం తెలీని విషయాలు నీవు అనవసరంగా మాట్లాడుతున్నావు' అన్నాడు డోరియన్ పెదవి కొరుక్కుంటూ. నేను గదిలో అడుగుపెట్టగానే బెర్విన్ ఎందుకు లేచి వెళ్ళా డంటావా? అతనిజీవితం ఎలాటిదో నాకు తెలుసుకాబట్టి లేచి వెళ్లాడు. నాజీవితం ఎలాటిదో అత నికి తెలిసి కాదు. తన రక్తనాళాలలో అలాటి మలినరక్తం ప్రవహిస్తూంటే అతనిచరిత్ర అమలినమైన దెలా అవుతుంది? హెన్రీ యాష్టన్‌ను గురించి పెర్త్‌ను గురించి నన్నడుగు, నేను చెబుతాను. యాష్టన్‌కు చెడుఅలావాట్లు, పెర్త్‌కు వ్యభిచారం నేను నేర్పా నంటావా? కెంట్ కొడుకు బజారు పిల్లను పెళ్ళాడితే దానికిబాధ్యత నాదా? అడ్రియన్ సింగిల్ టన్ బిల్‌మీద స్నేహితునిపేరు వ్రాస్తే నేనా కారణం? ఇంగ్లండ్‌లో జనం ఎలా మాట్లాడుకుంటారో నాకు తెలుసు. మధ్య తరగతులు డిన్నర్ టేబిళ్ళదగ్గర తమగొప్పలు చెప్పు కుని, తమకంటె పై వారిలోపాలను చెప్పుకుని తమకు ఎలాటి

లోపాలుగా లేవని సంతృప్తి చెందుతారు. తాము నిందించే వారితోనే తమకు ఎంతో సఖ్యం ఉన్నట్టు నటిస్తారు. ఈదేశంలో మనిషికి కాస్త బుద్ధి, ప్రత్యేకత ఉంటే చాలు – అందరూ అతన్ని గురించే గుసగుసలాడుతారు. ఈ నీతిపరులమనే వారంతా ఎలాంటి జీవితాలు గడుపుతారో తెలుసా ? అబ్బాయ్! నువ్వు బ్రతుకుతున్నది వంచకుల జన్మభూమి.'

'డోరియన్, ఇదిగో నా ప్రశ్న. ఇంగ్లండ్ చెడుదేశమే కావచ్చు. ఇంగ్లీష్ సమాజమంతా చెడ్డదే కావచ్చు. అందుచాతనే నీవు సక్రమంగా ఉండాలంటాను. తమ స్నేహితులపట్ల తమ ప్రభావం ఎలా ఉంటుందో – దాన్నిబట్టి మనం ఒక మనిషిని నిర్ణయించవచ్చు. గౌరవం, మంచితనం, నిర్మలత్వం – వీటిని గురించిన గౌరవం నీకు పూర్తిగా నశిస్తున్నట్టుంది. సౌఖ్యోన్మాదంతో వీటిని అవతలికి తోసేశావు అవి లోతులకు పోయాయి. నీవే వాటిని లోతులకుతోసి నవ్వుతూ చూచున్నావు. ఇప్పుడు నీవు నవ్వుతున్నట్టుగానే నవ్వవచ్చు. కాని ఇంతకంటె ఘోరం ఉంది. నీవూ, హెన్రీ విడరాని మిత్రులని నాకు తెలుసు. అందుకైనా అతని చెల్లెలిపేరు కళంకితం చెయ్యకుండా ఉండవలసింది'

'బేసిల్, జాగ్రత్త. చాలాదూరం పోతున్నావు'

'నేను చెప్పితీరాలి. నీవు విని తీరాలి. నీవు వింటావు కూడా. నీవు మొదట లేడీగ్వెన్ డొలెన్‌ను కలుసుకున్నప్పుడు ఆమెను గురించి ఎవరైనా పల్లెత్తుమాట అనేవారా? ఇప్పుడు ఆమెతో కలిసి పార్కుకు వెళ్ళడానికి సాహసించే సభ్య స్త్రీ లండన్‌లో ఒక్కతయినా ఉందంటావా? ఆమె పిల్లలనుకూడా

ఆమెదగ్గర లేకుండా చేశారు. ఇంకా ఎన్నోకథలు - కొన్ని గృహాలనుంచి నీవు ఉదయాన్నే బైటికిరావడం చూచామని, మారువేషాలతో లండన్‌లోని వెళ్ళరానిడెన్‌లలోపడి ఉన్నావనీ. ఇవన్నీ నిజమేనా? నేను మొదట్లో అవి విన్నప్పుడు నవ్వుకున్నాను. ఇప్పుడు అవి వింటూంటే నాకు కంపం కలుగుతూ ఉంది. నీ గ్రామభవనంలో నీవు గడిపిన జీవితంసంగతేమిటి? డోరియన్ నిన్నుగురించి ఏమనుకుంటున్నారో నీకు తెలీదు. నేను బోధించాలనికాదు. హెన్రీ ఒకమాటు ఒక మాట అన్నాడు. ఒకరికి బోధచెయ్యబోయేవాడు ప్రతివాదూ, తరువాత తనమాట తానే నిలుపుకోడట. నీకుబోధించడం నాకిష్టం లేదు. లోకం నిన్ను గౌరవించేలా బ్రతకమంటున్నాను.అంతే. పేరుకు మచ్చ తెచ్చుకోవద్దంటున్నాను. నీవుకలిసితిరిగే ఆపాడు స్నేహాలు వదులుకోమంటున్నాను. ఏమిటిలా చెబుతున్నావని అలా అలక్ష్యంచెయ్యకు. నీ దగ్గర గొప్ప ప్రభావం ఉన్నది. ఆ ప్రభావాన్ని దుర్వినియోగంచెయ్యకు. మంచి కోసం వినియోగించు. చెడుకోసం వినియోగించకు. నీతో స్నేహంచేసినవారినల్లా నీవు చెడగొడతావని అంటారు. నీవు ఏ ఇంట్లోనైనా అడుగుపెడితే చాలు. నీ వెంటనే ఏదో ఒక పరాభవం తరుముకువస్తుందంటారు. ఇదిఎంతమాత్రంనిజమో నాకు తెలీదు. నా కెలా తెలుస్తుంది ? కాని అందరూ నిన్ను గురించి ఇదేమాట అంటారు. సందేహానికి తావివ్వని విషయాలు ఎన్నోవిన్నాను. ఆక్స్‌ఫర్డ్‌లో నా గొప్పస్నేహితులలో లార్డ్ గ్లౌసెస్టర్ ఒకడు. తనభార్య మెన్‌టోన్‌లో, తన బంగాళాలో ఒంటిగా చనిపోతూ తనకు వ్రాసిన ఉత్తరం

నాకు చూపాడు. అందులో నీ పేరుంది. వట్టిపేరుకాదు, పేరు తోపాటు ఒకభయంకరమైన నివేదనకూడా ఉంది. అది కేవలం అబద్ధమన్నాను. నిన్ను నేను బాగా ఎరుగుదు నన్నాను. అలాంటి పనులు నీ వెన్నటికీ చెయ్యలే వన్నాను. నిన్ను నేను ఎరుగుదునా? నిజంగా ఎరుగుదునా? ఆ ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే ముందు నీ ఆత్మను నేను చూడవలసి ఉంటుంది.'

'నాఆత్మను చూడడమా!' గొణుక్కున్నాడు డోరియన్, సోఫాలో కూచున్నవాడు ఉలికిపడి భయంతో అతని ముఖం తెల్లనైంది.

'అవును' అన్నాడు హాల్‌వర్డ్ గంభీరంగా. అతని కంఠంలో దుఃఖం కనుపించింది. 'నీ ఆత్మను చూడాలి. కాని ఒక్క భగవంతుడే ఆపని చెయ్యగలడు' అన్నాడు.

యువకుని పెదవులనుంచి ఒక వికృత మందహాసం వెలికి వచ్చింది. 'ఇవాళ రాత్రి నీవే చూదువుగాని' అన్నాడు. టేబిల్ మీద దీపం తీసుకుని 'రా. చూడు. అది నీవు గీసిందే. నీ వెందుకు చూడగూడదు? తరువాత నీవు ప్రపంచాని కంతా ఆవిషయం చెప్పవచ్చు. అప్పుడు నిన్నెవరూ నమ్మరు. ఒకవేళ నమ్మడం జరిగితే నన్ను పూర్వంకంటె ఎక్కువగా ప్రేమిస్తారు. నాకు ఈయుగలక్షణం నీకంటె బాగా తెలుసు. నీవు అస్తమానం దాన్నిగురించి మాట్లాడుతావు కాని నీకు తెలీదు. రా. పతనాన్ని గురించి చాలాసేపు ఉపన్యసించావు. ఇప్పుడు నీవు దాన్ని కళ్ళారా చూదువుగాని' – అన్నాడు.

అతను మాట్లాడిన ప్రతిమాటలోనూ ఒక వెర్రిగర్వం తొణుకుతూ ఉంది. తన సహజమైన క్రూరతనపు అహంకారంతో నేలను కాలితో తాడించాడు. ఇతరు లొకరు తన రహస్యంలో పాలుపంచుకోడం చూచి తనకు భయంకరమైన ఆనందం కలిగింది. తన అమూలకారణమైన బొమ్మగీసిన చిత్రకారుడు తనబ్రతుకంతా ఆ భీకరస్మృతితో కుంగిపోతాడని తనకు ఆనందం కలిగింది.

'సరే. నా ఆత్మను చూపిస్తాను రా. భగవంతుడికి మాత్రమే కనుపిస్తుందన్నావే - దాన్ని నీవే చూదువుగానిరా' అన్నాడు డోరియన్ అతనిదగ్గరకివచ్చి అతని కండ్లలో కండ్లుంచి చూస్తూ.

హాల్‌వర్డ్ ఉలికిపడ్డాడు. 'ఇది ఈశ్వరనింద డోరియన్' అన్నాడు. 'నీవు అలాటిమాటలు మాట్లాడకూడదు. అవి భయంకరమైన మాటలు. వాటికి అర్థంలేదు' అన్నాడు.

'అలాగా?' మళ్ళీ నవ్వాడు డోరియన్.

'అవును. ఇవాళ రాత్రి నీకు చెప్పిన విషయాలు నీమంచికే చెప్పాను. నీకు ఎప్పుడూ నేను స్నేహితుణ్ణేనని నీకు తెలుసు.'

'నన్ను తాకకు. చెప్పదలచుకున్నది చెప్పు.' ఒక బాధారేఖ చిత్రకారునిముఖంలో దూసుకుని పోయింది. ఒకక్షణం ఆగాడు. ఒక తీవ్రమైన జాలి అతన్ని ఆవహించింది. అయినా, అనవసరంగా డోరియన్‌జీవితంలో తొంగిచూడవలసిన అవసరం తన కేమిటి? తననుగురించిన పుకార్లలో ఏమాత్రం నిజమైనా అతనెంతో బాధపడి ఉంటాడు. తరువాత అతను ఒళ్లు

విరుచుకుని మంటదగ్గరకు వెళ్ళి నిల్చుని కాలుతున్న కట్టెల వంక మంచులాంటి బూడివంక వణుకుతున్న జ్వాలలవంక చూడసాగాడు.

'నీకోసమే నిల్చున్నాను బేసిల్' అన్నాడు యువకుడు.

అతను తిరిగి చూచాడు. 'దీనికి నే నేం చెప్పను?' అన్నాడు. 'నిన్ను గురించిన ఈ నిందలకు నీవేదో సమాధానం చెప్పితీరాలి. ఇవన్నీ పూర్తిగా అబద్ధమంటే నేను నమ్ముతాను. అవన్నీ అబద్ధమను డోరియన్. అను. నే నెంత బాధ పడుతున్నానో చూడు. నీవు చెడిపోతావని, పతనమైపోతావని నాకు చెప్పకు' అన్నాడు.

డోరియన్ చిరునవ్వు నవ్వాడు. అతని పెదవులపై ఒక అసహ్యరేఖ నిలిచింది. 'మేడపైకి రా బేసిల్' అన్నాడు నెమ్మదిగా. 'నా జీవితంలో ప్రతిరోజు నా దినచర్య వ్రాసుకున్న డైరీ ఉంది. నీవు నాతో నస్తే దాన్ని చూపుతాను.'

'నీవు కోరితే వస్తాను డోరియన్. నా బండి వెళ్ళిపోయింది. కాని పరవాలేదు. రేపు వెడతాను. కాని ఇవాళ రాత్రి నన్నేమీ చదవమని అడగకు. నాకు కావలసిందల్లా నా ప్రశ్నకు సూటిగా సమాధానం. అంతే.'

'ఆ సమాధానం మేడమీద ఇస్తాను. ఇక్కడ చెప్ప లేను. నీవు చాలాసేపు చదవక్కరలేదు.'

మెల్లెక్కుతున్నారు. ముందుడోరియన్, వెనుక హాల్ వర్డ్. హాల్‌వర్డ్ డోరియన్‌ను అనుకుని మెల్లెక్కుతున్నాడు. రాత్రిపూట సహజంగా మనుష్యులు నడిచేవిధంగా మెల్లగా అడుగులు వేస్తూ మెల్లెక్కుతున్నారు. దీపం. గోడమీద మెట్లమీద చిత్రవిచిత్రమైన నీడలు పరుస్తూఉంది. ఒక గాలి తెర తాకి కిటికీలతలుపులు కొట్టుకొంటున్నాయి.

పైకి చేరగానే డోరియన్ దీపం క్రిందఉంచి తాళపు చెవి తీసి తలుపు తెరిచాడు. 'నీవు తెలుసుకోక తప్పదా బేసిల్?' అని అడిగాడు మెల్లగా.

'అవును.'

'సరే. సంతోషం' అన్నాడు డోరియన్ చిరునవ్వు నవ్వుతూ. తరువాత, 'నన్నుగురించి ఏవిషయమైనా తెలుసుకోడానికి లోకంలో నీ వొక్కడవే అర్హుడివి. నీవు అనుకున్నదానికంటె నాజీవితానికి నీకూ ఎక్కువసంబంధం ఉన్నది' అన్నాడు.

తరువాత దీపంతీసుకుని తలుపు తెరుచుకుని లోపలికి దారితీశాడు. ఒక చల్లని గాలి వారిని తాకింది. ఒకక్షణం పాటు దీపం గప్పుమన్నది. అతను వణికాడు. 'తలుపు మూసెయ్' అన్నాడు దీపం టేబిలుమీద ఉంచుతూ. హాల్‌వర్డ్ కలవరంతో నలువైపులా కలయచూచాడు. కొన్నిసంవత్సరాలనుంచి ఎవరూ నివసించని గదిలాగ ఉంది ఆగది. మాసిపోయిన ఒక ఫ్లెమిష్ తెర, తెర కట్టిన ఒకచిత్రం; ఒక ఖాళీ

పుస్తకాల కేసు. ఒక కుర్చీ, ఒక టేబిల్ — అంతే ఆగదిలోని వస్తువులు. డోరియన్ షెల్ఫ్‌మీదున్న కొవ్వొత్తి వెలిగించాడు. ఆ వెలుగులో గదిఅంతా దుమ్ము కొట్టుకుని కనిపించింది. తివాసీకి చిల్లులుపడివున్నాయి. ఒక ఎలుకపిల్ల కిచకిచలాడుతూ పరుగెత్తుతూ వెళ్ళింది. ముంచువాసన మందంగా వేస్తోంది.

'అయితే భగవంతుడికళ్ళకుమాత్రమే ఆత్మ కనుపిస్తుందంటావ్. అవునా బేసిల్? కాని ఆ తెర తొలిగించి చూడు. నా ఆత్మ నీకు కనిపిస్తుంది.'

ఈ మాటలు మాట్లాడిన కంఠస్వరం క్రూరంగావుంది. 'నీకు వెర్రా? లేక నటిస్తున్నావా డోరియన్?' అని అడిగాడు హాల్‌వర్డ్.

'నీవు తొలిగించవా? అయితే నేనే ఆపని చేస్తాను' అన్నాడు డోరియన్. తరువాత తెర తొలిగించి నేలమీద పడేశాడు.

చిత్రకారుని పెదవులనుంచి ఒక సన్నని కేక వెలువడింది. ఆ మసకవెల్తురులో ఆ భీభత్సవదనం తనను చూచి నవ్వుతోంది. ఆముఖాన్ని చూస్తే చెప్పరాని అసహ్యం కలుగుతోంది. తను చూస్తున్నది డోరియన్ ముఖాన్నేనా? ఆ భీభత్సం - అది ఎలాంటిదయినా ఆ ముఖంలోని అందాన్ని పాడుచెయ్యలేకపోయింది. పల్చబడిపోతున్న జుట్టులో ఇంకా కొంత బంగారుమెరుపు ఉంది. పెదవులపై ఇంకా కొంత ఎరుపు ఉంది. బరువుగా దించుకునిపోయిన కండ్లలో ఇంకా నీలాల జాలి విడిచిపోలేదు. తీర్చినట్టున్న ముక్కు ప్రక్కన

ఉన్న ఉదార రేఖలు ఇంకా చెరిగిపోలేదు మెడక్రింది ముడతలు అలానే ఉన్నాయి. అవును, ఇది డోరియన్ చిత్రమే. ఈచిత్రం గీసిన దెవరు ? తనకుంచె మెలకువలు అతనికి జ్ఞాపకం వచ్చాయి. ఫ్రేమ్‌కూడా తను కట్టిందే. భావం మాత్రం మారింది. భయంకరంగా ఉంది. కాని తనకుమాత్రం భయం కలగడం లేదు. దీపమెత్తి బొమ్మవంక చూచాడు. ఎడమప్రక్క మూలన తనపేరే ఉన్నది.

ఇది ఏదో చాలా చిత్రమైన భీకరవ్యంగ్యంలాగా ఉంది. ఈబొమ్మ తను వ్రాసింది కాదు. అయినా, ఈబొమ్మ తను వ్రాసిందే. అతని కా విషయం తెలుసు. ఒకక్షణంలో వెచ్చని తననెత్తురు మంచుగడ్డగా మారిపోయింది. తనువ్రాసిన బొమ్మే మారింది. ఎందుకు మారింది. డోరియన్‌వంక చూచాడు. అతనికళ్ళలో సీడలు నిండాయి. పెదవులు కుంచించుకున్నాయి. నాలుక ఎండిపోయింది. మాటలు రావడంలేదు. నుదురు తుడుచుకున్నాడు. చెమటలు వరదలు కడుతున్నాయి.

డోరియన్ బట్టలబీరువాకు ఆనుకుని నిల్చుని, ఒక పెద్దనటుడు నటిస్తున్నప్పుడు ప్రేక్షకులు నాటకంలో ఎలా నిమగ్నులవుతారో అలాంటిముఖంతో అతనివంక చూస్తున్నాడు. అందులో దుఃఖమూ లేదు. సుఖమూ లేదు. ఒక ప్రేక్షకుని ఉద్వేగం మాత్రమే అందులో కనుపిస్తుంది కళ్ళలో కొంచెం తళుకు కనుపిస్తుంది. కోటులో ఉన్న పూవుతీసి వాసనచూస్తూ నిల్చున్నాడు.

అలా బొమ్మనంక చాలాసేపు చూచిన తరువాత, 'ఏమిటది?' అన్నాడు హాల్‌వర్డ్. అతని కంఠస్వరం అతనికే చిత్రంగా వినిపించింది.

'సంవత్సరాలక్రితం నేను కుర్రవాణ్ణిగా ఉన్నరోజుల్లో'- అంటూ మొదలుపెట్టాడు డోరియన్ తన చేతిలోని పూవును నలిపివేస్తూ. 'సంవత్సరాలక్రితం నేను కుర్రవాణ్ణిగా ఉన్నప్పుడు నీవు నన్ను కలుసుకున్నావు. నీకూ నాకూ పరిచయం కలిగింది. నీవు నన్ను పొగిడావు. నా అందానికి నేను గర్వపడేట్టుచేశావు. ఒకరోజున నీ స్నేహితునికి నన్ను పరిచయం చేశావు. యౌవనంలోని అద్భుతాన్ని అతను నాకు విప్పిచెప్పాడు. నీవు నా బొమ్మ వ్రాయడం ముగించావు. ఆ బొమ్మ నాకు అందంలోని అపూర్వతను ఎరుకపరిచింది. అప్పుడు ఒక క్షణంలో - అది ఒక వెర్రిక్షణం - ఇప్పుడుకూడా అందుకు విచారిస్తున్నానో సంతోషిస్తున్నానో చెప్పలేను - ఆ క్షణంలో ఒక కోరిక వెలిబుచ్చాను. ఆ కోరికను నీ వేమైనా అనవచ్చు...'

'అవును నాకు జ్ఞాపకమే. ఎంతచక్కగా జ్ఞాపకముందనుకున్నావు? కాని ఎలా సాధ్యం? సాధ్యంకాదు! గది తేమగా ఉంది. పల్చని మంచు కాన్వాస్‌లోకి ప్రవేశించి ఉంటుంది. నేను ఉపయోగిస్తూ వచ్చిన రంగులలో ఏదో లోహసంబంధమైన విషం ఉంటూఉండేది. ఇది సాధ్యమని నాకు నమ్మకం లేదు'

'ఏది అసాధ్యం?' లోగొంతుకలో గొణుక్కున్నాడు కుర్రవాడు. కిటికీదగ్గరకు వెళ్ళి మంచుపొరతో తడిసిన కిటికీ అద్దంపై నుదురు ఆనించాడు

దీన్ని నీవు ధ్వంసం చేశావని చెప్పావు'

'అదే నన్ను ధ్వంసం చేసింది'.

'ఇది నేను వ్రాసిన బొమ్మ కాదనుకుంటాను'

'నీ ఆదర్శం ఇందులో నీకు కనుపించడం లేదూ?' అన్నాడు డోరియన్ విరసంగా.

'నా ఆదర్శమా ?'

'అవును'

'ఇందులో చెడేమీ లేదు. సిగ్గుపడవలసిందికూడా ఏమీ లేదు. నేను ఇకముందు ఎన్నడూ కలుసుకోని ఆదర్శానివి నీవు. ఇది నీ ముఖం కాదు.'

'ఇది నా ఆత్మయొక్క ముఖం'

'అయ్యో! జీసస్! నేను పూజించిన వస్తువు ఎలాంటిది. దీనికళ్ళు దెయ్యపుకళ్ళు'

'మనలో ప్రతి ఒక్కరిలోనూ స్వర్గనరకాలున్నాయి' అన్నాడు డోరియన్.

హాల్‌వర్డ్ మళ్ళీ బొమ్మవంకతిరిగి దానివైపు తదేకంగా చూచాడు. 'అయ్యో! భగవంతుడా! ఇదే నిజమవుతే ఇక చెప్పవలసింది ఏముంది? నీ జీవితానికి నీవు చేసుకున్న ఉపకారం ఇదేనన్నమాట. నిన్నుగురించి నిందలు మాట్లాడేవారి కంటె కూడా నిజంగా నీ వెంతో పతితుడవై ఉండితీరాలి.' ఇలా అని దీపమెత్తి కాన్వాస్‌ను పరిశీలించి చూచాడు. కాన్వాస్ పైభాగంలో ఏమీ మార్పు కనుపించడం లేదు. తను తొలిగా బొమ్మ వ్రాసినప్పుడు ఎలా ఉన్నదో ఇప్పుడు కూడా అలాగే చెక్కుచెదరకుండా ఉన్నది. పైనుంచి కాదు

ఈ మాలిన్యమంతా పుట్టుకొచ్చింది. లోపలినుంచే ఈ మాలిన్యం పుట్టుకొచ్చింది ఆ బొమ్మలో లోపల ఏదో అంతర జీవితం త్వరితగతిలో నూర్పు చెందుతూ ఉంది. ఆ జీవితం తాలూకు కుష్ఠువ్యాధి ఆ బొమ్మను క్రమక్రమంగా కొరికివేస్తూ ఉంది. నీటిలో నాని నాని చివికిపోతున్న శవంకూడా ఇంత భయంకరంగా ఉండదు. అతని చేయి వణికింది. కొవ్వొత్తి క్రింద నేలమీద పడిపోయింది అక్కడ కొట్టుకుంటూ ఉంది. కాలితో ఆ దీపాన్ని ఆర్పివేశాడు. తరువాత ఊగిసలాడే కుర్చీలో కూచుని ముఖం చేతుల్లో దాచుకున్నాడు.

'అయ్యో! డోరియన్! ఎంతటి గుణపాఠం!' అతనన్న ఈమాటకు జవాబు లేదు. కిటికీ దగ్గర నిల్చుని కుర్రవాడు వెక్కి వెక్కి ఏడవడం మాత్రం మెల్లగా వినిపిస్తూ ఉంది. 'చెప్పు డోరియన్! మనకు చిన్నతనంలో నేర్పిన పాఠమేమిటి? ఆకర్షణలకు దుర్మార్గానికి దూరంగా ఉండమని కదూ? మన పాపాలు కడుగుకోవాలని కదూ? మనిద్దరం కలిసి ఇప్పుడే ప్రార్థన చేదాం డోరియన్. నీగర్వం తాలూకు ప్రార్థనకు జవాబు వచ్చింది. నీ పశ్చాత్తాపం తాలూకు ప్రార్థనకు కూడా జవాబు రాకపోదు. నిన్ను అధికంగా పూజించాను. అందుకే శిక్ష స్వీకరించాను. నీవూ నిన్ను అధికంగా పూజించుకున్నావు. మనం ఇరువురం శిక్షితులమైనాము.'

డోరియన్ ఎంతో మెల్లగా తలతిప్పి చూచాడు. కళ్ళలో కన్నీళ్లు నిండి జలజలలాడుతున్నాయి. 'చేతులు జారిపోయింది బేసిల్,' అన్నాడు.

'మించి పోయిందేమీ లేదు డోరియన్ మనిద్దరం మోకాళ్ళని ఒకమాటు ఒక ప్రార్థన జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నిద్దాం. ఎక్కడో ఎవరో వ్రాసిన ఒక పద్యంలేదూ! 'నీపాపాలు ఎంతరక్తారుణాలైనా వాటిని హిమంలాగా తెలుపు చేస్తాను' – అని.

'ఇప్పుడు ఆ మాటలు నాకు అర్థరహితంగా కనుపిస్తున్నాయి.'

'అలా అనకు. నీవు నీ బ్రతుకులో చాలినంత పాపం చేశావు. చూడు – ఆ శ పచిత్రం మనల్ని చూచి ఎలా నవ్వుతూందో' డోరియన్ బొమ్మవంక చూచాడు. హఠాత్తుగా ఒక అణచరాని అసహ్యం బేసిల్ హాల్‌వర్డ్‌పట్ల అతనిలో మేలుకుంది. ఆ అసహ్యాన్ని ఆ బొమ్మే అతనిలో ప్రవేశపెంచినట్లుగా ఉంది. పరిహాసం చేస్తున్న ఆ పెదవులు అతని చెవిలో ఏదో ఊదినట్లుగా ఉన్నాయి. వేటాడబడిన జంతువులో మేలుకునే వెర్రి ఉద్రేకాలు అతనిలో విజృంభించాయి. టేబిల్ దగ్గర కూచున్న ఆ వ్యక్తిని చూచినప్పుడు అతనికి చెప్పరాని రోత కలిగింది. అలా అతను అతని జీవితంలో ఎన్నడూ దేన్నీ అసహ్యించుకోలేదు. ఒకమాటు వికృతంగా నలువైపులా కలయ చూచాడు. రంగువేసిన టేబిలుపై అతనికేదో మిలమిలలాడుతూ కనుపించింది. అతనికళ్ళకు తగిలింది. అదేమిటో అతనికి తెలుసు. కొన్ని రోజుల క్రితం ఒక తాడు కోయడానికి ఆకత్తి తీసుకుని వచ్చాడు. ఆ కత్తి అక్కడే వదలి వెళ్ళాడు. మెల్లగా దాని దగ్గరకు వెళ్ళాడు. మధ్యలో హాల్‌వర్డ్‌ను దాటుతూ వెళ్ళాడు. వెనక్కు వెళ్ళగానే కత్తితీసుకుని వెనక్కు తిరి

గాడు. హాల్‌వర్డ్ లేవబోయేవాడిలా కుర్చీలోనుంచి కదిలాడు. ఒక్క దూకులో అతని పైకి ఉరికి చెవికి ప్రక్కనున్న పెద్ద నరంలో కత్తిగుచ్చాడు. తల టేబిల్ పైకివంచి మళ్ళీ మళ్ళీ కత్తితో పొడిచాడు.

నొక్కిపట్టిన ఒక కేక వినిపించింది. నెత్తురు కారుతూ ఊపిరాడని చప్పుడు. మూడుసార్లు చాచిన చేతులు గిలగిల లాడాయి. మరో రెండుసార్లు కత్తితో పొడిచాడు. తరువాత ఇక అతను కదల్లేదు. ఏదో మెల్లగా నేలపై జాలువారడం మొదలుపెట్టింది. ఒకక్షణం ఆగాడు. ఇంకా తల క్రిందికి ఒత్తి పట్టుకునే ఉన్నాడు. తరువాత కత్తి టేబిలుమీద విసిరేసి వినసాగాడు.

అతనికేమీ వినిపించడం లేదు. తివాసీపై బొట బొట మంటున్న శబ్దం మాత్రమే వినిపిస్తూ ఉంది. తలుపు తెరుచుకుని బైటికి వెళ్లాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. ఎక్కడా చడీ చప్పుడూ లేదు. ఎవరూ లేరు. కొన్నిక్షణాలు బాల్కనీపై వంగి క్రిందినుంచి ఊరుతున్న చీకటి బావిలోకి చూస్తూ నిల్చున్నాడు. తరువాత తాళపుచెవి తీసుకుని గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు.

ఇంకా ఆ వస్తువు కుర్చీలో అలాగే ఉంది. ముఖం టేబిల్ పైన వాలిఉంది. వంగిన వెన్ను, నిడివిగా చిత్రంగా కనుపిస్తున్న చేతులు. ఒక ఎర్రని నెత్తురుచార మెడపైన లేకుండా ఉండి టేబిల్‌పై గడ్డకట్టిన నల్లని నెత్తురు మడుగు పెద్దదవుతూ విస్తరించకుండా ఉన్నట్లయితే ఆ వ్యక్తి ఊరికే నిద్రిస్తున్నాడనే అనుకోవచ్చు.

ఎంత త్వరగా జరిగింది ఇదంతా! కన్నుమూసి తెరిచే లోగా జరిగినట్టుంది. అతనిలో ఏదో విచిత్రమైన శాంతి నిండు కున్నట్లు తోచింది. మెల్లగా నడుస్తూ కిటికీ దగ్గరకువెళ్ళి కిటికీ తలుపులు తెరిచాడు. బాల్కనీలోకి వచ్చి నిల్చున్నాడు. గాలికి మంచు విడిపోయింది. గగనం కెద్దనెమలి పింఛంలా కనుపిస్తూ ఉంది. నక్షత్రాలు బంగారు కన్నులలా మిల మిలలాడుతున్నాయి క్రిందికి చూశాడు. ఒక పోలీసు గస్తీ తిరుగుతున్నాడు. నిద్రపోతున్న ఇండ్ల తలుపులను ఒక దీప మెత్తి చూస్తున్నాడు. వీధిమూలగా ఒక బండి వెడుతూ ఉంది. దీపం కనుపించి అంతలో మాయమైంది. ఎగురుతున్న ముసుగు కప్పుకున్న ఒకస్త్రీ మెల్లగా అడుగులువేస్తూవస్తూంది. ఆమె అడుగులు తడబడుతూ ఉన్నాయి. మధ్యమధ్యలో ఆగి వెనక్కు తిరిగి చూస్తూ ఉంది. ఒకపాట రుద్ధమైన కంఠ స్వరంతో పాడడం మొదలుపెట్టింది. పోలీసు దగ్గరకు వచ్చి ఆమెతో ఏదో మాట్లాడాడు. ఆమె నవ్వుతూ అక్కడనుంచి వెళ్ళిపోయింది. ఒక మంచుగాలి తెర వీచింది. గాస్ లాంతర్లు మినుకు మినుకు మన్నాయి. నీలపురంగుకు తిరిగాయి. మోడు లైన చెట్లు అల్లలాడాయి. అతను చలికి వణికి లోపలికి తిరిగి వెళ్ళి కిటికీ తలుపు మూసుకున్నాడు.

తలుపు దగ్గరకువెళ్ళి తాళపుచెవిత్రిప్పి తలుపు తెరి చాడు. హత్య చేయబడిన వ్యక్తి వంక ఒక్కమాటు కూడా చూడలేదు. ఆ పరిస్థితిని గ్రహించకుండా కండ్లుమూసుకోడం తోనే అందులోని రహస్యమంతా ఇమిడి ఉన్నదని అను

కున్నాడు. తన విషాదాని కంతకీ కారణమైన ఆ చిత్రాన్ని రచించిన చిత్రకారుడు ఇప్పుడిక లేడు. అంతే చాలు.

తరువాత అతనికి దీపం సంగతి జ్ఞప్తికి వచ్చింది. దీపంలో ఎంతో శిల్ప చతురత ఉట్టిపడుతూ ఉంది. మెరుగు పెట్టని వెండి లోపల తాపారు. ముత్యాలు పొదిగారు. దీపం కనుపించడం లేదు. బహుశా సేవకుడు మరిచిపోయి ఉంటాడు. ఇప్పుడు అడిగితే ఇక అనేక ప్రశ్నలు అడగవలసి వస్తుంది. ఒక క్షణం ఆలోచించాడు. వెనక్కు తిరిగిచూచి దాన్ని టేబిల్‌పై నుంచి తీసుకున్నాడు. ఆ మృతవస్తువు అతని కంట పడడం తప్పలేదు. ఎంత నిశ్చలంగా ఉంది అది! ఆ చేతులు ఎంత పొడుగ్గాను తెల్లగాను ఉన్నాయి! ఒక భీకరమైన మైనపు బొమ్మ లాగుంది.

వెనకాల తలుపుమూసి మెల్లగా మెట్లుదిగాడు. చెక్కతో చేసిన మెట్లు కరకరలాడాయి. బాధపెట్టగా అరుస్తున్నట్లున్నాయి. మధ్యలో అనేకసార్లు ఆగి లేచి నిల్చున్నాడు. ఏమీలేదు. అంతా నిశ్శబ్దం. ఆ చప్పుడు తన అడుగులదే.

లైబ్రరీలోకి చేరగానే సంచీ కోటూ కనుపించాయి. వాటిని దాచిపెట్టాలి. తన బీరువాలో ఒక రహస్యపు సొరుగు తెరిచాడు. చిత్రవిచిత్రమైన తన దుస్తులు అందులోనే దాస్తూ ఉంటాడు. వీటినికూడా అందులోనే ఉంచాడు. తరువాత తగల పెట్టవచ్చు. గడియారం చూచుకున్నాడు. రెండుకు ఇంకా ఇరవై నిమిషాలున్నాయి. కూచుని ఆలోచింపసాగాడు. ప్రతి సంవత్సరం ప్రతినెల – చేసిన నేరానికి ఎవరో ఒకరిని ఉరి తీస్తూనే ఉంటారు. హత్య ఒక పిచ్చిగా పరిణమించినట్లుంది.

వాతావరణంలో ఎక్కడ చూచినా హత్యలే. ఏదో దుష్టతార భూగోళానికి సన్నిహితంగా వచ్చినట్లుంది... అయినామటుకు తనకు సాక్ష్యమెక్కడుంది? బేసిల్ పదకొండు గంటలకు ఇల్లు విడిచి బయలుదేరాడు. అతను మళ్లీ లోనికి రావడం ఎవరూ చూడలేదు. సేవకులలో చాలామంది సెల్బీరాయల్ దగ్గర ఉన్నారు. అతని సేవకుడు కూడా నిద్రపోయాడు... పారిస్! అవును పారిస్ కే వెళ్ళాడు బేసిల్. అనుకున్నట్లుగానే అర్ధ రాత్రి బయలుదేరేబండిలో వెళ్ళాడు. అదీకాక అతని అల వాట్లుకూడా విచిత్రమైనవి. ఒక్కొకసారి ఎవరికీ కనుపించకుండా ఉంటాడు. అందుచేత అనుమానాలు కలగడానికికూడా ఎంతో కాలం పడుతుంది. నెలలు! ఈలోగా దాన్ని రూపుమాపెయ్య వచ్చు. హఠాత్తుగా అతని మనస్సులో ఒక భావం తళుక్కున పొడచూపింది. ఉన్నికోటు వేసుకుని హాట్ పెట్టుకుని హాల్లో నుంచి బైటికి వెళ్ళాడు. ఒకక్షణం ఆగాడు. బైట పేవ్ మెంట్ మీాద పోలీసునడక వినిపించింది. బాటకీలైటు వేసి కిటికీ అద్దాల వైపు చూచాడు. ఒకక్షణం ఊపిరి బిగబట్టుకుని నిల్చున్నాడు తరువాత కొద్దినిమిషాలకు మళ్ళీ గడియతీసి బైటికివెళ్ళి మెల్లగా తలుపుమూశాడు. బెల్ ప్రయోగించాడు. అయిదునిమిషాల్లో సరిగా దుస్తులు వేసుకోకుండా తూగుతున్నకండ్లతో సేవకుడు వచ్చి నిల్చున్నాడు.

'నిన్ను సమయంకాని సమయంలో నిద్రలేపాను. మరేమీా అనుకోకు ఫ్రాన్సిస్' అన్నాడు లోపల అడుగు పెడుతూ. 'నా తాళపుచెవి మరిచాను. ఇప్పుడు టైమెంత యింది?' అన్నాడు.

'రెండుగంటల పది నిమిషాలు సార్', అన్నాడు సేవకుడు గడియారంవంక చూచి కళ్ళార్పుతూ.

'రెండూ పది! ఎంతరాత్రయింది! రేపు తొమ్మిది గంటలకు నన్ను నిద్రలేపు, నాకు కొంచెం పనివుంది'

'సరేనయ్యా'

'ఇవాళ సాయంత్రం నాకోసం ఎవరైనా వచ్చారా?'

'మిస్టర్ హాల్‌వర్డ్ వచ్చారు సార్. పదకొండు గంటల వరకు ఉండి రైలుకు వెళ్ళారు'

'అయ్యో! అతన్ని కలుసుకోలేకపోయానే నాతో చెప్పమని ఏమైనా కబురు చెప్పారా?'.

'లేదు సార్. మీకోసం క్లబ్‌కు వెళ్ళి చూస్తానన్నారు. మిమ్మల్ని క్లబ్‌లో కలుసుకోలేకపోతే పారిస్ వెళ్ళి మీకు ఉత్తరం వ్రాస్తానన్నారు'

'మంచిది ఫ్రాన్సిస్. రేపు తొమ్మిదిగంటలకు నన్ను నిద్రలేపడం మరచిపోకు'.

'సరేసార్'. సేవకుడు మెల్లగా జారుతున్నట్టువెళ్ళాడు. డోరియన్ హాటు, కోటు టేబిలుమీద పడేసి లైబ్రరీలోకి వెళ్ళాడు. ఒకపావుగంట అటూ ఇటూ పచార్లు చేశాడు. పెదవి కొరుక్కుంటూ ఆలోచిస్తున్నాడు. తరువాత బ్లూబుక్ తీసుకుని కాగితాలు తిరగవేస్తూ కూచున్నాడు. 'ఎలన్ కాంప్ బెల్, 152, హెర్ట్‌ఫోర్డ్‌స్ట్రీట్, మేఫెయిర్' అవును. అదే అతనికి కావలసిన పేరు.

# 14

మరుసటిరోజు ఉదయం తొమ్మిది గంటలకు అతని సేవకుడు 'ట్రే'లో ఒక కప్పు చాక్‌లెట్ పానీయం తీసుకునివచ్చి కిటికీల తెరలు దించాడు. డోరియన్ ఒక ప్రక్కకు ఒత్తిగిలి చెక్కిలి క్రింద చేయిచేర్చుకుని మెల్లని నిద్రపోతున్నాడు. ఆట ఆడి లేక చదువుకుని అలసి కనుమూసిన పిల్లవాడిలా ఉన్నాడు.

అతన్ని కండ్లు తెరిపించడానికి సేవకుడు రెండుసార్లు అతని బుజం తట్టవలసివచ్చింది. అతనికండ్లు విప్పుకున్నవో లేదో ఒక సన్నని చిరునవ్వు పొర అతని పెదవులపైగా తేలిపోయింది. అతను ఏదో చక్కని కలనుంచి అప్పుడే మేలుకున్నట్లుగా ఉన్నాడు. అయినా అతను కన్నకల లేదు. రాత్రి చక్కగా నిద్రపోయాడు. సుఖం కాని దుఃఖం కాని అతన్ని అంటుకోలేదు. కాని యౌవనం నవ్వుతుంది. ఎందుకు నవ్వుతుందీ అంటే ఏం చెప్పగలం? అది ఒక అందం.

అతను మోచేయిపై తలఉంచి తిరిగి చాక్‌లెట్ పానీయం చప్పరించసాగాడు. పల్చని నవంబర్ ఎండ గదిలోకి దూసుకుని వచ్చి మడుగుకట్టింది. ఆకాశం నిర్మలంగా ఉంది. గాలి వెచ్చగా ఉంది. మేమాసపు ఉదయంలాగా ఉంది. క్రమక్రమంగా గడిచిన రాత్రి తాలూకు సంఘటనలు ఒక్కొక్కటీ రక్తారుణాలైన అడుగులతో అతని మనస్సులో అడుగు పెట్టసాగాయి. మళ్ళీ తిరిగి ఒక స్పష్టమైన ఆకృతి పొందాయి.

తను అనుభవించినదంతా ఒక్కమాటు జ్ఞాపకం వచ్చింది. ఒక్కమాటు, బేసిల్ హాల్‌వర్డ్ పట్ల తనను కలిగినరోత-అతను కుర్చీలో కూచుని ఉండగా ఆక్షణానే తనచేత అతన్ని చంపించిన రోత – మళ్ళీ తిరుముకుని వచ్చింది. ఆ మృతుడు ఇంకా అక్కడే కూచుని ఉన్నాడు. అతనిమీద కూడా సూర్యకాంతి పడుతూ ఉంది ఎంత భయంకరం! అలాంటివి రాత్రితో బంధుత్వం చెయ్యాలిగాని పగటితో బంధుత్వం చెయ్యకూడదు.

జరిగినదాన్ని జరిగినట్లు మరిచిపోవడం మంచిది. కాని దాన్ని మననం చేసుకోసాగితే మతితప్పడం తప్ప మరి గత్యంతరం లేదనుకున్నాడు. కొన్నిపాపాల అందం జ్ఞాపకంలోనే ఉంటుంది కాని వాటిని చెయ్యడంలో ఉండదు.

వాటిని గురించి అలాగే ఆలోచిస్తూ కూచుంటే ఇక వెర్రెత్తిపోవడం తప్ప మరోగత్యంతరం లేదు. పాపాల అందం వాటి జ్ఞాపకంలో ఉంది కాని ఆ పాపాలు చెయ్యడంలో లేదు. ఉద్వేగాలంటే ఎక్కువ గర్వాతిరేకాన్ని కలిగించే విజయాలవి. బుద్ధికి ఎక్కువ నిశితమైన ఆనందమిస్తాయి. కాని ఇది అలాంటిది కాదు. మనసునుంచి మచ్చకూడా కనుపించకుండా చెరిపివేసుకోవలసింది ఇది.

అరగంట గడిచింది. అతను నుదురు తుడుచుకున్నాడు. త్వరగా లేచాడు. ముస్తాబు జాగ్రత్తగా చేసుకున్నాడు. నెక్టై పిన్ను ఎన్నుకున్నాడు. రెండుమూడు ఉంగరాలు మార్చుకున్నాడు. భోజనం దగ్గర చాలాసేపు కూచున్నాడు. అనేక పదార్థాలు రుచిచూచాడు. సేవకునితో కొత్త దుస్తులను గురించి మాట్లాడాడు. జాబులు చూచుకున్నాడు. కొన్ని ఉత్త

రాలు చూచి నవ్వుకున్నాడు. మూడు ఉత్తరాలవుతే సుస్తీ రోత కలిగించాయి. మళ్లీ మళ్ళీ చదువుకుని ఉత్తరాలు చింపి వేశాడు. 'స్త్రీస్మృతి ఎంత పాడైంది!' - లార్డ్ హెన్రీ అన్నట్టు.

కాఫీ పుచ్చుకున్న తరువాత పెదవులు జాగ్రత్తగా తుడుచుకుని సేవకుణ్ణి కాచుకుని ఉండమని సైగచేసి టేబిలు దగ్గరకు వెళ్ళి కూచుని రెండు ఉత్తరాలు వ్రాశాడు. ఒకటి జేబులో పెట్టుకున్నాడు. మరొకటి సేవకునికి ఇచ్చాడు.

'ఇది 152 హార్ట్‌ఫోర్డ్ స్ట్రీట్‌కు తీసుకువెళ్ళు ఫ్రాన్సిస్. కాంప్‌బెల్ లేకపోతే అతని ఎడ్రస్ తీసుకునిరా.'

ఒంటిగా మిగిలిన తరువాత సిగరెట్ వెలిగించి ఒక కాగితంమీద బొమ్మలు గీయసాగాడు. ముందు పూలు తరువాత మరేవో శిల్పాలు, తరువాత మనుష్యముఖాలు. హఠాత్తుగా అదేం చిత్రమో కాని ప్రతిముఖంలోనూ బేసిల్ హాల్‌వర్డ్ పోలికలు కనుపించసాగాయి. ముఖం చిట్లించుకుని లేచి పుస్తకాల బీరువాదగ్గరకు వెళ్ళి చేతికొచ్చిన ఒక వాల్యూము అందుకున్నాడు. అవసరమైనప్పుడు తప్ప ఇక ఆ ఆలోచన తన మనస్సులోకి రానివ్వదలచుకోలేదు. సోఫాలో వాలి పుస్తకం టైటిల్ పేజీ చూచాడు. అది గాటియర్ 'ఇమాఎట్‌కామె' ఆకుపచ్చని లెదర్ బైండు. అతని వ్రేళ్ళు మెల్లగా వణకడం అతనికే కొంచెం ఆశ్చర్యం కలిగించింది.

ఆ పద్యాలు ఎంత అద్భుతంగా ఉన్నాయి! చదువుతుంటే ఆ నగరపు పచ్చని కాలవలలో తేలిపోతున్నట్టుగా ఉంటుంది. మెరుస్తున్న పక్షుల్లా ఎగురుతున్నాయి ఆ పద్యాలు.

ఆ రెండుపంక్తుల్లోనూ వెనిస్‌నగర సౌందర్యమంతా ఇమిడి ఉంది. నిశ్వసించాడు. మళ్ళీ పుస్తకం తీసుకున్నాడు. ఆ విషయం మరిచిపోదామనుకున్నాడు. పుస్తకంలో ఎన్నెన్నో విషయాలు చదివాడు. హోటళ్ళముందు లోనికి బైటికి ఎగిరే పక్షులు - ఎన్నో చిత్రవిచిత్ర విషయాలు. పుస్తకం అలాగే అతని చేతిలోనుంచి వాలిపోయింది. మళ్ళీ అతని నరాల్లోకి భయం పరుగెత్తుకుని వచ్చింది. ఎలన్ కాంప్‌బెల్ ఇంగ్లండ్‌లో లేకపోతే? రోజులు గడిచిపోతాయి. అతను రాడేమో బహుశా. అప్పుడు? అయిదుసంవత్సరాలక్రితం తామిద్దరూ ఎంతటిస్నేహితులు. హఠాత్తుగా ఆ స్నేహం ఎక్కడో మటు మాయమైపోయింది. ఇప్పుడు ఎక్కడైనా కలుసుకున్నా నవ్వేది డోరియనే, కాంప్‌బెల్ కాదు.

అతను చాలా తెలివిగల కుర్రవాడు. అతనికి దృశ్యకళ లపై అభిరుచిలేదు. అయినా, ఉన్న అభిరుచిమాత్రం డోరి యన్ దగ్గరనుంచి నేర్చుకున్నదే. ముఖ్యంగా అతన్ని ఆకర్షిం చింది విజ్ఞానశాస్త్రం. కేంబ్రిడ్జ్‌లో చాలాకాలం లేబరేట రీలో కాలం గడిపాడు. ప్రకృతిశాస్త్రంలో పరిశోధన చేశాడు.

ఇప్పటికి కూడా రసాయన శాస్త్రాన్ని పరిశోధిస్తూ ఉన్నాడు. ఒక స్వంత లాబరేటరీ ఏర్పరుచుకున్నాడు.రోజంతా అక్కడే తలుపులు మూసుకుని కూచుంటాడు. అతని తల్లికి కూడా ఈవిషయం అంతఇష్టంలేదు. కెమిస్టంటే మందులపేర్లు వ్రాసిచ్చేవాడని ఆవిడఉద్దేశ్యం. అతను మంచి గాయకుడు. ఫిడేలు పియానో చాలామంచి ఎమెచూర్లకంటె కూడా చక్కగా వాయిస్తాడు. అసలు సంగీతమే మొదట్లో అతనికీ

డోరియన్‌కూ స్నేహం కుదిర్చింది. సంగీతం - ఆ అనిర్వచనీయమైన ఆకర్షణే డోరియన్‌ను అతనికి తెలీకుండానే ఆకట్టుకున్నది. వారిద్దరూ ఆరాత్రి రాడీబెక్‌షైర్ ఇంట్లో కలుసుకున్నారు. రూచిన్ స్టీన్ ఆరాత్రి అక్కడ సంగీతంపాడాడు. ఆతరువాత ప్రతిరోజూ ఒపెరాదగ్గరో మరే సంగీతకచ్చేరీ దగ్గరో వారు కలుసుకోని రోజంటూ ఉండేదికాదు. ఇలా పద్దెనిమిది నెలలు వారి స్నేహం సాగింది. కాంప్‌బెల్ ఎప్పుడూ సెల్బీరాయల్ దగ్గరో గ్రోస్‌వెనర్ స్క్వేర్ దగ్గరో తప్పకుండా ఉండేవాడు. అతనికి కూడా, ఇతరులు చాలామంది లాగానే డోరియన్ జీవితంలోని ఆనందానికీ అందానికంతా ప్రతినిధి. వారిద్దరిమధ్య ఎప్పుడైనా తగాదా జరిగిందో లేదో ఎవరికీ తెలీదు. కాని తరువాత వారు కలుసుకున్నప్పుడు ఎప్పుడో కాని మాట్లాడుకోడంలేదని అందరూ అనుకోసాగారు. డోరియన్‌గ్రే ఉన్న పార్టీనుంచి కాంప్‌బెల్ త్వరగా వెళ్ళిపోయేవాడని అంటూ ఉండేవారు. అతనుకూడా మారిపోయాడు. ఎం చాతనో కాని అప్పుడప్పుడూ విషాదంగా కనుపిస్తూవచ్చాడు. సంగీతం వినడమన్నా ఇష్టంగా ఉండేవాడు కాదు. తను ఎన్నడూ సంగీతం వాయించేవాడు కాడు. సైన్సు రిసెర్చిలో మునిగి ఉన్నాననీ సంగీతంపాడే ఇది లేకుండా ఉందనీ చెప్పేవాడు. ఇది నిజంకూడా. నానాటికీ ప్రకృతిశాస్త్రంలో అతని శ్రద్ధ మరింత హెచ్చయింది. ఒకటొరెండుసార్లు సైన్సు రెవ్యూలలో అతనిపేరు కూడా పడింది. డోరియన్‌గ్రే వేచిఉన్నది ఇతనికోసమే. ప్రతిక్షణం గడియారంవంక చూస్తూఉన్నాడు. నిమిషాలు గడిచేకొద్దీ అతని కలవరం

మరింత ఎక్కువ కాసాగింది. చివరకు లేచి గదిలో పంజరంలో పావురాయిలా అటూ ఇటూ తిరగసాగాడు. అటూ ఇటూ చూడసాగాడు. అతని చేతులు విచిత్రంగా చల్లబడసాగాయి.

రానురాను సస్పెన్సు మరింత భరించరానిదిగా తోచింది. కాలం మైనపుకాళ్ళతో మెల్లగా ప్రాకుతున్నట్టు తోచింది. అతను పెనుగాలుల్లో ఏదో అగాధంవైపుకు కొట్టుకునిపోతున్నాడు. అక్కడ అతనికోసం ఏం కాచుకుని ఉన్నదో అతనికి తెలుసు. అది కనుపిస్తూనేఉందికూడా. దాన్ని చూచి వణికిపోయాడు. కళ్ళు చల్లనిచేతులతో గట్టిగా ఒత్తుకున్నాడు. కాని లాభంలేదు. అతనిమనస్సులో దానికి తగిన ఆహారం దానిలోనే ఉన్నది. అతని భావన ఒక వికారమైన కీలుబొమ్మలా ఆడసాగింది. హఠాత్తుగా కాలం ఆగినట్టు తోచింది. అవును — ఆగ్రుడ్డిది మెల్లనిది ఇక ప్రాకడం లేదు. కాలం చనిపోయింది. భయంకరమైన భావాలు కూడా అతని కళ్ళముందు మెల్లగా ఆడసాగాయి. తన సమాధిలోనుంచి ఒక అసహ్యాకరమైన భవిష్యత్తును వెలికితీసి అతనికి చూపుతోంది. అతను దాన్ని చూచి గడ్డకట్టుకునిపోయాడు.

చివరకు తలుపు తెరుచుకుంది. సేవకుడు లోనికి వచ్చాడు. అతని గాజుకళ్లు అతనివైపుకు తిప్పాడు.

'మిస్టర్ కాంప్‌బెల్ సర్'

అతనికి ప్రాణం వచ్చినట్టయింది. మళ్ళీ చెక్కిళ్ళు ఎరుపెక్కాయి.

'వెంటనే లోపలికి రమ్మను ఫ్రాన్సిస్' మళ్ళీతనమనస్సు తన స్వాధీనంలోకి వచ్చింది. అతని భయం గడిచిపోయింది. సరేనని సేవకుడు వెళ్ళాడు. కొద్దిక్షణాలలో ఎలన్ కాంప్‌బెల్ లోనికి వచ్చాడు. మనిషికొంచెం పాలిపోయి కనుపిస్తున్నాడు.

'ఎలన్, వచ్చావా! మంచిది.'

'మళ్ళీ నీఇంటికి రాదలుచుకోలేదు గ్రే. కాని నీవు చాలా అవసరమని కబురు పంపావు కాబట్టి వచ్చాను' – అన్నాడు. అతనిగొంతుక నిర్లిప్తంగా ఉంది. మెల్లగా మాట్లాడాడు. ఆచూపులో ఒకవిధమైన అసహ్యం కూడా కనుపిస్తూ ఉంది. ఆస్ట్రిఖన్ కోటుజేబులో చేతులు పెట్టుకున్నాడు. తనను ఆహ్వానించిన తరహా కూడా గమనించినట్లు కనుపించలేదు.

'అవును. నిజంగా ఇది జీవన్మరణ సమస్యే ఎలన్. ఒకరికేకాదు. ఇద్దరికీ. కూచో' కాంప్‌బెల్ టేబిలు ప్రక్కగా ఒక కుర్చీ వేసుకుని కూచున్నాడు. డోరియన్ అతనికి ఎదురుగా కూచున్నాడు. అతను చెయ్యనున్నది భయంకరమైనదని అతనికి తెలుసు.

కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా ఉన్నతరువాత అతను ముందుకు వంగి మెల్లగా ఇలా చెప్పసాగాడు. ఇలా చెబుతూ అతని ప్రతిమాటా ఎలన్ ముఖంలో కలిగించే ప్రతిస్పందనను గమనింపసాగాడు.'

'ఎలన్' ఈ ఇంటిమీద ఒక గదిలో – మూసిఉన్న గదిలో ఒక మనిషి శవం ఉన్నది. ఆ గదిలోకి నేను మినహా మరెవరూ వెళ్ళరు. అతను చనిపోయి పదిగంటలు కావస్తూంది. అలా కలవరపడకు. ఎలాచనిపోయాడో, అతనెవరో

ఎందుకుచనిపోయాడో ఆ విషయాలు నీకు అనవసరం. అలా చూడకు. నీవు చెయ్యవలసిందల్లా ఇది...

'ఇక చాలు గ్రే నేను ఇక ఏమీ తెలుసుకోదలచ లేదు. నీవు నాకు చెప్పింది అబద్ధమైనా నిజమైనా దానితో నాకు ఎలాటి సంబంధమూ లేదు. నీ జీవితంతో అంటుపడడం నాకు ఎంతమాత్రం ఇష్టంలేదు. నీ రహస్యాలు నీ దగ్గరే ఉంచు. వాటితో నాకేమీ సంబంధంలేదు.'

'ఎలన్ అలా అనకు. వాటితో నీకు సంబంధంఉంది. అన్నిటితో లేకపోయినా దీని ఒకదానితో మాత్రం ఉంది. నేను నీకోసం ఎంతో చింతిస్తున్నాను ఎలన్. కాని నేను చెయ్యగలిగిందేమీ లేదు. నీవొక్కడివే ఈ సమయంలో నన్ను రక్షించగలవు. నిన్ను ఇందులోకి లాగకుండా ఉండలేను. మరి గత్యంతరంలేదు. నీకు సైన్సు తెలుసు. నీకు కెమిస్ట్రి తెలుసు. అలాటి శాస్త్రాలు తెలుసు. నీవు ప్రయోగాలుకూడా చేశావు. నీవు చెయ్యవలసిందల్లా ఆ పైనున్నదానిని మచ్చకూడా కనుపించకుండా మటుమాయం చెయ్యడమే. అతను ఇంట్లోకి రావడం ఎవరూ చూడలేదు. ఇప్పు డతను పారిస్‌లో ఉన్నా డని అనుకుంటున్నారుకూడా. కొన్ని నెలలవరకు అతను కనుపించడు. అప్పుడతను ఇక్కడకూడా లేడనుకుంటారు. అవును. ఎలన్, నీవు అతన్ని మార్చెయ్యాలి. ఒక గుప్పెడు బూడిగా మార్చెయ్యాలి. నేను, ఆబూడిని గాలిలో విసిరేస్తాను. నీకువెర్రి త్తినట్టుంది డోరియన్.'

'డోరియన్ అని ఎందుకు పిలిచావు?'

'నీకు పిచ్చిలా ఉంది. నీకు సాయం చేస్తాననుకుంటు న్నావు. ఈ గొడవంతా నాకు చెప్పకొచ్చావు. దీనితో నాకేమీ సంబంధంలేదు. ఏమైనా నీకోసం ఇలా అపనింద పాలవుతానా ? ఏమి టీ పాడుపనులు'

'అది ఆత్మహత్య ఎలన్'

'అవుతే మంచిదే. కాని అంతవరకూ ఎవరు దారి తీశారు? నీవే ననుకుంటాను'

'ఇంకా నామాట కాదంటావా?'

'అవును. నాకేమీ సంబంధంలేదు. నీకు ఎలాటి అప కీర్తికలిగినా దానితో నాకు ఎలాటి సంబంధమూలేదు. నీవు దానికి తగినవాడివి కూడా. నీవు అందరిలోనూ అపకీర్తిపాలు కావడం చూచి నేనేమీ చింతించను. అయినా - నీవు - అందరిలోనూ - నన్ను ఇందులో జోక్యం కలిగించుకోమనడ మేమిటి? నీకు అందరి స్వభావాలూ తెలుసనుకొన్నాను. నీ స్నేహితుడు లార్డ్ హెన్రీవాటన్ నీకు మరేం చెప్పినా మనస్తత్వాన్ని గురించి చెప్పిఉండడు. అయినా నేను దీనిలో జోక్యం కలిగించుకోను. నీవు మరేస్నేహితుణ్ణయినా అడుగు నన్ను మాత్రం అడగకు ?'

'ఎలన్. అది హత్య. నేనే చంపాను. అతనివల్ల నాకు ఎంతబాధకలిగిందో నేను చెప్పలేను. నా జీవితం ఏమైనా, పాపం ! హానికంటెకూడా దాని మంచికీ చెడుకీకూడా అతనే ఎక్కువ కారణమని చెప్పాలి. అతను దాన్ని ఉద్దేశించి ఉండక పోయినా ఫలితం ఒకటే.

'హత్యా!— ఇంతవరకు వచ్చిందా డోరియన్! నేను నీ విషయం ఎవరితోనూ చెప్పను. అది నాపనికాదు. అదీకాక, నేను జోక్యం కలిగించుకోకపోయినా, నీవు అరెస్టు కాక తప్పదు. ఏదో ఒక తెలివితక్కువపని చెయ్యకుండా ఎవరూ హత్య చెయ్యరు. కాని నాకు మాత్రం దీనితో సంబంధంలేదు.

'నీకు సంబంధం ఉంది ఒక్క నిముషం ఆగు. నామాట విను నేను నిన్ను కోరుతున్నదల్లా ఒక శాస్త్రప్రయోగం చెయ్యమని. అంతే. నీవు ఆస్పత్రులకూ మృత్యుగృహాలకు వెడుతుంటావు. అక్కడ నీవుచేసే భీకరమైన పనులు నిన్నేమీ కలవరపరచవు. ఏ పోస్టుమార్టమ్ గదిలోనో లేక లాబరెటరీలోనో ఈవ్యక్తి ఉబికి వస్తున్న పేగులతో టేబిల్ మీద పడుకుని ఉంటే నీవు దాన్ని నీకు వినోదం కలిగించే పదార్థం లాగానే చూస్తావు. నీలో ఏమాత్రం సంకోచంకూడా కలుగదు. నీవు తప్పుచేస్తున్నాననికూడా అనుకోవు. పైగా మానవజాతికి గొప్ప సహాయం చేస్తున్నావని లోకంలో విజ్ఞానం ఎక్కువ చేస్తున్నావని అనుకుంటావు. నీ మేధస్సుకు సంబంధించిన ఏదో ఒక విచిత్రితను సంతృప్తిపరుచుకుంటున్నాననుకుంటావు. నేను నిన్ను కోరేదల్లా నీవు ఇదివరకు చేసిన పనినే మళ్ళీ చేయమని అడుగుతున్నాను. అంతే. నీకు అలవాటే కాబట్టి శరీరాన్ని ధ్వంసం కావించడం అంతకష్టమైనపని కాదు. అదీకాక మరో విషయం — ఇదొక్కటే నాకు వ్యతిరేకంగా ఉన్న సాక్ష్యం. దీన్నికనిపెట్టారంటే నేను పూర్తిగా నశించిపోయినట్లే. నీవు సహాయం చెయ్యకపోతే తప్పకుండా కనుక్కొనితీరుతారు.

'నాకు నీకు సాయం చెయ్యాలని ఏమాత్రం లేదు. ఈ విషయం మరిచిపో. నాకుదీనితో ఏమాత్రం జోక్యంలేదు.'

'ఎలన్, నిన్ను ప్రార్థిస్తున్నాను. నేను ఎలాంటి పరిస్థితిలో ఉన్నానో గమనించు. నీవు రావడానికి ముందు నేను భయంతో మూర్ఛిల్లానంటే నమ్ము. భయం అంటే ఏమిటో నీకూ ఒకనాటికి తెలియకపోవచ్చు. ఆవిషయం ఆలోచించు. కేవలం శాస్త్రీయదృష్టితో దీన్ని చూడు. నీవు ప్రయోగం కావించే ఈ మృత వస్తువులన్నీ ఎక్కడినుంచి వస్తున్నాయో నీవు పట్టించుకోవు. ఇప్పుడు కూడా అలాగే ఆవిషయం విచారించకు. ఇప్పటికే చాలా చెప్పాను. ఈ ఒక్క–సహాయం చెయ్యి. మనం ఒకప్పుడు స్నేహితులం.'

'ఆ రోజులను గురించి మాట్లాడకు. ఇప్పుడా రోజులు లేవు. చనిపోయాయి.'

'చనిపోయినవి ఒక్కొక్కప్పుడు అంటిపెట్టుకుని వ్రేలాడుతూ ఉంటాయి. పైనున్న మనిషి వెళ్ళిపోడు. టేబిలుదగ్గర తలవంచుకుని చేతులు చాచుకుని కూచుని ఉన్నాడు. ఎలన్! ఎలన్! నీవు నాకు సహాయంరాకపోతే నేను పూర్తిగా నాశనమైపోయినట్లే. వాళ్లు నన్ను ఉరితీస్తారు ఎలన్. నేను చేసిన దానికి——'

'ఇకచాల్లే. నే నీపని చెయ్యలేను. ఇలా నీవు నన్నడగడం పిచ్చి'

'అవుతే ఒప్పుకోవన్నమాట'

'ఊఁహుఁ'

'నిన్ను అర్థిస్తున్నాను ఎలన్'

'లాభంలేదు'

డోరియన్ కళ్ళలో మళ్ళీ అదేజాలి కనుపించింది. తరువాత చెయ్యిచాచి ఒక కాగితం ముక్క తీసుకుని దానిమీద ఏదో వ్రాశాడు. ఒకటి రెండుసార్లు చదువుకుని జాగ్రత్తగా మడిచి టేబిలు మీదుగా దాన్ని ముందుకు తోశాడు. ఇలా చేసి లేచి కిటికీ దగ్గరకు వెళ్ళాడు.

కాంప్‌బెల్ అతన్ని ఆశ్చర్యంతో చూస్తున్నాడు. తరువాత కాగితం తీసుకుని తెరచి చూచాడు. చదువుతూంటే అతని ముఖం పాలిపోయింది. కుర్చీలో వెనకాలకూలిపోయాడు. అతని మనస్సంతా మరాసుకునిపోయినట్టుయింది. ఏదో డోల్లు లాగా హృదయం కొట్టుకోసాగింది.

రెండుమూడు నిమిషాలు నిశ్శబ్దం. తరువాత డోరియన్ తిరిగి అతనిదగ్గరకు వచ్చి వెనకాల నిల్చుని అతని బుజంపై చెయ్యిఉంచాడు.

'నీకోసం ఎంతో చింతిస్తున్నాను ఎలన్. కాని నాకు మరో గత్యంతరం కనుపించడంలేదు. నేనప్పుడే ఒక ఉత్తరం వ్రాసి ఉంచాను. ఇదుగో ఆ ఉత్తరం. ఈ ఎడ్రస్ చూడు, నీవు నాకు సాయం చెయ్యకపోతే ఈ ఉత్తరం పంపుతాను. దీని వల్ల వచ్చే ఫలితమేమిటో నీకు తెలుసు కాని, నీవు నాకు సాయం చేస్తావు. నా మాట కాదనవు. నిన్ను వదులుదామను కున్నాను. నీవు ఆ విషయం ఒప్పుకుంటావనుకున్నాను. నీవు చాలా నిక్కచ్చిగా ఉన్నావు. ఎవరూ నన్ను ఎన్నడూ చూడని

విధంగా నీవునన్ను చూచావు. అంతా సహించి ఊరుకున్నాను. ఇప్పుడు నీకు ఉత్తరువులిచ్చే స్వాతంత్ర్యం నాచేతుల్లో ఉంది.'

కాంప్‌బెల్ చేతుల్లో ముఖం దాచుకున్నాడు. ఆ పాదమస్తకం వణికిపోయాడు. 'అవును ఈమాటు నీకు ప్రిస్క్రిప్షన్ డిక్టేట్ చేసే స్వాతంత్ర్యం నాచేతుల్లోనే ఉంది ఎలన్. వాళ్లు ఎలాటివారో నాకు తెలుసు. ఇది చాలా సామాన్యమైన విషయం. నీవు అనవసరంగా గాభరాపడకు. ఇది చేసితీరాలి. మరి లాభంలేదు.' కాంప్‌బెల్ పెదవులనుంచి ఒక సన్నని కేక వెలువడింది. అతను చలికి వణికినట్టు వణికిపోసాగాడు. మాంటిల్‌పీస్‌మీద ఉన్న గడియారం టిక్ టిక్‌మని శబ్దం చేయడం కాలాన్ని వేరువేరు వేదనాణువులుగా విభజిస్తున్నట్లుగా ఉంది. నుదుటిచుట్టూ ఒక ఇనపచక్రాన్ని బిగిస్తున్నట్టుంది. తను ఏ అవనతిని ఊహించుకున్నాడో అది అప్పుడే అతనిపైకి దిగినట్టుగా ఉంది. అతని బుజంమీద ఉన్న చేయి అతన్ని బరువుగా క్రిందికి దించేస్తున్నట్టుంది.

'ఏమంటావు ఎలన్ ?'

'నే నాపని చేయలే' నన్నాడు.

'నువ్వు చేసితీరాలి. మరో గత్యంతరంలేదు. ఇక ఆలస్యానికి వీలులేదు'

అతను ఒకక్షణం తటపటాయించాడు.

'పైన మేడమీద గదిలో మంట వుందికదూ'

'అవును. గ్యాస్‌మంట వుంది'

'నే నింటికి వెళ్ళి లాబరేటరీనుంచి కొన్ని వస్తువులు తీసుకు వస్తాను'

'కాదు ఎలన్, నువ్వు యింట్లోనుంచి బయటకు వెళ్ళ కూడదు. నీకు కావలసిందేమిటో ఒక కాగితంమీద వ్రాయి. నా సేవకుడు టాక్సీమీద వెళ్ళి తీసుకువస్తాడు.'

క్యాంప్‌బెల్ కొన్ని లైనులు వ్రాశాడు. వాటిని నెమ్మదిగా బ్లాటుచేసి ఒక కవరు తన అసిస్టెంటు పేరిట వ్రాశాడు. డోరియన్ ఆ చీటీ తీసుకుని జాగ్రత్తగా చదివాడు. తరువాత గంటకొట్టి సేవకుడిని పిలిచాడు. ఆ వస్తువులు తీసుకుని త్వరగా రమ్మన్నాడు. హాలు తలుపు మూసుకోగానే క్యాంప్‌బెల్ కలవరంతో కుర్చీమీదనుంచి లేచి కిటికీదగ్గరకు వెళ్ళాడు. ఒకవిధమైన భయంతో అతను ఆపాదమస్తకం వణకిపోతున్నాడు. ఇరవై నిమిషాలపాటు యెవరూ మాట్లాడలేదు. ఒక ఈగ గదిలో చప్పుడుచేస్తూ తిరుగుతోంది. గడియారం టిక్ టిక్‌మని చప్పుడు చేస్తోంది.

ఒంటిగంట కొట్టింది. క్యాంప్‌బెల్ తిరిగి డోరియన్ వంక చూచాడు. అతని కళ్ళలో కన్నీళ్ళు కన్పించాయి. విచార సూచకంగావున్న అతని ముఖంలోని నాజూకులోను స్వచ్ఛత్వంలోను అతనికి కోపం తెప్పించిందేదో కనిపించింది.

'నీవు భ్రష్టుడివి. పట్టి భ్రష్టుడివి' అన్నాడు.

'ఎలెన్, నీవు నాజీవితాన్ని రక్షించావు' అన్నాడు డోరియన్.

'నీజీవితం? అదీ ఒక జీవితమేనా? ఒక్కొక మెట్టే దిగజారి పతితుడవై చివరకు హత్యకు కూడా వొడికట్టావు. నేను

చేయబోయే దాంట్లోను, నువ్వు శిష్యుని నిర్బంధిస్తున్న దాంట్లోను నీజీవిత ప్రసక్తి ఏమీ లేదనుకుంటాను_'

డోరియన్ నిట్టూర్పు విడిచాడు. నింపాదిగా అన్నాడు!' ఎలెన్. నీపట్ల నాకున్న జాలిలో కనీసం సహస్రాంశమయినా నీకు నాపట్ల ఉండాలని ఆశిస్తున్నాను.' అతను మాట్లాడుతూ వెనక్కు తిరిగాడు. తోటవైపు చూస్తూ నిలబడ్డాడు. కాంప్ బెల్ సమాధానం చెప్పలేదు.

పది నిమిషాల తర్వాత తలుపుతట్టిన శబ్దమయింది. సేవకుడు లోనికి వచ్చాడు. అతని చేతిలో రసాయనాలపేటిక వుంది. దానికి ఉక్కు ప్లాటినంతీగలు వేలాడుతున్నాయి. అతడు కేంప్ బెల్ నుద్దేశించి 'వీటిని యిక్కడే వుంచమంటారా?' అన్నాడు.

'ఆ! - చూడు ఫ్రాన్సిస్, నీకు మళ్ళీ పనిపురమాయించవలసివచ్చేట్టుంది. రిచ్ మండ్ లో సెల్బీకి సప్లై చేసే అతడిపేరేమిటి?' అనడిగాడు డోరియన్.

'హార్డెన్ అంటారండి'

'ఆ! హార్డెన్! నీవు వెంటనే రిచ్ మండ్ వెళ్ళి స్వయంగా హార్డెన్ ను కలుసుకో. నేను పురమాయించిన వాటికన్నా రెట్టింపు యాపిల్స్ యిమ్మను. సాధ్యమయినంత వరకు తెల్లటివాటినే తీసుకురా. నిజానికి నాకు తెల్లవివి అసలే అక్కరలేదు. ఈరోజు చాల బాగుంది ఫ్రాన్సిస్. రిచ్ మండ్ చాల చక్కటి ప్రదేశం. లేకపోతే నేను దానికోసం అంత బెంగపెట్టుకోను.

'ఏమీ బెంగపెట్టుకోనక్కరలేదు సార్! మళ్ళీఎప్పుడు తిరిగి రమ్మంటారు ?'

డోరియన్ కాంప్‌బెల్ వంక చూచాడు. 'నీఎక్స్‌పెరిమెంటు ఎంతసేపు పడుతుంది ఎలెన్ ?' అనడిగాడు ప్రశాంతంగా, నిర్లిప్తమైన కంఠస్వరంతో.

మరోవ్యక్తి గదిలో వుండటం అతని కెంతో ధైర్యం యిచ్చినట్లుంది.

కాంప్‌బెల్ ముఖం చిట్లించుకుని తలఊపాడు

'అయిదు గంటలసేపు పడుతుంది.'

'అయితే చాల వ్యవధివుంది. నీవు ఏడున్నరకు వచ్చినా ఫరవాలేదు ఫ్రాంసిస్. లేకపోతే అక్కడేవుండిపో. నాముస్తాబు దుస్తులు మాత్రం తీసి అవతలవుంచు. ఈ సాయంకాలం నీవు సెలవు తీసుకోవచ్చు. నేను యింట్లో భోజనం కూడ చేయటం లేదు. అందుచేత నీఅవసరం అసలేలేదు.'

'సరే'నంటూ అతను గదివిడిచి వెళ్ళాడు.

'ఇప్పుడు, ఎలెన్, ఒక్క నిముషంకూడా వృథాచేసేందుకు వీల్లేదు. చూడు ఈ పెట్టె ఎంతబరువుగా వుందో. దీన్ని నేను తీసుకువస్తాను. తతిమ్మాది నీవు తీసుకుపద' అన్నాడు డోరియన్. త్వరత్వరగా ఇరువురూకలిసి మేడమీదికి వెళ్ళారు. వారు మేడమీదికి చేరేసరికి డోరియన్ తాళంచెవి తీసుకుని తాళాన్ని తిప్పాడు. కాని తాళం తెరవలేకపోయాడు. అక్కడే ఆగిపోయాడు. అతని కళ్ళలో కలవరం కనుపించింది. అతను వణికిపోతూ 'నేను లోపలకు వెళ్ళలే ననుకుంటాను ఎలన్.'

'నాకేం భయవాలేదు, నేను వెడతాను' అన్నాడు కాంప్‌బెల్ మెల్లగా.

డోరియన్ సగం తలుపు తెరిచాడు. అలాచేస్తూ సూర్యకాంతిలో కనిపిస్తూవున్న తన చిత్తరువులోని తన ముఖాన్ని చూశాడు దానికిముందు చిరిగిపోయిన తెర నేల మీద పడివుంది. పోయినరాత్రి అతనిజీవితంలో తొలిసారిగా దానిని మూసివేయడం మరిచిపోయాడు. అతను ముందుకు వెళ్ళబోయి వణికిపోతూ మళ్ళీ వెనక్కి తగ్గాడు.

ఆ బొమ్మలో ఒక చేతిమీద ఎర్రనిమచ్చ కనిపించింది. చేతికి ఎర్రని చెమట పోసినట్టుగా వుంది. ఎంతభయంకరంగా వుంది! ఆ క్షణంలో టేబిల్ దగ్గరకూర్చున్న వస్తువుకంటే అది ఎంతో భయంకరంగా వుంది. చుక్కలుచుక్కలుగావున్న తివాచీ మీద పడుతున్న ఆ వస్తువుతాలూకు నీడ కదలడంలేదు, అక్కడే వుంది.

అతను ఒక్కమాటు గట్టిగా నిశ్వసించి,తలుపు కొంచెం తెరిచి, అరమూతలుపడిన కండ్లతో త్వరత్వరగా నడిచి లోనికి వెళ్ళాడు. ఒక్కమాటుకూడా మృతునివంక చూడకుండా వుండాలి! తర్వాత కిందికివంగి తెరతీసుకుని చిత్రంమీద విసరి వేశాడు.

తర్వాత కాస్సేపున్నాక తిరిగి చూడటం చేతకాక చిత్తరువు వంకే చూడసాగాడు.

కాంప్‌బెల్ బరువుగావున్న పెట్టెను, కావల్సిన ఖడ్డీలను తీసుకుని భీకరమైన ఆపనిని చేయడానికి లోపలకు రావడం విని పించింది. అతనూ బేసిల్ హాల్‌వర్డ్ ఎన్నడయినా కలుసు

కున్నారో లేదో తెలియక ఆశ్చర్యపోయాడు. కలుసుకుంటే ఒకరినిగురించి ఒకరు యేమనుకున్నారో !

'ఇక నన్ను వదలివెళ్లు' అని ఒకకంఠస్వరం అతని వెనుకనుంచి వినవచ్చింది! అతను తిరిగిచూచి త్వరత్వరగా బయటకు వెళ్ళాడు. వ్యాలెట్ కుర్చీలో మళ్లీ వెనక్కువాల్చి బడివున్నాడు. కాంప్‌బెల్ అతడిని చూస్తున్నాడు. డోరియన్‌కు అదేగుర్తు. అతడు కిందికి వెళుతూవుండగా గడియ మళ్లీ పెట్టటం వినిపించింది.

కాంప్‌బెల్ లైబ్రరీలోనికి వచ్చేసరికి యేడుగంటలు దాటింది. అతను పాలిపోయి వున్నాడు. కాని చాలా ప్రశాంతంగా వున్నాడు. 'నీవడిగిన పని చేశాను. ఇక వెడతాను. మళ్ళీం మనం ఎన్నడూ కలుసుకోవద్దు' అన్నాడు.

'నన్ను నాశనంకాకుండా కాపాడావు కద. నే నెన్నటికీ నీసహాయం మర్చిపోలేను' అన్నాడు డోరియన్.

కాంప్‌బెల్ వెళ్ళిపోగానే అతను మేడమీదకు వెళ్ళిపోయాడు. గదిలో నత్రికామ్లం వాసన ఘాటుగా వేస్తోంది. కాని టేబుల్‌దగ్గర కూర్చున్న వస్తువుమాత్రం కనబడటం లేదు.

# 15

ఆసాయంత్రం ఎనిమిదిన్నరగంట లయింది. షోరి యర్ట్రగే బాగా అలంకరించుకున్నారు. అతడిని సేవకులు సగౌరవంగా లేడీ నార్బరో డ్రాయింగ్ రూంలో ప్రవేశపెట్టారు. అతని నరాలు పిచ్చెక్కినట్లు, తల వేడెక్కుతోంది. అతనికి చాల అలసటగా వుంది. కాని ఆవిడతో కరచాలనం చేస్తున్నప్పుడు అతనిపరిస్థితి చాల హుందాగాను గంభీరంగాను వుంది. తనకూ నాటకంలో కొంత పాత్ర వున్నప్పటికి ఎవరైనా యింత కులాసాగా వుండటం సాధారణంగా అసాధారణమైన విషయం. ఆరోజు షోరియర్ట్రగేను చూచినవాళ్ళెవరూ అతనొక దుర్భరమైన దుఃఖాంత కర్మకాండ ముగించి వస్తున్నాడనుకోరు. ఆ సున్నితమైన చేతివేళ్ళు ఎప్పుడూ పాపకార్యానికి కత్తిని చేపట్టివుంటాయనుకోరు. ఆ నవ్వే పెదవులు - భగవంతుని గూర్చి మంచితనాన్నిగూర్చి నిందించివుంటాయని అనుకోరు. తన ప్రశాంతతకు అతనికే చాలఆశ్చర్యంగా వుంది. తన ద్వంద్వవ్యక్తిత్వానికి మనసులో ఒక క్షణంపాటు 'హాయి హాయి' అనుకున్నాడు.

అది చాల చిన్నసమావేశం. లేడీ నార్బరోచేత అతి హడావుడిగా యేర్పాటుచేయబడ్డది. ఆమె చాల తెలివైన మనిషి. భర్త చనిపోయినతర్వాతనే కూతుళ్ళను బంచి మంచి సంబంధాలు తెచ్చి ఘనంగా వివాహం చేసింది. తను మాత్రం ఫ్రెంచినవలాలకు కాలక్షేపాలకు నివేదితమయింది.

డోరియన్ ఆమె ముఖ్యస్నేహితులలో ఒకడు. అతడిని చిన్న వయసులోనే చూడకుండా వుండటం, కలుసుకోలేక పోవడం తనకు చాలసంతోషదాయకమయిన విషయా లని ఆమె యిప్పటికీ డోరియన్‌తో అంటూ వుంటుంది. 'డోరియన్, నిన్ను చిన్నప్పుడే గనుక చూచివున్నట్లయితే ఎంతో ఘాటుగా ప్రేమించి వుండేదానిని! నీప్రేమకోసం ఆ సి సర్వస్వం అయినా సంతోషంగా వదిలేసివుండేదాన్ని! ఆరోజుల్లో పద్ధతే వేరు. ఎవరితోనయినా కనీసం మాట్లాడటానికి కూడా అవకాశం వుండేది కాదు. అదంతా నార్బరీ తప్పేలే! అతనిది బొత్తిగా హ్రస్వదృష్టి. కనుచూపులేనివాడితో కాపురం చేయడంలో రవంతయినా సుఖం లేదు.'

ఈ సాయంత్రం ఆమెఅతిథులు దుర్భరంగా తయారయారు. నిజం యేమిటంటే—యీ సంగతి ఆమె డోరియన్‌కు విశదీకరించింది — ఆమె వివాహితసుతలలో ఒకామె అనుకోకుండా చెయ్యకుండా తల్లితో కలిసివుండటానికంటూ వచ్చేసింది. మరీ దారుణంగా తనతోపాటు భర్తనుకూడా వెంట వేసుకు వచ్చింది. 'ఇది నిజంగా దారుణం. నేను ప్రతి వేసవీ వాళ్ళదగ్గరకు వెళ్లి వుంటూవుంటాననుకో, అయితే నేం? నాబోటి ముసిలిదానికి గాలిమార్పు తప్పకుండా వుండాలి, అదీ గాక నేను వాళ్ళకు ఎంతో సహాయకరంగానూ వుంటాను! అక్కడ వాళ్ళ ఉనికి ఎల్లాంటిదో నీకు తెలీదు. ఏమీ సంస్కారం సంపర్కం లేని పల్లెటూరి బతుకు! వాళ్ళు వేకువజామునే లేస్తారు! యేమంటే వాళ్ళకు చేతినిండా బోలెడుపని! ఊరు మాటుమణగకముందే నిద్రపోతారు. యేమంటే వాళ్ళకు ఆలో

చించటానికి యేమీవుండదు. ఎలిజబెత్ రాణి కాలంనుంచి కూడా అక్కడ సత్కాలక్షేపం అంటూ యేమీలేదు. అందు చేతే మధ్యాహ్న భోజనం అయ్యాక నిద్రలుపోతారు. నీవు వాళ్ళిద్దరికీ పక్కన కూర్చో కూడదు. నాపక్కనే కూర్చుని వుండి నాకు హుషారు కలిగించు.'

డోరియన్ కృతజ్ఞతాపూర్వకంగా యేదో అని ఒకసారి గదినంతా కలయజూచాడు. అవును! ఈ పార్టీ చాలా దుర్భరం గానే వుంది. వాళ్ళల్లో యిద్దరిని తను యింతకుముందెన్నడూ చూడలేదు. తతిమ్మావాళ్ళు ఎర్నెస్ట్‌హార్డెన్; లండను క్లబ్బుల్లో విరివిగా కన్పిస్తూనే వుంటాడు – యితడికి శత్రువన్న మాటే లేదు – అందరితో కలివిడిగా వుంటాడు; లేడీ రక్స్ టాన్ – నలభైయేడేళ్ళపడుచు! అతివిలాసంగా దుస్తులువేసు కుంటుంది; చిలకముక్కు – అన్ని విషయాల్లోనూ సర్దుకు పోవటానికి ప్రయత్నిస్తూ వుంటుంది. ఇంకా మిసెస్ ఎర్లైన్, లేడీ ఎలైస్ చాప్‌మన్, ఆమె భర్త.

లేడీ నార్బరో 'హెన్రీవాటన్ కూడా యింత ఆల స్యంగా రావటం అక్రమం! తప్పకుండా వస్తానని నాకీ వుద యమే వాగ్దానం చేశాడు!' అంది.

హారీ అక్కడ వుండటం ఆ వాతావరణానికే కొంత వరకు ఓదార్పు. తలుపు తెరుచుకుని లోపల ప్రవేశించడంతో అతను యింక మనసులో బాధపడటం మానేశాడు.

కాని భోజనందగ్గర అతనేమీ తినలేకపోయాడు. పళ్ళెంతర్వాత పళ్ళెం యేమీ రుచిచూడకుండానే తీసి వేయాల్సివచ్చింది. లేడీ నార్బరో అతన్ని చివాట్లుపెట్ట నారం

భించింది. అత నేమీ తినకపోవటం, అతనికోసరమని ప్రత్యేకంగా తయారుచేసిన వంటకానికి నామర్దా అంది. అడపాదడపా లార్డ్ హెన్రీ అతనివంక ఓరచూపులు చూస్తున్నాడు. అతని నిస్తబ్ధతకూ గాంభీర్యానికి విస్మయపోతున్నాడు. బట్లర్ అతని గ్లాసును షాంపైన్‌తో నింపుతున్నాడు. తాగుతూన్నకొద్దీ అతని దప్పిక ఎక్కువవుతూన్నట్లుంది!

చివరకు లార్డ్ హెన్రీ పట్టబట్టలేక 'యేం డోరియన్! యివాళ నీ తరహా అంతా [illegible] వుందే?' అన్నాడు.

లేడీ నార్బరో 'బహుశ అతనేదో ప్రేమకలాపంలో యిరుక్కున్నాడు. నాతో చెప్పితే అసూయపడతానేమోనని భయపడుతున్నాడు. అతని ఊహ నిజమే! నేను అసూయపడే మాట ఖాయమే!'

డోరియన్ చిరునవ్వుతో 'నార్బరో సతీ, ఒక వారం రోజులనుంచి ప్రేమకలాపం అన్నమాటే లేదు. అంటే ఫెర్రాల్ డి మదాం ఈ ఊరు వదలి వెళ్ళినప్పటినుంచీ—' అన్నాడు.

ఆ వృద్ధురాలు సాశ్చర్యంగా 'మీ మగవాళ్ళు ఆమె ప్రేమకోసం యెందుకు తహతహలాడిపోతుంటారో నాకు అర్థంకాకుండావుంది' అంది.

'ఎందుచేతనంటే నీ చిన్నతనంనుంచి కూడా ఆమె నిన్ను ఎరుగును' అన్నాడు లార్డు హెన్రీ.

లేడీ నార్బరో 'ఆమెను నేను 30 సంవత్సరాల క్రిందట నేవియన్నాలో ఎరుగుదును. అప్పుడామె చాలా విలాసంగా ఉండేది' అంది.

లార్డుహెన్రీ తన పొడుగాటి వేళ్ళతో ఒక పండు అందుకొంటూ 'ఆమె ఇప్పటికీ విలాసంగానే ఉంటుంది. చిన్ని గౌను వేసుకొన్నప్పుడు ఈకాలపు ఫ్రెంచి నవలల్లోని నాయికలా ఉంటుంది. ఆమె అంగవిన్యాసం బ్రహ్మాండంగా ఉండటమే కాకుండా ఆమె ఆశ్చర్యాల అంబుధి. ఆమెకు కుటుంబ మమ కారాలు జాస్తి. మూడోభర్త చనిపోయినప్పుడు ఆ విచా రంలో ఆమెతల నెరిసిపోయింది' అన్నాడు.

'ఎంత విశదీకరిస్తున్నావు హారీ' అన్నాడు డోరియన్.

అభ్యాగతి నవ్వుతూ 'ఇదంతా ప్రణయగాథ. కానీ మూడోభర్త చనిపోయాడంటూ వేమిటి? నీ ఉద్దేశ్యం ఫెర్రాల్ నాలుగోవాడనా?' అంది.

'నిశ్చయంగా, లేడీ నార్బరో!'

'నేను ఒక్క ముక్క కూడా నమ్మను.'

'కావాలంటే గ్రేను అడుగు. అతను కూడా ఆమె ఆంతరంగికమిత్రుడేగా'

'నిజమేనా గ్రే?'

'ఆమె అలాగే చెప్పింది. మార్గరెట్ డీనావక్ మాదిరి ఆమెకూడా ప్రియులహృదయాలు మాలకూర్చి మెడలో వేసుకున్నదేమోనని అడిగాను కాని, ఆమె వాళ్ళ కెవరికీ హృద యాలే లేవు అంది' అన్నాడు డోరియన్.

'నలుగురు భర్తలా! నన్నడిగితే చాలా విపరీత మంటాను.'

'విపరీతమే కాదు విశుద్ధం కూడాను' అన్నాడు డోరియన్.

'అయినప్పటికీ ఆమె చాలా విలాసంగా ఉంటుంది. మరి ఫెర్రాల్ ఎలా ఉంటాడు? నే నెప్పుడూ అతన్ని చూడ లేదు.'

'అమిత సౌందర్యరాసుల భర్తలు ఎప్పుడూ కిరాతక తరగతికే చెంది ఉంటారు' అన్నాడు లార్డుహెన్రీ సారాయం చప్పరిస్తూ.

లేడీ నార్బరో తనచేతి విసనకర్రతో అతనిని కొట్టింది. 'నీవు పరమ కర్కోటకుడవు అని ప్రపంచం అంటుంది. అందులో ఆవంతైనా అతిశయోక్తి లేదు'

లార్డుహెన్రీ కనుబొమ్మలు పైకెగురవేస్తూ 'ప్రపంచ మంటుందా! అయితే అది మర్రోప్రపంచ మన్నమాట. ఈ ప్రపంచమూ నేనూ ఏపేచీలులేకుండానే ఉన్నాము' అన్నాడు.

వృద్ధురాలు తల గట్టిగా ఊపుతూ 'నాకు తెలిసిన వాళ్ళంతా నీవు పరమకర్కోటకుడవు అనే అంటారు' అంది.

లార్డుహెన్రీ కొన్నిక్షణాలసేపు గంభీరంగా చూశాడు. చివరకు 'మనిషిచాటున అతనిని దారుణమైన మాటలు అన టం చాలా అసంబద్ధమైన విషయం' అన్నాడు.

లేడీనార్బరో నవ్వుతూ 'మీ రంతా మదామ్ ఫెర్రా లును ఆరాధించేటట్లయితే నేనుకూడా ఫాషన్ కోసరం మళ్ళీ వివాహం చేసుకోవలిసి ఉంటుంది.'

లార్డుహెన్రీ అందుకొని 'నీవు మళ్ళీ వివాహం చేసు కోవు లేడీ నార్బరో! నీవు చాలా సుఖపడ్డావు. ఒకస్త్రీ మళ్ళీ పెళ్ళాడిందంటే మొదటిభర్తను అసహ్యించుకున్న దన్నమాట. అదే ఒక పురుషుడు మళ్ళీ పెళ్ళి చేసుకున్నట్లయితే మొదటి

భార్యను మిక్కుటంగా ప్రేమించేవాడన్నమాట. స్త్రీలు తమ అదృష్టంతో ఆటలాడుతారు. కాని పురుషులు దుస్సాహసాలు చేస్తారు.' అన్నాడు.

వృద్ధురాలు 'నార్బరో సరియైనవాడు' కాడు అంది.

'అతనే సరైనవాడైతే నిన్ను ప్రేమించేదానివే కాదమ్మా! ఆడవాళ్ళు మమ్మల్ని మా లోపాలు చూసి ప్రేమిస్తారు. వాళ్లు మాతప్పులను, అత్యభిరుచులనుకూడ సహిస్తారు. క్షమిస్తారు. ఈమాటచెప్తే నీవు నన్నిక ఎప్పుడూ భోజనానికి పిలవవు. కాని, యిది అక్షరాల నిజం' అన్నాడు లార్డ్ హెన్రీ.

'నిజమే కావచ్చు, హెన్రీ ఆడవాళ్ళు మీలోపాలు చూచి మిమ్మల్ని ప్రేమించకుండా వున్నట్లయితే మీరంతా యేమైవుండేవాళ్ళు? మీలో ఒక్కళ్ళకుకూడా వివాహం అయివుండేది కాదు. మీరంతా దురదృష్టవంతులయిన బ్రహ్మచారులుగా మిగిలిపోయేవాళ్ళు. ఈ రోజుల్లో పెళ్ళిళ్ళయిన వాళ్ళు బ్రహ్మచారుల్లా జీవిస్తున్నారు; బ్రహ్మచారులు పెళ్ళిళ్ళయినవాళ్ళలా జీవిస్తున్నారు.'

డోరియన్ గాఢంగా నిట్టూర్చి 'జీవితం తీరని నిరాశ!' అన్నాడు.

లేడీ నార్బరో 'నీవు జీవితాన్ని కాచివడపోశా నని చెప్పకు. ఎవరైనా ఆమాట అన్నారంటే జీవితమే వాళ్ళను కాచివడపోసిం దన్నమాట. లార్డ్ హెన్రీ చాలా కర్కోటకుడే. నేనూ అలాగేవుందామని కొన్నిమార్లు అనుకున్నాను. కాని నీవు చాలా మంచివాడివి. అట్లాగే కనిపిస్తావు. నీకు ఒకచక్కని

భార్యను సేకరించాలి. లార్డ్ హెన్రీ! గ్రేకు ఇక వివాహం చేసేయాలని నీ కనిపించటం లేదూ?' అన్నది.

లార్డ్ హెన్రీ తలవూపుతూ 'నే నెప్పుడూ అతనితో యీమాటే చెబుతున్నాను లేడీ నార్బరో!' అన్నాడు.

'సరే! అతనికి సుఖం సరైన సంబంధం చూచిపెట్టాలి. ఈ రాత్రి డిబ్రెట్‌లో జాగ్రత్తగా పరిశీలించి అందమైన ఆడ వాళ్ళ జాబితా తయారుచేస్తాను.

'ఆ జాబితాలో వాళ్ళ వయసు కూడా వేయాలి నార్బరో!' అన్నాడు డోరియన్.

'అవునవును! వయసుకూడా వేయాలి. కాని ఏమీ హడావుడిగా చేయకూడదు. నింపాదిగా ఆలోచించి మరీ చేయాలి. మీరాిద్దరూ సుఖంగా వుండాలని నాకోరిక.'

లార్డ్ హెన్రీ ఆశ్చర్యంగా 'సుఖవంతమైన వివాహాలను గురించి మాటాడటం ఎంత అవివేకం! ఆమెను ప్రేమించకుండా వున్నంతవరకు మగవాడు ఏస్త్రీతోనైనా సుఖంగా వుండ గలడు' అన్నాడు.

వృద్ధురాలు కుర్చీ వెనక్కు లాక్కుంటూ 'అబ్బ! నువ్వెంత నిష్కర్షగా మాటాడుతావూ' అంది. 'నీవు మళ్ళీ త్వరలోనే వచ్చి నాతో విందారగించాలి. నీవు ఉత్సాహాన్ని కలిగించే టానిక్‌లాంటివాడివి. నాకోసం సర్ ఆండ్రూ వ్రాసి స్తున్న మందులకన్నా నీవే మిన్న! ఎవరెవర్ని కలుసుకోవడం నీకు ఉల్లాసంగా వుంటుందో, నాకు చెప్పు. నేను వాళ్ళందరినీ రప్పిస్తాను' అంది.

'మంచి భవిష్యత్తువున్న మగవాళ్ళూ గతచరిత్ర వున్న ఆడవాళ్ళూ అంటే నా కిష్టం!' అన్నాడు లార్డ్ హెన్రీ.

ఆమె నవ్వుతూ లేడీ రక్స్టన్ వంక చూస్తూ 'సిగరెట్టు కాల్చడం పూర్తయినట్టు లేదే?' అంది.

'ఈమధ్య తాగడం ఎక్కువయిపోతోంది. ముందు ముందు చాలా మితపరచా లనుకుంటున్నాను.'

లార్డ్ హెన్రీ అందుకుని 'ఆ పనిమాత్రం చేయకు రక్స్టన్! తగ్గించటం నికృష్టమైనపని సరిగా వుండటంలో చెప్పుకోదగ్గ విశేషమేమీ లేదు. చాలినదానికన్నా ఎక్కువ వుండటంలోనే గొప్పవిందారగించినంత మహదానందంవుంది' అన్నాడు.

లేడీ రక్స్టన్ అతనివంక ఆతృతగా చూచింది. 'మీ సిద్ధాంతం కాస్త తమాషాగానే వుంటుంది. ఎప్పుడైనా తీరుబడిగా బోధపరుద్దురుగాని లెండి!' అంటూ ఆమె గదిలోనుంచి వెళ్ళిపోయింది. లేడీ నార్బరో తలుపుదగ్గరనుంచే 'మీ రాజకీయాలతోను, కబుర్లతోను కాలం వ్యయపరచకు. మళ్ళీ మేము పైకి రావాల్సివస్తుంది' అన్నది.

మగవాళ్ళంతా విరగబడి నవ్వారు. ఛాప్మాన్ కుర్చీలోంచిలేచి పైకి వచ్చాడు. డోరియన్ గ్రేకూడా లేచి లార్డ్ హెన్రీప్రక్కన కూర్చున్నాడు. ఛాప్మాన్ కామన్సుసభలో కార్యకలాపాన్నిగురించి గంభీరంగా వుపన్యసిస్తున్నాడు.

లార్డ్ హెన్రీ పెదవులమీద విచిత్రమైన నవ్వు అవతరించింది. డోరియన్ వంక చూచి 'నీవంట్లో కులాసాగావుందా? భోజనాలదగ్గర మామూలుగా లేవే.' అన్నాడు.

'కులాసాగానే వుంది హారీ! కాని అలసటగా వుంది. అంతే!'

'గతరాత్రిమాత్రం నీవు మనోహరంగా వున్నావు. చిన్న డచెస్ నీవంటే చాలా అభిమానంగా వుంది. ఆమె సెల్బీకి వెళ్ళిపోతున్నట్టు నాతో చెప్పింది.'

మళ్ళీ 'యిపసయ్యోతాగీఖు వస్తానని నాకు వాగ్దాన మిచ్చింది. మన్మౌత్ కూడా అక్కడే వుంటాడా?'

'తప్పకుండా హారీ! అతడు నన్ను చాలా విసిగిస్తాడు. ఆమెనూ అంతే. ఆమె చాలా తెలివైన మనిషి. చాలా అనుభవశాలికూడానూ!' అన్నాడు.

'ఆమెకు వివాహమై యెన్నాళ్ళయింది?' అని అడిగాడు డోరియన్.

'ఆమె సమానంగా చెప్పదు. కాని పది సంవత్సరాలు అయుంటుందనుకుంటాను. మన్మౌత్‌తో కొన్ని సంవత్సరాలు కాపురమంటే కొన్నియుగా లన్నమాట. మరింకా యెవరెవరు వస్తున్నారు?'

'ఇంకానా? విల్లోబీస్, లార్డ్ రగ్బీ, ఆయనభార్యా, మన అభ్యాగతీ, జఫ్రీ, క్లస్టన్. మామూలు జట్టే! లార్డ్ గ్లోట్రియన్‌ను కూడా రమ్మన్నాను.'

'నా కతనంటే చాలాయిష్టం! అతను ఎవరికీ నచ్చడు కాని నాకుమాత్రం చాలా సుందరంగా అధునాతనంగా కనిపిస్తాడు' అన్నాడు లార్డ్ హెన్రీ.

'అతను ఖచితంగా రాగలడనుకోను హారీ! తనతండ్రితో కలిసి మాంట్‌కారంలోకి వెళ్ళవలసివుంటుందేమో!'

'అబ్బబ్బ! ఏమి బాధకబందీలు! అతన్ని యెల్లాగైనా వచ్చేటట్లు చేయి. అన్నట్లు డోరియన్! రాత్రి నీవు చాలా పెందలకడనే వచ్చేశావు. తరువాత యేం చేశావు? తిన్నగా యింటికే వెళ్ళిపోయావా?'

డోరియన్ అతనివంక నిబ్బరంగా చూశాడు. కొద్దిగా వణికాడు. తరువాత మాత్రం 'లేదు హారీ! దాదాపు మూడు గంటలదాకా యింటికి వెళ్ళనే లేదు!' అన్నాడు.

'అయితే క్లబ్బుకు వెళ్ళావా?'

'అవును, వెళ్ళాను' అన్నాడు. తరువాత పెదవి కొరుక్కున్నాడు 'లేదులేదు, క్లబ్బుకు వెళ్ళలేదు. ఊరికే రోడ్డు వెంట నడిచాను. ఏం చేశానో మరిచిపోయాను... నీ కెంత ఆసక్తి హారీ! ఎవరెవరు యేం చేస్తూంటారో నీకు కావాలి. నేనుమాత్రం యెప్పుడూ చేసినపని మరిచిపోవడానికే ప్రయత్నిస్తూంటాను. నీ కంతగా తెలుసుకోవాలని వుంటే చెబుతాను విను. నేను రెండున్నరకు వచ్చాను. తాళంచెవి యింటిదగ్గరే మరచాను. అందుచేత నౌకరు వచ్చేవరకు వేచి వుండాల్సి వచ్చింది. నీ కింకా సాక్ష్యం కావాలంటే వాణ్ణి అడగొచ్చు' అన్నాడు.

లార్డ్ హెన్రీ బుజాలెగరవేశాడు. 'నా కెందుకోయీ వివరాలన్నీ? పద, డ్రాయింగ్‌రూముకు వెళదాము. కాని నీలో యేదో మార్పు కనిపిస్తోంది డోరియన్! నా కది యేమిటో చెప్పు! ఈ రాత్రి నీవు నీవుగా లేవు.'

'అదేమంత పట్టించుకోకు హారీ! నా మనస్సేమీ బావుండలేదు నేను మళ్ళీవచ్చి రేపో యెల్లుండో నిన్ను

కలుసుకుంటాను. లేడీ నార్బరోకు నా క్షమాపణ చెప్పు. నేను పైకి రాలేను. ఇంటికి వెళ్ళిపోతాను.'

'అలాగే డోరియన్! రేపు టీ సమయానికి కలుసుకుందాము' డచెస్ వస్తా నన్నది.'

గదిలోంచి బయటకు వెడుతూ 'రావడానికి తప్పకుండా ప్రయత్నిస్తాను' అన్నాడు డోరియన్.

ఇంటికి వెడుతూన్నంతసేపూ అతనికి తాను జయించానను కొన్న భయోద్రేకాలు తనను తిరిగీ ఆవహించాయని పించింది. లార్డ్ హెన్రీ సాధారణ ప్రశ్నలు తనను మరీ నీరసింప జేశాయి. ప్రమాదకరమైన వస్తువులు వినాశం చేయాలి. వాటిని కనీసం ముట్టుకోవడమైనా హేయమనిపించింది.

అయినా ఆపని చేయవలసే వుంది. లైబ్రరీగది తాళం వేసినప్పుడు అక్కడే బాసిల్ హార్వర్డ్ తాలూకు కోటూ, సంచీ వదిలివేసినట్లు గ్రహించాడు. బ్రహ్మాండమైన మంట మండుతోంది. దానిలోకి మరొకకట్టెను చేర్చాడు డోరియన్. కాలుతున్న బట్టలూ తోలూ వాసన భరించ శక్యంగాకుండా వుంది. సర్వసంపూర్ణమయేసరికీ మూడు పావుగంటలు పట్టింది. చివరిదశలో అతనిశరీరం తూలిసట్లయింది. చేతులను చల్లని సువాసనల సారాయంలో కడుక్కున్నాడు.

ఉన్నట్లుండి అతను తేరిపార జూచాడు.

అతనికళ్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. క్రింది పెదవి విపరీతంగా వణుకుతోంది. రెండు కిటికీలకూ మధ్య ఒక పెద్ద బీరువా వుంది. దాన్ని చూస్తున్నకొద్దీ అతనికి భయం యెక్కువవుతూన్నట్లుంది. అతను త్వరత్వరగా వూపిరి పీలుస్తు

న్నాడు. ఒక విధమైన ఉద్విగ్నత అతనిని ఆవేశించింది. సిగరెట్టు ముట్టించి మళ్ళీ కిందికి పడేశాడు. కనురెప్పలు కిందికిజారి చెంపలను అంటుకుంటున్నట్లున్నాయి. అయినా అతనింకా ఆబీరువాను చూస్తూనే వున్నాడు. చివరకు పడుకున్న సోఫా లోంచి లేచి బీరువాదగ్గరకు వెళ్ళాడు. దానితాళంతీసి రహస్యపు మీట నొక్కాడు. ఒక త్రిభుజాకారపు డ్రాయరు మెల్లిగా బయటకు తోసుకువచ్చింది. అతనివేళ్ళు అనాలోచితంగా దానిమీదికి వెళ్లి దేనినో మూసేసినాయి. అదొక చిన్న చైనాపెట్టె, నలుపుమీద సువర్ణరేఖలు. దానిమూలలు తరంగాలుగా చెక్కబడి వున్నాయి. దానిమూత తెరిచాడు. లోపల పసుపుపచ్చని జిగురుపదార్థం వుంది. మైనపుముద్దలా వుంది. వాసన మటుకు చాలా ఘాటుగా వుంది.

అతడు కొన్ని క్షణాలపాటు సందేహిస్తూ చూచాడు. నిశ్చలమైన వింత చిరునవ్వు అతనిముఖంమీద ఆవరించుకుంది. ఆగదిలో వాతావరణం అత్యుష్ణంగా వున్నప్పటికీ అతను వణికిపోతున్నాడు. అతికష్టంమీద ఒక్కసారి గడియారం వైపు చూచాడు. పన్నెండు గంటలు కావడానికి యింకా యిరవై నిమిషాలు విరామం వుంది. పెట్టెను యథాస్థానంలో వుంచాడు. బీరువాతలుపులను మూసేశాడు. పడకగదిలోనికి వెళ్ళాడు.

అర్ధరాత్రి గాలివిసురు జోరుగా వున్నపుడు డోరియన్ గ్రే ప్రశాంతంగా యింటిబయటకు నడిచాడు. అతి సాధారణమైన దుస్తులు ధరించాడు. మెడ కొక మఫ్లర్ చుట్టు

కున్నాడు. బాండ్ బజారుకు వెళ్ళాడు. ఒక గుర్రపుబగ్గీ దొరికింది. దానిలో యెక్కి డ్రైవరుకు అడ్రస్ చెప్పాడు.

'చాలాదూరముంది!' అన్నాడు డ్రైవరు.

'ఇదుగో ఒక సవర్ను తీసుకో. తొందరగా తోలావంటే వెళ్ళాక యింకో సవర్ను యిస్తాను' అన్నాడు.

'అలాగేనండి, ఒక గంటలో తీసుకెళ్తాను' అన్నాడు.

వేగంగా నదివైపుకు బండిని తోలాడు.

## 16

చల్లని వాన కురుస్తోంది. బజారుదీపాలు మసక మసకగా వెలుగుతున్నాయి. ఇంటి తలుపులు అప్పుడే మూతబడుతున్నాయి. తాగుబోతులు విపరీతంగా నవ్వుతున్నారు. అరుస్తున్నారు.

గుర్రపు బగ్గీలో వెనక్కి పడుకుని టోపీ ముందుకు లాగుకొని డోరియన్ గ్రే బండిచిల్లులోంచీ నగరాన్ని పరికిస్తున్నాడు. అప్పుడప్పుడూ మొదటిసారిగా కలుసుకున్నపుడు లార్డ్ హెన్రీ చెప్పినమాటలు పునస్స్మరణచేసుకుంటున్నాడు. 'ఆత్మను వివేకంతోనూ, వివేకాన్ని ఆత్మతోనూ నివారించుకోవాలి.' అవును! అదే రహస్యం. దీనిని తరుచూ ప్రయోగించాడు. ఇప్పుడు మళ్ళీ ప్రయోగించబోతున్నాడు. కొత్త పాపాలతో పాతపాపాలు మరుగునపడిపోతాయి.

చంద్రుడు ఆకాశంలో పసుపుపచ్చనికపాలంలా వ్రేలాడుతున్నాడు. అప్పుడప్పుడూ మేఘాలదొంతరలు

చంద్రుడిని మరుగుపరుస్తున్నాయి. దీపాలవెలుగు సన్నగిల్లుతోంది. సందులు మరీ సన్నవిగా చీకటిగోతుల్లా వున్నాయి. దారితప్పటంవలన మళ్ళీ అరమైలు వెనక్కి తోలాల్సి వచ్చింది. లార్డ్ హెన్రీ చెప్పినమాటలే పునశ్చరణచేసుకుంటున్నాడు. తనఆత్మ యిప్పుడు మృత్యుశయ్యమీద వుంది. అయితే తనవివేకం దానిని నివారించగలదా! అమాయకమైన రక్తం చిందింది. దానికి పరిహారం యేమిటి? క్షమాపణలు దుస్సాధ్యం. అంతకంటే మరచిపోవడమే సాధ్యమేమో? నిజానికి బాసిల్ కు తనతో అట్లా మాట్లాడటానికి యేమి అధికారం వుంది? ఇతరులచర్యలనుగురించి తర్కించే అధికారం తనకెవరు యిచ్చారు?

గుర్రపుబగ్గీ మెల్లగా నడుస్తోంది. తొందరగా నడపమని బండివాడితో చెప్పాడు. నల్లమందు ఆకలి అతన్ని దహించివేస్తోంది. అతడిగొంతు మండుతోంది. సున్నితమైన చేతులు ఒకటిగా మెలికలు తిరుగుతున్నాయి. గుర్రాన్ని వెర్రిగా ఒకదెబ్బతీశాడు. డ్రైవరునవ్వాడు. గుర్రాన్ని వేగంగా తోలుతున్నాడు. జవాబుగా అతనుకూడా నవ్వాడు. డ్రైవరు నిశ్శబ్దంగా తోలుతున్నాడు.

ఈ మార్గానికంతు లేనట్లుంది. వీధులు సాలెగూళ్ళలా చిక్కచిక్కగా వున్నాయి. ఒంటరితనం భరించ శక్యంగాకుండావుంది. దట్టమైనపొగమంచు అతనిని భయపెట్టుతోంది.

తరువాత వాళ్ళు పొలాలు దాటారు. ఇక్కడ పొగమంచు స్వల్పంగానే వుంది. కొంతసేపయింతర్వాత మట్టిరోడ్డు దాటి మళ్ళీ కంకరరోడ్డుకు వచ్చారు. అక్కడక్కడా

దీపాల గుడ్డివెలుతురు కనిపిస్తోంది. అతడు దానినే పరిశీలనగా చూస్తున్నాడు. అతడి హృదయంలో విస్తృతమైన క్రోధం ఆవరించుకుంది. ఒక సందు తిరగబోతూండగా యింటి గుమ్మం ముందు నిల్చున్న ఒకపడుచు వాళ్ళను వుద్దేశించి యేమో అరిచింది. వందగజాలవరకూ యిద్దరు మగవాళ్ళు బండివెంట పరుగెత్తారు. డ్రైవరు వాళ్ళను కొరడాతో కొట్టాడు.

ఆలోచనలతో డోరియన్ మనస్సు దగ్ధమవుతోంది. మూడురోజుల్లో తాను సర్వస్వతంత్రుడవుతాడు.

బండి ఆగింది. డ్రైవర్ 'ఇక్కడే కదండి?' అన్నాడు.

డోరియన్ చుట్టూ పరిశీలించాడు. డ్రైవరుకు మాట యిచ్చిన నవర్ను యిచ్చేసి ముందుకునడిచాడు. తనవెంట యెవరూరావటంలేదుకదాఅని నాలుగుప్రక్కలా కలయవెదుకుతున్నాడు. ఏడెనిమిదినిమిషాలలో రెండు బ్రహ్మాండమైన ఫాక్టరీల నడుమనున్న చిన్నపూరికొంపదగ్గరకు చేరుకున్నాడు. ఒక కిటికీలో దీపం వెలుగుతోంది. డోరియన్ తమాషాగా తలుపుతట్టాడు.

కొద్దిసేపట్లోనే ఎవరో వస్తూన్న అడుగుల చప్పుడూ గొళ్ళెం తీస్తున్న చప్పుడూ వినిపించాయి. తలుపు తెరచుకుంది. నోరు మెదపకుండా డోరియన్ లోనికి వెళ్ళాడు. ఒక చిన్న గదిలోనికి వెళ్ళి కూర్చున్నాడు. నేలంతా ధూళిదూసరంగా వుంది. పక్కనే బొగ్గులకుంపటిదగ్గర కొంతమంది కూర్చుని వున్నారు. ఒకమూల చేతుల్లో తల దిగజార్చుకొని ఒక సిపాయి కూర్చున్నాడు. మరొక పక్క ఇద్దరు ఆడవాళ్ళు నిలుచున్నారు. ఆ గది చివర చిన్నమెట్లవరుస వుంది. అదే

చీకటికోణానికి మార్గం. వాటిని చూస్తూంటేనే డోరియన్‌కు నల్లమందు ఘాటు అనిపించింది. అతడు గాఢంగా వూపిరి విడిచాడు. అతని నాసికారంధ్రాలు సంతోషంతో కదలబారినాయి. అతడు ప్రవేశిస్తూ వుండగా వంగి దీపం ముట్టిస్తున్న యువకుడు అతనివైపు సంశయాత్మకంగా చూశాడు.

'నువిక్కడున్నావా అడ్రియన్!' అన్నాడు డోరియన్.

'మరి యింకెక్కడ వుంటాను! ఇప్పుడు నాతోయెవరూ మాటాడటం లేదు' అన్నాడు నిర్లక్ష్యంగా.

'నీవు ఇంగ్లండు వదలి వెళ్లి పోయివుంటా వనుకున్నాను. డార్లింగ్‌టన్ నన్నేమీ చేయబోవటం లేదు. మా సోదరుడు బిల్లు చెల్లించేశాడు. జార్జికూడా నాతోమాట్లాడడు. అయినా నాకేమీ లక్ష్యంలేదు' అంటూ అతడు యింకా యిలా అన్నాడు. 'ఈ సరంజామా వున్నతరువాత ఎవరికైనా వేరే స్నేహితులు అక్కర్లేదనుకుంటాను.'

డోరియన్ చుట్టూ పరికించాడు. చిరిగిన చాపలమీద దొర్లుతున్న వస్తువులవంక నిశితంగా చూచాడు. మెలితిరిగిన అవయవాలూ తెరుచుకున్న నోళ్ళూ కాంతివిహీనమైన కళ్ళూ అతడిని అయోమయస్థితిలో దింపాయి. అవి యే స్వర్గాలలో బాధపడుతున్నాయో అతనికి తెలుసు. అయినప్పటికీ తనకంటే అవే మెరుగు. అతడు ఆలోచనలలో బందీ చేయబడ్డాడు. జ్ఞాపకాలు అతనిఆత్మను నమిలి మింగేస్తున్నాయి. అప్పుడప్పుడూ బేసిల్ హాల్వర్డ్ నేత్రాలు అతనికి కనిపించినట్లువుతూంటుంది. ఇంక అక్కడ వుండలేకపోయాడు. అడ్రియన్ సింగిల్టన్ సమక్షం అతడిని బాధిస్తూంది. తనను యెవరూ యెర

గని చోటికి వెళ్ళా లనివుంది. అతనికి తనదగ్గిర్నించే పారిపోవా లని వుంది. కొద్దిసేపు వున్నాక డోరియన్ 'నేను మరోచోటికి వెడుతున్నాను' అన్నాడు.

'ఆపక్కకేనా?'

'అవును'

'ఆ పిచ్చి పిల్లి నిశ్చలంగా అక్కడే వుంటుంది. దాన్ని యిప్పు డిక్కడికి రానియటం లేదు.'

డోరియన్ బుజాలు యెగురవేస్తూ 'ప్రేమించే ఆడ వాళ్ళంటే నాకు వెర్రెత్తిపోతోంది. హేయంగాచూచే ఆడ వాళ్ళే అభిరుచిదాయకం అవుతారు' అన్నాడు.

'ఎవరైనా ఒకటే!'

'కాని నాకు వాళ్ళంటేనే యిష్టం! సరే, రా! కాస్త యేదేనా తాగుదాం.'

'నాకేమీ అక్కర్లేదు.'

'ఫరవాలేదులే!'

ఆడ్రియన్ సింగిల్టన్ విసుగ్గాలేచి డోరియన్‌ను అనుస రించాడు. దారిలో ఆడవాళ్ళు విసుగూవిరామంలేకుండా కబుర్లు చెప్పుకుంటున్నారు. డోరియన్ ప్రక్కకుతిరిగి ఆడ్రి యన్ చెవులో యేదో అన్నాడు.

ఒకస్త్రీముఖాన వికృతపునవ్వు వెలిసింది. 'ఈ రాత్రి మాకు చాలా సంతోషంగావుంది' అంది.

డోరియన్ కాలితో నేలమీద దభీమని చప్పుడుచేసి 'నీకుపుణ్యముంటుందిగాని నన్నుమాట్లాడించకు. నీకుడబ్బేగా

కావలసింది? ఇదిగో తీసుకో - మళ్లీ ఎప్పుడూ నాతో మాటా డకు!' అన్నాడు.

ఆమెకళ్ళలో కెంపుజ్యోతులు వెలిగి చప్పున ఆరి పోయాయి. ఆ నాణా లందుకొని తలవంచి లెక్క పెట్టుకుంది.

ఆడ్రియన్ సింగిల్టన్ నిట్టూర్చి 'ఇదేం లాభం లేదు. నాకు వెనక్కు వెళ్ళిపోవాలని వుంది. నాకు ఇక్కడే హాయిగా వుంది' అన్నాడు.

డోరియన్ ఒక్కక్షణం ఆగి 'నీ కేదైనా కావలసివస్తే నాకు రాస్తావుకదూ!' అన్నాడు.

'సరే! సెలవు'

ఆ యువకుడు 'సెలవు!' అంటూ మెట్లెక్కి జేబు రుమాలుతో మూతి తుడుచుకుంటూ వెళ్ళిపోయాడు. డోరియన్ చాలా బాధగా తలుపువంక నడిచాడు. తెర పక్కకు వత్తిగించుతుండగా తన దగ్గరనించి డబ్బు తీసుకున్న స్త్రీ వికృతపునవ్వు వినిపించింది.

ఆ వానలోనే తడుస్తూ బయలుదేరాడు డోరియన్ గ్రే. ఆడ్రియన్ సింగిల్టన్‌తోటి అనుకోని సమావేశం అతనిలో వింత ఆలోచనలు రేపింది. అతను పెదవులు కొరుక్కున్నాడు. ఈప్రపంచంలో యెవరి బ్రతుకు వాళ్లు బ్రతుకుతున్నారు. మరొకరినేరాలూ తప్పిదాలూ భుజాన వేసుకోవడానికి యెవరికీ తీరుబడి లేదు.

ఈ ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోతూండగా, డోరియన్ అలాగే నడుస్తున్నాడు. ఇంతలో అతనితలకు గురిపెట్టి రివాల్వరు పట్టుకుని ఎవరో అడ్డువచ్చారు.

'ఏం కావాలి నీకు?' అన్నాడు డోరియన్.

'నోరు మెదపకు! కదిలావా కాల్చేస్తాను' అన్నా డా మనిషి.

'పిచ్చివాడివా యేమిటి? నిన్నేంచేశాను నేను?'

'నీవు సిబిల్ వేన్ జీవితం ధ్వంసం చేశావు. ఆమె నాచెల్లెలు. ఆత్మహత్య చేసుకుంది. నా కంతా తెలుసు. నీ గుమ్మందగ్గిరే అసువులు విడిచింది. ప్రత్యామ్నాయంగా నిన్ను చంపుతానని శపథంచేశాను. సంవత్సరాల తరబడిగా యీ అవకాశం కోసం ఎదురు చూస్తున్నాను. నిన్ను యెరుగున్న యిద్దరూ చనిపోయారు. నాచెల్లెలు నిన్నుపిలిచే ముద్దుపేరు తప్ప మరింకేమీ నాకు తెలియదు. యాదాలాపంగా ఆ పేరే యీరాత్రి విన్నాను. ఆట్టే విరామం లేదు. దేవుడిని ప్రార్థించుకో. నీ విప్పుడే చచ్చిపోబోతున్నావు' అన్నాడు.

డోరియన్ గ్రే భయవిహ్వాలు డయ్యాడు. 'నా కామె యెవరో తెలియను. నే నెప్పుడూ ఆపేరే వినలేదు. నీ వెవరో పిచ్చివాడివి' అన్నాడు.

'నీపాపాలను వొప్పుకోవడం మంచిది. నిన్ను నే నిపుడు చంపకపోతే నాపేరు జేమ్స్‌వేన్ కానేకాదు.'

అది అతినికృష్టమయిన క్షణం. డోరియన్‌కు ఏం మాట్లాడాల్సిందీ తెలియలేదు. 'మోకాళ్ళమీద కూర్చో!' అని ఆ మనిషి ఆక్రోశించాడు. 'దేవుడిని ప్రార్థించటానికి ఒక్క నిమిషం విరామం యిస్తున్నాను. ఈరాత్రి నేను భారత దేశం వెళ్ళిపోవాలి. ముందుగా యీ వ్యవహారం ముగించాలి. ఒక్కనిమిషం. అంతే!'

డోరియన్ చేతులు క్రిందికిపడిపోయాయి. ఉన్నట్టుండి అతనిమనసులో ఒక ఆశాకిరణం మొలకెత్తింది. 'ఆగు! నీ చెల్లెలు చచ్చిపోయి యెన్నాళ్ళయింది. తొందరగా చెప్పు!' అన్నాడు.

'పద్దెనిమిది సంవత్సరాలు! ఎందుకా ప్రశ్న! సంవత్సరాలతో యేముంది?' అన్నాడా మనిషి.

విజయంప్రస్ఫుటించే కంఠస్వరంతో డోరియన్ గ్రే కులాసాగా నవ్వాడు. 'పద్దెనిమిది సంవత్సరాలా? కాస్త దీపం వెలుగులో నాముఖం చూడు!'

ఈ మాటలకు అర్థం యేమిటో తెలియక జేమ్సువేన్ ఒక క్షణం తటపటాయించాడు. తరువాత డోరియన్‌గ్రేను పక్కకు గుంజుకువెళ్ళాడు భయంభయంగా పడుతున్న వెలుతురులో డోరియన్‌గ్రే ముఖంలోకి తీవ్రంగా చూచాడు. ఈ కుర్రవాడు యిరవై వసంతాలయినా చూచివుండడనిపిస్తోంది. తనచెల్లెలు చనిపోయి పద్దెనిమిదిసంవత్సరాలయింది. ఆమె జీవితాన్ని పాడుచేసింది ఈ కుర్రవాడై యుండడు.

'హారి భగవంతుడా! కాసేట్లో నిన్ను చంపేసి వుండేవాడిని!' అంటూ డోరియన్‌గ్రేను వదలిపెట్టాడు.

డోరియన్‌గ్రే గాఢంగా నిశ్వసించాడు. అతడివంక కఠినంగాచూస్తూ 'గొప్పతప్పిదం చేయబోయి బయటపడ్డావు. ఇక ముందయినా జాగ్రత్తగా వుండు' అన్నాడు.

జేమ్సువేన్ తడబడుతూ 'నన్ను క్షమించండి. నేను మోసపోయాను. యాదాలాపంగా విన్నమాటమీద యింతగా ఉద్రిక్తుడనయాను' అన్నాడు.

డోరియన్ మెల్లగా నడకసాగిస్తూ 'ఇక యింటికి వెళ్లు. వెళ్ళగానే పిస్తోలు అవతల పారేయి. లేకపోతే ప్రమాదంలో చిక్కుకుంటావు' అన్నాడు.

జేమ్సువేన్ సంభ్రమంలో పేవ్‌మెంట్ మీదే నిలబడి వున్నాడు. ఆపాదమస్తకం కంపిస్తున్నాడు. ఒక నల్లటినీడ అత నికి సమీపంగా వచ్చింది. ఎవరిదో చేయి మీదపడటంతో ఉలిక్కిపడి అటు చూచాడు. ఇందాక హోటల్లో లిప్పతాగు తున్న స్త్రీలలో ఒకామె!

అతడి ముఖంలో ముఖం పెడుతూ 'ఎందుకతన్ని చంప కుండా వదిలావు? తెలివితక్కువవాడా! వాడిదగ్గర ఎంతో డబ్బు మూలుగుతూ వుంటుంది' అంది.

'నేను చూస్తున్నమనిషి అతడుకాదు. నాకు ఎవరి డబ్బూ అక్కర్లేదు. ఒక మగవాడి ప్రాణం మటుకు కావాలి. వానివయస్సు నలభైపైనే వుంటుంది. వీడు ఇరవైయేళ్ళ గుంటడు. తొందరపడి వీడిని చంపనందుకు సంతోషిస్తున్నాను'

ఆమె వికృతంగా నవ్వింది. 'చిన్నకుర్రాడా! యేం! ఛార్మింగ్ రాకుమారుడు నన్నిలా తయారుచేసి దగ్గర దగ్గర పద్దెనిమిది సంవత్సరాలవుతోంది!'

'అబద్ధం!' అన్నాడు జేమ్సువేన్.

ఆమె ఆకాశంవైపు చేతులెత్తి 'భగవానుడిముందు నిజం చెబుతున్నాను' అంది.

'భగవంతుడి ముందా?'

'నిజం కాకపోతే నన్ను చావగొట్టు. ఇప్పటికి పద్దెనిమిది సంవత్సరాలయింది. అతను ఎవరో అందగత్తెకు అమ్ముడు పోయాడు. అప్పటినించి నేను చూడనే లేదు' అంది.

'నిజమేనా?'

'ఒట్టు. కాని నా కత డంటే భయం. ఈ రాత్రికి నా కేదైనా డబ్బివ్వు' అంది.

అత నేదో తిట్టుకుంటూ డోరియన్ గ్రే వెళ్ళిన వీధివైపే పరుగెత్తాడు. అతను తిరిగి చూచేసరికి ఆ మెకూడా మాయమయింది.

# 17

వారంరోజుల అనంతరం డోరియన్ గ్రే సెల్బీరాయల్ భవనంలో మన్మాత్ డచెస్‌తో మాట్లాడుతూకూర్చున్నాడు. అరవైయేళ్ళ ఆమె భర్తకూడా యితరఅతిథులతో పాటు అక్కడే వున్నాడు. అది టీ సమయం. టేబిల్ మీద లైట్ల వెలుగులో అక్కడిపాత్రలు ధగధగ మెరుస్తున్నాయి. ఆమె తెల్లని చేతులూ, యెర్రని పెదవులూ మరింత ప్రకాశవంతం అవుతున్నాయి. లార్డ్ హెన్రీ కొంచెం వెనుకగా ఒక కుర్చీలో జారగిలబడి వారివైపే చూస్తున్నాడు. లేడీ మార్బరో డ్యూక్ చెపుతూన్న మాటలు వింటున్నట్టు నటిస్తోంది. హుందాగా అలంకరించుకున్న యిద్దరు యువకులు ఆడవాళ్ళకు టీ కప్పులు అందిస్తున్నారు. ఆ పార్టీలలో వున్నవాళ్లు పన్నెండుమంది. మరునాడు మరికొందరు వస్తారనుకుంటున్నారు. లార్డ్ హెన్రీ బల్లదగ్గరకువస్తూ 'యేమిటి మాట్లాడుకుంటున్నారు! అన్నిం

టికీ మళ్ళీ మతం యిచ్చే నాకార్యకలాపంగురించి బహుశా డోరియన్ చెప్పేవుంటాడు అది చక్కని ఆలోచన' అన్నాడు.

మెరుస్తున్న కళ్ళతో డచెస్ అతనివంక చూస్తూ 'నాకు మళ్ళీ మతంపుచ్చుకోవాలని లేదు హారీ! నాపేరు నాకు బాగానే వుంది. గ్రే విషయంలో కూడా అంతే అనుకుంటాను' అంది.

'అమాయకుల్లారా! నేను మీ యిద్దరిపేర్లూ మార్చాను. అవి బాగానే వున్నాయి. నేను ముఖ్యంగా పూలనుగురించి ఆలోచిస్తున్నాను నిన్న నా కోటు బొత్తాములో పెట్టుకోడానికని ఒక ఆర్చిడ్ పుష్పం కోశాను. ఆ వసం చాలా బాగుంది. అనాలోచితంగానే అక్కడితోటమాలిని 'ఈ పుష్పాన్ని యేమంటారు?' అ నడిగాను 'రోబిన్సోనియనా' అని చెప్పా డతను. వస్తువులకు చక్కటి పేర్లిచ్చే నైపుణ్యం మనం పోగొట్టుకుంటున్నాము. పేర్లలోనే పెన్నిధులన్నీ వున్నాయి. నేను చేష్టలతో పోట్లాడను. మాటలతోనే పోట్లాడుతాను. సాహిత్యంలో అభివాస్తవికతను అసహ్యించుకోవడానికి కూడా యిదే కారణం. బల్లాన్ని బల్లెము అని పిలిచేవాడు దాన్ని వుపయోగించటానికి తప్ప మరెందుకూ పనికిరాడు.

'అయితే నిన్నేమని పిలవమంటావు హారీ!' అన్న దామె.

డోరియన్ 'అతనిపేరు ప్రిన్స్ పారడాక్స్' అన్నాడు.

'అవునవును!' అంది డచెస్.

లార్డ్ హెన్రీ నవ్వుతూ 'నే నా చిన్నదాన్ని స్వీకరించటంలేదు' అన్నాడు.

'రాచరికాలు యింతటితో వదిలిపోవు.'

'అయితే నా సింహాసనాన్ని రక్షించుకోమంటావా?'

'అవును.'

'నేను రేపటిసత్యాలు చెప్తూతున్నాను.'

'అంతకంటే యివ్వాల్టితప్పులే నయం!' అన్న దామె.

'నీవు నన్ను నిరుత్సాహపరుస్తున్నావు.'

'నీ డాలు తీసేస్తున్నాను. బల్లాన్ని కాదు.'

'నేను అందాని కెప్పుడూ చలించను' అన్నాడు హెన్రీ గాలిలో చేతులూపుతూ.

'అదే నీలో తప్పు. హారీ! నామాట నమ్ము. అందమంటే నీకు చాలాదూరపువిలువ వుంది.'

'ఆమాట నీ వెట్లా చెప్పగలవు? మంచిగావుండటం కంటే అందంగావుండటమే నయమని నా వుద్దేశమని ఒప్పుకుంటాను. అయితే, అనాకారంగా వుండటంకంటె మంచిగా వుండటమే నయమని నేను వప్పుకున్నంతతొందరగా యెవరూ వొప్పుకోరు.'

'అందవికారం యేడు మహాపాపాల్లో ఒక టంటావా? ఆర్చిడ్ పువ్వుంతో నీ ఉపమానం యేమైంది' అన్నది డచెస్.

'అందవికారం యేడు మహాప్రసాదాలలో వకటి. నీవు యెంత టోరీవైనా యీమాటను కాదనటానికి వీల్లేదు. బీరూ, బైబిలూ యీ యేడు మహాప్రసాదాలూ, మన యింగ్లండును యీ స్థానంలో వుంచాయి.'

'అయితే నీ స్వదేశాన్ని నీవు మెచ్చుకోవా?' అన్న దామె.

'నేను యిక్కడే నివసిస్తున్నాను.'

'అందుకనే యింతబాగా ఖండిస్తున్నా వన్నమాట.'

'అయితే యూరపు ఉపదేశాలు తీసుకోమంటావా !'

'వాళ్ళే మంటారు?'

'తర్తఫ్ యింగ్లండులో ప్రవేశించి దుకాణం ప్రారంభించాడు అని'

'అది నీదేనా హారీ?'

'నీ కిస్తున్నాను తీసుకో.'

'నేను దాన్ని వుపయోగించలేను. అది చాలా సత్యం.'

'నీ వేమీ భయపడనక్కరలేదు. మనదేశీయులు వర్ణనను గుర్తించలేరు.'

'వాళ్ళకు ప్రత్యక్షసాక్ష్యాలు కావాలి.'

'అదేమీ కాదు, వట్టి మోసం. అవివేకమే వాళ్ళధనం. నైచ్యమే వాళ్ళకు ఘనం.'

'అయినప్పటికీ మనం చాలా గొప్పపనులు చేశాము.'

'అవును, గొప్పగొప్ప పనులు మననెత్తిన రుద్దబడ్డాయి.!

'కనీసం వాటి భారమైనా మనం మోశాము కద'

'స్టాక్ ఎక్ఛేంజి వరకే మోశాము.'

ఆమె తలతిప్పింది. 'నాకు జాతిలో నమ్మకం వుంది.'

'అది ప్రోత్సాహానికి చిహ్నం.'

'దానికీ అభివృద్ధి వుంది.'

'వినాశమే నన్నెక్కువగా ఆకర్షిస్తుంది.'

'కళ విషయం యేమిటి?'

'అ దొక వ్యాధిలాంటిది.'

'ప్రేమ?'

'భ్రమ.'

'మతం?'

'నమ్మకానికి అందమైన బురఖా.'

'నీవు నా స్తికుడివి.'

'పొరబాటు. నా స్తికత్వమే నమ్మకానికి నాంది.'

'అయితే నువ్వెవరు?'

'నిర్వచించటమంటే హద్దులుయేర్పరచటమన్నమాట.'

'నాకేమీ అర్థమవడంలేదు'

'దారం చిక్కుబడింది. నీవు అయోమయంలో పడిపోతావు.'

'చాలా ఘాటుగా వుంది. మరేదైనావిషయం మాటాడుదాం.'

'మన అభ్యాగతునిగురించే మాట్లాడుదాం. చాల సంవత్సరాల క్రిందటే అతనికి 'ప్రిన్స్ ఛార్మింగ్' అని నామకరణం చేశారు.'

డోరియన్ గ్రే 'నాకా సంగతులన్నీ జ్ఞాపకంచేయకు' అన్నాడు.

'మన అభ్యాగతి ఇవాళ చాలాసంభ్రమంగా వున్నాడు. మన్మోత్ నన్ను కేవలం శాస్త్రీయపద్ధతులమీదే కొత్త కాలపు సీతాకోకచిలక నని పెండ్లిచేసుకున్నాడు అని అతని వుద్దేశం అయివుంటుంది' అంది డచెస్.

డోరియన్ నవ్వుతూ 'మంచిదే! అతడు నీకు గుండు సూదులు గుచ్చు దనుకుంటాను డచెస్!' అన్నాడు.

'నా పరిచారిక అలాగే చేస్తుంది మిస్టర్ గ్రే.'

'ఆవిడకు అలా ఎందుకు గాభరా కలగాలి?'

'చిన్నవిషయాలనుగురించే.'

'ఎంత అవివేకం! నీవు ఆవిడకు చెప్పి చూడవలసింది.'

'అలాచెయ్యలేను మిస్టర్ గ్రే. అది నాకు కొత్తకొత్త హాట్లు కనిపెట్టి ఇస్తుంది. మొన్న లేడీ హిల్‌స్టోన్ గార్డెన్ పార్టీకి ఒకటిపెట్టుకుని వచ్చాను చూచావుకదూ! నీవు చూడలేదనుకుంటాను. అలా చూడకపోవడంకూడా నీకు అలవాటే కదూ? సరే, అది ఎలా చేసిం దనుకున్నావు? ఉత్తినే చేసేసింది. మంచి హాట్లన్నీ అలాగే చేస్తారు.'

'గొప్పకీర్తిప్రతిష్ఠ లన్నిటిలాగానే గ్లాడిస్' అన్నాడు లార్డ్ హెన్రీ.

'మనలో ఒక్కప్రభావ మున్నా మన కొకశత్రువు ఏర్పడుతాడు. ప్రజాహితాన్ని సంపాదించాలంటే అంత పెద్ద తెలివితేట లుండకూడదు.'

'స్త్రీలవిషయంలో అది నిజంకాదు' అన్నది డచెస్. 'లోకాన్ని శాసించేది స్త్రీలే. సామాన్యులకు మనం సహించలేనిమాట నిజమే. ఎవరోఅన్నట్లు మేము స్త్రీలం. మా చెవులతో ప్రేమిస్తాం- మీపురుషులు కండ్లతో ప్రేమించినట్లు - అసలు మీరు ప్రేమిస్తే——'

'మేముచేసేపని అదొక్కటే అనుకుంటాను' అన్నాడు డోరియన్.

'అయితే నీ వెన్నడూ అసలు నిజంగా ప్రేమించనే ప్రేమించ వన్నమాట' అన్నది డచెస్ విషాదసూచకమైన పరిహాసంతో.

'గ్లాడిస్, ఆమాట ఎలా అనగలవు?' అన్నాడు లార్డ్ హెన్రీ.

ప్రణయం పునరావృత్తివల్ల వర్ధిల్లుతుంది. పునరావృత్తి ఏ ఆకలినైనా కళగా మారుస్తుంది. అదీగాక ఎవరైనా ఒక మారు ప్రేమిస్తే ఆ ఒక్కసారిమాత్రమే సరిగా ప్రేమించారన్న మాట. మనం ప్రేమించేవస్తువు మారినంతమాత్రంచేత దాని తాలూకు ఉద్వేగం మారదు. పైగా మరింతఎక్కువవుతుంది. మనం జీవితంలో - ఎంతఅనుకున్నా ఒక్కగొప్పఅనుభవంతప్ప ఉండదు. ఆ అనుభవాన్ని మళ్ళీమళ్ళీ పునశ్చరణ చెయ్యడమే జీవితరహస్యం.

'ఆ అనుభవం నొప్పించినదయినా అలాగే చెయ్యాలంటావా లార్డ్ హెన్రీ?'—అని అడిగింది డచెస్ కొద్దిసేపాగి.

'ముఖ్యంగా దానివల్ల నొప్పికలిగినప్పుడే'—అన్నాడు లార్డ్ హెన్రీ.

డచెస్ డోరియన్ వంక తిరిగి అదోలా చూచింది. 'నీవేమంటావు మిస్టర్ గ్రే?'—అని అడిగింది.

డోరియన్ ఒకక్షణం ఆలోచించాడు. తరువాత తల వెనక్కువాల్చి నవ్వాడు. 'నే నెప్పుడూ హెన్రీతో ఏకీభవిస్తాను డచెస్'— అన్నాడు.

'అతను తప్పు చెప్పినప్పుడుకూడానా?'

'అత నెన్నడూ తప్పు చెప్పడు.'

'అతనితత్వం నీకు ఆనంద మిచ్చిందా'

'నే నెప్పుడూ ఆనందంకోసం అన్వేషించలేదు. ఆనందం ఎవరి క్కావాలి? నేను సౌఖ్యాన్ని వెదికాను.'

'సౌఖ్యం దొరికిందా మిష్టర్ గ్రే?'

'ఆ. చాలాసార్లు.'

డచెస్ నిశ్వసించింది. నేను శాంతికోసం వెదుకుతున్నాను'. అన్నది. 'నే నిక వెళ్ళి ముస్తాబు కాకపోతే ఈ సాయంకాలం ఎవరూ రారు'— అన్నది.

'నీకు కొన్నిపూలు తీసుకురానా డచెస్' అంటూ డోరియన్ అక్కడనుంచి లేచాడు. తోటవైపు నడకసాగించాడు.

'నీవు అతనితో మరింతచనువుగా ఉన్నట్టున్నావు. జాగ్రత్తసుమా' - అన్నాడు లార్డ్ హెన్రీ డచెస్‌తో.

'అతను అందగాడే కాకపోతే సమరం ఎందుకు?'

'గ్రీకులు గ్రీకులను కలుస్తారు.'

'నేను ట్రోజన్ల పే ఉంటాను. వాళ్ళు స్త్రీకోసం పోట్లాడారు.'

'ఓడిపోయారు'

'గెలుపుకంటెకూడా హీనమైన విషయా లున్నాయి.'

'నీగుర్రం అదుపూ ఆజ్ఞా లేకుండా పరుగెత్తుతుంది.'

'వేగంలో జీవం ఉంది'

'ఆమాట ఇవాళరాత్రి నా డైరీలో వ్రాసుకుంటాను.'

'ఏమని?'

'కాలినశిశువు నిప్పునే ప్రేమిస్తాడని.'

"నే నింతవరకూ అంటుపడలేను. నా రెక్కలు అస్పృశ్యంగానే ఉన్నాయి.'

'నీవు ఒక్క ఎగరడానికితప్ప వాటిని అన్నిటికీ ఉపయోగిస్తావు.'

'ధైర్యం పురుషులదగ్గరనుంచి స్త్రీలకు బదిలీఅయింది. ఇదొక కొత్తఅనుభవం.'

'నీ కొకప్రత్యర్థికూడా ఉన్నాడు.'

'ఎవ రతను?'

అతను నవ్వాడు. 'లేడీ నార్బరో' – అన్నాడు మెల్లగా 'ఆవిడ అతన్నిపూజిస్తోంది.'

'నీవు నన్ను కలవరపరుస్తున్నావు. మేము కల్పనావాదులం.'

'కల్పనావాదులా! మీకు శాస్త్రీయపద్ధతులన్నీ ఉన్నాయి.'

'పురుషులు మాకు విజ్ఞానం కలిగించారు.'

'కాని వివరం చెప్పలేదు.'

'మమ్మల్నొకజాతిగా వర్ణించండి.'

'మీకు రహస్యాలంటూ లేవు.'

ఆవిడ అతనివంక చిరునవ్వు నవ్వుతూ చూచింది. 'డోరియన్ గ్రేను వదిలి చాలాసేపయింది. వెళ్ళి సాయం చేదాం రా. అతని కింకా నా ఫ్రాక్ రంగు నేను చెప్పలేదు –'

నీఫ్రాక్ రంగూ అతనిపూలరంగూ సరిపోవాలి గ్లాడిస్.'

'అది ముందుగా మనం లొంగిపోవడ మవుతుంది.'

'కాల్పనికకళ క్లైమాక్సులోనే ప్రారంభిస్తుంది.'

'నేను తిరోగమనానికి అవకాశం జాగ్రత్త చేసుకోవాలి.'

'పార్థియన్ పద్ధతిలోనా?'

'వారికి ఎడారిలో శరణ్యం దొరికింది. నా కలా కాదు.'

'స్త్రీలకూ ఎప్పుడూ అవకాశమంటూ ఉండదు,— అన్నాడతను. ఇలా అన్నాడో లేదో తోట అటువైపునుంచి ఒక సన్నని కేక వినిపించింది. ఎవరో క్రిందపడిన చప్పుడయింది. అంతా ఉలికిపడ్డారు. డచెస్ భయంతో నిశ్చలంగా నిల్చుంది. కళ్ళలో నిండిన భయంతో లార్డ్ హెన్రీ కొబ్బరిచెట్ల మధ్య తోవగుండా పరుగెత్తుకుని వెళ్ళాడు. డోరియన్ గ్రే ముఖాన్ని క్రిందుగా పెట్టుకుని నేలమీద మూర్ఛలో పడిఉన్నాడు. వెంటనే అతన్ని డ్రాయింగ్ రూమ్‌లోకి తెచ్చి సోఫామీద పడుకోబెట్టాడు. కొద్దిసేపట్లో అతనికి తెలివివచ్చింది. చలిత దృష్టితో నలువంకలా కలయచూచాడు.

'ఏం జరిగింది?' — అని అడిగాడు. 'ఆ — జ్ఞాపకం వస్తోంది. ఇప్పుడు క్షేమంగా ఉన్నానా హారీ —' అని వణికిపోసాగాడు.

'డోరియన్, నీవు మూర్ఛిల్లావు. అంతే. మరి వచ్చిన ఫరవాలేదు. చాలా అలసిపోయి ఉంటావు. నీ విప్పుడు క్రిందికి డిన్నర్‌కు రాకుండా ఉండడం మంచిది. నీకు మారుగా నేను వెడతాలే.'

'కాదు, వస్తాలే' — అన్నాడు మెల్లగా లేస్తూ 'నేనూ వస్తాను. నేను ఒంటిగా ఉండడం మంచిది కాదు.'

తన గదిలోకి వెళ్ళిముస్తాబయ్యాడు. అతను టేబిల్ దగ్గరకు వచ్చి కూచోగానే అతని తరహాలో ఒక నిర్లక్ష్యమైన

కులాసా కనుపించింది. మధ్యమధ్యలో అతని కా విషయం జ్ఞాపకంరాగానే ఒక భయం విద్యుత్ప్రవాహంలా అతని నరాల్లో ప్రవహించసాగింది. ఒక తెల్లని చేరుమాలులాగా పూ మొక్కల గది కిటికీఅద్దానికి నునుకు అద్దుకోగానే ఏదో ముఖం అతనికి కనుపించసాగింది.

# 18

ఆ మరుసటిరోజంతా అతను ఇంట్లోనే ఉన్నాడు. గదిలోనే కూచున్నాడు. గడపదాటి బైటికి వెళ్ళలేదు. చావు భయం అతన్ని దెయ్యంలా పీడించసాగింది. అయినా బ్రతుకంటే అంత లెక్క చెయ్యలేదు. అతన్ని వేటాడుతారనే భయం అతన్ని పూర్తిగా ఆవేశించసాగింది. ముత్యాల తెర గాలికి అల్లాడుతే చాలు అతనుకూడా అల్లాడసాగాడు. కిటికీ అద్దాలకు అంటుకున్న ఎండుటాకులు అతనికి చలిత నిశ్చితాల్లోగా కనుపించసాగాయి. అతను కండ్లు మూసుకుంటే చాలు ఆ నావికునిముఖం కిటికీఅద్దంలోంచి తొంగిచూస్తున్నట్టు కనుపించసాగింది. మళ్ళీ అతనిహృదయంలో భయం తొంగిచూస్తోంది. ఆ రాత్రి అతనిమీంద ప్రతీకారం తీర్చుకోదలచుకున్నది కేవలం అతని ఊహే కావచ్చు. అతని కళ్ళముందు ఎన్నెన్నో ఊహాచిత్రాలు కనుపింప సాగాయి. అసలు బ్రతుకంతా అల్లకల్లోలంగా ఉంటుంది. ఊహలోనే ఏదో ఒకచిత్రమైన తీరు వుంది. పాపాన్ని పసిగట్టడానికి పశ్చాత్తాపాన్ని పంపేది ఊహే. ప్రతినేరం ఊహాల తీగలపందిరి అల్లుకునేట్టు చేసేదికూడా ఈ ఊహే.

వాస్తవలోకంలో దుష్టులను ఎన్నడూ శిక్షిస్తూ ఉండదు. మంచివాళ్ళకు బహుమానాలూ ఉండవు. బలంగలవాళ్ళకు విజయం, లేనివాళ్ళకు పరాజయం కలుగుతూ ఉంటుంది. అంతే. అంతకంటే మరేం కాదు అదీకాక, ఇంటిచుట్టూ అపరిచితుడు మరెవరైనా తిరుగుతూ వున్నట్లయితే ఇంటి సేవకులో, మరి పొరుగువారో, మరెవరైనా చూచి ఉండేవారే. తోటపూలతోటల్లో అడుగుజాడలు కనుపిస్తే తోటమాలి తనకు చెప్పిఉండేవాడే. అవును. ఇదంతా కేవలం ఊహ. సిబిల్ వేన్ తమ్ముడు మళ్ళీ తనని చంపడానికని తిరిగిరాలేదు. అతను ఏ శీతాకాలపు సముద్రంలోనికో పడవ వేసుకుని వెళ్ళాడు. ఏది ఏమైనా అతనివల్లమాత్రం ప్రమాదంలేదు. తనెవరో అతనికి తెలీదు. ఇకముందుకూడా తెలీదు. తన యౌవనపుముసుగే తనని కాపాడింది.

అయినా - అది కేవలం ఊహమాత్రమే అనుకున్నా - అంతరాత్మ అంతభయంకరమైన దృశ్యాలు మనస్సులో మొలకెత్తిస్తుందంటే - అదెంత భీకరం! రాత్రింబగళ్ళు ఇలాగే నిశ్శబ్దపుమారుమూలలనుంచి తననేరాలనీడలు తొంగిచూస్తూ తనని వెక్కిరిస్తూంటే—, ఒకక్షణంకూడా తనని విడవకుండా తను భోజనంముందు కూచున్నప్పుడు తనచెవిలో ఏవో రహస్యాలూదుతూ, తను కళ్ళుమూస్తేచాలు - చల్లని కొనవ్రేళ్ళతో రెప్పలు తెరుస్తూంటే—, ఇక—ఈ బ్రతుకు కేం బ్రతుకు? ఆ భావం బిలబిలా అతనిమనస్సులోకి దూరంగానే అతని భయం ముఖంలోని నెత్తురంతా విరిచింది. గాలి హఠాత్తుగా గడ్డకట్టినట్టనిపించింది. ఓ! ఎలాటి ఉన్మాదక్షణంలో తను తనస్నేహి

తుణ్ణి చంపాడు! ఆదృశ్యం జ్ఞాపకంవస్తే చాలు - ఎంత భయం వేస్తుంది! మళ్ళీ ఆ దృశ్యమంతా అతనికి జ్ఞాపకం వచ్చింది. కొత్తభయాలతో ఆ దృశ్యమంతా మళ్ళీ అతనిమనస్సుముందు పొడగట్టసాగింది. నల్లనికాలకుహరంలోనుంచి తనపాపరూపం మేలుకోసాగింది. లార్డ్ హెన్రీ వచ్చేసరికి ఆరుగంటలు కావస్తోంది. అప్పుడతను పసిపిల్లవానిలా ఏడుస్తున్నాడు.

మూడురోజులవరకూ అతను ఇల్లుదాటి అడుగుబైటపెట్టలేదు. అది శీతాకాలపుఉదయం. గాలిచల్లగా వీస్తోంది. ఆచల్లనిగాలి పైన్ వాసనతో గుబాళిస్తోంది ఆచల్లనిగాలికి మళ్ళీ అతనిలో ఏదోఆనందం జీవనాసక్తి చివురించినట్లయింది. కాని అలా తనలో మార్పుకలగడానికి కేవలం శారీరక పరిస్థితులే కారణమని చెప్పడానికి వీల్లేదు. తనస్వభావమే అధికమైపోయిన తన బాధాతప్తపై తిరుగుబాటుచేసింది. తననింపాదికి భంగపాటు కలగకుండా చూచుకుంది. సూక్ష్మమైన సున్నితస్వభావం ఎప్పుడూ అలాగే ఉంటుంది. అలాటిస్వభావాలు ఉద్వేగాలకు గాయపడతాయి. లేక ఆఉద్వేగాలు లొంగిపోతాయి. మనిషిలో నిలవనీరులా ఉండిపోతాయి. లేక వాడిపోతాయి. లోతులేని శోకాలు, లోతులేని ప్రణయాలు ఎక్కువకాలం మనుతాయి. ఉదారాలూ ఉత్తాలాలూ అయిన ప్రేమలూ శోకాలూ వాటి ఉత్తాలతకే అవి ఆహరింపబడిపోతాయి. అదీకాక అతనికి మరో నమ్మకంకూడా కలిగింది. అతను ఒక భయచలితమైన ఊహకు బందీఅయ్యాడు. అంతే. ఇప్పుడు అతనిభయాలను అతనే ఒక విధమైన జాలితోనూ కొద్దిఅసహ్యంతోనూ చూచుకోగలుగుతున్నాడు.

భోజనమైనతరువాత ఒకగంటసేపు డచెస్‌తో కలిసి తోటలో నడిచాడు. తరువాత నేటసార్లీని కలుసుకోడానికి పార్కుకు వెళ్ళాడు. మంచు ఉప్పురిసినట్టు గడ్డిపై పరుచుకొని ఉంది. బోర్లగిలపెట్టిన నీలపుపాత్రలాగా ఉంది ఆకాశం. ఒక సన్ననిమంచుతెర నాముదింపిన కొనేటినీళ్ళను కప్పింది.

అడవికొసను డచెస్‌తమ్ముడు సర్ గాఫ్రి క్లస్టన్ కనుపించాడు. రెండు తోటాలను తుపాకీనుంచి తీసివేస్తున్నాడు. బండిదిగి సేవకునితో గుర్రాన్ని ఇంటికి తీసుకునివెళ్ళమనిచెప్పి తోటలోగుండా తోవచేసుకుంటూ తన అతిథిని కలుసుకోడానికి వచ్చాడు.

'ఆటబాగాసాగిందా గాఫ్రీ?' అని అడిగాడు డోరియన్.

'అంతబాగా సాగలేదు డోరియన్. పక్షులన్నీ పికారు వెళ్ళాయి. భోజనం తరువాత అయినట్లయితే బావుండేది. అప్పుడు కొత్తచోట పికారు మొదలెట్టవచ్చు.'

డోరియన్ అతని ప్రక్కనే నడవసాగాడు. సన్ననిగాలి, అడవిలో అక్కడక్కడ మిలమిల మినుకుమినుకుమనే ఎర్రని గోధుమవన్నె దీపాలు, మధ్యమధ్యలో వినిపిస్తున్న సన్నని కేకలు, తుపాకులమోతలు ఇవన్నీ - అతన్ని చిత్రంగా ఆకర్షింపసాగాయి. ఒక తీయని స్వేచ్ఛతో అతన్ని ముంచెత్తసాగాయి. ఆనందంలోని నిర్లక్ష్యత అతన్ని పూర్తిగా ఆవరించింది.

హఠాత్తుగా వారికెదురుగా ఉన్న ఒక గరిక పొదలో నుంచి ఇరవైగజాల దూరంలో నల్లనిచుక్కలుగల చెవులు నిక్కించుకుని మెడచాచి ఉలికిపడి ఒకకుందేలు తొంగిచూచింది.

మారో పొదలోకి తుర్రున పరుగెత్తుకుని వెళ్ళింది. సర్ గాఫ్రే వెంటనే తుపాకి సారించాడు. కాని ఆ చిన్ని కుందేటి కదలికల అందంలో ఏదో ఒక విచిత్రం డోరియన్‌ను ఆకర్షించింది. అతను వెంటనే 'దాన్ని కాల్చకు గాఫ్రే. బ్రతకనీ'—అన్నాడు.

'ఇదేం వెర్రి డోరియన్ !'— అని నవ్వాడు మిత్రుడు. కుందేటిపిల్ల పొదలోకి పరుగెత్తుకునిపోగానే కాల్చాడు. ఒకే మారు రెండు కేకలు వినిపించాయి. ఒక కేక నొప్పితగిలిన కుందేటిపిల్లది. రెండవది అంతకంటే నొప్పికలిగిన మనిషిది.

'అయ్యో! ఒక వేటగాణ్ణి కొట్టాను' — అన్నాడు సర్ గాఫ్రె. 'వట్టి మతిమాలినవాడిలా ఉన్నాడు. తుపాకులకు అడ్డువచ్చాడు. —' అని 'ఇక అక్కడ కాల్పులు ఆపండి —ఒక మనిషికి దెబ్బతగిలింది' — అన్నాడు.

వేటగాడు పరుగెత్తుకుని వచ్చాడు. అతని చేతిలో ఒక చిన్నకర్ర ఉంది. 'ఎక్కడండీ ? ఎక్కడ?' అంటూ వచ్చాడు. ఈలోగా కాల్పులు ఆగిపోయాయి.

'ఇక్కడే — అంటూ సర్ గాఫ్రె పొదదగ్గరకు పరుగెత్తుకుని వెళ్ళాడు.

'మీా మనుష్యులను ఇక్క డెందుకు ఉంచావు. ఇవాళ నా వేటంతా పాడుచేశారు' — అన్నాడు.

వారు చెట్లకొమ్మలు ప్రక్కలకు తొలగించుకుంటూ వెలికిరావడం డోరియన్ చూచాడు. కొద్దిక్షణాల్లో వారు ఒకదేహాన్ని లాక్కుంటూ బైటకి వచ్చారు. అతను భయంతో ముఖం పక్కకు తిప్పుకున్నాడు. అతను ఎక్కడికివెళ్ళినా దుర దృష్టం అతని కాలికి తీగలా తగులుకుని వచ్చేలా అనిపించింది

'అతను చనిపోయాడా' అని అడిగాడు గ్రాఫె. 'అవు'నన్నాడు వేటగాడు. అడవినిండా అప్పుడు ముఖాలు విచ్చుకున్నట్టుగా కనుపించాయి. కొన్ని వేల అడుగులచప్పుడు వినిపించింది. మెల్లనికంఠస్వరాలు తుమ్మెదలరొదలా వినిపించాయి. పావురాయి రెక్కలు రెపరెప చప్పుడుచేసుకుంటూ కొమ్మలచాటు నుంచి ఎగిరివచ్చింది.

'కొద్దిక్షణాలుగడిచాయి' కలవరంతో కళపెళలాడిన క్షణాలు అంతులేని యుగాల్లా కనుపించాయి. తరువాత – ఒక చెయ్యి అతనిబుజాన్ని తాకింది. ఉలికిపడి తిరిగిచూచాడు.

'డోరియన్!' అని పిలిచాడు లార్డ్ హెన్రీ. 'ఇవాల్టికి వేట ఆపుచెయ్యమని చెప్పా లనుకుంటున్నాను. ఇవాళ వేట అంతబాగాలేదు' – అన్నాడు.

'ఎప్పటికీ ఆపుచెయ్యడం మంచిది' – అన్నాడు డోరియన్ విరసనగా. 'ఆమనిషి ఏమయ్యాడు...?' – వాక్యం పూర్తి చేయ లేకపోయాడు.

'అవుననుకుంటాను గుండెలో బాగా గాయం తగిలింది. వెంటనే చనిపోయి ఉంటాడు. సరే. ఇక రా. ఇంటికి వెడదాం'

ఇద్దరూ ప్రక్క-ప్రక్కనే తోటవైపు నడవసాగారు. కొద్దిక్షణాలు ఒకరితో ఒకరు మాట్లాడుకో లేదు. తరువాత డోరియన్ లార్డ్ హెన్రీవంక చూచి బరువుగా నిశ్వసించి 'ఇది చాలా చెడు శకునం హెన్రీ – చాలా చెడ్డశకునం' – అన్నాడు.

'ఏదీ?' – అన్నాడు లార్డ్ హెన్రీ. 'ఈ సంఘటనేకదూ– అవును – మరేంచేస్తాం? అది అతని తప్పే. అతను తుపాకికి

ఎదురుగా ఎంచాత రావాలి? అదీకాక ఆవిషయం నాక కలవ సరం. గ్రాహైమకూడా. అతనికాల్పు సూటిగా వెళుతుంది. అయినా ఆ విషయం మాట్లాడడం అనవసరం.'

డోరియన్ తలఊపాడు. 'ఇది చాలా చెడుశకునం హెన్రీ. మనలో ఎవరికో ఏదో పెద్దప్రమాదం జరిగేలా ఉంది. బహుశా నాకే కావచ్చు' - అన్నాడు కండ్లు బాధతో ఒత్తుకుని.

అతను నవ్వాడు 'లోకంలో భీకరమైన విషయం ఒకటే ఉంది డోరియన్. అది భయం. క్షమాపణంటూ లేనిపాపం అదొక్కటే. కాని మనం అందువల్ల బాధపడ మనుకుంటాం. వీళ్ళు భోజనంముందు ఇదే ప్రస్తావన తీసుకుని వస్తే ఆపవలసిం దని చెబుతాను. ఇక శకునా లంటావా? అలాంటి వేమీ లేవు. విధి చాలా తెలివిగలది. ముందుగా తన రాయబారు లను మనకు పంపించదు. అదీకాక ఉత్తిభయంకాని,నీకు జరిగే ప్రమాద మేమిటిచెప్పు. మనిషికి కావలసినవన్నీనీకు ఉన్నాయి. నీతో మారకానికి ఎగిరిగంతెయ్యని వ్యక్తంటూ ఉండడు' - అన్నాడు.

'అదికాదు హెన్రీ - నేను మారకానికి ఏవ్యక్తితో నైనా ఒప్పుకుంటాను. అలా నవ్వకు. నా మనసులోఉన్న మాట చెబుతున్నాను. ఇప్పుడు చనిపోయిన ఆ... నాకంటె ఎన్నోరెట్లు అదృష్టవంతుడు. నాకు మృత్యుభయం కాదు. దానిరాకను చూస్తేనే నాకు భయం. నాచుట్టూఉన్నగాలిలో దాని రెక్కలచప్పుడు వినిపిస్తూఉంది. అయ్యో! ఆ చెట్లచాటున

ఎవరో నాకోసం తారట్లాడుతూ కాచుకుని వేచిఉన్నట్టు కనుపించడం లేదూ ?'

వణుకుతున్న వేలు చూపుతున్న దిశవైపు చూచాడు లార్డ్ హెన్రీ 'అవును, తోటమాలి నీకోసం కాచుకుని ఉన్నాడు. ఇవాళరాత్రికి టేబిల్ పై నీవు ఎలాటిపూలు కోరుకుంటావో నిన్ను అడగాలని కాచుకుని ఉన్నాడనుకుంటాను. ఎంతభయస్థుడి వబ్బాయ్. నీవు నగరానికివచ్చినప్పుడు ఒకమాటు వచ్చి నా డాక్టర్ని చూడాలి సుమా.'

తోటమాలి దగ్గరకు వస్తూండగా చూచి డోరియన్ ఒకమాటు బరువు తీరినట్టు నిశ్వసించాడు. అతను హాట్ స్పృశించి ఒకక్షణం ముందుకు వెనకాడుతున్నట్టుగా లార్డ్ హెన్రీ వంక చూచి ఆతరువాత ఒక ఉత్తరాన్ని తెసి తనయజమానికి అందించాడు. 'అమ్మగారు నన్ను జవాబుకోసం వేచి ఉండమని కోరారు' అన్నాడు.

డోరియన్ ఉత్తరం జేబులో పెట్టుకున్నాడు. 'ఆ విడతో నేను వస్తున్నానని చెప్పు' అన్నాడు ముక్తసరిగా. అతను వెనక్కుతిరిగి త్వరత్వరగా ఇంటిదిక్కుకు వెళ్ళాడు.

'స్త్రీలకు ప్రమాదకరమైన పనులు చెయ్యడమంటే ఎంతఇష్టం' – అని నవ్వాడు లార్డ్ హెన్రీ. 'వారిలో నే నెక్కువగా ప్రశంసించే గుణగణాలలో అదొకటి. ఇతరులు చూస్తున్నంతకాలము స్త్రీ ఎవరితోనైనాసరే పూజాచేస్తుంది.'

'ప్రమాదకరమైన విషయాలు చెప్పడమంటే నీకెంత ఇష్టం హెన్రీ ! ఈ విషయంలో మాత్రం నీవు చెప్పింది సరి

కాదు. నాకు డచెస్ అంటే ఎంతో మక్కువ. కాని నేను ఆవిడను ప్రేమించడంలేదు.'

'కాని డచెస్‌మాత్రం నిన్నెంతో ప్రేమిస్తూంది. అయినా నీవంటె అంతఇష్టం లేదు. అంచాత మీకు జోడు బాగా కుదిరింది.

'నీవు అపనిందవేస్తున్నావు హెన్రీ. కాని అపనిందకు ఎప్పుడూ ఆధారంలేదు.'

'ప్రతి అపనిందకూ ఆధారం ఒక అవినీతికరమైన నిశ్చితత్వం'- అన్నాడు లార్డ్ హెన్రీ సిగరెట్ వెలిగిస్తూ.

'ఒక్క విసురుకోసం ఎవరినీ లెక్కచెయ్యావు హెన్రీ.'

'లోకం దానంతట అదే బలిపీఠందగ్గరకు వెళుతుంది.'

'నేను ప్రేమించగలిగితే ఎంతబావుండేది.' అన్నాడు డోరియన్ విషాదం వెల్లివిరిసిన కంఠస్వరంతో 'కాని నాలో ఉద్వేగం వాడిపోయినట్టుంది. కోరికను మరిచిపోయినట్టుగా ఉన్నాను. నేను నన్నే ఎక్కువగా ధ్యానించుకున్నాను. నాకు నేనే బరువైపోయాను. దీనినుంచి తప్పించుకుందా మనుకుంటాను. ఎక్కడికో వెళదా మనుకుంటాను. మరిచిపోదా మనుకుంటాను. ఇక్కడికి నేను రావడం ఎంతో వెర్రి. హార్వేకు బండి తయారుగాఉంచమని కబురుపంపుతాను. అలా చేస్తే కొంచెం క్షేమంగా ఉంటుంది.

'దేనినుంచి క్షేమం డోరియన్ ? నీ వేదో బాధలో ఉన్నట్టున్నావు. అదేమిటో నాకు చెప్పకూడదూ? నీకు నేను సహాయంచేస్తానని నీకు తెలుసుకదా!'

'అలా చెప్పలేను హెన్రీ' అన్నాడు.

'అదీకాక ఇది కేవలం నా ఊహామాత్రమే కావచ్చు. ఈ సంఘటన నన్ను తల్లక్రిందులు చేసింది. ఇలాంటి ఘటనే నాకూ జరగవచ్చునని ఎంచాతనో కాని అనిపిస్తున్నది.'

'ఏమి టీ వెర్రి?'

'అవును. ఎన్నిసార్లు కాదనుకున్నా అలాగే అని పిస్తోంది. ఆ – అదుగో – డచెస్ వస్తూంది. ఆర్టెమిస్‌లాగా అలంకరించుకుంది. – మళ్ళీ వచ్చాం డచెస్.'

'అంతా విన్నాను మిస్టర్ గ్రే. గ్లాడ్ఫ్రేకూడా చాలా తల్లకిందులైపోయాడు. నీ వతన్ని కుందేటిపిల్లని కాల్చవద్దని చెప్పావటగా. ఎంత చిత్రం!'

'అవును చిత్రమే. అలా అప్పుడు ఎంచాత చెప్పానో తెలీదు. అదొక ఖయాలీ. చిన్నచిన్నపదార్థాలన్నిటిలోకి అదెంతో చూడముచ్చటగా కనుపించింది.'

'అయినా నీకు ఆ విషయం తెలిసిం దనుకుంటాను.'

'అది చాలా కలవరం కలిగించే విషయం' అన్నాడు లార్డ్ హెన్రి. దానికి మన స్తత్వశాస్త్రాలూను విలువలేమీ లేవు. గాడ్ఫ్రే ఆపని కావాలనుకుని చేసిఉన్నట్లయితేఎంతబా వుండేది? నాకు నిజంగా హత్యకావించిన వ్యక్తిని చూడాలని ఉంది' – అన్నాడు.

'ఇదేం ఘోరం హెన్రీ – కాదూ మిస్టర్ గ్రే? హారీ! మిస్టర్ గ్రే మళ్ళీపడిపోతున్నాడు' – అన్నది డచెస్.

డోరియన్ మళ్ళీ తనను ఎంతో ప్రయత్నంమీద చిక్కబట్టుకుని చిరునవ్వు నవ్వి 'ఏంలేదు డచెస్. నా నరాలు ఇవాళ బాగా దెబ్బతిని బలహీనంగా ఉన్నాయి. అంతే.

ఇవాళ చాలాదూరం నడిచినట్టున్నాను. హారీ చెప్పినమాటలు నేను వినలేదు. అంతే. ఏమన్నాడు? మరోసారి చెప్తువుగానిలే. ఇక వెళ్ళి పడుకుంటాను. నన్ను క్షమిస్తా వనుకుంటాను' – అన్నాడు డోరియన్.

ఎత్తుగా వున్న మేడమెట్లదగ్గరకు వెళ్ళాడు. పూల మొక్కల గదినుంచి పైఅంతస్తుకు కొట్లవరుస వుంది. డోరియన్ లోనికి వెళ్ళాడు. గ్లాసు తలుపు మూసుకోగానే లార్డ్ హెన్రీ తిరిగి డచెస్‌వంక నిద్రమత్తుగా కనుపించే కండ్లతో చూచి, 'అతన్ని నీవు గాఢంగా ప్రేమిస్తున్నావా?' – అని అడిగాడు.

ఆవిడ వెంటనే సమాధానం చెప్పలేదు. ప్రకృతివంక చూస్తూ అలాగే నిల్చుంది. 'నా కా విషయం తెలిస్తే ఎంతో బావుండేది' అన్నది.

అతను తలఊపాడు. 'విజ్ఞానం ప్రమాదకరమైంది. అనిశ్చితత్వంలోనే అందంఉంది. మంచుతెరచాటునే అందం ఉంది.'

'మంచులో సూర్యత్రోవ పట్టవచ్చు.'

'అన్నిదోవలూ ఒకేచోటకి దారితీస్తాయి గ్లాడిస్'

'అదేమిటి?'

'విఫలాశ.'

'అదే నాబ్రతుకు.'

'నేనూ అదే కిరీటం ధరించాను'

'స్ట్రాబెర్రీ ఆకులతో విసిగిపోయాను.'

'అవే నీ వవుతావు.'

'నలుగురిలో నే'

'వాటిని నీవు పోగొట్టుకుంటావు'

'ఒక్క ఆకు కెమ్మనుకూడా వదలను'

'వృద్ధాప్యం విసరానిది'

'అతని కెన్నడూ అసూయ లేదా?'

'ఉంటే బావుంటే దనుకుంటాను.'

అతడు ఏదో వెదకుతున్నట్లు నలువంకలా చూచాడు.

'దేనికోసం వెదకుతున్నావు?'– అనిఅడిగింది.

'నీవు గుండీ జారవిడిచావు.'

ఆవిడ నవ్వింది. 'నా కింకా ముసుగు ఉంది' అన్నది.

'అంచాత నీకండ్లు మరింత అంద.గా కనుపిస్తున్నాయ్' అన్నాడు.

ఆవిడ మళ్ళీనవ్వింది. ఎర్రనిదానిమ్మపండులోని తెల్లని గింజల్లా కనుపించాయి ఆవిడపళ్లు.

మేడమీద గదిలో డోరియన్ గ్రే సోఫాలో పడుకుని ఉన్నాడు. అతని దేహం నరనరంలోనూ భయం పరుగులుతీస్తూఉంది. జీవితం హఠాత్తుగా ఒకభరించికాని భారంగా కనుపించ సాగింది. పొదలో జంతువులా దెబ్బతిని చనిపోయిన మనిషిమృత్యువు తనకు రానున్న మృత్యువుకు నాందిలా కనుపిస్తూఉంది. పరాచకానికి లార్డ్ హెన్రీ విసిరిన ఒక్కమాటకే అతను మూర్ఛిల్లినంత పనయింది.

అయిదు గంటలకు గంటకొట్టారు. సేవకుడు రాగానే రాత్రి ఎక్స్ప్రెస్కు పట్నానికి వెళ్ళడంకోసం అన్నీ పాక్ చెయ్యమని చెప్పాడు. ఎనిమిదిన్నరకల్లా బండి వాకిట ఉండాలని

చెప్పాడు. సెల్ఫ్‌ట్రాయల్‌లో ఇంకొక్క రాత్రి కూడా గడప దలచుకోలేదు. అది అపశకునాలకు ఆలవాలం. మృత్యువు పట్టపగలే పచార్లుచేస్తుంది. గడ్డిపరకలు నెత్తురుచుక్కల్లా కనుపిస్తాయి.

తరువాత లార్డ్ హెన్రీకి తను డాక్టర్ సలహాకోసం పట్నానికి వెడుతున్నానని, తనులేనిసమయంలో తన అతిధులను వినోదింపచెయ్యవలసిందని ఒకచీటీ వ్రాసిపెట్టిపోయాడు. ఉత్తరం కవరులో పెడుతూఉండగా తలుపుచప్పుడు వినిపించింది. వేటగాడు ఎవరో చూడాలని కోరుతున్నాడని చెప్పాడు సేవకుడు. డోరియన్ ముఖంచిట్లించుకుని పెదవికొరుకున్నాడు. 'సరే లోపలికి పంపు' అన్నాడు కొద్దిసేపాగి.

అతను లోనికి రాగానే డోరియన్ చెక్‌పుస్తకం తీసి అతనిముందుంచాడు.

'ఉదయంజరిగిన దురదృష్టసంఘటన సందర్భంలో వచ్చావనుకుంటాను థారన్‌టన్?' అన్నాడు పెన్ తీసుకుని.

'అవునయ్యా.'

'పాపం, అతనికి పెండ్లయిందా? భార్యాబిడ్డలు కాని మరెవరయినాకాని అతనిమీద ఆధారపడినవా ళ్ళున్నారా? అలా అవుతే వారు లేమితో అవస్థలుపడడం నాకు ఇష్టంలేదు. మీరు ఎంతడబ్బడిగితే అంత పంపుతాను.'

'అత నెవరో మాకు తెలీదయ్యా. అందుకనే తమదగ్గరికి రాగలిగాను.'

'అత నెవరో తెలీదా! అదేమిటి? అతను మీలోవాడు కాదా?

'కాదయ్యా ఇంతవరకూ ఎన్నడూ అతన్ని చూడలేదు. సెయిలర్‌లాగా ఉన్నాడు.'

డోరియన్ చేతిలో కలం జారిపోయింది. గుండెకొట్టుకోవడం ఒక్కసారిగా ఆగినట్టయింది. 'సెయిలరా? ఏమన్నావ్? సెయిలరా?' -అన్నాడు.

'అవునయ్యా. సెయిలర్‌లాగానే కనిపిస్తున్నాడు. రెండు చేతులకూ పచ్చలు - ఏవో అలాంటివి ఉన్నాయి'

'మరేమైనా గుర్తులు కనుపించాయా?' - అన్నాడు డోరియన్ ముందుకువంగి ఉలికిపడినకండ్లతో అతనివంక చూస్తూ. 'అతనిపేరు తెలుసుకోడానికి వీలుందా?'

కొంత డబ్బుంది సార్. అదీ అంతఎక్కువ లేదు. ఒక సిక్స్‌షూటర్ ఉంది. మరి పేరేమీ లేదు. మనిషి చూడ చక్కగా ఉన్నాడు. ఎవరో సెయిలరల్లే ఉన్నాడు.'

డోరియన్ వెంటనే లేచాడు. ఆశ మళ్ళీ అతనిలో సీతాకోకచిలుకలా రెపరెపలాడసాగింది. దాన్ని గట్టిగా అణచుకున్నాడు. 'ఏదీ ఆ దేహం? ఎక్కడుంది? నేను వెంటనే చూడాలి' అన్నాడు.

'ఖాళీగాఉన్న చావడిలో ఉంది సార్. ఎవరూ అలాంటి కళేబరాలను ఇళ్ళలో ఉంచుకోరు. కళేబరాలవల్ల అదృష్టం తొలగుతుందనుకుంటారు'.

'చావడిలోనా? సరే పదండి. నేనూ అక్కడికి వస్తున్నాను' నాసేవకునితో నాగుర్రాన్ని తీసుకురమ్మని చెప్పండి. -అవసరం లేదులే. నేనే వస్తున్నాను.'

ఒకపావుగంటలో డోరియన్ గుర్రంపై తోటలో వేగంగా దౌడుతీస్తూ వెడుతున్నాడు. చెట్లు వరుసలుతీరి పచ్చనిబారులై వెనక్కు పరుగులుతీస్తున్నట్లుగా ఉన్నాయి. పెద్దపెద్దనీడలు అతనిత్రోవను అడ్డుతగులుతున్నాయి. ఒకమాటు ఆ గుర్రం గేట్‌పోస్ట్‌కు డీకొనబోయి అతను కిందపడేటంత పనయింది. అతను ఒకమాటు దాన్ని ఉలికిపడేటట్టు చేశాడు. అది శరంలాగ దూసుకునిపోయింది.

చివరకు చావడి చేర్చాడు. ఇద్దరు పెరట్లో పచార్లు చేస్తున్నారు. అతను జీనుపైనుంచి దూకి కళ్ళాలు ఒకరికి అందించాడు. దూరంగా ఉన్న చావడిలో ఒకదీపం మినుకు మినుకుమంటూ ఉంది. అక్కడే దేహం ఉందని అతని కేదో చెప్పినట్టు తోచింది. ఆ తలుపుదగ్గరికి పరుగెత్తుకునివెళ్ళి గడియమీద చెయ్యి ఉంచాడు.

అక్కడ ఒక్కక్షణం ఆగాడు. తనజీవితాన్ని వికసింపచేసేదో, వినష్టంకావించేదో అక్కడే ఉందని అనుకున్నాడు. తరువాత తలుపుతెరచి లోనికి వెళ్ళాడు.

ఒకమూల బస్తామీద ఒకమనిషిశవం ఉంది. గరుకుగా ఉన్న చొక్కా. నీలంగా ఉన్న పంట్లాం. చుక్కలుచుక్కలుగా ఉన్న చేరుమాలు ముఖానికి కప్పబడి ఉంది. ఒకసీసాలో ఉంచిన కొవ్వొత్తిదీపం ప్రక్కనే మినుకుమినుకుమంటూ ఉంది.

డోరియన్‌గ్రే వణికిపోయాడు. తనచేతితో ఆ చేరుమాలు తొలిగించలే ననుకున్నాడు. ఒకసేవకుణ్ణి పిలిచాడు. 'అది తీసెయ్. అది నేను చూడాలి' అన్నాడు గడపను గట్టిగా ఆనుకుని నిల్చుని.

సేవకుడు అలా చెయ్యగానే ఒకఅడుగు ముందుకు వేశాడు. అతనిపెదవులనుంచి ఒకసన్నని ఆనందంతోకూడిన కేక వెలికివచ్చింది. ఆ పొదలో కాల్చివెయ్యబడింది జేమ్స్ వేన్.

ఆ మృతకళేబరాన్ని చూస్తూ కొద్దిసేపు చాలసేపు అలాగే నిల్చున్నాడు. ఇంటికి వెనుదిరుగుతుంటే ఇక తనకు ప్రమాదంలేదుకదా అని కళ్ళనిండా కన్నీళ్ళు నిండాయి.

## 19

'ఇకనుంచి నీవు మంచిగా ఉంటానని చెప్పి లాభంలేదు' అన్నాడు లార్డ్ హెన్రీ.

లార్డ్ హెన్రీ తన తెల్లని వేళ్ళు కప్పుగోని రోజ్‌వాట ర్‌లో ముంచుతున్నాడు 'నీ విప్పుడు బాగానే ఉన్నావు. ఇహ మారకు, దయచేసి' – అన్నాడు.

డోరియన్ తలఊపాడు 'అదికాదు హారీ, నేను జీవితంలో చాలా చెడుపనులు చేశాను. ఇకముందు అలాంటి వేవీ చెయ్యదలచుకోలేదు. నిన్ననే మంచిపనులు చెయ్యడం మొదలెట్టాను' అన్నాడు.

'నిన్న ఎక్కడున్నావు?'

'గ్రామసీమకు వెళ్ళాను. ఒకసత్రంలో నేను ఒక్కడినే ఒంటరిగా ఉన్నాను.'

'అబ్బాయ్! గ్రామాల్లో ఎవరైనా మంచిగా ఉండవచ్చు. అక్కడ ఆకర్షణలేమీ ఉండవు'–అన్నాడు లార్డ్ హెన్రీ చిరునవ్వు నవ్వుతూ.

'అందుచేతనే నగరానికి దూరంగా ఉండేవారు అంత అనాగరకంగా ఉంటారు. నాగరకతను సంపాదించడం అంత సులభమైన పని కాదు. దాన్ని పొందడానికి రెండేమార్గాలున్నాయి. ఒకటి సంస్కారం. రెండవది భ్రష్టత.'

'భ్రష్టత, సంస్కారం - ఈ రెంటినీ నేను కొంతవరకు చవిచూచాను. ఈ రెంటికీ అవినాభావసంబంధం ఉండడం నాకు ఎంతో భీకరంగా కనుపిస్తూఉంది. ఇప్పుడు నేనొక కొత్త ఆదర్శం ఏర్పరుచుకున్నాను హారీ. నేను మారిపోతున్నాను. ఇప్పటికే మారాననుకుంటాను.'

'నీవు చేసిన మంచిపని ఏమిటో నీవు నాకు చెప్పలేదు. లేక నీవు చాలామంచిపనులుచేశాననా చెప్పింది?'- అని అడిగాడు స్నేహితుడు - తన నీలాల ప్లేటులో కొన్ని చక్కని దుంపలు వేసుకుని మంచుసోనలాంటి చక్కెరచల్లుకుంటూ.

'నేను చెప్పగలను హారీ. ఇది నేను మరెవరికీ చెప్పే కథ కాదు. దీనికోసం ఒకరిని ప్రత్యేకించాను. అహంకారంగా కనుపిస్తుందేమోకాని నీవు అర్థంచేసుకుంటావనుకుంటాను. ఆవిడ చాలా అందగత్తె. సిబిల్ వేన్‌లాగానే అద్భుతంగా ఉంటుంది. అందుచేతనే అనుకుంటాను ఆవిడ నన్ను ఆకర్షించింది. నీకు సిబిల్ జ్ఞాపకమేకదూ ? అవును. ఇప్పుడు అదంతా జరిగిపోయి ఎన్నాళ్ళైనట్టుంది! అవును. హెట్టీ మనవర్గానికి చెందినపిల్ల కాని మాట నిజమే. అది వట్టి పల్లెటూరిపిల్ల. కాని నిజంగా దాన్ని ప్రేమించాను. నేను నిజంగా ప్రేమించాననే అనుకుంటున్నాను. అద్భుతంగా గడిచిన ఈ మే మాసమంతా

వారానికి రెండుమూడుసార్లయినా వెళ్ళి ఆపిల్లను చూచి వచ్చేవాణ్ణి. నిన్నటికి నిన్న నన్నాక చిన్నతోటలో ఆ అమ్మాయి కలుసుకుంది. యాపిల్ పూలు ఆ అమ్మాయి జుట్టులో జలజలలాడుతున్నాయి. ఆ అమ్మాయి నవ్వుతూ ఉంది. ఈ ఉదయం ఇరువురం కలిసి వెళ్ళిపోయేవాళ్ళమే. కాని హఠాత్తుగా ఆ అమ్మాయిని –'

ఈ ఉద్వేగం తాలూకు వినూతనత నీకొక ఆనందో ల్బణం కలిగించిం దనుకుంటాను డోరియన్' – అన్నాడు లార్డ్ హెన్రీ. 'కాని నీకథకు నేను ముగింపు చెయ్యనా? ఆవిడకు నీవు మంచిసలహా ఇచ్చి ఆవిడగుండె పగలగొట్టావు. ఇదే నీ సంస్కరణకు నాంది.'

'హారీ, నీ వెంతభయంకరమైన వ్యక్తివి! నీవు ఇలాంటి మాటలు మాట్లాడకూడదు. హెట్టీహృదయం పగిలిపోలేదు. అది విలవిలలాడింది. అంతే. అంతకుమించిన నిందాభారం మరేమీ లేదు. పెర్డిటాలాగా తనబంగారుతోటలో హాయిగా ఉండిపోగలదు.'

అలాఉండి విశ్వాసంలేని ఫ్లోరిజెల్ నుగురించి విల పించగలదుకూడా' అన్నాడు. లార్డ్ హెన్రీ నవ్వుతూ కుర్చీలో వెనక్కు వాలి. 'డోరియన్! నీకు అన్నీ చిత్రమైన పిల్లతనపు మూడ్స్ ఉన్నాయి! ఈ పిల్ల తనసమానస్థాయీ వారితో సంతృప్తిపడి ఊరుకుంటుం దనుకుంటావా? ఉండి ఉండి ఒకరోజున ఏబండివాడినో పెళ్ళాడేస్తుంది. నిన్ను కలుసు కుని నిన్ను ప్రేమించినందువల్ల తనభర్తను అసహ్యించుకుం టుంది. నైతికదృష్ట్యా నీత్యాగం నా కంతగొప్పదిగా కనుపిం

చడంలేదు. నీ ఈసాధనకు తొలిమెట్టుకూడా అంతబాగా లేదు. అదీకాక, హెట్టీ ఈక్షణంలో నక్షత్రాలు ప్రతిఫలిస్తున్న ఏ చిన్నికొలనులోనో ఒఫీలియాలాగా చుట్టూ చిన్నిచిన్ని నీటి లిలీపూలతో తేలడంలేదంటే ఎలా నమ్మడం ?'

'ఇది భరించలేను హారీ! నీవు వెక్కిరించనివిషయమంటూ లేదు. ముందు వెక్కిరిస్తావు. తరువాత అనర్థాలు చెబుతావు. ఇప్పుడు ఈవిషయం నీకు చెప్పినందుకు చాలా చింతిస్తున్నాను. నేను చేసినపని మంచిదనే అనుకుంటున్నాను.

'పాపం! హెట్టీ! ఇవాళ ఉదయం నేను పొలంలోనుంచి వస్తూఉండగా ఆవిడ తెల్లనిముఖాన్ని కిటికిలోనుంచి చూచాను. మల్లెపూలగుత్తిలా కనుపించింది. ఇక మనం ఆవిషయం మాట్లాడకపోవడం మంచిది. సంవత్సరాల కొకసారి నేనుచేసిన మొట్టమొదటి చిన్న మంచిపని, నేను తొలిగా చవిచూచిన ఈచిన్నిఆత్మత్యాగాన్ని - ఒకపాపంలాగా నన్నుతలుచుకునేట్టు చెయ్యకు. నే నికనుంచి మంచిగా ఉండాలనుకుంటున్నాను. ఉంటాను. నిన్నుగురించి ఏదైనా చెప్పు. ఊళ్ళోవిశేషాలేమిటి? నేను క్లబ్బుకువెళ్ళి చాలారోజులైంది.'

'బేసిల్ కనుపించకపోవడాన్ని గురించి ఇంకా చర్చించుకుంటూనే ఉన్నారు.'

'ఇప్పటికి ఆవిషయం మరచిపోయా రనుకుంటున్నాను' అన్నాడు డోరియన్ కొంచెం ద్రాక్షరసం గ్లాసులోపోసుకుంటూ.

'అబ్బాయ్. ఆరువారాలనుంచీ ఆవిషయం మాటాడుకుంటున్నారు. మూడు నెలలకు ఒకవిషయం తప్ప అం

తకు మించి పోట్లాడుకునే మనస్తిమితం బ్రిటిష్ వాళ్ళకి లేదు. ఇటీవల వీరికి కొంచెం అదృష్టం పట్టుకుందనే చెప్పాలి. వీరి ముచ్చట్లకు కొత్తవిషయాలు కొన్ని వచ్చాయి. నా డైవోర్సు కేసు, అలన్ కాంప్‌బెల్ ఆత్మహత్య. ఇప్పుడు ఈ ఆర్టిస్టు చిత్రంగా మాయంకావడం ఒకటి కొత్తగా వచ్చింది. బూడిరంగు కోటు వేసుకుని నవంబర్ తొమ్మిదో తారీఖు అర్ధరాత్రి బండికి పారిస్ వెళ్ళింది బేసిలేనని స్కాట్‌లండ్ యార్డ్ చెబుతున్నారు. ఫ్రెంచి పోలీసులు బేసిల్ అసలు పారిస్‌కు రానే రాలేదంటున్నారు. ఒకపక్షం రోజుల్లోగా అతను ఏ శాన్ ఫ్రాన్సిస్కోలోనో తేలుతాడనుకుంటాను. అది చాలా ముచ్చటైన నగరం. ఆవలిలోకం తాలూకు అందచందాలన్నీ ఆ నగరంలో ఉన్నాయి.'

'బేసిల్ ఏమై ఉంటాడని నీవనుకుంటున్నావు ?' అని అడిగాడు డోరియన్ బర్గండీ చుట్ట దీపానికి వెలిగిస్తూ. తను ఈ విషయాన్ని ఇంతచల్లగా ఎలా ప్రస్తావించగలుగుతున్నానా అని ఆశ్చర్యపడుతూ.

'నేనేం చెప్పగలను ? బేసిల్ దాక్కున్నాడంటే అది నాకు సంబంధించని విషయం. చనిపోయాడంటావా- ఆవిషయం నేను ఆలోచించదలుచుకోలేదు. చావొక్కటే నన్ను భయపెట్టే విషయం.'

'అదేం ?' - అన్నాడు బద్ధకంగా.

'ఎంచాతనంటావా ?' - అంటూ లార్డ్ హెన్రీ పూలగుత్తివాసన చూస్తూ ఇలా చెప్పసాగాడు. 'ఈ రోజుల్లో దాన్ని తప్ప మరిదేన్నయినా భరించగలం. మృత్యువు-అసంస్కృతి -

ఈరెండే పందొమ్మిదవ శతాబ్దంలో అర్థం చెప్పుకోలేని విషయలుగా కనుపిస్తున్నాయి. ఇక సంగీతపుగదిలోకివెళ్ళి కాఫీ తీసుకుందాం పద డోరియన్. నీవు నాకు ఇవాళ ఛాపిన్‌కృతి వాయించి వినిపించాలి. నాభార్యతో లేచిపోయిన వ్యక్తి ఛాపిన్ అద్భుతంగా వాయించేవాడు. పాపం! విక్టోరియా! నేను దాన్ని ఎంతో ఇదిగా ప్రేమించేవాణ్ణి అదిలేకుండా ఇల్లుబోసిపోతున్నట్టుగా ఉంది. వివాహజీవితం ఒకఅలవాటు లాంటిదే అనుకో. అదీ చెడుఅలవాటు. కాని ఒక్క చెడుఅలవాటు లేకపోయినా అది కొంచెం విచారంగానే ఉంటుంది. అందువల్ల విచారం మరీ ఎక్కువనుకుంటాను. దానికి మనవ్యక్తిత్వంలో అలాంటి స్థానముంది.'

డోరియన్ ఏమీ మాట్లాడలేదు. టేబిల్‌దగ్గర నుంచి లేచి ప్రక్కగదిలోకి వెళ్ళి పియానో మీదపై వ్రేళ్ళు సారించసాగాడు. కాఫీరాగానే ఆపి లార్డ్ హెన్రీవంక చూచి, 'హారీ, బేసిల్ హత్యకావించబడిఉండవచ్చని నీ కెన్నడూ తట్టలేదా?' – అన్నాడు.

లార్డ్ హెన్రీ ఒకసారి ఆవులించాడు. 'బేసిల్ పేరుపడ్డవాడు. ఎప్పుడూ వాటర్‌బరీగడియారం పెట్టుకునేవాడు. అతనెందుకు హత్యగావించబడాలి? అతనికి శత్రువులను సంపాదించుకునేటంత తెలివితేటలు లేవు. చిత్రలేఖనంలో అతనికి గొప్పప్రతిభ ఉన్నమాట నిజమే ననుకో. కాని ఒకడు వెలాస్క్వెజ్ అంత గొప్పచిత్రకారుడూ కావచ్చు. వట్టి నిరుత్సాహీ కావచ్చు. బేసిల్ నిజంగాకూడా అలాగే ఉండేవాడు. అతనిలో ఒక్కసారిమాత్రమే నాకు కొంచెంఆసక్తి కలిగింది. అదీ –

కొన్ని సంవత్సరాలక్రితం అతను నిన్ను ఇంచుమించుగా పూజిస్తున్నానని చెప్పినప్పుడు - అతనికళకు నీవు ప్రేరేపణ అన్నప్పుడు.'

'నాకు బేసిల్ అంటే ఎంతో ఇష్టంగా ఉండేది' అన్నాడు డోరియన్ విచారంగా. 'కాని అతను హత్యచేయబడ్డాడని ఎవరూ అనుకోడంలేదా?' అని అడిగాడు.

'అదా! కొన్ని పేపర్లు అలా వ్రాస్తున్నాయి. కాని అది నమ్మతగినదిగా నాకు కనుపించడంలేదు. పారిస్‌లో చాలా ఘోరానిస్థలా లున్నాయని నాకు తెలుసు. కాని బేసిల్ అలాంటిస్థలాలకు వెళ్ళేవ్యక్తి కాదు. అతనికి కొత్త విషయాలు చవిచూదామనే ఆసక్తి లేదు. అతనికున్న ముఖ్యమైన లోపాల్లో అదొకటి.'

'ఒకవేళ నేనే బేసిల్‌ను హత్యచేశానంటే నీవేమంటావు హారీ?' - అని అడిగాడు కుర్రవాడు.

'ఏమంటాను? నీకుతగనిపాత్రను నీవుధరించడానికి యత్నిస్తున్నానంటాను. నేరంఅనేది చాలా అసంస్కృతమైనది, డోరియన్ - హత్యచెయ్యడమనేది నీ లక్షణం కాదు. ఇలా అన్నానని మరోవిధంగా అనుకోకు. కాని ఈమాటమాత్రం నిజం. నేరమనేది ఒక్క తక్కువజాతి వాళ్ళకు చెందిందిమాత్రమే. నేను వాళ్ళనూ నిందించడంలేదు. మనకు కళ ఎలాంటిదో వాళ్ళకు నేరం అలాంటిది. అసాధారణమైన ఆవేగాలు చవిచూడడానికి ఒకపద్ధతి, అంతే'

'ఆవేగాలను ఆస్వాదించే విధానమా? అవుతే ఒకమాటు హత్యచేసినవ్యక్తి మళ్ళీ అదేపని చెయ్యగలడంటావా?

'అదా? ఏదేమయినా తరచుగా చేసినప్పుడు అది ఆనందంగా పర్యవసిస్తుంది' అన్నాడు లార్డ్ హెన్రీ నవ్వుతూ. 'ఇది ముఖ్యమైన జీవిత రహస్యాలలో ఒకటి. అయినా హత్య అనేది ఎప్పుడూ ఒక తప్పుగానే నేను భావిస్తాను. డిన్నర్ తరువాత కబుర్లాడుకోడానికి తగనిదాన్ని ఎవరూ ఎన్నడూ చెయ్యకూడదని నా ఉద్దేశం. సరే ఇక బేసిల్ విషయం మాట. నేదాన్ని నీవు సూచించినట్లుగా నేను అతని బ్రతుకు ఒక శృంగారమైన ముగింపుకు వచ్చి ఉంటుందని నమ్మాలని నేనూ కోరుకున్నాను కాని అలా నమ్మలేకుండా ఉన్నాను. ఒక బస్ లో నుంచి వెనుకగా సీను నదిలో దూకి ఉంటాడని కండక్టర్ ఆ సంగతి అలాగే [illegible] కావించి ఉంటాడని అనుకుంటాను. అవును. అదే అతని ముగింపని అనుకుంటాను. ఇప్పుడతను ఆ మంద కల్మష జలాల క్రింద పడి ఉంటాడు. పైన బరువైన ఓడలు తేలుతూ ఉంటాయి. నాచు అతని జుట్టుచుట్టూ చేరి ఉంటుంది. ఇక అతను మంచి బొమ్మలు గీస్తాడని కూడా నేననుకోను. గత పది సంవత్సరాల్లోనూ అతని కళ చాలా తీసికట్టుగా ఉంది.'

డోరియన్ బరువుగా నిశ్వసించాడు. లార్డ్ హెన్రీ గదిలో ఇటునుంచి అటు నడిచి వెళ్ళి విచిత్రమైన జావా చిలుక తలను మెల్లగా నిమరసాగాడు. పెద్దపక్షి. ఎర్రని పింఛం. వెదురు కర్రపై కూచుని ఉంది. సన్నని అతని వేళ్ళ కొసలు స్పృశించిన వెంటనే అది మెల్లగా కనురెప్పలు దించుకుని ముందుకూ వెనక్కూ ఊగిసలాడసాగింది.

'అవును' అని జేబులోనుంచి చేరుమాలు తీసి మళ్ళీ ఇలా చెప్పసాగాడు— 'అతని కళ ఎంతో దిగజారిపోయింది.

ఏదో లోపించినట్టు కనుపించసాగింది. దానికి ఏదో ఒక ఆదర్శమంటూ లేకుండాపోయింది. అతనూ నీవూ స్నేహితులుగా ఉండడం మానేసిన వెంటనే అతనిలో కళకూడా పోయింది. మిమ్మల్నిద్దర్నీ విడదీసిన దేమిటి? అతను నిన్ను విసుగెత్తించాడనుకుంటాను అలాఅయితే అతను నిన్ను క్షమించలేదన్నమాట. అలవాటు ఎప్పటికీ కొంతకాలానికి విసుగు కలుగజేస్తుంది. అదీకాక అతను నీ చిత్రపటమొకటి వ్రాశాడు చూశావూ — అది ఏమైంది? అతను దాన్ని పూర్తిచేసిన తరువాత ఇంతవరకూ దాన్ని చూడలేదనుకుంటాను. దాన్ని నీవు సెల్బీపంపించానని ఒకసారి నీవు చెప్పడం నాకు జ్ఞాపకం ఉంది. దాన్ని ఎక్కడో మరిచానో దొంగిలించారనో ఏదో చెప్పావు. మళ్ళీ అది నీదగ్గరికి రానేలేదా? అయ్యో! నిజంగా అది ఎంతచక్కనిబొమ్మ! నేను ఒకసారి దాన్ని కొనాలని కూడా అనుకున్నట్టు జ్ఞాపకం. ఇప్పుడు ఆ బొమ్మ ఉంటే ఎంత బావుండేది! అది బేసిల్ కళ వెలుగుతున్నరోజులలో వ్రాసింది. ఆతరువాత అతనిబొమ్మలన్నీ చెడు కళ, చక్కని ఉద్దేశాలు — ఈరెంటిసమ్మేళనంగా ఉంటూవచ్చాయి. అదే బ్రిటిష్ చిత్రకారుని ప్రత్యేకత. దానికోసం నీవు ఎక్కడైనా ప్రకటన నిచ్చావా? ఇచ్చిఉండవలసింది.'

'మరిచాను. ఇచ్చా ననుకుంటాను. కాని నా కెన్నడూ అదంటే ఇష్టముండేది కాదు. నేను అందుకోసం ఎందుకు పోజ్ ఇచ్చానా అని నాకు ఇప్పటికీ విచారంగా ఉంది. దాని తాలూకు జ్ఞాపకంకూడా నాకు అసహ్యంకలిగిస్తూఉంది. అది

నాకు ఏదో నాటకంలో - హామ్లెట్ అనుకుంటాను- ఆ చిత్ర మైనపంక్తులు జ్ఞాపకం వస్తూండేవి. అవి - ఆపంక్తులు-అవేమిటి?

'ఒకవిషాదచిత్రంలాగా
హృదయంలేని ముఖం'

అవును, అలాగుంది.

లార్డ్ హెన్రీ నవ్వాడు 'ఎవరైనా జీవితాన్ని కళాత్మకంగా చూడగలిగినట్టయితే అతనిమేధస్సే అతనిహృదయమవుతుంది' అన్నాడు కుర్చీలో వాలి.

డోరియన్ గ్రే అవునన్నట్టు తలఊపి పియానో పై మెల్లగా వేళ్ళుమీటాడు 'విషాదచిత్రంలాగా, హృదయంలేని ముఖంలాగా' - అన్నాడు.

హెన్రీ వెనక్కువాలి పడుకుని అరమూతలకండ్లతో అతనివంక చూచాడు. 'మరోమాట డోరియన్' అన్నాడు కాసేపాగి. 'మనిషి ప్రపంచమంతా గెలిచి ... ఏమిటి ఆ వాక్యం ? ... ఆత్మను పోగొట్టుకుంటే లాభమేమిటని కదూ ?'

సంగీతం ఆగింది. డోరియన్ ఉలికిపడ్డాడు. స్నేహితుని వంక నివ్వెరపోయిచూచి 'ఆ మాట ఎందుకొచ్చింది హారీ?'- అన్నాడు.

'అది కాదబ్బాయ్'అంటూ లార్డ్ హెన్రీ కనుబొమ్మలు ఆశ్చర్యంతో పైకెత్తి ఇలా చెప్పసాగాడు. 'నీవు సమాధానం చెబుతావని అడిగాను. అంతే. అంతకంటె మరేంలేదు. పోయిన ఆదివారం పార్కులోనుంచి వెడుతున్నాను మార్బిల్ ఆర్చిదగ్గరికి చేరేసరికి ఒకచిన్నగుంపు కనుపించింది. అంతా మూసినట్టుగా ఉన్నారు. ఎవరో బజారుబోధకుడు ఏదో

చెబుతూ ఉంటే వింటూనుంచున్నాను. జనం అలా నడుస్తూ ఉండగా అతను ఆ ప్రశ్న అక్కడ చేరినవారిని అడగడం విన్నాను. అది నాకు చాలా చిత్రంగా కనిపించింది. లండన్‌లో ఇలాంటి చిత్రాలు చాలా జరుగుతూ ఉంటాయి. చల్లని ఒక ఆదివారం, గజిబిజిగా కనుపిస్తున్న ఒక క్రిస్టియన్ ప్రచారకుడు, పాలిపోయిన ముఖాలసర్కిలం, వాననీరు బొటబొట కారుతున్న గొడుగులు, హఠాత్తుగా అందరినీ అడిగిన ఒక ప్రశ్న, మూర్ఖంగా అరిచిన పెదవులు — అనిష్టంగా ఇదంతా చాలా చిత్రంగానే ఉంది. నేను అతనికి ఒకమాట చెబుదామనుకున్నాను — కళకు ఒక ఆత్మంటూ ఉన్నదనీ, మనిషికిమాత్రం ఆత్మ లేదనీ చెబుదామనుకున్నాను. కాని అలా అంటే అతనికి అర్థంకాదని ఊరుకున్నాను.'

'అలా అనకు హారీ. ఆత్మ వాస్తవమైంది. దాన్ని కొనవచ్చు. అమ్మవచ్చు. మారకం చెయ్యవచ్చు. మనందరిలోనూ ఒకఆత్మంటూ ఉంది. ఆ విషయం నాకు తెలుసు.'

'అలా అని నీకు గట్టిగా తెలుసా డోరియన్ ?'

'ఆ.'

'అవుతే అది ఒక భ్రమ అయిఉంటుంది. ఒకరికి గట్టిగా ఇది నిజమని తెలిసిందంటే ఆ విషయాలు ఎన్నటికీ నిజంకావు. విశ్వాసంలో ఉన్న ప్రమాదం ఇదే. ప్రణయం సంప్రదాయంకూడా ఇదే. ఏం అలా చూస్తున్నావు? అలా చూడకు. మనయుగం తాలూకు మూఢనమ్మకాలతో నీకూ నాకూ పనేమిటి? ఏమీ లేదు. మనం ఆత్మలో విశ్వాసాన్ని ఎన్నడో వదిలాం. ఏదైనా ఒక పాట పాడి వినిపించు. ఒక రాగం ఆలాపించు డోరి

యన్, అలా రాగం తీస్తూ నాకో విషయం చెప్పు. నీ యౌవనాన్ని నీ వెలా కాపాడుకున్నావో చెప్పు. నీకు ఏదో రహస్యం తెలిసి ఉండాలి. నేను నీకంటె పదిసంవత్సరాలు పెద్ద. అంతే. కాని నా ముఖం ముడతలు పడిపోయింది. జీర్ణించి పోయింది. పసుపువన్నె వచ్చింది. నీవు నిజంగా అద్భుతంగా ఉన్నావు డోరియన్. ఈ రాత్రి నీవు కనుపించినంత అద్భుతంగా నీవు మరెన్నడూ కనుపించలేదు. నేను నిన్ను మొట్టమొదట చూసిన రోజు నాకు జ్ఞాపకం వస్తోంది. అప్పుడు నీబుగ్గలు కాస్త బలిసి ఉండేవి. చాలా సిగ్గుగా ఉండేవాడివి. ఎంతో అసాధారణంగా కనుపించేవాడివి. నీవు కొంతమారావు నిజమే. కాని రూపులకుమాత్రం అలాగే ఉన్నావు. నాకు నీ రహస్యం చెబుతా అనుకుంటాను నా యౌవనం మళ్ళీ తెచ్చుకోడానిక నేను ప్రపంచంలో ఏం చెయ్యమన్నా చేస్తాను - ఒక్క ఎక్సర్‌సైజ్ చెయ్యడం - త్వరగా నిద్ర లేవడం - గౌరవనీయుడుగా మసులుకోడం తప్ప. యౌవనం అలాంటిది. మరేమీ లేదు, చిన్నవాళ్ళఅజ్ఞానాన్నిగురించి మాట్లాడడం పట్టివెర్రి. ఇప్పుడు నేను గౌరవంతో వినేదల్లా నాకంటె చిన్నవాళ్ళఅభిప్రాయాలుమాత్రమే. వారు నాకంటె ముందున్నట్లుగా కనుపిస్తారు. జీవితం తనకడపటి అద్భుతాన్ని వారికి కనుపింపచేసింది. ఇక వృద్ధులవిషయ మంటావా? వారి అభిప్రాయాలు ఎప్పుడూ కాదంటాను. అది ఒకవిధిగా కాదంటాను. నిన్న జరిగినవిషయాన్ని గురించి వారిఅభిప్రాయాలు తెలుపమని అడిగితే వారు ఎంతో ఇదిగా 1820 నాటి అభిప్రాయాలు చెప్పడం మొదలెడతారు- ఎత్తుగా ఉన్న సాక్స్ వేసుకుని దేంట్లో

నూ నమ్మక పోదీ తెలీకుండా ఉన్నవారి అభిప్రాయాలు- నీవు పాడుతున్న ఆరాగం ఎంతమధురంగా ఉంది. ఛాపిన్ దాన్ని మెజార్కాలో కూడుని వ్రాసిఉంటా డనుకుంటాను. అతని విల్లాచుట్టూ విలపిస్తున్న సముద్రం. కిటికీఅద్దాలపై చల్లుతున్న ఉప్పురవ్వలు. ఊహించుకుంటే ఎంతఅందంగా ఉంటుంది. అను కరణకు చెందని ఒక్కకళయినా మిగిలిఉండడం మనకు ఎంత అదృష్టం. ఆపకు .ఆరాగాన్ని అలాగే సాగనీ. ఈరాత్రి నాకు సంగీతం కావాలి, నీవు సుప్రసిద్ధమైన ఎపోలోలాగానూ నేను అతనిపాటవింటున్న మార్స్యాస్‌లాగానూ ఉన్నాను. నాలో నూ కొన్నిశోకాలుఉన్నాయి డోరియన్ .నాటవిషయం నీకు తెలీదు. ఒకోక్కసారి నావిషయం నాకే ఆశ్చర్యంకలిగిస్తుంది. ముసలి తనంతాలూకు శోకం ముసలి వాళ్ళదికాదు. యువకులదే. ఒకోక్క సారి నావిషయం నాకేఆశ్చర్యంకలిగిస్తుంది. డోరియన్ నీ వెంత సుఖజీవివి! నీజీవితం ఎంత అద్భుతమైంది? ప్రతిదాన్నీ మనసారా త్రాగావు. ద్రాక్షగుత్తులనీ మనసారా త్రొవావు. నీనుంచి దాగిం దేమీ లేదు. అంతా నీకు ఒకరాగంలా సాగింది. అది నిన్ను ఏమాత్రం చెదిరింపచేయలేదు. నీవు ఎప్పటిలాగా నే ఉన్నావు.'

'నే నలా లేను హారీ.'

'అవును. నీవు ఎప్పటిలాగానే ఉన్నావు. నీ జీవితంలోని కడమభాగం ఎలాఉంటుందోనని నేను ఆశ్చర్యపోతున్నాను. అనవసరమైన త్యాగాలవల్ల దాన్ని అధ్వాన్నంచేసుకోకు. ఇప్పుడు నీవు చిక్కగా ఉన్నావు. నిన్ను వెదకిచూచినా నలు సంత కళంకం లేదు. అలా కాదని తలఊపకు. అవునని నీకు

తెలుసు. అదీకాక డోరియన్, నిన్ను నీవు మోసంచేసుకోకు. జీవితాన్ని పరిపాలించేది ఇచ్ఛాశక్తి కాదు. ఉద్దేశాలూ కావు. జీవితం నరాలతో నాళాలతో చిన్నచిన్న అణువులతో కూడుకున్నది. ఆ అణువుల్లో కలలు దాగి జలజలలాడుతుంటాయి. నీవు చాలా భద్రంగా ఉన్నా నుకుంటావు. చాలా బలంగానూ ఉన్నా ననుకుంటావు. కాని గదిలో కనుపించినవర్ణంగో, లేక ఏ ఉదయకాలఆకాశమో, ఎప్పుడో నీవు వాసనచూచిన ఏ పరిమళమో, మనసుపునీనుతో రాలిపోయిన ఏ పద్యపాదమో, పాడడం ఆపేసిన ఒక రాగ—డోరియన్—ఇలాంటివాటిపై నే మన బ్రతుకులు నిలుస్తున్నాయి. బ్రౌనింగ్ ఈ విషయాన్నే ఎక్కడో వ్రాశాడు. కాని మనఇంద్రియాలే మనకోసం వాటిని ఊహించి ఉంచుతాయి. ఎప్పుడో ఒకప్పుడు ఏచక్కని పూ పరిమళమో నాముందునుంచి తరలిపోతుంది. నేను మళ్ళీ ఆ విచిత్రమైన నెలనంతా తిరిగి జీవించవలసి ఉంటుంది. నీవూ నేనూ నేననీవుగా, నీవునేనుగా మారిపోతే ఎంతబావుండును డోరియన్. లోకం మనిద్దరినీకలిపి గుయ్యిబట్టింది. కాని ఎప్పుడూ నిన్ను ఆరాధించింది. ఎప్పుడూ ఆరాధిస్తుందికూడా. ఈ యుగం దేనికోసం వెదుకుతున్నదో అదే నీవు. ఏది కనుక్కున్నందుకు భయపడుతూ ఉందో అదేనీవు. కాని ఒకవిషయానికి నే నెంతో సంతోషిస్తున్నాను. నీవుమాత్రం ఎన్నడూ ఒక ప్రతిమమలచలేదు, ఒక బొమ్మగీయలేదు. — నీవుకానిది మరొకటి చేయలేదు, జీవితమే నీకు కళయింది. సంగీతమే నీకళ. రోజులే రాగాలుగా గడిపావు.

డోరియన్ పియానో దగ్గర నుంచి లేచి జుట్టులోనుంచి వేళ్ళుపోనిచ్చాడు. 'అవును, రాత్రి అద్భుతంగా గడిచింది. కాని ఇక నువ్వు నా విషయంలో మాట్లాడవలసినది లేదు. నీవూ ఇలా అవ్యక్తవిషయాలు నాకు చెప్పకు. నీకు నన్ను గురించిన విషయాలన్నీ తెలియవు. ఒకవేళ తెలిస్తే నీవూ నన్ను ఎదురుతిరుగుతావు. నీవు నవ్వుతున్నావు. అలా నవ్వకు నాని.'

'పాట ఆపావేం డోరియన్? మళ్ళీ — ఏదీ ఆ రాగం ఒకమాటు పాడి వినిపించు. చూడు — ఆ తేనెరంగు చంద్ర బింబం సాయంకాలపు ఆకాశంలో ఎలా వ్రేలాడుతున్నదో చూడు. నీవు పాడి ముగించేస్తావని ఎదురుచూస్తోంది. నీవు పాడు. భూమికి దాపుగా దిగుతుంది. పాడవూ? పోయితే క్లబ్‌కు వెడదాం రా. ఇది ఎంతచక్కనిసాయంత్రం! ఈ చక్కని సాయంత్రాన్ని చక్కగానే ముగింపుచెయ్యాలి. వైట్స్‌లో ఒకాయన ఎవరో ఉన్నారు. వారు నిన్ను తెలుసుకోవాలని ఎంతగానో వాంఛిస్తున్నారు. చిన్నవాడు — లార్డ్ పూలె అనుకుంటాను — ఇప్పటికే నీ నెక్‌టైలు కాపీచెయ్యడం మొదలెట్టాడు. నన్ను పరిచయంచెయ్యమని నన్నుకోరాడు. ఎంతో ముచ్చటయినవ్యక్తి. ఒక్కమాటు...

'అలా కాకుండా ఉండాలని కోరుకుంటున్నాను' — అన్నాడు డోరియన్ విచారపూరితమైనకండ్లతో 'ఇవాళ రాత్రి చాలా అలసిఉన్నాను హారీ. క్లబ్‌కు రాను. ఇప్పటికే పదకొండు గంటలయింది. పెందలాడే వెళ్ళి పడుకుంటాను.'

'అలా వెళ్ళకు. ఇవాళ రాత్రి నీవు రాగం వాయించి నంతఅందంగా ఎన్నడూ వాయించలేదు. ఇవాళ నీస్పర్శలో

ఏదో అద్భుతమైంది కనుపించింది. ఇదివరకు నేనెన్నడూ వినని ఏదో వ్యక్తీకరణ ఈరోజు కనుపించింది.'

'నేను మంచిగా ఉండబోతున్నాను కాబట్టి అలా వాయించగలిగాను' అన్నాడు డోరియన్ చిరునవ్వు నవ్వుతూ 'ఇప్పటికే కొంచెం మారినట్టు కనుపిస్తున్నాను.'

'నాకు నీలో ఎప్పుడూ మార్పు కనుపించదు డోరియన్. నీవూ నేనూ ఎప్పుడూ స్నేహితులంగానే ఉంటాము; అన్నాడు లార్డ్ హెన్రీ.

'అయినా ఒకమాటు ఒకపుస్తకాన్నిచ్చి నీవు నన్ను విషపూరితం చేశావు. మళ్ళీ ఆపుస్తకం ఎవరికీ ఇవ్వకు. హాని చేస్తుంది.'

'అబ్బాయ్! నీవు నీతిపరుడివైపోతున్నట్టున్నావు. త్వరలోనే ఒక పరివర్తనపొందినవ్యక్తిలాగానో ఒక పునరుజ్జీవన వాదిలాగానో నీవు అలసట చెందిన పాపాలన్నీ ఇతరులను చెయ్యవద్దని హెచ్చరిస్తూ వెళ్ళేలా ఉన్నావు. నీ అందచందాలకు అది ఏమాత్రం తగనిపని. అదీకాక దానివల్ల వచ్చే ఉపయోగంకూడా లేదు. నీవూ నేనూ ఏమిటో అదే మనం. ఇక ముందుకూడా ఇలాగే ఉంటాం. ఇక పుస్తకం విషపూరితం కావించడ మంటావా – అలాటిదేమీ లేదు – కళకు ఎలాటి పనిమీదా ప్రభావంలేదు. పనిచేదామనే కోరికనుకూడా కళ పూర్తిగా తొలగిస్తుంది. అంతగొడ్డాలు మరొకటి లేదు. మనం అవినీతికరమైన పుస్తకాలని పిలిచేవి లోకంఅవినీతిని లోకానికి చూపేవి. అంతే. కాని ఇక మనం సాహిత్యాన్ని చర్చించవద్దు. రేపునన్ను కలుసుకో. రేపు నేను పదకొండుగంటలకు వస్తాను.

ఇద్దరం కలిసి వెడదాం. నేను నిన్ను లేడీ బ్రాంక్‌సమ్‌తో కలిపి తరువాత భోజనానికి తీసుకుని వెడతాను. ఆవిడ చాలా ముచ్చటైన స్త్రీ. ఆవిడ కొనాలని అనుకుంటున్న కొన్ని ముత్యాల తెలను గురించి సలహా అడగాలనుకుంటోంది. వస్తావు కదూ? లేక నవ చిన్ని డచెస్‌తో కలిసి లంచ్‌కి వెడదా మంటావా? నీవు ఇటీవల అసలు కనుపించడమే లేదని అంటోం దావిడ. గ్లాడిస్‌తో నీవు అలసిపోయినట్టున్నావు, అన్నను. ఆవిడ మాట్లాడే తరహా అలాంటిది. అయినా, పదకొండు గంటలకు నీవు తయారుగా ఉంటావు కదూ?'

'నేను నిజంగా రావాలంటావా హారీ?'

'తప్పకుండా రావాలి. పార్కు ఇప్పుడు ఎంతో ముచ్చటగా ఉంది. నేను నిన్ను కలుసుకున్న ఏడాదినుంచి ఇంతచక్కని పూలు ఎన్నడూ పూయలేదనుకుంటాను.'

'మంచిది. పదకొండుగంటలకు వస్తాను హారీ'— అని డోరియన్ తలుపుదాకా వెళ్ళాడు. మరేదో చెప్పబోయినట్టుగా ఒకక్షణం ఆగాడు. తరువాత నిశ్వసించి వెళ్ళిపోయాడు.

## 20

చక్కనిరాత్రి. వెచ్చగా తీగసాగింది అతను కోటుబుజం మీద వేసుకున్నాడు. సిల్కురుమాలుకూడా మెడకు చుట్టుకో లేదు. సిగరెట్ కాలుస్తూ మెల్లగా ఇంటివైపు నడవసాగాడు. సాయంకాలపు డ్రస్‌లోఉన్న ఇద్దరుయువకులు అతనిప్రక్కనుంచే వెళ్ళారు. వారిలో ఒకడు మరొకనితో 'అతనే డోరియన్ గ్రే' అన్నాడు. అతను అలాచూపినప్పుడుకాని తనవంకనివ్వెరపోయి

చూచినప్పుడుకాని గుసగుసలాడినప్పుడుకాని అత నెంతో సంతోషించేవాడు. తనపేరువినడం తనకే ఇప్పుడుఅలసటకలిగిస్తోంది అతను ఇటీవల తరచుగావెడుతూవచ్చిన గ్రామంతాలూకుసగం ఆకర్షణ అక్కడ తనెవరో ఎవరికీ తెలీకపోవడమే. తను తనను ప్రేమించేట్టుగా ఊరించినపిల్లకు అనేకపర్యాయాలు తను పేద వాణ్ణని చెప్పాడు. ఆపిల్ల నమ్మిందికూడా. ఒకమాటు తనుచెడ్డ వాణ్ణని చెబితే ఆపిల్ల నవ్వింది, చెడ్డవాళ్ళు ముసలివాళ్ళుగా ఉంటారని అందంగా ఉండరని అన్నది. ఆపిల్ల అలానవ్వితే ఎంత చక్కగా ఉండేది! — గజ్జెలు ఘల్లుమన్నట్టు తనమామూలు నేతదుస్తుల్లోనూ పొడుగాటిహాటుతోనూ ఆపిల్ల ఎంతచక్కగా ఉండేది! ఆవిడకేమీ తెలీదుకానితనకులేనిదంతా ఆపిల్లకుంది.

అతను ఇంటికిచేరగానే సేవకుడు తనకోసం కాచుకుని ఉన్నాడు. అతన్నిపడుకోమనిచెప్పి తను వెళ్ళి సోఫాలో పడుకున్నాడు. లార్డ్ హెన్రీ చెప్పినవిషయాల్లో కొన్ని మననం చేసుకోసాగాడు.

ఒకరు మారరంటారు. ఆమాట నిజమేనా? ఒక్కమాటు అతనిస్వచ్ఛమైన బాల్యంపట్ల అతనికి తీరనికోరిక ఏర్పడింది—లార్డ్ హెన్రీ అన్నట్టు తెల్లగులాబీలాంటి తనబాల్యంపట్ల. తను మలినమైపోయాడని తనకు తెలుసు. తనమనస్సంతా మలినంతోనింపుకున్నాననీ తనఊహ వికృతరూపం పొందిందనీ తనకు తెలుసు. ఇతరులపట్ల తనప్రభావంకూడా వికృతంగానే పరిణమించింది. అలాకావడంలో అతనొకభీకరమైన ఆనందాన్ని కూడా పొందాడు. తనజీవితాన్నిఅంటుకుపోయిన జీవితాలను— ఎన్నో అందమైన జీవితాలను — పైకి రావలసిన జీవితాలను

అతను నిందపాలు చేశాడు. ఇక అలాగా ముసుగు వేసుకోడానికి వీల్లేదా? ఇక ఆశేంటుంది?

తన రోజుల బరువంతా ఆ బొమ్మ మొయ్యాలని తను మాత్రం నిత్యయౌవనంతో ఉండాలని ఏ అహంకారపూరితమైన ఉన్మాదక్షణాల్లో తను ప్రార్థించాడో మరి? తనవిఫలత కంతా అదే కారణమైంది. తనజీవితంలోని ప్రతిపాపమూ తనతోపాటు ఆ పాపఫలాన్నికూడా మోసుకునివస్తే ఎంతో బాగుండేది. శిక్షలో ఒక పవిత్రత ఉంది.

ఎన్నో సంవత్సరాలక్రితం లార్డ్ హెన్రీ అతనికిచ్చిన విచిత్రంగా మలచబడిన ఆ అద్దం ఇంకా అలాగే ఉంది. దాని చుట్టూ ఉన్న చిన్ని చిన్ని చేపపిల్ల బొమ్మలు ఇంకా పూర్వంలాగా నవ్వుతూనే ఉన్నాయి. అతను దాన్ని చేతిలోకి తీసుకున్నాడు. ఆనాటిరాత్రి ఎలా తీసుకున్నాడో ఈనాడూ అలాగే తీసుకున్నాడు. కన్నీరు జలజలరాలి మసకలు కమ్మిన కండ్లతో ఆ అద్దంలో చూచుకున్నాడు. ఒకమాటు తనకు ఎవరోవ్రాసిన ఉత్తరంలోని చివరిమాటలుజ్ఞాపకంవచ్చాయి 'నీవుదంతంతోనూ బంగారంతోనూ చేయబడ్డావు. అంచాతనే ఈశోకం మూరింది. నీపెదవుల కొసలు చరిత్రను మళ్లీ తిరిగి వ్రాస్తున్నాయి. ఆమాటలు మళ్ళీ అతని స్మృతిపథంలో తళుకొత్తాయి.

మళ్ళీ మళ్ళీ అదేమాటలు తనలో తానే అనుకోసాగాడు. తరువాత తన అందంపట్ల తనకే అసహ్యాంకలిగింది. అద్దాన్ని నేలకు విసరికొట్టి తెల్లనిరజనులాంటి అద్దపుముక్కలను కాళ్ళకింద నలిపివేశాడు. తనఅందమే తననాశనానికి

దారితీసింది. తను ప్రాణం పోసి తానే తెచ్చుకున్న అంతమే. ఆరెండూ లేకుండా ఉన్నట్లయితే అతని జీవితాన్ని ఏనాడూ అంటుకుని ఉండేదికాదు. అతని దేహం అతనికి ఒకముసుగు మాత్రం అయింది. అతని యౌవనం ఒక వెక్కిరింపయింది. యౌవన మంటే ఏమిటి? పచ్చి పసి పండని కాలం. కొన్ని లలితమైన ఊహాలూ కలవరాలూ పలికే కాలం.

గతాన్ని స్మృతికి తెచ్చుకోకుండా ఉండడం మంచిది. ఏవిధంగానూ అది మారదు. తనూ, తనభవిష్యత్తూ— అదే తను ఆలోచించవలసింది. జేమ్స్ వేన్ సెల్బీచర్చియార్డ్‌లో ఏ అనామకసమాధిలోనో నిద్రపోతూ ఉన్నాడు. ఎలన్ కాంప్‌బెల్ ఒకనాటిరాత్రి లాబరేటరీలో తనను తాను కాల్చుకుని చంపుకున్నాడు. కాని తను తెలుసుకోవలసివచ్చినరహస్యం మరెవరితోనూ చెప్పలేదు. బేసిల్ హాల్‌వర్డ్ కనుపించకపోవడాన్నిగురించిన కలవరం క్రమంగా మాసిపోయింది. ఇప్పటికే చాలవరకు మాసిపోయింది. తను ఇక్కడ భద్రంగా ఉన్నాడు. లేక నిజంచెప్పాలంటే బేసిల్ మృత్యువు అతన్ని బరువుగా కుంగదీస్తున్నది. బేసిల్ తనజీవితాన్నంతా నాశనంచేసిన ఆ చిత్రాన్ని గీశాడు. అతన్ని అందుకోసం క్షమించడు. ఆచిత్రమే ఇంతవరకుతెచ్చింది. బేసిల్ తనకు భరించరాని విషయాలు చెప్పాడు. తను అవన్నీ ఎంతో ఓరిమితో భరించాడు. హత్య అన్నది ఏదో ఒకవెర్రిక్షణంలో జరిగింది. అంతే. ఇకఎలన్ కాంప్‌బెల్ ఆత్మహత్య. అది అతనంతటఅతను చేసుకున్నదే. దానితో తన కేమాత్రం సంబంధం లేదు.

కొత్తజీవితం! అదీ అతను కోరింది. దానికోసమే అతను కాచుకున్నాడు. ఆ జీవితాన్ని ప్రారంభించాడు కూడా. ఒక అమాయకురాలిని వదిలాడు. మళ్ళీ ఎప్పుడూ అమాయకులను తనవలలో చిక్కించుకోడు. ఇకనుంచి బాగా ఉంటాడు. అతను టేబిల్ మీదినుంచి దీపంతీసుకుని మెల్లగా మెట్లెక్కి వెళ్ళాడు. తలుపు తెరవగానే ఒక సన్నని చిరునవ్వు చిత్రమైన అతనిలేత ముఖంపై అతని పెదవులపై అలా కాసేపు మిల్లలాడింది. అవును, అతను బాగా ఉంటాడు. తనుదాచిన ఆ అసహ్యకరమైన వస్తువు ఇకనుంచి తనకు భయం కలిగించదు. తనలో ప్రేలాడుతూ వచ్చిన బరువు దిగిపోయినట్టుగా తోచింది.

అతను నిశ్శబ్దంగా లోనికి వెళ్ళాడు. వెనకాలతలుపు మూశాడు. చిత్రానికి వ్రేలాడదీసిన ఊదా తెర తొలగించాడు. ఒకసన్నని బాధా కేకా అతని పెదవులనుంచి వెలువడింది. అతనికి ఆబొమ్మలో మార్పేమీ కనుపించలేదు. ఒక్క కండ్లలో మాత్రం కుట్రతో కూడినచూపు కనుపిస్తూఉంది. పెదవులచివర ఆ రేఖ ఇంకాఅలాగే ఉంది. ఆబొమ్మ ఇప్పటికీ అసహ్యకరంగానే కనుపిస్తూఉంది. పూర్వంకంటెకూడా అసహ్యకరంగా కనుపిస్తూ ఉంది. చేతికి చల్లుకున్న ఎర్రని మంచుముక్కలు మరింతకాంతివంతంగా కనుపిస్తున్నాయి. కొత్తగా అప్పుడే నెత్తురు చల్లినట్టుగా ఉంది. అదిచూడగానే అతను వణికిపోయాడు. తనుచేసిన ఒక్క మంచిపనికి కారణం తనఅహంకారమేనేమో. లేక లార్డ్ హెన్రీ వెక్కిరింపుగా నవ్వుతూ అన్నట్టు ఒక కొత్త అనుభవంకోసం కోరికేమో. మనకంటెకూడ సున్నితమైనవిషయాలు చెయ్యడం కోసం మనల్ని పురికొల్పే ప్రేరేపణేమో. లేక ఇవన్నీకలసిన

లేదో మరి. అదీకాక ఆఎర్రనిమచ్చ పూర్వంకంటెకూడా ఎక్కువఎర్రగా కనుపిస్తూంది— ఎంచేతనో. కొసలుతేలిన వేళ్ళ నిండా ప్రాకినట్టుగా ఉంది. కాళ్ళమీదకూడా పడింది—అక్కడి నుంచి జారి చుక్కలుగా పడినట్టు కత్తిపట్టని ఆచేతిమీదకూడా చుక్కలు కనుపిస్తున్నాయి. నేరం ఒప్పుకోవాలా? తనువెళ్ళి నేరంఒప్పుకోవాలా? అదేనా దానిభావం?

అతను నవ్వుకున్నాడు. అది అతనికి భీకరంగా కనుపించింది. అదీకాక అతను నేరంఒప్పుకున్నప్పటికీ నమ్మే దెవరు? హత్యచేయబడినవ్యక్తి తాలూకు ఆరా ఎక్కడా కనుపించడం లేదు. అతనికి చెందినదంతా ధ్వంసంచేయబడింది. తనే క్రింది అంతస్తులో ఉన్న వస్తువులన్నీ తగలపెట్టాడు. లోకం తనని వెర్రి వాడని అంటుంది. అంతే. తనే పాడిందేపాటగా ఆకథచెబితే — అతనినోరు మూయిస్తారు ............ అయినా, నేరం ఒప్పుకోడం అతనివిధి, అలాఒప్పుకుని అందరిముందూ తను అవమానాన్ని భరించవలసిఉంటుంది. తన పాపాన్ని క్షాళితం గావించుకోవలసిఉంటుంది. ఒకభగవంతుడంటూ ఉన్నాడేమో. అందరి పాపాలూ అతను కనిపెట్టి ఉంటాడేమో. తనపాపం తను చెప్పేవరకూ ఏదీ అతన్ని క్షాళితం చెయ్యలేదు. తనపాపం? అదేమిటి? అతను బుజాలు కదిలించాడు. బేసిల్ హాల్వర్డ్ మృత్యువు అతనికి చాలాఅల్పంగా కనుపించింది. అతను హెట్టీ మెర్టన్ నుగురించి ఆలోచిస్తూ ఉన్నాడు. ఎందుచేతనంటే ఇప్పుడు తను తనపాపచూచుకుంటున్న ఈఅద్దం చాలాఅన్యాయమైంది. అహమా? విచిత్రతో? కపటత్వమో మరి? తనత్యాగంలో ఇంతకుమించి మరేమీ లేదేమో. అంతకుమించింది మరేదో

ఉంది. అలాఅని అతను అనుకున్నాడు. కాని ఎవరు చెప్పగలరు? కాదు, అంతకుమించి మరేమీ లేదు. కేవలం అహంవల్లనే అతను ఆవిడను వదిలిపెట్టాడు. ఆత్మవంచనవల్లనే మంచితనపు ముసుగు వేసుకున్నాడు. చవిచూడటం కోసమే ఆత్మత్యాగానికి యత్నించిచూచాడు. ఆవిషయం ఇప్పుడు గ్రహించాడు. కాని ఈహత్య—ఇది జీవితమంతా అతన్ని వేటాడితీరవలసిందేనా? ఎప్పుడూ ఈగతంతాలూకుబరువు అతను మోయవలసిందేనా? నిజంగా అతను నేరంఒప్పుకునితీరాలా? ఎన్నటికీ అలాచేయడు. అతనికి వ్యతిరేకంగా ఒకటే ఒకసాక్ష్యం మిగిలిఉంది. అంతే. అది ఆ చిత్రమే. దాన్ని ధ్వంసంచేస్తాడు. ఇంతకాలం దాన్ని ఎందుకుఉంచాడు? ఒకమారు అదిమారుతూఉండడం, దానికి వయస్సుమళ్ళుతూ ఉండడం అతనికి ఆనందం కలిగించింది. ఇటీవల అలాంటిఆనందంకూడా కలగడంలేదు, రాత్రంతా అతనికి నిద్రపట్టకుండా చేసింది. అతను ఇంట్లో లేనప్పుడు మరెవరైనా దాన్నిచూస్తారేమోనని అతనికి భయం కలిగేది. అతని ఉద్వేగాలను విషాదపూరితంచేసింది. దానితాలూకు జ్ఞాపకమే ఎన్నో ఆనందక్షణాలను విధ్వంసం చేసింది. అది అతని అంతస్సులాంటది. అవును. అది అంతస్సే. దాన్ని ధ్వంసంచేస్తాడు.

అతను తిరిగి చూచాడు. బేసిల్‌హాల్‌వర్డ్‌ను చంపిన కత్తి కనుపించింది. దాన్ని అనేకసార్లు తుడిచాడు. ఒక్కమరక కూడా కనుపించనంతవరకూ తుడిచాడు. ఇప్పుడది తళతళలాడుతూఉంది. ఆచిత్రకారుణ్ని అదిచంపినట్టే ఆచిత్రకారుని బొమ్మనుకూడా చంపుతుంది. దానితాలూకు స్మృతినంతా మాపుచేస్తుంది. గతాన్నంతా చంపుతుంది. అప్పుడు అతనికి

బంధముండదు. విపరీతమైన హెచ్చరికలతో కూడిన ఈ ఆత్మగత జీవితాన్ని చంపుతుంది. ఇక అతనికి శాంతిలభిస్తుంది. అతనా కత్తిని తీసుకుని బొమ్మను దానితో పొడిచేశాడు.

ఒక అరపు వినిపించింది. తరువాత ఏదో ఘెళ్ళునవిరుచుకునిపడిన చప్పుడయింది. ఆ అరుపుకు భయపడిన సేవకులంతా లేచి గదుల్లోనుంచి బైటికి వచ్చారు. అటువైపుగా వెడుతున్న ఇద్దరు ఆగి ఆ పెద్దభవనంవైపుకు తలెత్తిచూచారు. ఒక పోలీసు కనుపించేవరకూ వెళ్ళి అతన్ని పిలుచుకుని వచ్చారు. అతను అనేకసార్లు గంటకొట్టాడు. కాని సమాధానంలేదు. పైన కిటికీల్లోంచి కనుపించే ఒక చిన్నదీపంతప్ప ఇల్లంతా చీకటిగాఉంది.

తరువాత కొంతసేపటికి అతను వెళ్ళి ప్రక్కనే నిల్చుని గమనించసాగాడు.

'ఇది ఎవరిల్లు కానిస్టేబుల్?' – ఆ ఇద్దరిలో ఒకతను అడిగాడు.

'డోరియన్ గ్రెఇల్లు సార్'– జవాబు చెప్పాడుపోలీసు.

వారు ఒకరివంకఒకరు చూచుకుని నవ్వుకుని వెళ్ళారు. వారిలో ఒకరు సర్ హెన్రీ ఆష్టన్‌మామారు. లోపల సేవకుల గదిలో సగంముస్తాబైన ఇంటివాళ్ళు వారిలోవారు ఏదో గుసగుసలాడుకుంటున్నారు. మిసెస్ లీఫ్ ఏడుస్తూ చేతులునలుపుకుంటూ ఉంది. ఫ్రాంసిస్‌ముఖం తెల్లగా పాలిపోయిఉంది.

ఒకపావుగంట గడిచింది. అతను బండివాణ్ణి తీసుకుని వచ్చాడు. ఒకసేవకుణ్ణికూడా తీసుకునివచ్చాడు. ఇద్దరూకలిసి పైకివెళ్ళారు. తలుపుకొట్టారు. సమాధానంలేదు. పిలిచారు.

అంతా నిశ్శబ్దం. చివరకు తలుపు తెరవాలని యత్నించి విఫలులై చూరుపైకెక్కి బాల్కనీలోకి దిగారు. కిటికీతలుపులు సులభంగానే వచ్చాయి. అవి పాతవి.

లోపలికి వెళ్ళగానే గోడకు వ్రేలాడుతూ అద్భుతంగా కనిపిస్తున్న వారి యజమాని చిత్తరువు కనుపించింది. వారు కడసారిగా ఆయనను చూసినట్లు అద్భుతమైన యౌవనంతోనూ అందంతోనూ తళతళలాడుతోంది. నేలమీద ఒకవ్యక్తి మృతకళేబరం పడిఉంది. సాయంకాలపు దుస్తులు. గుండెల్లో కత్తిగుచ్చుకుని ఉంది. వాడి వడలి ముడతలుపడి చూడవీల్లేకుండా పడిఉన్నాడు. వ్రేలిఉంగరాలుచూసేవరకూ అతనెవరో గుర్తించలేకపోయారు.